గోపాలదాసు

చికిత్సాసారము

చెన్నపురి, 1927

Record no. 555

## Bibliographic Record Target

గోపాలదాసు.

చికిత్సాసారము / శ్రీమద్గోపాలదాసునిచే రచియింపఁబడినది ; ఆయుర్వేదద్యనేక గ్రంథముల నవలోకించి పువ్వాడ సూర్యనారాయణరావుగారిచే ఆంధ్రవచనరూపముగ రచియింపఁబడినది.- చెన్నపురి : వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, 1927.

319 p. ;21 cm.

Record no. 555

Gōpāladāsu.

Cikitsāsāramu / Śrīmadgōpāladāsunicē raciyimpam̐baḍinadi ; Āyurvēdadyanēka granthamula navalōkiñci Puvvāḍa Sūryanārāyaṇarāvugāricē Āṃdhravacanarūpamuga raciyimpam̐baḍinadi.- Cennapuri : Vāviḷḷa Rāmasvāmiśāstrulu aṃḍ Sans, 1927.

319 p. ;21 cm.

Record no. 555

శ్రీరస్తు.

వైద్యశిఖామణియగు శ్రీమద్గోపాలదాసునిచే

రచియింపఁబడిన

# చికిత్సాసారము.



ఆయుర్వేదాద్యనేక గ్రంథముల నవలోకించి

పువ్వాడ - సూర్యనారాయణరావుగారిచే



ఆంధ్రవచనరూపముగ రచియింపఁబడి

కాంచీనగరస్థిత సంస్కృతప్రాకృతాద్యనేకభాషానిపుణులగు

నివృత్తి - వీరాస్వామిశాస్త్రులవారిచే

లేఖకప్రమాదజనితదోషంబులు లేకుండునటుల పరిష్కరింపఁబడినది.



చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి

'వావిళ్ల' ముద్రణాలయమున

ముద్రింపఁబడి ప్రకటింపఁబడియె.

1927.

PRINTED BY
V. RAMASWAMY SASTRULU & SONS,
AT THE 'VAVILLA' PRESS, MADRAS.—1927.

శ్రీ ర స్తు.

# వి ష య సూ చి క.

## విషయసూచిక.



చికిత్సాసారవిషయసూచిక ముగిసెను.

# అవతరణిక.



శ్రీమదఖిలజగజ్జన్మస్థేమ ప్రళయప్రముఖలీలైకరసికుండగు భగవంతునిచే సృజింపఁబడిన నీప్రపంచంబునందు "ధర్మసారమిదం జగత్" అనుపురాణవచనానుసరణి ప్రజలు ముఖ్యంబుగ ధర్మార్థకామమోక్షంబులను పురుషార్థంబులం బడయవలయు. అట్టి పురుషార్థప్రాప్తికి "శరీరమాద్యం ఖలు ధర్మసాధనమ్"అనునటుల మానవులకు శరీరమే ప్రధానసాధనంబుగ నున్నయది. అట్టిశరీరంబునకు జ్వరాదిరోగంబులు రానీయక కాపాడుకొనవలయును. ఇటుల జేయుచుండినను "పూర్వజన్మకృతం పాపం వ్యాధిరూపేణ బాధతే"అను స్మృతివచనానుసరణి పూర్వజన్మసంపాదిత దుష్కృతములవలన వాతాదిదోషంబులు ప్రకోపించి జ్వరాద్యనేకరోగములను కలుగంజేసి మనుజులను పీడింపుచుండును. దానంజేసి "తచ్ఛాంతిరౌషధైర్దానైః జపహోమసురార్చనైః" అనుటంబోలె యట్టి రోగంబులకు చగక, సుశ్రుత, వాగ్భటాది ప్రణీతాయుర్వేద తంత్రంబులలోఁ జెప్పియుండు చికిత్సాదులంజేసి తద్రోగంబులను నివర్తింపఁజేసుకొనవలయును. కావున వైద్యవరుండగు శ్రీమద్గోపాలదాసునిచే విరచింపంబడిన చికిత్సాసారంబను సార్థకనామంబుగల నీవైద్యగ్రంథము యెల్లరకుఁ దెల్లంబగునటుల సంస్కృతశ్లోకంబులకు తేటతెలుఁగున తాత్పర్యముతోడ కడుజాగరూకతతో శోధించి ముద్రాక్షరాంకితము జేయించినారము. ఇందు శారీరతత్వము, నాడీపరీక్షాద్యనేక దేహపరీక్షలు, శకునశాస్త్రము, సర్వధాన్యాది గుణాగుణంబులు, రసగంధక లోహరత్నప్రవాళాదుల శుద్ధిగావించు తెఱంగు, ...కరజత తామ్రాదిభస్మముల గావించువిధము, వానివాని గుణాగు...లు, సర్వజ్వరాతీసారసంగ్రహణ్యర్శోఽజీర్ణప్రమేహపాండుపానా

త్యయ కామిలామూత్రకృచ్ఛ్రమూత్రాఘాతోరుస్తంభాండవృద్ధ్యుపదంశాపస్మారభగందర శుక్రదోషాశీతివాతరోగవ్రణ స్త్రీబాలరోగాద్యనేక రోగంబులకు నిదానంబులు, వానివాని లక్షణంబులు, అచ్చటచ్చట అనేక మూలికాప్రయోగంబులు, రసచికిత్సలు, పథ్యవర్గము, కేశకృష్ణీకరణాది క్షుద్రరోగచికిత్సలు, సర్పవృశ్చికమూషకాది విషచికిత్సలును గలవు. నిదానభాగములో మాధవనిదానమెట్లు ప్రాశస్త్యము వహించి యున్నదో! చికిత్సావిషయములో నీగ్రంథ మంతకన్న నెక్కుడు ప్రయోజనకారి యని వక్కాణింపవచ్చును. మరియు బాలరోగప్రకరణమునం దనేకవిధములగు శాన్తికకర్మములుకూడఁ దెల్పఁబడినవి. ఇట్టి గ్రంథరాజము వద్దనున్నచో నెట్టి యసాధ్యరోగములైనను వైద్యుల యపేక్ష లేక స్వయముగా కుదుర్చికొనవచ్చుననుటకు సందియము లేదు కాన నీగ్రంథమును ఎల్లరును తప్పక పఠించి చికిత్సలఁ గావించుచు నారోగ్యభాగ్యము వడయుదురు గాత.

ఇట్లు,

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్.

శ్రీరస్తు.

# గ్రంథసూచన.

---

ఔషధంబులు గావించునెడ యందు నవీనంబు లగుద్రవ్యంబులనే ఉపయోగింపవలయు. అయినను వాయువిళంగములు, పిప్పళ్ళు, బెల్లము, ధనియాలు, తేనె, యీ మొదలగుద్రవ్యంబు లొకసంవత్సరము నాటివిగ నుండవలయు. మరియు అడ్డసరపాకు, చల్లపిల్లిగడ్డలు, తిప్పతీగె, పెద్దగుమ్ముడువేరు, కొడిసెపట్ట, పెద్దసోపు, పెన్నేరుగడ్డ, సుగంధిపాలవేళ్ళు, నేలవేము, ఈ మొదలగుద్రవ్యంబులను సర్వకాలములయందును పచ్చివిగనే యౌషధాదులయం దుపయోగింపవలయు. అయినను నవి పచ్చివి యని ద్విగుణంబుగ స్వీకరింపఁజనదు. మఱియు ద్రవ్యాంగములను జెప్పకయుండెడి యెల్లస్థలములయందును వాటిమూలములనే చేర్చుకొనవలయు.

---

## ఔషధప్రతినిధి.

కషాయములు, చూర్ణములు, ఈ మొదలగువాటియం దుపయోగింపఁదగిన ద్రవ్యంబులలో నెవ్వియైనను లభింపవేని, నభావంబయ్యెనేని, వాటికిబదులుగ సమాన గుణములుగల ద్రవ్యంబులను ధన్వంతరినిఘంటు మొదలగువాటి ననుసరించి గ్రహింపవలయు. మఱియు నౌషధంబులయం దుపయోగింపఁదగిన ద్రవ్యంబులకుఁ బ్రమాణము జెప్పఁబడకుండెడి యెల్లస్థలములయందును నాద్రవ్యంబులను సమభాగములుగనే స్వీకరింపవలయు.

---

## కషాయవిధి.

కషాయంబును గావించునెడ యం దుపయోగింపఁదగిన ద్రవ్యంబుల నన్నిటిని దినుసుకు నాలుగుతులములచొప్పున గ్రహించి వాటిని చక్కగ నలియఁగొట్టి భాండంబున వైచి యం దరువదినాలుగుపలముల మంచి యుదకముబోసి మందాగ్నిచే అష్టాంశముగ కాచి వడియగట్టి యాకషాయంబును బాలురు కాలుతులము మొదలొకతులము వఱకును, తక్కినవారు నాలుగుతులములవఱకును, త్రాగవలయు. మఱియు నాకషాయంబున శర్కర మొదలగువాటిని మిశ్రము జేయవలసియుండెనేని వాతపిత్తశ్లేష్మదోషంబులయం దాకషాయమునకుఁ గ్రమంబుగ నాలవభాగంబును, ఎనిమిదవభాగంబును,

పదియాఱవభాగంబును, జేర్చికొనవలయు. మఱియు తేనెను గలుపునెడ శ్లేష్మరోగమున కషాయంబునకు నాలుగవభాగంబును, పిత్తరోగమున నెనిమిదవభాగంబును, వాతరోగమున పదియాఱవభాగంబును జేర్చికొనవలయు. జీలకఱ్ఱ, గుగ్గిలము, క్షారములు, శిలాజిత్తు, ఇంగువ, ఈమొదలగువాటిని కాలుతులమునకన్న నధికముగ గ్రహింపంజనదు. మఱియు పాలు, బెల్లము, నెయ్యి, నూనె, కల్కము, చూర్ణము, ఈ మొదలగువాటిని కషాయంబులలో నొకతులమునకన్న నధికముగఁ జేర్చుకొనందగదు.

## కల్కవిధి.

అల్లమునైనను, నితర శుష్కద్రవ్యంబులనైనను, నుదకముచే నూరి యందుఁ దీసెడిరసము కల్కమనంబడు. ఇట్టి కల్కంబొక తులప్రమాణం బుండవలయు. మఱియు నీకల్కంబున నెయ్యి, తేనె, నూనె, వీటిలో దేనినైనను మిశ్రముజేయునెడ ద్విగుణంబుగను, బెల్లము, శర్కర, వీటిని సమభాగములుగను జేర్చుకొనవలయు.

## చూర్ణక్రమము.

శుష్కించిన ద్రవ్యములను చక్కగ దంచి చూర్ణముజేసి వస్త్రగాలిత మొనర్చిన నదియ చూర్ణమనంబడు. ఈచూర్ణంబును స్త్రీపురుషు లరతులముమొద లొకతులమువఱకును, బాలు రొకమాషముమొదలు మూడుమాషములవఱకును, దేహతత్వంబును, వ్యాధిబలంబును, దేశకాలంబులను నెఱింగి సేవింపవలయు. మఱియు నీచూర్ణంబున బెల్లమును మిశ్రముజేయునెడ చూర్ణంబునకు సమభాగంబుగను, శర్కర యయ్యెనేని ద్విగుణంబుగను, గలుపవలయు. ఇం దింగువను గలుపవలసియుండెనేని దానిని నేతితో పొంగించి మిశ్రము జేయవలయు. నెయ్యినిగూడ గలుపవలసియుండెనేని ఇంగువకు ద్విగుణంబుగను, ఉదకంబును కలుపునెడ చూర్ణంబునకు నాలుగింతలును గలుపవలయు. మఱియు చూర్ణంబునైనను లేహ్యంబునైనను, గుటికెలనైనను, కల్కమునైనను, సేవించినపిదప పాలు మొదలగువాటినిఁ ద్రాగవలసియుండెనేని వాతరోగంబున ౧౨ తులములును, పిత్తరోగంబున ౮ తులములును, శ్లేష్మరోగంబున ౪ తులములును త్రాగవలయు. చూర్ణము మణుగునటుల యందు రసముబోసి యారసం బిగురువఱకు భద్రపఱచి యుంచునదియ భావన యనంబడు.

## ఔషధసేవనకాలము.

కషాయము, చూర్ణము, ఈ మొదలగువాటిని సేవింపవలసినకాలము చెప్పంబడకుండెడి యెల్లస్థలంబులయందును ప్రాతస్సాయంకాలములయందే సేవింపవలయు. అయినను వమనవిరేచనములకు ప్రాతఃకాలమునందే యౌషధంబును సేవింపవలయు.



మఱియు వమనంబైనను, విరేచనంబైనను, చక్కగ నైనపిదప లఘువుగ భుజింపవలయు. అపానవాయు వధోగతంబగుటకు నౌషధంబును సేవింపవలసియుండిన భోజనాత్పూర్వమే పుచ్చుకొనవలయు. మఱియు నజీర్ణమును హరింపంజేయునిమిత్తము సేవించెడి యెల్లయౌషధంబులను భోజనకాలంబుననే సేవింపవలయు. అగ్నిదీపనమును జనింపంజేసెడి సర్వౌషధంబులను భోజనమధ్యంబున సేవింపవలయు. మఱియు వ్యానవాయువును శమింపంజేయుటకై యౌషధంబును సేవింపవలసియుండిన భోజనం బైనపిదప సేవింపవలయు. ఎక్కిళ్ళు, కంపవాయువు, వీటికి భోజనముగావించుటకు ముందుగనైనను, భోజనకాలంబుననైనను, నౌషధంబును సేవింపవలయు. స్వరభేదమున సంధ్యాకాలభోజనకాలంబున నౌషధంబును సేవింపవలయు. ప్రాణవాతము,పిత్తము, వీటియందు సంధ్యాకాలభోజనంబైనపిదప ఔషధంబును సేవింపవలయు. దాహము, ఓకర, ఎక్కిళ్లు, ఉబ్బసము, విషమదోషము, వీటియం దన్నమును భుజించిన పిదపనైనను, ముందుగనైనను, ఔషధంబును సేవింపవలయు. కర్ణరోగము, నేత్రరోగము, నాసారోగము, శిరోరోగము, వీటియందలి వాతాదిదోషంబులు హరించుటకై సేవించెడియౌషధంబులను భోజనాదిమధ్యాంతములయందును, రాత్రులయందును, సేవింపవలయు. మఱియు నీగ్రంథమున నౌషధంబులను నింతకాలమువఱకు సేవింపవలయునని జెప్పంబడకయుండినను రోగము నివృత్తియగువఱకైనను, యుక్తమగు కాలమువఱకైనను, సేవింపవలయు.

## స్నేహపాకవిధి.

నెయ్యి, నూనె, ఉదకము, ద్రవపదార్థములు, వీటిని కల్కమునకన్న నాలుగింత లధికంబుగ వైచి వండవలయు. మఱియు నందలి ద్రవ్యంబులు మృదువుగ నుండెనేని వాటికి నాలుగింతలు నుదకంబునైనను, రసంబునైనను, బోయవలయు. కఠిన ద్రవ్యంబు లయ్యెనేని నెనిమిదింతలును, నత్యంత కఠినద్రవ్యంబు లయ్యెనేని పదియాఱింతలును, బోయవలయు. తైలములయందు కల్కములను నాలుగవభాగంబైనను, ఆఱవభాగంబైనను, ఎనిమిదవభాగంబైనను, బోయవలయు. పాలు, పెరుగు, స్వరసము, మజ్జిగ, ఈమొదలగువాటిని యాతైలంబున మిశ్రమము జేయవలసియుండెనేని వాటికి సమభాగంబులుగ జేర్చుకొనవలయు. ఇటుల భాగములనన్నిటిని క్రమంబుగ నేకముజేసి మందాగ్నియం దునిచి తైలమును కాచవలయు. ఇటుల కాచెడితైలము మైనపక్వమై యందు నురుగుజనించినతోడనే దాని నగ్నియందు వైచిన చురచుర మనుశబ్దము లేక యుండెనేని పక్వంబైనదని యెఱింగి యందుండి దించి సాంగశీతలమున వడియగట్టికొని భద్రపఱచవలయు.

## గుటికవిధి.

మాత్రల నొనర్చుయెడ యం దుపయోగింపందగిన ద్రవ్యంబులనన్నిటిని చూర్ణముజేసి ఖల్వంబున వైచి యాయా యనుపానములతో చేలికినంతకుండువఱకు చక్కగ

మర్దించి మాత్రలుజేసి యందలినీరు శుష్కించువఱకు వాటిని నీడన యెండించవలయు. ఇట్లొనర్చెడి మాత్రలయందు రసగంధకములను గలుపవలసియుండెనేని నా రసగంధక ములను ఖల్వంబున వెవ్వేరుగ మర్దించి పిదప యితరద్రవ్యంబులను జేర్చి చక్కగ మర్దింపవలయు.

### భస్మవిధి.

తామ్రాదిభస్మంబులను గావించునెడ ఆయాలోహంబులను ప్రథమంబున క్రమంబుగ శుద్ధిజేసి పిదప పలచనిరేకులుగ నొనర్చి ఆయాయోగంబులయందుఁ జెప్పంబడియుండెడిరీతిని నాయాయౌషధులను వాటికి లేపనముజేసి తగుమైనమూసయం దునిచి దానిమూతిని బిగించి చీలమన్నులేపనము జేసి యెండించి గజపుటము వేసిన నవి భస్మంబులగు. ఇటుల భస్మంబైనపిదప వానిని ఖల్వంబున నునిచి అనుపానవిశేషములచేఁ జక్కగ మర్దించి బిళ్లజేసి యెండించి మూసయం దునిచి చీలమన్నులేపనముజేసి పుటము వేయవలయు. ఇటుల ప్రతిపుటమునందును గావింపందగు.

ఈగ్రంథమునందు వమనవిరేచనాదిమాత్రలకు వల్లాదిప్రమాణంబులు జెప్పంబడియుండినను, "శ్లో. స్థితిర్నాస్త్యేవ మాత్రాయాః కాలమగ్నిం వయోబలమ్, ప్రకృతిం దోషదేశౌ చ దృష్ట్వా మాత్రాం ప్రకల్పయేత్. యతోమందాగ్నయో హ్రస్వా హీనసత్వా నరాః కలౌ, అతస్తు మాత్రా తద్యోగ్యా ప్రోచ్యతే సుజ్ఞసమ్మతా." అను వచనముల ప్రకారము ఇక్కలియుగమున జనులు మిగుల దుర్బలులుగను, మిక్కిలి యగ్నిదీపనము లేనివారుగను, నుండుటచే దేశము, కాలము, వయస్సు, ప్రకృతి, దేహతత్త్వము, ఈ మొదలగువాటి నెఱింగి మాత్రలను బ్రయోగింపవలయు.

### ఖల్వలక్షణము.

శ్లో. నీలఖల్వే బలారోగ్యం శ్వేతఖల్వే బలక్షయమ్
పీతఖల్వే త్రిదోషఘ్నం రక్తఖల్వే త్రిదోషకృత్.

తా. నల్లనిఖల్వంబున నౌషధంబును మర్దించి భక్షించిన బలారోగ్యంబును, తెల్లనిఖల్వంబున బలక్షయంబును, పచ్చనిఖల్వంబున త్రిదోషశమనంబును, ఎఱ్ఱని ఖల్వంబున త్రిదోషోత్పత్తియుఁ గలుగు.

### పరిమాణ (కొలత) నిర్ణయము.

శ్లో. యవోఽష్టసర్షపైః ప్రోక్తో గుంజాస్యాత్తచ్చతుష్టయమ్
మాషో గుంజాభిరష్టాభిస్సప్తభిర్వా భవేత్క్వచిత్.



మాషైశ్చతుర్భిర్ధరణశ్శాణ ఇత్యపి కథ్యతే
టంకశ్చ తద్వయం కోలస్తద్వయం కర్ష ఉచ్యతే.
సప్తకర్షం పాణిమానం చతుష్కర్షం పలం స్మృతమ్
చతుష్పలై రంజలిస్స్యాచ్ఛరావోఽష్టపలస్స్మృతః.
ద్విశరావో భవేత్ప్రస్థశ్చతుఃప్రస్థైస్తథాఢకః.

తా. ఎనిమిది ఆవగింజలయెత్తు యొక యవయనియు, నాలుగు యవలయెత్తు యొక గురిగింజయనియు. ఎనిమిది గురిగింజలయెత్తు, లేక ఏడు గురిగింజలయెత్తు మాషమనియు, నాలుగు మాషములయెత్తు ధరణియనియు, శాణమనియు, రెండుశాణముల యెత్తు యొకటంకమనియు, రెండుటంకములయెత్తు కోలమనియు, రెండుకోలములయెత్తు కర్షమనియు, ఏడుకర్షములయెత్తు పాణియనియు, నాలుగు కర్షములయెత్తు పలమనియు, నాలుగుపలములయెత్తు అంజలియనియు, ఎనిమిది పలములయెత్తు శరావమనియు, రెండుశరావములు యొకప్రస్థమనియు, నాలుగుప్రస్థములు ఆఢకమనియు జెప్పంబడు.

### తూనికనిర్ణయము.

శ్లో. సర్షపః ప్రథమామాత్రా తేద్వాదశ యవస్స్మృతః
యవద్వయేన గుంజా స్యాత్త్రిగుంజో వల్ల ఉచ్యతే.
మాషశ్చ సప్తగుంజాభిశ్శాణో మాషచతుష్టయమ్
గద్యాణకశ్చ షణ్మాషః కర్షశ్చ దశమాషకః.
చతుఃకర్షైః పలం ప్రోక్తం దశశాణమితం బుధైః.

తా. పండ్రెండావాలయెత్తు యవయనియు, రెండు యవలయెత్తు గురిగింజయనియు, మూడు గురిగింజలయెత్తు వల్లమనియు, ఏడు గురిగింజలయెత్తు మాషమనియు, నాలుగు మాషములయెత్తు శాణమనియు, ఆరు మాషములయెత్తు గద్యాణకమనియు, పదిమాషములయెత్తు కర్షమనియు, నాలుగు కర్షములయెత్తు పలమనియు, జెప్పంబడు. మఱియు కొందఱు పదిశాణములయెత్తునే పలమని వచించెదరు.

### పథ్యప్రశంస.

శ్లో. పథ్యే సతి గదార్తస్య కిమౌషధనిషేవణైః
పథ్యేఽసతి గదార్తస్య కిమౌషధనిషేవణైః.

తా. రోగికి పథ్యమునకన్న వేఱొండు ఔషధము దొఱకొనదు. పథ్యం బొనర్పనివానికి ఔషధమువలన ప్రయోజనమును లేదు. కావున పథ్యంబుగనుండి యౌషధసేవం జేయవలయు.

---

## ఆరోగ్యప్రశంస.

శ్లో. అబ్దే ద్వివారం వమనం చ కుర్యా
ద్విరేచనం చేత్క్రమశస్త్రివారమ్
నస్యం చతుర్వార మథాంజనం చ
షడ్వారమప్యంజనమన్యదిష్టమ్.

తా. సహజంబుగ సంవత్సరమున రెండుమారులు వమనంబునకును, మూడుమారులు విరేచనమునకును, బుచ్చుకొనుటయే గాక నాలుగుమార్లు నస్యంబును, ఆరుమార్లు అంజనంబును, గావింపవలయు. అయినను దేహతత్త్వంబు నెఱింగి యుక్తానుసారంబుగ వమనవిరేచనాదుల కౌషధంబుల సేవింపందగు.

---

## తైలాభ్యంజనగుణము.

శ్లో. తైలాభ్యంగ స్త్వగ్రుజం హంతి సత్యం
పాదాభ్యంగో నేత్రరోగం నిహంతి
నేత్రాభ్యంగో దంతదోషాపనోదీ
శ్రోత్రాభ్యంగో దంతరోగం నిహన్యాత్.
మస్తాభ్యంగస్సర్వరోగం నిహన్యా
ద్దేహాభ్యంగశ్చర్మదోషాపహారీ.

తా. తైలాభ్యంజనముచే చర్మగతదోషంబును, పాదాభ్యంజనముచే నేత్రరోగంబులును, నేత్రాభ్యంజనముచే దంతదోషంబులును, శ్రోత్రాభ్యంజనముచే దంతరోగంబులును, శిరోభ్యంజనముచే సర్వరోగంబులును, దేహాభ్యంజనముచే చర్మగతసర్వదోషంబులును నశించు.

---

# శ్రీతులసీదాసరామాయణము,

## ఆంధ్రవచనము.

ఈగ్రంథము ఉత్తరహిందూస్థానములో మహావిఖ్యాతిగాంచిన శ్రీతులసీదాసనెడి మహాత్మునిచే హిందీభాషలో భక్తిరసభరితముగ రచింపఁబడినది. ఇది సమస్తకావ్యగుణముల కాకరమై విషయమునుబట్టి సర్వోపనిషత్సారమనఁదగియున్నది. ఈగ్రంథము నొకసారి వినినను ఎట్టి అక్షరశూన్యునకైనను ఎట్టి శుష్కహృదయునకైనను భక్తిరసముపుట్టి పొంగిపొరలి ప్రవహించునని చెప్పుట అతిశయోక్తి కాదు. ఇట్టిగ్రంథము మన తెనుఁగుభాషలో లేకుండుట యవమానకరమని తలఁచి ప్రకృతము తెనుఁగుభాషలో మృదుమధురశైలిని మూలగ్రంథములోనిభావము లేమియు విడనాడక వ్రాయఁబడినది. అచ్చటచ్చట పాఠకమహాశయుల హృదయమునకై తులసీదాసువారిమూలగ్రంథములోని చౌపాయ్, సొరథా, ఛాంద్ అను మనోహరగీతములుగూడఁ బొందుపఱుపఁబడి యున్నవి. ఈగ్రంథము ప్రతిపదభక్తిరసాలంకృతమును, సర్వమత శ్లాఘాపాత్రమును అయియుండు ననుటకు సందియము లేదు.

పూర్తిగ్రంథము. రూ. 7 8

# భక్తిరసశతకసంపుటము—౧.

భక్తిరసశతక మొదటిసంపుటములో భక్తిరసోద్బోధకములగు ఈక్రిందిశతకములను చేర్చి ముద్రింపించితిమి. శతకములన్నియు నిర్దుష్టముగ మనోహరముగ ముద్రింపఁబడి విపులములగు పీఠికలతో నలరారుచున్నవి. 1 వృషాధిపశతకము, 2 చెన్నమల్లుసీసములు, 3 సర్వేశ్వరశతకము, 4 ఒంటిమిట్ట రఘువీరశతకము, 5 దేవకీనందనశతకము, 6 నారాయణశతకము, 7 దాశరథిశతకము, 8 సింహాద్రినారసింహాశతకము, 9 కృష్ణశతకము, 10 మాతృశతకము, 11 ఉన్నవరాజగోపాలశతకము, 12 మానసబోధశతకము, 13 చిత్తబోధశతకము, 14 ఆంధ్రనాయకశతకము, 15 ప్రసన్నరాఘవశతకము, 16 రామతారకశతకము, 17 రామరాఘవశతకము, 18 రామప్రభుశతకము, 19 భద్రాద్రిరామశతకము, 20 మారుతిశతకము.

శ్రీ రస్తు.

శ్రీమద్ధన్వంతరయే నమః.

# చికిత్సాసారము.

---

అవతారిక. సకలవిద్యాసార్వభౌముండగు గోపాలదాసుండను వైద్యశిఖామణి తనచే రచియింపంబడు చికిత్సాసారంబను నీవైద్యశాస్త్రము నిర్విఘ్నంబుగ పరిసమాప్తి యగుటకై మంగళస్తోత్రంబు నొనర్చుచున్నాడు.

శ్లో. పరాత్పరో యః పురుషః పురాణస్సనాతనో యోపి చ విశ్వకర్తా
యస్యాంతపారం న శుకాదయోపి విదుర్హి దేవం తమహంస్మరామి.
షడంగవేదాస్సకలోపవేదా యతః ప్రజాతా ఉత సృష్టికాలే
యేనాత్రసర్వే ప్రకటీకృతాస్తే పరోపకారాయ తముద్భజేహమ్.

తాత్పర్యము. పరాత్పరుండును, పురాణపురుషుండును, సనాతనుండును, సృష్టిస్థితిసంహారకారణీభూతుండుననగు, నే పరబ్రహ్మనిజతత్వంబును, శుకాదియోగులు సగానెఱుంగరైరో నాపరబ్రహ్మంబును స్మరించెద. మఱియు జగత్సృష్టికాలంబున నే పరబ్రహ్మముచే శిక్షాది షడంగ సహిత వేదంబులును, ఆయుర్వేదాద్యుపవేదంబులును, సృజింపబడి పరోపకారంబునకై యెల్లెడల బ్రకటింపబడినవో యాబగవంతుని నేమిగుల భజించెద.

శ్లో. ఋగ్వేదస్యోపవేదోయమాయుర్వేదం ప్రచక్షతే,
తస్య సంఖ్యాప్రమాణం హి లక్షైకం గ్రంథతో విదుః.

తా. ఋగ్వేదంబున కుపవేదంబగు నాయుర్వేదము లక్షగ్రంథసంఖ్యగలిగి వెలయుచున్నయది.

శ్లో. సంహితాచ రసగ్రంథదేశభాషాదిభేదతః
విస్తృతో బహుమాతో౽హి తత్పారం కేపి నోయయుః.
పరం పరోపకారార్థం యద్దృష్టం యచ్ఛ్రుతం మయా
లిఖ్యతే తచ్చ సంక్షిప్తం వైద్యానాం సుఖదాయకమ్.

తా. ఆ ఆయుర్వేదసంహిత రసగ్రంథములుగను, దేశభాషాది ప్రబంధభేదములుగను, ననేక సంహితలుగ విస్తరింపంబడియుండుటచే వాటి నాద్యంతంబు లిదివర

కెవరును దెలిసికొనరైరి. కావున నాచే జూడబడి పూర్వీకులవలన వినబడిన వైద్య శాస్త్రంబును లోకోపకారం బగునట్లును, వైద్యులకు సుబోధంబగునట్లును, సంక్షిప్తం బుగ రచియింపుచున్నాడను.

శ్లో. చికిత్సాసార నామాయం గ్రంథః పరమదుర్లభః,
శ్రీమద్గోపాలదాసేన క్రియతే పండితప్రియః.

తా. శ్రీమద్గోపాలదాసుండను నామంబుగల నేను చికిత్సాసారంబను పేరుగల నీవైద్యశాస్త్ర మతిదుర్లభం బగువిషయములతో గూడినదిగను, పండితమనోహ్లాదకరం బగునటులను రచియింపుచున్నాడ. ఇందు ముందుగ వైద్యునిలక్షణంబు వక్కాణించెద.

## వైద్యునిలక్షణము.

శ్లో. గురోరధీతాఖిలవైద్యవిద్యః పీయూషపాణిః కుశలః క్రియాసు
గతస్పృహోధైర్యధరఃకృపాళుస్సిద్ధోఽధికారీ భిషగీదృశస్స్యాత్.

తా. క్రమముగా గురువువలన వైద్యశాస్త్రము నభ్యసించినవాడును, అమృత హస్తుడును, చికిత్సలుజేయుటలో నేర్పరియును, దురాశలను వదలినవాడును ధైర్యవం తుడును, ప్రాణులయందు దయగలవాడును, నగువైద్యుండు చికిత్సలం జేయుట కర్హుం డగు.

శ్లో. నానారోగసమాకులేతదుదితైర్దుఃఖైః పరం దుస్సహై
ర్దూనే దీనజనే శరణ్యరహితే నారాయణాత్మా స్వయమ్
దత్వా ధైర్యమధీరపవ కురుతే తత్తచ్చికిత్సాంభిష
క్తైనార్తాస్సుఖినో భవంతి మనుజాస్తద్వైద్య ఏవోత్తమః.

తా. నానారోగంబులచే దుఃఖింపుచు గతిలేక నధైర్యంబును బొందినమనుజు లను శ్రీమన్నారాయణస్వరూపుండగు వైద్యుడనుగ్రహించి ఔషధములచే నామను జులవ్యాధులను నివృత్తిజేసి నారోగ్యమును గలుగజేయువాడే వైద్యోత్తముడు.

శ్లో. యోగీ స్వదేహతత్వజ్ఞః పండిత శ్శాస్త్రచింతకః
అన్యరోగం విజానాతి పరకాయప్రవేశవత్.

తా. వైద్యుడు దేహతత్వశాస్త్రమును, పదార్థగుణశాస్త్రమును, యోగశాస్త్ర మును, అనుమాపకశాస్త్రమును, చక్కగా నభ్యసించి తనదేహమువలెనే పరదేహమును భావించి పరకాయప్రవేశముచే బరశరీరతత్వంబు నెఱుంగుచందంబున రోగి శరీరత త్వము నెఱింగి చికిత్సంజేయవలయు.



## దుష్టవైద్యునిదూషణము.

శ్లో. యశ్శాస్త్రమపరిజ్ఞాయ చికిత్సామిహ నాటయేత్,
ఉపాచరతి తం విద్యాద్భిషజం గరళోపమమ్.

తా. ఏవైద్యుడు శాస్త్రానుభవంబు లేక సర్వశాస్త్రతత్త్వంబు నెఱింగినవానివలె నటింపుచు చికిత్సంజేయునో నట్టివానిని విషతుల్యముగ నెంచవలయు.

## శరీరలక్షణము.

శ్లో. తనుశ్శరీరమిత్యాదినామ్నామనర్థతా స్మృతా
ద్విసప్తతిసహస్రాంత్రమష్టకోటివిలోమకమ్.
సప్తధాతు సమాయుక్తం శరీరం పాంచభౌతికమ్
పంచవింశతితత్వాఢ్యం షట్కోశం నవరంధ్రకమ్
షణ్ణవత్యంగుళాయామం రోగభోగాలయం వపుః

తా. * తనువు, శరీరములను సన్వర్థనామములుగల నీదేహము 72 వేల నర ములు, 8 కోట్ల వెంట్రుకలు, చర్మము, మాంసము, మేదస్సు, రక్తము, మజ్జము, స్నాయువు, ఎముకలు, అను నీ 7 ధాతువులు, పృథివ్యప్తేజోవాయ్వాకాశరూపమైన పంచభూతములు, అవ్యక్తాది 25 తత్వములు, 6 కోశములు, నేత్రములు, నాసికము, చెవులు, నోరు, మూత్రపురీషద్వారములను నవరంధ్రములు, వీటితోగూడి తొంబది యాఱంగుళముల పొడవుగలిగి రోగభోగాలయంబై వెలయుచుండు.

## దేహతత్వశాస్త్రసంగ్రహము.

శ్లో. పిండజే మానుషే దేహే హ్యూర్ధ్వకాయస్త్రికోశకః,
కుక్షావన్నమయం కోశో వక్షః ప్రాణమయాన్వితమ్.
మనోమయస్తథా మూర్ధ్ని విజ్ఞానానందసంయుతః.

తా. అన్నరసముచే జనించిన నిమ్మనుష్యశరీరోర్ధ్వకాయంబున 3 కోశంబులు గలవు. అం దుదరంబున అన్నమయకోశము, వక్షంబున ప్రాణమయకోశము, శిరస్సున మనోమయ కోశములుండు. ఇమ్మనోమయ కోశమునందే విజ్ఞానమయకోశము, ఆనంద మయకోశము మిళితములై యున్నయవి.

* తనుః :— తన్యతే విస్తీర్యతే ఆహారేణేతి తనుః :— ఆహారముచే విస్తరింప బడునది కావున తనువనబడు. శరీరం— శీర్యతఇతి శరీరం— నశించునది కావున శరీర మనబడు.

శ్లో. వపుర్నవశతస్నాయు త్రిశతాస్థిదశాధికమ్,
సప్తోత్తరం మర్మశతం సిరా స్సప్తశతం తథా.
చతుర్వింశతి రాఖ్యాతా ధమన్యో రసవాహికాః,
మాంసపేశ్యః పంచశతం కండరా శ్చైవ షోడశ,
షట్పంచాశత్పంచశతపలరక్తం తు యావనే,
నృదేహే దశరంధ్రాణి నారీదేహే త్రయోదశ.
కలా స్సప్తాశయాస్స ప్తధాతవస్స ప్తతన్మలాః,
సప్తోపధాతవస్స ప్తత్వచస్స ప్త ప్రకీర్తితాః.
శ్లేష్మాశయ స్స్యాదురసి తస్మాదామాశయ స్త్వధః,
ఊర్ధ్వమగ్న్యాశయో నాభే స్తదధః పవనాశయః.
మలాశయ స్త్వధ స్తస్య వ స్తిర్మూత్రాశయ స్తథా,
జీవరక్తాశయమురో నారీణామధికా స్త్రయః.
వాయుః పిత్తం కఫో దోషాః పవన స్తేషు వీర్యవాన్,
రజోగుణశ్శీతరూక్షో పిత్తముష్ణం తిలోన్మితమ్.
కఫస్స్నిగ్ధో గురుశ్శ్వేతశ్శీతలశ్చ తమోగుణః,
సిరాధమన్యో నాభిస్థా స్సమాసోఽన్యత్ర విస్తరః.

తా. శరీరము ౯౦౦ నరములతోడను, ౩౧౦ అస్థులతోడను, ౧౦౭ మర్మస్థానముల్లతోడను, ౭౦౦ బోలునరములతోడను, ౨౪ రక్తవ్యాపకమగు బోలునరములతోడను, ౫౦౦ మాంససంచులతోడను, ౧౬ కండనరములతోడను, యావనంబున ౫౫౬ పలముల రక్తముతోడను గూడియుండు. పురుషశరీరమునందు ౧౦ రంధ్రంబులును, స్త్రీశరీరంబునందు ౧౩ రంధ్రములును నున్నయవి. ఈశరీరమున ౭ కళలు, ౭ ఆశయములు, ౭ ధాతువులు, ౭ ఉపధాతువులు, ౭ పొరలు నున్నయవి. మరియు వక్షస్థలమున శ్లేష్మధాతువు, జీవరక్తాశయము, వీటికి క్రింద వస్తియను మూత్రాశయము నున్నయవి. అయినను స్త్రీలకు మూడు రక్తాశయము లధికముగనుండు. వాతపిత్తశ్లేష్మములయందు వాయువు వీర్యవంతముగను, రజోగుణస్వరూపముగను, శీతలముగను, పిత్తము ఉష్ణముగను, సత్వగుణ స్వరూపముగను, శ్లేష్మము తామసగుణస్వరూపముగను, గురువుగను, శీతలముగను నుండు. మఱియు సిరాధమనీలను నాడులు నాభిస్థానమునందున్నయవి. కావున వీటి వివరణము అన్యగ్రంథములయందు విస్తారముగ చెప్పంబడియున్నవి.



## రక్త విషయ వివరణము.

శ్లో. భుక్తాన్నస్య రసః పూర్వరూపం భవతి కాంజికమ్,
పరమాణుద్రవో హ్యేష భవేదాపోమయే నృణామ్.
ప్రాణాఘ్రాత శ్శుద్ధిమేతి సహోష్మా రక్తతాం వ్రజేత్,
సహి ప్రాణరసో జ్ఞేయస్సంచరత్యపి సర్వదా.
తన్మూలం జీవనం జ్ఞేయం తస్మాజ్జీవరసస్స్మృతః,
విషోత్థఫేనయోగేవా మహాశీతవిషేణ వా.
సంపృక్తశ్లేష్మ పిత్తాభ్యాం సరక్త స్స్తబ్ధతాం వ్రజేత్,
స్తంభేతు కించిన్మాత్రస్య నిస్పర్శో దారుగేహితా.
హృదయే రక్తకోశస్య స్తంభే ప్రాణవియోగితా,
ఉష్మాద్యుత్తేజకాసంగే రక్తం ద్రవతి నిస్సరత్.
న్యూనాధికత్వే రక్తస్య రోగో నాశోఽపివా భవేత్,
దేహస్వభావ సున్నస్య రక్తస్య స్తంభవేగయోః.
నాళాంతర్గతిసమ్మర్దే వేదనాదిః ప్రజాయతే,
తస్మాన్నిమిత్తమేవైతదోఘ్భగజీవనయోస్స్మృతమ్.

తా. లోకంబున మనుజులచే భక్షింపబడు యన్నమువలన బుట్టిన రసధాతువు ప్రథమంబున గంజిరూపంబుగను, అతిసూక్ష్మమగు నుదకరూపంబుగను నగుచున్నయది. పిదప యీయన్నరసము ప్రాణవాయువుచే గొట్టంబడి పరిశుద్ధత్వముగలదై తేజస్సుతో గూడి రక్తంబై ప్రాణరసంబని చెప్పంబడుచు. సర్వదా శరీరమునందెల్లెడల సంచరింపుచున్నయది. ఇదియ ప్రాణధారణమునకు గారణముగనుండుటచే జీవరసమనంబడు. ఈ రసరూపంబగు రక్తము విషముచే జనించిన నురుగుతోనైనను, మహాశీతవిషంబుతోనైనను, కూడెనేని నపుడారక్తము శ్లేష్మపిత్తంబులతో సంబంధించి స్తబ్ధత్వమును జెందు. (అనగా ఱొమ్మునందుగడ్డకట్టు) ఇటుల రక్తము స్తంభించియుండునపుడు దేహి స్పర్శజ్ఞానశూన్యుడై వృక్షంబువలె నిశ్చేష్టితుడుగ నుండు. మఱియు హృదయమునందలి రక్తకోశము స్తంభించెనేని నాదేహంబునుండి ప్రాణంబులు బైలువెడలు. కావున ఱొమ్మునందు రక్తము గడ్డకట్టియుండునపుడు నుష్ణంబులగు నౌషధాదులచే జికిత్సలంజేసిన నారక్తము ద్రవత్వమును జెంది దేహమునందెల్లెడలవ్యాపించి దేహిని చలింపంజేయు. సాధారణంబుగ రక్తము శరీరంబునందుండవలసిన ప్రమాణంబునకన్న నధికరక్తంబుండినను, కొఱవడినను, నాదేహికి రోగంబైనను, మృత్యువైనను, సంభవించు. మఱియు స్వభావంబుగ వాయువుచే ప్రేరితమైన రక్తంబునకు నతివేగంబును, స్తంభనమును, నాళాంతర్గతి సమ్మ

ర్ధంబును గలిగెనేని దేహికి వేదనలు జనించు. కావున నీరక్తము భోగంబునకును, జీవించి యుండుటకును కారణభూతంబుగనుండు.

---

## జాఠరాగ్ని విచారము.

శ్లో. నాభేరూర్ధ్వే ద్వ్యంగుళే వామభాగే నౄణామగ్నిర్జాఠరో యోషితాంతు, భాత్యేవాయం దక్షిణే వ్రీహితుల్య స్తస్యైవోష్మా వ్యాపృతస్సర్వదేహే. సజీర్ణకారీతి వదంతి కేచిద్వైశ్వానరం దీపశిఖామథాన్యే, నీవారశూకప్రతిమాం చ పీతాం కుక్ష్యుద్భవో హ్యమ్లరసోయమగ్నిః.

తా. పురుషులకు నాభికి రెండంగుళములకుపైన యడమప్రక్కను, స్త్రీలకు కుడిప్రక్కను జాఠరాగ్నియుండు. మఱియు నీజాఠరాగ్ని వ్రీహితుల్యముగ నుండుటయ గాక దీనియూష్మమే దేహంబంతటను వ్యాపింపుచుండు. ఇది భుజించిన యాహారంబు నెల్ల జీర్ణింపజేయును. ఇజ్జాఠరాగ్నినే కొందఱు జీర్ణకారియనియు, మరికొందఱు హృదయకమలమున నీవారశూకంబువలె సన్నగను, పీతవర్ణముగను నుండు దీపాకారమగు జ్వాలావిశేషంబునే జీర్ణకారియనియు, మరికొందఱు కుక్షియందుండు ఆమ్లరసస్వరూపమగు యగ్నినే జీర్ణకారియనియు వచించెదరు.

ఇటుల శరీరసంబంధములగు విషయములు ముగిసెను

---

## దూతపరీక్ష.

శ్లో. వంగం భీతం ద్రుతం దీనం రూక్షం౽మంగళవాదినమ్,
అమంగళం చ మలినం శస్త్రిణం దండపాణినమ్.
వ్యాధితం క్రూరకర్మాణం రక్తమాల్యానులేపనమ్,
తైలం పంకవిలేపాఢ్యమశుచిం కృష్ణచామరమ్.
అనేకం జటిలం శీర్ణం వివర్ణార్ద్రైకవాససమ్,
స్త్రియం ఖరోష్ట్రమహిషారూఢం కష్టస్వరం తథా.
నానుగచ్ఛే ద్భిషగ్దూతమాహ్వయంతం చ దూరతః.

తా. అంధత్వాదులచే నంగవైకల్యము గలవాడు, భయపడువాడు, త్వరపడువాడు, దీనుడు, కఠినముగను అమంగళముగను శబ్దంబుల నుచ్చరించువాడు, రూక్షవిహీనుడు, మలినవస్త్రంబులం గట్టికొనినవాడు, శస్త్రములను ధరించినవాడు, దుడ్డుకఱ్ఱను



చేబూనినవాడు, రోగపీడితుడు, సదా క్రూరకర్మల జేయువాడు, రక్తపుష్పమాలికలను ధరించినవాడు, రక్తగంధంబును మేననలదికొనినవాడు, సర్వాంగంబులకు తైలము బూసికొనినవాడు, బురద బూసికొనినవాడు, అశుచిగనుండువాడు, నల్లచామరమును ధరించినవాడు, తానువచ్చునపుడు మరియొకని దోడ్కొనివచ్చువాడు, జడలు ధరించినవాడు, స్త్రీలు, ముసలివాడు, వివర్ణముగనుండు తడివస్త్రంబునైనను, ఒంటివస్త్రంబునైనను ధరించినవాడు, గాడిదె, ఒంటె, మహిషము, వీటిని వాహనంబొనర్చికొనినవాడు, స్వరహీనుడు, దూరమునుండి పిలుచువాడు, ఇట్టిలక్షణంబులుగలదూత రోగివద్దనుండి వైద్యుని బిలువ నేతెంచిన నారోగికడకు వైద్యుండు జనందగదు.

---

## అశుభశకునములు.

శ్లో. దుర్గంధం సుకషాయం చ దుర్వాక్యం లవణం క్షుతమ్,
హాహాక్రందిత ముత్కృష్టం కృష్ణధాన్యం గుడోవమీ.
ఇంధనాదితృణం శుష్కం పురీషం పూతిదుర్మదమ్,
క్రూరపక్షి మృగాణాం చ రూక్షాః ప్రతిదిశంగిరః.
సమరం కలహో హానిః పంకతైలం ససర్పిషమ్,
భంగోవా పూర్ణపాత్రాణాం ప్రాసాదధ్వజశోభినామ్.
చండాలః క్రూర పాశాంశ్చ నిస్సారం జాలవాగురే,
శయనాసనయానానాముత్తానానాం చ దర్శనమ్,
మార్గచ్ఛేదోపి మార్జారగోధాసరటవానరైః,
రోగిద్వారాభినిర్గచ్ఛే న్మంగళం తదమంగళమ్.

తా. వైద్యుడు రోగికడకు బోవునపుడు దుర్గంధపదార్థములు, వగరుపదార్థములు, ఉప్పు, ఉద్దులు, నువ్వులు మొదలగు కృష్ణధాన్యములు, బెల్లము, కట్టెలు, పిడకలు, యెండుగడ్డి, అమేధ్యము, మిగుల దుర్గంధమగు కుళ్లినపదార్థములు, బురద, తైలము, నెయ్యి, రిక్తపాత్రలు, వల, ఉరులు, ఇవి దృశ్యంబులైనను, దుర్వాక్యంబులు వచించువాడు, తుమ్మువాడు, హాయనుచు గొప్పధ్వనితో రోదనముసేయువాడు, వమనంబొనర్చువాడు, చండాలుడు, క్రూరములగు నాయుధముల ధరించినవాడు, వీరెదురొక్కనినను, క్రూరపక్షులు, చతుష్పాజ్జంతువులు, ఇవి పరస్పరము బోరుచు కఠినధ్వనులొనర్చుచుండుట నాకర్ణించినను, యుద్ధము, కలహము హాని, ఇవి జరుగుటను దృష్టించినను, మిద్దెలు, గృహము, పతాకము పూర్ణకుంభము, ఇవి అకస్మాత్తుగ భూమింగూలినను, గుఱ్ఱము, ఆసనము, శయనము యానము, ఇవి బోర్లపడియుండుటను గాంచినను,

ఉడుము, తొండ, మార్జాలము, కోతి, ఇవి మార్గంబు నడ్డగించినను, వైద్యుడు రోగి గృహంబు జేరునపుడు నాగృహంబునుండి మంగళకరములగు వస్తువులు బైటవచ్చినను, ఇవియన్నియు నపశకునంబులు గాన నట్టి రోగికడకు వైద్యుండు బోవందగదు.

## శుభశకునములు.

శ్లో. పున్నామం వామతశ్శ్రేష్ఠో గజఖర్పర వర్జితః,
స్త్రీనామ్ని దక్షిణేశ్శ్రేష్ఠా శివాశ్యామా వివర్జితా.

తా. వైద్యుడు రోగిగృహంబున కేతెంచునెడ పురుషజాతి యెడమపార్శ్వంబునుండి కుడిపార్శ్వంబునకును, స్త్రీజాతి కుడిపార్శ్వంబునుండి యెడమపార్శ్వంబునకును, నేతెంచిన శుభంబు గలుగు. అయినను పురుషజాతియందేనుగ, కంచరగాడిదె, స్త్రీజాతియందు నల్లనక్క, ఇవి నేతెంచిన నశుభంబు గలుగు.

శ్లో. ఛత్రంగోద్విజ కన్యకామిషసురాపణ్యాంగనారోచనం
మాంగళ్యం నృపవాజివారణదధిస్తోత్రాదిపాఠశ్శుభః
సంగీతం కరుణాభయానకరసై రౌద్రైర్విహీనం స్మర
క్రీడాభావ మనోహరం కిమపి సద్యోగీ చ బాలస్తథా.

తా. మరియు రోగికడ కేగువైద్యుని కభిముఖంబుగ గొడుగు, గోవు, బ్రాహ్మణులు, కన్యక, మాంసము, మద్యము, భోగముచాన, గోరోచనము, మంగళకరములగు పదార్థములు, రాజు, గుఱ్ఱము, ఏనుగ, పెరుగు వేదఘోషము కరుణాభయానకరసరహితములై శృంగారరస ప్రధానంబుగనుండు గానము, బాలుడు, ఉత్తముడగు యోగి, ఏతెంచిన శుభంబు గలుగు.

## నాడీపరీక్ష.

శ్లో. వాతే వక్రా తదను చపలా శ్లేష్మరోగే స్థిరా స్యా
త్సర్పాకారా ప్రభవతి తదా వాతపిత్తప్రభావే,
నాడీ హంసీకఫపవనయోర్దర్దురా శ్లేష్మపిత్తే
ఛిన్నా సూక్ష్మాపి చ విషమగదే సన్నిపాతే త్వలక్ష్యా.

తా. నాడి వాతరోగంబున వంకరగను, పిత్తరోగంబున చంచలముగను, శ్లేష్మరోగంబున స్థిరముగను నడుచును. మరియు వాతపిత్తరోగంబున సర్పంబువలెను, శ్లేష్మ



వాతరోగంబున హంసవలెను, శ్లేష్మపిత్తరోగంబున కప్పవలెను, విషమజ్వరరోగంబున ఖండఖండములుగను, సూక్ష్మముగను, నాడి నడుచును. సన్నిపాతంబున నాడి అదృశ్యమై యనేక రీతులుగ నడుచును.

శ్లో. వాతే వక్రగతా నాడీ చపలా పిత్తవాహినీ,
స్థిరా శ్లేష్మవతో జ్ఞేయా ద్వంద్వజా సన్నిపాతజా.

తా. వాతరోగంబున వంకరగను, పిత్తరోగంబున చంచలముగను, శ్లేష్మరోగము, ద్వంద్వరోగము, సన్నిపాతము, వీటియందు స్థిరముగను, నాడి నడుచును. (ఇది పాఠాంతరము.)

శ్లో. కాష్ఠకుట్టో యథాకాష్ఠం కుట్టతే నాతివేగతః,
స్థిత్వా స్థిత్వా తథా నాడీ సన్నిపాతే భవే ద్ధ్రువమ్.

తా. కట్టెలను ఛేదించువాడు నిలిచినిలిచి ఛేదించుచందంబున సన్నిపాతరోగంబున నాడి నిలిచినిలిచి నడుచును.

శ్లో. మందం మందం శిథిలశిథిలం వ్యాకులం వ్యాకులం వా
స్థిత్వా స్థిత్వా వహతి ధమనీ యాతి నాశం చ సూక్ష్మా
నిత్యం స్కంధే వహతి పునరప్యంగుళీస్సంస్పృశేద్వా
భావై రేవం బహువిధతరైస్సన్నిపాతే త్వసాధ్యా.

తా. అసాధ్యసన్నిపాతమునందు నాడి అతిమందముగను, మిగుల శిథిలముగను, మిక్కిలి వ్యాకులముగను, నిలిచినిలిచియును, అతిసూక్ష్మముగను, నాడి నశించినట్లుగను, మరల భుజంబులపై స్థిరముగనడుచుచు నంతలోనే యంగుళస్థానముజేరి యనేకరీతులుగ నడుచును.

శ్లో. ప్రాతశ్శ్లేష్మయుతా నాడీ మధ్యాహ్నే చాపి పైత్తికీ,
అపరాహ్ణే వాతకీ చ పునః పిత్తం నిశార్ధకే.

తా. నాడి ప్రాతఃకాలమున శ్లేష్మయుక్తంబుగను, మధ్యాహ్నంబున పిత్తయుక్తంబుగను, అపరాహ్ణంబున వాతయుక్తంబుగను, అర్ధరాత్రియందు మరల పిత్తయుక్తంబుగను నడుచును.

## మూత్రపరీక్ష.

శ్లో. * రక్తం పీతం తథా శ్వేతం కృష్ణం చైవ యథాక్రమమ్,
వాతే పిత్తే కఫే ప్రోక్తం సన్నిపాతే చ మూత్రకమ్.

* వాతే తు రక్తమూత్రం స్యాత్పీతవర్ణం తు పిత్తజే, పాండువర్ణం కఫే ప్రోక్తం కృష్ణవర్ణం త్రిదోషజే. (ఇట్లు పాఠాంతరము గలదు.)

తా. మూత్రము వాతరోగంబున నెఱ్ఱగను, పిత్తరోగంబున పచ్చగను, శ్లేష్మరోగంబున తెల్లగను, సన్నిపాతరోగంబున నల్లగను నుండును.

శ్లో. ధూమలం వాతపిత్తేవ ఫేనిలం కఫమారుతే,
శ్లేష్మవాతసముద్భూతం మూత్రం కుంకుమపాండురమ్.

తా. మూత్రము వాతపిత్తరోగంబున ధూమవర్ణముగను, వాతశ్లేష్మరోగంబున నురుగునురుగుగను, పిత్తశ్లేష్మరోగంబున మిశ్రవర్ణంబుగను నుండును.

శ్లో. ప్రాతర్మధ్యభవాం ధారాం ధృత్వా మూత్రస్య రోగిణః,
తత్ర తైలలవం క్షిప్త్వా సాధ్యాసాధ్యం విచింతయేత్.

తా. ప్రాతఃకాలమున రోగిచే విసర్జింపబడు మూత్రము మొదటిధారను, కడపటిధారను, వదలి మధ్యధారను తుత్తినాగపుపాత్రయందైనను, కంచుపాత్రయందైనను గ్రహించి ఆమూత్రమునందొక తైలబిందువును తృణముచేవేసి వక్ష్యమాణరీతిగ బరీక్షించి సాధ్యాసాధ్యముల నెఱుంగవలయు. ఎట్టులనిన.—

శ్లో. వాతే విస్తరతి ఛాయా పిత్తే భవతి బుద్బుదః,
శ్లేష్మణా చోదయాకారమసాధ్యం తలగం యది.

తా. ఇట్లామూత్రమునందువైచిన తైలబిందువు యెల్లెడలవ్యాపించిన వాతరోగంబనియు, బుగ్గలుబుగ్గలుగ లేచిన పిత్తరోగంబనియు, ఆకారరూపములయ్యేనేని శ్లేష్మరోగంబనియు, ఆ మూత్రమునందా తైలబిందువు తేలక మునిగిపోయిన నారోగం బసాధ్యంబనియు నెఱుంగవలయు.

శ్లో. విస్తృతే బహుళే స్సాధ్య ఊర్ధ్వగే కృచ్ఛ్రసాధ్యగః,
తలగే మ్రియతే రోగి బ్రహ్మణాపి చికిత్సితః.

తా. మూత్రమునందువైచిన తైలబిందువు సర్వత్ర వ్యాపించిన నారోగము సాధ్యంబనియు, ఊర్ధ్వముగ బుగ్గలుబుగ్గలుగ లేచిన కష్టసాధ్యంబనియు, నెఱుంగవలయు. మరియు తైలబిందువు వేసినతత్క్షణమున నది తేలక మునిగిపోయిన నారోగికి సకలజగత్సృష్టికర్తయగు బ్రహ్మదేవుడునగా చికిత్సంజేసినను నారోగి జీవించుట దుర్లభంబని తెఱుంగవలయు.

## కాలపరీక్ష.

శ్లో. అరుంధతీ ధ్రువం చైవ విష్ణో స్త్రీణి పదాని చ
ఆయుర్హీనా న పశ్యంతి చతుర్థం మాతృమండలమ్.



తా. అరుంధతి, ధ్రువుడు, విష్ణుసంబంధమైన మూడుస్థానములు, మాతృమండలము, ఇవి ఆయువులేనివారి కగుపడవు. అరుంధతిమొదలగు వాటియర్థముల వివరించెద.

శ్లో. అరుంధతీ భవే జ్జిహ్వా ధ్రువో నాసాగ్రమేవ చ,
విష్ణుస్తు భ్రూద్వయో ర్మధ్య భ్రూద్వయం మాతృమండలమ్.

తా. అరుంధతి అనగా జిహ్వ, ధ్రువంబనగా నాసికాగ్రము, విష్ణుసంబంధములగు మూడుస్థానములన రెండు కనుబొమలకు మధ్యనుండు స్థానము, మాతృమండలంబన రెండు కనుబొమలు.

శ్లో. నాసాగ్రం భ్రూయుగం జిహ్వాం ముఖం చైవ న పశ్యతి,
కర్ణఘోషం న జానాతి సగచ్ఛేద్యమమందిరమ్.

తా. నాసికాగ్రము, కనుబొమలు, జిహ్వ, ముఖము, ఇవి ఎవని కగుపడవో అట్టివాడును, చెవులుమూసికొనిన నెవనికి కర్ణఘోషము వినుపించదో అట్టివాడును, వీరలు శీఘ్రముగ యమునిగృహమున కేగెదరు.

శ్లో. నవభ్రూపంచచక్షుష్య సప్తకర్ణత్రినాసికా
జిహ్వాం చ దినమేకం తు కాలచిహ్నం దినేదినే.

తా. తనకనుబొమల కనుగొననివాడు తొమ్మిది దినములలోను, కనుబొమల మధ్యభాగము కనుగొనినవాడైదుదినములలోన, కర్ణఘోషము వినుపించనివాడేడుదినములలోను, నాసికాగ్రము కనుగొననివాడు మూడుదినములలోను, జిహ్వాగ్రము కనుగొననివాడొకదినములోను, యమపురము జేరునుగాన ప్రతిదినమును కాలచిహ్నమును బరీక్షింపుచుండవలయు.

శ్లో. అకస్మాద్ధి భవేత్థూలో హ్యకస్మాచ్చ కృశో భవేత్
అకస్మాదన్యథా భావే షణ్మాసైశ్చ వినశ్యతి.

తా. అకస్మాత్తుగ దేహము స్థూలంబైనను,శుష్కించినను కోపములేనివానికి కోపముగలిగినను, కోపముగలవానికి శాంతిగలిగినను, ఇట్టివా రాఱుమాసంబులలో మృతినొందెదరు.

శ్లో. రసనాయాః కృష్ణభావో ముఖం కుంకుమసన్నిభమ్
జిహ్వాస్పర్శం న జానాతి దుర్లభం తస్య జీవితమ్.

తా. జిహ్వ నలుపుగనుండుట, ముఖం బెఱ్ఱగనుండుట, జిహ్వకు స్పర్శజ్ఞానము తెలియకుండుట, ఇట్టి లక్షణములుగలవాడు నిశ్చయముగ మృతినొందు.

శ్లో. సూర్యే కేంద్రే జ్వరమతితరం శీతవాతం చ చంద్రే
భౌమే రక్తం జ్ఞగురుభృగవో రోగనిర్ముక్తకాస్స్యుః

మందే మందం శిథిలమరణం జీవనాశం చ రాహౌ
లగ్నం శస్తం గ్రహబలయుతం యాతు వైద్యో విలోక్య.

తా. వైద్యుండు రోగికడ కేగునపుడేలగ్నమో ఆలగ్నంబునకు * కేంద్రస్థానంబున సూర్యుండుండిన రోగి మిగుల జ్వరపీడితుడనియు, చంద్రుడుండిన రోగికి శ్లేష్మ, వాత, రోగములుగలవనియు, అంగారకుండుండిన రక్తరోగముగలదనియు, బుధుడు, గురువు, శుక్రుడుండిన రోగవిముక్తుం డగుననియు, శనియుండిన దీర్ఘరోగియై జీవించుననియు, రాహువైనను, కేతువైనను నుండిన శీఘ్రముగ మృతినొందుననియు, నెఱుంగవలయు. కావున వైద్యుడు ముఖ్యముగ జ్యోతిశ్శాస్త్రము నెరింగి లగ్నము, గ్రహబలము వీటిని బరీక్షించి రోగికడకు జనవలయు.

శ్లో. రాత్రౌ దాహో భవతి చ దివా జాయతే శీతలత్వం
కంఠే శ్లేష్మా నిరసవదనః కుంకుమాకారనేత్రే
జిహ్వా కృష్ణా వహతి చ సదా స్థూలసూక్ష్మా చ నాడీ
తద్భైషజ్యం స్మరణమధునా రామరామేతి నామ.

తా. రాత్రియందు దాహము గలుగుట, పగలు చలిపట్టుట, కంఠమునందు కఫముకట్టుట, ముఖము వివర్ణముగనుండుట, నేత్రములు రక్తవర్ణముగనుండుట, నాలుక నలుపువర్ణము గలిగియుండుట, ఒకసమయంబున నాడి యతివేగంబుగను, మఱియొక సమయంబున నతిసూక్ష్మముగనడుచుట, ఇట్టి లక్షణములుగలరోగి జీవించుట దుర్లభము కావున నారోగి రామరామయని రామస్మరణ జేయుచుండవలయు.

శ్లో. సౌమ్యాదృష్టి ర్వదతి విమలం హస్తపాదం సదోష్ణం
స్వల్పో దాహస్సురసవదనః కోమలా యస్య జిహ్వా
నాసాశ్వాసో వహతి సరళం స్వేదహీనో జ్వరోఽసౌ
సాధ్యో రోగీ భవతి నియతం వైద్యభైషజ్యయోగ్యః.

తా. సౌమ్యదృష్టి, తేటగలమాటలు, స్వల్పదాహము, ఇవి కలిగియుండుట, చేతులు, కాళ్లు ఉష్ణముగనుండుట, ఏపదార్థముభుజించిన రుచిగను, జిహ్వ మృదువుగను నుండుట, సరళముగ శ్వాస బైలువెడలుట, స్వేదరహితంబగు జ్వరము గలుగుట ఈలక్షణములుగలరోగి చికిత్స కర్హుండగు.

శ్లో. ఔషధం మంగళం మంత్రాహ్యన్యాశ్చ వివిధాః క్రియాః
యస్యాయు స్తస్య సిద్ధ్యంతి న సిద్ధ్యంతి గతాయుషః.

---

* కేంద్రస్థానంబనగా.—లగ్న, చతుర్థ, సప్తమ, దశమ, స్థానంబులు.



తా. ఆయువుగలవానికి ఔషధము, దేవగ్రహపూజాదులు, మంత్రములు మరియు నితరములగు దానాద్యనేకక్రియలు, ఇవియన్నియు సిద్ధించు. ఆయువులేని వానికవి సిద్ధించవు.

శ్లో. అగ్నిమూలం బలం పుంసాం రేతోమూలం తు జీవితమ్
తస్మాత్సర్వప్రయత్నేన వహ్నిం శుక్రం చ రక్షయేత్.

తా. బలంబున కగ్నియు, జీవించుటకు శుక్లంబును గారణములు గాన పురుషుడు సర్వప్రయత్నములచే నగ్నిని, శుక్లంబును రక్షింపవలయు.

## ఋతువిచారము.

శ్లో. మార్గే పౌషే తథా మాఘే ఆషాఢే శ్రావణేఽపి చ,
భాద్రేమాసి చికిత్సజ్ఞైర్వాతో రాజా ప్రకీర్తితః.
అశ్వినే కార్తికే మాసే వైశాఖజ్యేష్ఠయో ర్ధ్రువమ్
సర్వశాస్త్రవిచారజ్ఞైః పిత్తం రాజా ప్రకీర్తితః.
ఫాల్గునే చైత్రమాసే చ జంతుపీడాకరో మతః,
శీతలాంబుసముద్భూత శ్లేష్మా రాజా ప్రకీర్తితః.

తా. మార్గశీర్షము, పుష్యము, మాఘము, ఆషాఢము, శ్రావణము, భాద్రపదము, ఈమాసంబులయందు వాయువు ప్రకోపంబుగను, ఆశ్వయుజము, కార్తికము, వైశాఖము, జ్యేష్ఠము, ఈమాసంబులయందు పిత్తము ప్రకోపంబుగను, ఫాల్గుణము, చైత్రము, ఈమాసంబులయందు శ్లేష్మము ప్రకోపంబులుగనునై సమస్తప్రాణులను పీడింపుచుండు.

శ్లో. సంధారణాధ్యశనజాగరణోచ్చభాషా
వ్యాయామయానకటుతిక్తకషాయరూక్షైః
చింతావ్యవాయభయలంఘనశోకభీత్రై
ర్వాయుః ప్రకోపముపయాతి ఘనాగమే చ.

తా. మూత్రాదులను బంధించుట, భోజనంబొనర్చిన తక్షణంబుననే మఱల భుజించుట, జాగరణము సేయుట, కంఠశోష గలుగునటుల మాటలాడుట, తిరిగితిరిగి వేసరుట, గుఱ్ఱము మొదలగువాటిని నెక్కుట, కారము, చేదు, వగరు, మందముగల పదార్థముల భుజించుట, చింతించుట, అతిమైథునం బొనర్చుట, భయపడుట, ఉపవాసము సేయుట,

రోదనం బొనర్చుట, జిగులుపడుట, వీటిచే వాతము ప్రకోపించు. మరియు వర్షించు నపుడు వాయువు ప్రకోపించియుండు.

శ్లో. కట్వమ్లమద్యలవణోష్ణవిదాహితీక్ష్ణైః
క్రోధాతపానలపరిశ్రమశుష్కశాకైః
క్షారాదజీర్ణవిషమాశనభోజనైశ్చ
పిత్తం ప్రకోపముపయాతి ఘనాత్యయే చ.

తా. కారము, పులుసు, ఉప్పు, ఉప్పుపదార్థములు, ఉష్ణపదార్థములు, మిరప కాయలు, ఇంగువ, శుష్కశాకములు, వీటిని విశేషముగ భుజించుటచేతను, అకాలం బున మిగులభుజించుట, విశేషముగ మద్యపానం బొనర్చుట, ఆగ్రహించుట, ఎండలో నుండుట, మిగుల శ్రమపడుట, నిప్పుశగయందుండుట, ఈమొదలగు కార్యంబు లొన ర్చుటచేతను, పిత్తము ప్రకోపించు. మరియు వర్షాకాలాంత్యంబునను సాధారణముగ పిత్తము ప్రకోపించియుండు.

శ్లో. స్వప్నాద్దివా మధురశీతలమత్స్యమాంసై
ర్గుర్వమ్లపిచ్ఛలతిలేక్షుపయోవికారైః
స్నిగ్ధాతితృప్తిలవణోదకపానభక్ష్యై
శ్శ్లేష్మా ప్రకోపముపయాతి తథా వసంతే.

తా. పగలు నిద్రించుటచేతను, మధురపదార్థములు, శీతలపదార్థములు, మత్స్య మాంసము, మందపదార్థములు, పులుసు, జిగటపదార్థములు, నువ్వులు, చెరుకుపాలు, వీటిచేజేయంబడిన పదార్థములు, గురుత్వముగలపదార్థములు, వీటిని భుజించుటచేతను, కడుపు నిండినపిదప నధికముగ భుజించుటచేతను, ఉప్పు, ఉదకము వీటిని అధికముగ సేవించుటచేతను, పాలుత్రాగినపిదప నీరుత్రాగుటచేతను, శ్లేష్మము ప్రకోపించు. మరియు వసంతఋతువునందు సాధారణముగ శ్లేష్మప్రకోపము గలిగియుండు.

ఇటుల ఋతువులయందు జనించెడి వాతపిత్తశ్లేష్మముల
ప్రకోపవిచారము ముగిసెను.

---

## దోషత్రయలక్షణము.

శ్లో. తదేవమేతే క్రమశో విశోధ్యా దోషాః ప్రదుష్టా యుగపత్త్రయోఽపి
కుర్వంతి రోగాన్వివిధాఞ్ఛరీరే సంస్థానసంజ్ఞా విగతాననేకాన్.



తా. ఇటుల ప్రకోపించు వాతపిత్తశ్లేష్మములను క్రమముగ శోధింపవలయు. అటుల శోధింపక నుపేక్షించిన నావాతపిత్తశ్లేష్మములు శరీరమున వ్యాపించి నామరహి తములగు నానావిధరోగములను గలుగంజేయు. కావున నారోగలక్షణముల నుడువ నెవ రికిని శక్యంబుగాదు.

శ్లో. పారుష్యసంకోచనతోదశూలాశ్యామత్వమంగవ్యథచేష్టభావాః
స్తబ్ధత్వశీతత్వఖరత్వశోషాః కర్మాణి వాయోః ప్రవదంతి తజ్జ్ఞాః.

తా. శరీరము బిగబట్టియుండుట, కడుపులో వ్యథకలుగుట, కడుపునొచ్చుట, శరీరము నలుపుగలిగి యుండుట, కాళ్ళుచేతులు నొచ్చుట, శరీరకంపము గలుగుట, అటు అటు చలింపనేరక మొద్దువలె నుండుట, శీతలము గలుగుట, శరీరము ముండ్లు బారియుండుట, వాపుగలుగుట, ఇట్టిలక్షములు దోషయుక్తమగు వాతప్రకోపంబున గలుగునని యెఱుంగవలయు.

శ్లో. పరిభ్రమస్వేదవిదాహరాగా వైగంధ్యసంక్లేదవిపాకకోపాః
ప్రలాపమూర్ఛాభ్రమపీతభావా పిత్తస్య కర్మాణి వదంతి తజ్జ్ఞాః.

తా. శరీరముదిరుగుట, చమట, అతిదాహము, వస్తువులయందు ప్రేమ, దుర్గం ధము, కోపము, ప్రలాపము, మూర్ఛ, భ్రాంతి, పసుపువర్ణము, ఇవిగలుగుట, శరీరమా ర్ద్రముగనుండుట, ఇట్టిలక్షణములు దోషయుక్తమగు పిత్తప్రకోపంబున గలుగునని తెలియంగవలయు.

శ్లో. శ్వేతత్వశీతత్వగురుత్వకండూస్నేహప్రసేకస్తిమితావలేపాః
ఉత్సేధసంధానచిరక్రియాశ్చ కఫస్య కర్మాణి వదంతి తజ్జ్ఞాః.

తా. శరీరమునకు తెలుపువర్ణము, శీతలము, బరువు, దురద, ఇవి గలిగియుండుట, శరీరము జిగటగనుండుట, చమటపడియుంట, స్తిమితముగ నుండుట, చలిపట్టుట, కార్య ములయం దాలస్యముగనుండుట, ఇట్టి లక్షణములుగలిగిన దోషయుక్తమగు శ్లేష్మరోగం బని తెలియంగవలయు.

శ్లో. ఏతాని లింగాని చ తత్కృతానాం
సర్వామయానాం చ విభిన్ననామ్నామ్
కర్భిద్భవే త్ప్రాప్తివిశేష ఏవ
సంజ్ఞాంతరం యేన తు సంప్రయాతి.

తా. పైన నుదహరింపబడిన వాతపిత్తశ్లేష్మములచే ప్రకోపింపబడు సర్వరోగం బులు వేరునామంబులు గలిగి వెలయుచుండినను నీలక్షణంబులే వాటికిని గలిగియుండు.

ఒకానొకసమయంబున నీవాతపిత్తశ్లేష్మంబు లేకంబయ్యెనేని నప్పుడారోగము వేఱొక నామంబుచే విలసిల్లుచుండు.

## సామాన్యరోగలక్షణము.

శ్లో. ఆలస్యతంద్రాహృదయావిశుద్ధి
దోషప్రవృత్తిర్ఘనతా చ మూత్రే
అల్పక్రియాత్వం చ విసుప్తతా చ
సామాన్యతో వ్యాధి ముపాదిశంతి.

తా. బడలిక గలుగుట, కండ్లు మూతలుబడుట, హృదయంబున వేదనగలిగియుండుట, ఆవలింతలుగలుగుట, ముక్కున నీరుగారుట, మూత్రం బధికముగ విసర్జించుట, కొద్దిపనులుజేయుటకుసగా శక్తిలేకుండుట, నిదురబట్టకుండుట, ఇట్టి లక్షణములు గలిగెనేని సామాన్యరోగంబని తెలియంగవలయు.

## దోషత్రయశమనవివరణము.

శ్లో. స్నిగ్ధోష్ణాస్థిరవృష్యభోజ్యలవణస్వాద్వమ్లతైలాతప
స్నానాభ్యంజనవస్తిమాంసమదిరాసంవాహనోన్మర్దనైః
స్నేహస్వేదనిరూహణైశ్చ శయనైస్త్రీవ్రోపనాహాదిభిః
పానాహారవిహారభేషజమిదం వాయుం ప్రశాంతిం నయేత్.

తా. మృదువుగనుండు పదార్థములు, ఉష్ణపదార్థములు, బలకరములగు ద్రవ్యంబులు, ఉద్దులచేజేయంబడిన పదార్థములు, ఉప్పుపదార్థములు, మధురపదార్థములు, పులుసుగల పదార్థములు, నూనెపదార్థములు, మాంసము, వీటిని భుజించుటచేతను, ఎండ కాచుకొనుట, స్నానంబొనర్చుట, అభ్యంజనము సేయుట, వస్తికర్మ, మిగుల గాలిలేని స్థలంబున బరుండుట, మద్యపానంబొనర్చుట, శరీరంబును మర్దించుట, తోముట, నూనె, నెయ్యి, ఇవి మొదలగు తైలంబుల పానము సేయుట, లేక లేపనంబొనర్చికొనుట, చమట కారునటులంజేయుట, నిరూహణవస్తికర్మ సేయుట, ఏకాంతస్థలంబున నిద్రించుట, పాలుద్రాగుట, విహారంబొనర్చుట, ఇట్టి కార్యంబులొనరించిన దోషయుక్తమగు వాతరోగము శమనంబునొందు.

శ్లో. స్నిగ్ధస్వాదుకషాయశీతపవనచ్ఛాయానిశావ్యంజనం
జ్యోత్స్నాభూగృహవారియంత్రజలజస్త్రీగాత్రసంస్పర్శనమ్
సర్పిః క్షీరవిరేకసేకరుధిరస్రావప్రలేపాదికం
పానాహారవిహారభేషజమిదం పిత్తం ప్రశాంతిం నయేత్.



తా. మృదువగుపదార్థములు, మధురపదార్థములు, వగరుపదార్థములు, శీతల పదార్థములు, ఇవి భుజించుట, చల్లనిగాలి, చల్లనినీడ, వీటియందుండుట, రాత్రులయందు గాలిలోనుండుట, మొరబ్బాలు, లేహములు వీటినిభుజించుట, వెన్నెలలో బరుండుట, నేలమాలికలయందువసించుట, జలయంత్రములసమీపమునందుండుట, యౌవన స్త్రీల నాలింగనంబొనర్చికొనుట, పాలు, నెయ్యి, ఇవిద్రాగుట, విరేచనమునకు బుచ్చుకొనుట, శరీరమునందలి దోషరక్తమునుదీయుట, చందనమునలదికొనుట, వింజామరలు, వట్టివేళ్ల విసనకఱ్ఱలు, వీటిచే విసరుకొనుట, శీతోదకాదులపానంబొనర్చుట, పిత్తహారమగుపదార్థముల భక్షించుట, విహరించుట, ఇట్టికార్యంబులొనర్చిన దోషయుక్తమగు పిత్తరోగము శమనంబునొందు.

శ్లో. రూక్షక్షారకషాయతిక్తకటుకవ్యాయామనిష్ఠీవనం
స్త్రీసేవాధ్వనియుద్ధజాగరజలక్రీడాపదాఘాతనమ్
ధూమస్త్రాపశిరోవిరేకవమనం స్వేదోపవాసాదికం
పానాహారవిహారభేషజమిదం శ్లేష్మా శమం గచ్ఛతి.

తా. ఉష్ణపదార్థములు, ఉప్పుపదార్థములు, వగరుపదార్థములు, చేదుపదార్థములు, కారము, ఇవిభుజించుట, తిరుగుట, పదేపదేకారివుమ్మివేయుట, స్త్రీసంభోగంబొనర్చుట, త్రోవనడుచుట, కుస్తీజేయుట, జాగరణముసేయుట, జలక్రీడలాడుట, పదేపదే కూర్చుండిలేచుట, పొగనుగ్రహించుట, ఒత్తడమువేసికొనుట, నస్యంబుసేయుట, వమనంబొనర్చుట, చమటగలుగునటులసేయుట, ఉపవాసముగావించుట, ఉష్ణోదకాదులను పానంబొనర్చుట, శ్లేష్మహారపదార్థములభుజించుట,విహరించుట, ఇట్టి కార్యంబులొనర్చిన దోషయుక్తమగు శ్లేష్మరోగము శమనంబునొందు.

## దోషోత్పత్తికాలము.

శ్లో. హేమంతవర్షాశిశిరేషు వాయోః
పిత్తస్య తోయాంతనిదాఘయోశ్చ
కఫస్య కోపః కుసుమాగమేషు
కుర్వీత యత్నం విహితం యదేషామ్.

తా. హేమంత, వర్ష, శిశిర, ఋతువులయందు వాయువుప్రకోపముగను, శరదృతువు, గ్రీష్మఋతువు, వీటిమధ్యంబున పిత్తముప్రకోపముగను, వసంతఋతువున శ్లేష్మముప్రకోపముగనునుండు, కావున నీకాలంబులనెఱింగి వాతపిత్తశ్లేష్మములకు జెప్పంబడిన చికిత్సలంజేయవలయు.

శ్లో. ఆమం జయేల్లంఘనకోష్ణపేయాల్లఘ్వల్పసూక్ష్మోదనతిక్తయూషైః
నిరూహణ స్వేదన పాచనైశ్చ సంశోధనైరూర్ధ్వమథస్తథా చ.

తా. లంఘనముసేయుట, కొంచము ఉష్ణంబగు పేయమనుగంజిని త్రాగుట, ఉష్ణపదార్థముల భుజించుట, లఘువుగను, అల్పంబుగను, మృదువుగనుండెడి పైపేయము నందలి నన్నమును భుజించుట, పెసలుమొదలగువాటి కట్టును త్రాగుట, నిరూహణ వస్తి సేయుట, చమటపట్టునటులసేయుట, పాచనకర్మ సేయుట, విరేచనవమనములకు బుచ్చుకొనుట, వీటిచే ఆమరోగములు నశించు.

శ్లో. కఫప్రకోపే వమనం సనస్యం విరేచనం పిత్తభవే వికారే
వాతామయే వస్తివిశోధనం చ సంసర్గజే చ ప్రవిమిశ్రమేతత్.

తా. శ్లేష్మప్రకోపంబైన వమనమునకు బుచ్చుకొనుటయగాక నస్యమును జేయవలయు. పిత్తప్రకోపంబైన విరేచనమునకు బుచ్చుకొనవలయు - వాతప్రకోపంబైన వస్తికర్మను, విరేచనమును జేయించవలయు. మరియును ద్విదోషములయందువస్తి, విరేచనములజేయించవలయు. *

శ్లో. బుద్ధ్వా తదన్యదపి తత్తదనుక్రమేణ
చేష్టాం స్వయం సమధిగమ్య యథానురూపం
రోగేషు భేషజమనల్పమతిర్విదధ్యా
చ్ఛాస్త్రం హి కించిదుపదేశబలం కరోతి.

తా. శాస్త్రమునందుదహరింపబడనియనేకరోగములు జనించుచుండు. కావున వాటిలక్షణములను బుద్ధిమంతులగువైద్యులెఱింగి తత్కాలోచితానుకూలంబగు నౌషధములచే చికిత్సలంజేయవలయు.

## సర్వధాన్యాదిగుణములు.

శ్లో. శ్వేతా రక్తా స్థూలసూక్ష్మా యేచాన్యే శాలయశ్శుభా
స్వాదుపాకరసాస్స్నిగ్ధా వృష్యా బద్ధాల్పవర్చసః.

తా, తెలుపువర్ణము, రక్తవర్ణము, స్థూలము, సూక్ష్మములగుధాన్యములును, ఇతరములగు ననేకధాన్యములును, శ్రేష్ఠంబులైనవిగనున్నయవి. ఇవి మధురంబుగను, స్నిగ్ధముగను, పుష్టికరముగను, మలమును శోధింపందగినవిగను నుండుటయేగాక నివిపాతవిగ

* శ్లేష్మయుక్తమగు ద్విదోషములకు నస్యంబును చేయవలయు.



నుండునపుడు పథ్యకరంబుగను, శరీరమున కారోగ్యమును గలుగంజేయునవిగను నున్నయవి.

శ్లో. కషాయాతు రసాః పథ్యా లఘవో మూత్రలా హిమాః
షష్టికా వ్రీహిషు శ్రేష్ఠా గౌరశ్చాసితగౌరతః.

తా. ముందుదహరింపంబడిన ధాన్యంబులలో తెలుపు, నలుపు తెలుపుగలిగి నఱువదిదినములలో ఫలించుధాన్యములు సర్వధాన్యంబులకన్న మిగుల నుత్తమంబైనవిగ నుండినను అందు తెలుపుగలధాన్యము మిగులపథ్యకరంబైనదిగను, మూత్రమును శోధించదగినదిగను, లఘుత్వము, చల్లదనము, స్వల్పవగరుగలదిగను నున్నయది.

శ్లో. సూక్ష్మశీతో గురుస్స్వాదుస్సరో విడ్వాతకృద్యవః.

తా. యవలు స్వల్పశీతలముగలదిగను, శరీరమునకు బలకరంబుగను, మధురముగను, మలమును శోధింపందగినదిగను, వాతమును వృద్ధిజేయునదిగ నున్నయది.

శ్లో. సంధానకారీ మధురో గోధూమస్థైర్యకృద్రసః.

తా. గోధుమలు సంధానమును జేయునదిగను, మధురంబుగను, దృఢకరమగు రసమును జనింపంజేయునదిగను నున్నయది.

శ్లో. యుగంధరస్త్రిదోషఘ్నస్స్వాదుపథ్యో రసాయనః.

తా. జొన్నలు త్రిదోషంబులను హరింపంజేయుటయగాక మధురంబైనదిగను, పథ్యకరంబైనదిగ నున్నది. మరియుంజొన్నలు జరావ్యాధిని పరిహరించుటయేగాక, వీర్యవృద్ధి, బలము, పుష్టి, సంతోషము, నేత్రంబులకు హితము, వీటిని గలుగంజేయు.

శ్లో. ముద్గాఢకీ మసూరాదిశింబీధాన్యం విబంధకృత్
కషాయం స్వాదుసంగ్రాహికటుపాకం హిమం లఘు
మేదశ్శ్లేష్మాస్రపిత్తేషు హితం లేపోపసేకయోః.

తా. పెసలు, కందులు, చిరిశనగలు, ఇవి మొదలగు మఱికొన్ని కాయధాన్యములు, వగరు, మధురత్వముగలవియై, మలబద్ధకము, కడుపుపుబ్బరము, వీటిని గలుగంజేయుటయగాకవాటికట్టు, చేదు, శీతలము, లఘుత్వము, గలదిగను, మేదస్సు, శ్లేష్మము, రక్తపిత్తము, వీటికి హితంబును జేయునదిగను, లేపనంబునకును, ఒత్తడమునకును, మిగుల శ్రేష్ఠంబైనదిగ నుండు.

శ్లో. వరోఽత్ర ముద్గోల్పచలః కలాయస్త్వతివాతలః
చణకో వాతలో రూక్షః కుళుత్థః కఫవాతహృత్.

తా. ముందుదహరింపంబడిన కాయధాన్యములలో పెసలు, స్వల్పవాతంబును బటాణీలు నధికవాతంబును, శనగలు వాతంబును, మందంబును కలుగంజేయు. ఉలవలు వాతంబును, శ్లేష్మంబును పరిహరింపంజేయు.

శ్లో. వాస్తుకం గ్రహణీకుష్ఠత్రిదోషార్శహరం పరమ్
తద్వల్లఘుదలా చిల్లీ కాకమాచీ చ మేథికా.

తా. చక్రవర్తికూర, సన్నచిల్లియాకులుగలవావిలికూర, కాచకూర, మెంతికూర, ఇవిసంగ్రహణీ, కుష్ఠు, త్రిదోషములు, మూలవ్యాధులు మొదలగురోగంబులను హరింపంజేయు.

శ్లో. రండులీయో హిమో గురుః విషపిత్తాస్రకాసజిత్.

తా. చిల్లీకూర చలవ, మందము, వీటినిగలుగంజేయునదిగను, విషము, పిత్తము, రక్తపిత్తము, దగ్గు, వీటిని నశింపంజేయునదిగను నున్నయది.

శ్లో. చాంగేరీ కఫవాతాస్రసంగ్రహణ్యతిసారజిత్.

తా. చుక్కకూర శ్లేష్మ, వాత, రోగములు, రక్తముపడేరోగము, సంగ్రహణి అతిసారము, వీటిని హరింపంజేయు.

శ్లో. హృద్యం పటోలం కృమిజిత్స్వాదుశీతం రుచిప్రదం
పిత్తలం దీపనం భేదీ వాతఘ్నం బృహతీద్వయమ్.

తా. పొట్లకాయ, మధురముగను, చలవను గలుగఁజేయునదిగను, నుండుటయగాక హృదయమునందలి పురుగులను నశింపఁజేయు. వాకుడుకాయ, పెద్దములకకాయ, ఇవి పిత్తము, దీపనము, వీటిని గలుగంజేయునవిగను, వాతము, విరేచనము, వీటిని శమింపంజేయునవిగను నున్నయవి.

శ్లో. కారవేల్లం సతిక్తం స్యాద్దీపనం కఫజిత్పరమ్.

తా. కాకరకాయ చేదుగలదిగనుండినను దీపనమును గలుగంజేసి, శ్లేష్మరోగంబును పరిహరింపంజేయు.

శ్లో. కర్కోటకం జ్వరశ్వాసదద్రుకుష్ఠవిషాపహమ్.

తా. ఆగాకరకాయ జ్వరము, శ్వాసము, దద్రుకుష్ఠము, విషము, వీటిని హరింపంజేయు.

శ్లో. వార్తాకం కఫవాతఘ్నం కించిద్వాతప్రకోపనమ్
సరం చ మూత్రలం ప్రోక్తం బలకృద్బాలమేవ తత్.



తా. వంకాయ శ్లేష్మ, వాత, రోగంబులను నశింపంజేయు. మరియు వంగపిందెలు సారముగలవియై వాతంబును వృద్ధిజేయుటయగాక బలంబునుగలుగంజేసి మూత్రము సరళముగ విసర్జనంబగునటులంజేయు.

శ్లో. బింబీఫలం స్వాదుశీతం స్తంభనం లేఖనం గురు
పిత్తాస్రదాహశోథఘ్నం వాతాధ్మానవిబన్ధకృత్.

తా. దొండకాయలు, దొండకూర ఇవి, మధురము, చలవ, మందము, గురుత్వము - గలవిగనుండుటయగాక పైత్యరోగము, రక్తస్రావరోగము, తాపము, వాతరోగము, శోభ, కడుపుబ్బరము, వీటిని పరిహరింపంజేయు.

శ్లో. వృష్యం వర్ణకరం బలౌజజననం పిత్తాపహం వాతజి
న్మూత్రాఘాతహరం ప్రమేహశమనం కృచ్ఛ్రాశ్మరీభేదనమ్
విణ్మూత్రగ్లపనం తృషార్తిశమనం క్షీణాంగపుష్టిప్రదం
కూశ్మాండం ప్రవరం వదంతి భిషజో వల్లీఫలానాం పునః.

తా. * పెద్దగుమ్మడుకాయ వీర్యవృద్ధి, దేహంబునకు కాంతి, బలము వీటిని గలుగచేయుటయేగాక, వాతము, పిత్తము, మూత్రాఘాతము, ప్రమేహము, మూత్రకృచ్ఛ్రము, మూత్రాశ్మరీ ఈమొదలగురోగంబులను పరిహరింపచేయు. మరియు నది మలమూత్రంబులనుశోధించి దాహంబును శమింపచేయునదిగను కృశించెడివారికి బలంబును గలుగజేయునదిగను నున్నయది. తీగవలనజనించెడి ఫలంబులలో నిది శ్రేష్ఠంబైనదని వైద్యులు వచించెదరు.

శ్లో. జలజం పద్మకందాది గ్రాహిపిత్తాస్రహృద్గురుః.

తా. కమలములు, తామరగడ్డలు మొదలగునవి, పిత్తము, రక్తస్రావము, వీటిని హరింపజేయు.

శ్లో. దీపనస్సూరణో రుచ్యః కఫార్శోఘ్నః ప్రజిల్లఘుః.

తా. మిగుల లఘుపదార్థములగు తియ్యనికంద, అడవికంద, ఇవిఅగ్నిదీపనము, నోటికిరుచి, వీటిని గలుగజేయునవిగను, శ్లేష్మము, మూలవ్యాధి, రక్తస్రావము వీటిని హరింపజేయునవిగను నున్నయవి.

శ్లో. ఆర్ద్రిం పాచనదీపనం రుచికరం వృష్యం కటూష్ణం వరం
స్వర్యం మేహహరం కఫామయహరం శోఫాపహం శూలజిత్

* ఇదియ బూడిదగుమ్మడుకాయ యనంబడు.

జిహ్వాకంఠవిశోధనం సలవణం పథ్యం సదా భోజనే
నింబూతోయవిమిశ్రితం రుచికరం సందీపనం సారణమ్.

తా. అల్లము అజీర్ణమునుహరింపజేసి దీపనమును గలుగజేయుటయేగాక రుచిగలదిగను, బలకరమయినదిగనుండు. అందు కారము, ఉష్ణము గలిగియుండుటచే నది స్వరదోషము, మేహము, శ్లేష్మరోగము, వాపు, శూల, వీటిని హరింపజేయు. మరియు అల్లపుస్వరసంబుదీసి నందు సైంధవలవణమునుచేర్చి సేవించిన జిహ్వా, కంఠము వీటియాందలిదోషములను హరింపచేయు గాన దాని ప్రతిదినము బుచ్చుకొనిన భోజనహితము గలుగు. మరియు నిమ్మపండ్లరసములో అల్లమునుచేర్చి పుచ్చుకొనిన మిగులరుచిని, దీపనమును, విరేచనమును గలుగజేయు.

శ్లో. భూకందస్త్వతివాతలో బలకరశ్శ్లేష్మాణమత్యర్థకృ
ద్విష్టంభీ గురుమేదసోఽపి విషమో వాతామయం దీపయేత్
మేహం కుష్ఠరుజం కరోతి సతతం తద్వాతరక్తం మహా
త్పిండాళుః కృమికృచ్ఛ్రకుష్ఠమలహృత్పిత్తామయధ్వంసకః.

తా. పుట్టకొక్కులు మిక్కిలివాతము, బలము, అత్యంతశ్లేష్మము, మలమూత్రబంధకము, వీటిని గలుగంజేయుటయగాక గురుత్వమయినదిగ నున్నయది. ఇవి మేదోరోగము, మేహము, కుష్ఠు, వాతరక్తము, వీటినివృద్ధిజేయు. గెనుసుగడ్డ, హృదయమునందలి పురుగులు, మూత్రకృచ్ఛ్రము, కుష్టురోగము, మలము, పైత్యరోగము, వీటిని నశింపజేయు.

శ్లో. ఔర్వారుకం పిత్తశీతం మూత్రఘ్నం రుచికారకమ్.

తా. నూగుదోసకాయ మధురము గలదియైనను, పిత్తము. శీతలము, వీటిని గలుగంజేయుటయేగాక మూత్రమును సరళముగ విసర్జింపంజేయు.

శ్లో. పత్రే పుష్పే ఫలే నాళే కందే చ గురుతా క్రమాత్
కందాస్తు వాతలాస్సర్వే కఫాజీర్ణకరా జడాః.

తా. ఎఱ్ఱగడ్డలు, వాటిఆకులు, పుష్పములు, ఫలములు, కాడలు, ఇవి క్రమంబుగనొకటికన్న నొకటి గురుత్వముగలవిగనుండు. పెద్దయెఱ్ఱగడ్డలు, గురుత్వముగలవియైనను వాతము, శ్లేష్మము, అజీర్ణము వీగిని గలుగంజేయు

శ్లో. దాడిమం గ్రాహి దోషఘ్నం హృద్యం రోచనదీపనమ్
తద్వదామలకం పథ్యం మధురామ్లరసం సరమ్.



తా. దానిమ్మపండు రుచి, ప్రియము, ఇవిగలదిగను, దీపనమును గలుగంజేయునదిగను నుండుటయగాక గ్రహణిరోగములను హరింపంజేయు. ఉశిరికాయ దాడిమఫలగుణముగలిగియుండినను నందుతీపు, పులుసు నుండుటచే హితంబును గలుగంజేయు.

శ్లో. దోషకృల్లకుచం స్వాదు పిత్తఘ్నం మృగలేండికమ్.

తా. అడివిపనస మధురమైనదైనను దోషమును జనింపంజేయు. జింకమాంసము పిత్తమును శమనంబుజేయు.

శ్లో. గుల్మవాతకఫశ్వాసకాసఘ్నం బీజపూరకమ్.

తా. మాదీఫలము గుల్మము, వాతము, శ్లేష్మము, శ్వాసకాసలు వీటిని నశింపంజేయు.

శ్లో. చారాక్షోరుష్కరాంతస్థం వృష్యం పిత్తానిలాగ్నిజిత్.

తా. సారపప్పు, తానికాయలపప్పు, జీడిపప్పు, ఇవిపిత్తమును, వాతమును, ఉష్ణమును, హరించి బలమును గలుగంజేయు.

శ్లో. ద్రాక్షా పరూషకామ్రాద్యమామం పిత్తకఫప్రదమ్.

తా. పచ్చిద్రాక్ష, ఫాలసాపండ్లు (అనగాజామపండ్లు) మామిడిపండ్లు ఇదిమొదలగుఫలములును, వాటికాయలును, ఆమమును, పిత్తమును, శ్లేష్మమును గలుగంజేయు.

శ్లో. ద్రాక్షా మధుకఖర్జూరకాశ్మర్యం సపరూషకమ్
వాతపిత్తాస్రజిద్వృష్యం కేశఘ్నం చ శమీఫలమ్.

తా. దీపద్రాక్ష, అతిమధురము, ఖర్జూరము, పెద్దగుమ్మడుపండు, ఫాలసాపండు, ఇవిబలమును గలుగంజేసి, వాతము రక్తపైత్యము, వీటిని నశింపంజేయు. జమ్మిపండ్లు వెంట్రుకలను నశింపజేయు.

శ్లో. అల్పసిక్థా భవేత్పేయా బహుసిక్థా విలేపికా
సునిష్కిక్థో భవేన్మండః ప్రభూతస్తోదనస్స్మృతః.

తా. స్వల్పమెతుకులుగల గంజి పేయమనియు, నందు మెతుకులధికముగనుండిన విలేపియనియు, మెతుకులులేనిగంజి మండమనియు, గంజిలేకయుండు మెతుకులు ఓదనమనియు (అనగా నన్నము) జెప్పంబడు.

శ్లో. మండశ్చతుర్దశగుణే తోయే సిద్ధోప్యసిక్థకః
పేయా సిక్థయుతా సిద్ధా చతుర్దశగుణేఽంభసి.
విలేపీ ఘనసిక్థా స్యాత్సిద్ధా తోయే చతుర్గుణే
మ్మండపేయావిలేపీనా మోదనస్య చ లాఘవమ్.

తా. ఒకభాగపు బియ్యములో ౧౪ భాగములు నీరుపోసి మెతుకులు లేనటుల ఉడికించినవి మండము. ఒకభాగపు బియ్యములో ౧౪ భాగములు నీరుపోసి మెతుకు లుండునటుల ఉడికించినది పేయము. ఇవి మిగులశ్రేష్ఠంబైనది. ఒకభాగము బియ్యము ౪ భాగములు నీరునుగలిపి మిగుల మెతుకు లుండునటుల పాకముచేసినది విలేపి. మఱియు మండము, పేయము, విలేపి ఈమూటికన్న నన్నము లఘుత్వముగ నుండు.

శ్లో. యథా శివస్తత్ర మండో వాతపిత్తానులోమనః
తృడ్దాహగ్లానిదోషఘ్నం పాచనో ధాతుసామ్యకృత్
శిరోమార్దవకృత్స్వేదీ సంధుక్షయతి చానలమ్.

తా. జనులను జగద్రక్షకుండగు శివుండెటుల రక్షించునో నటుల, పేయము, విలేపి, మండము, ఇవి వాతపిత్తశ్లేష్మములను, అనులోమవాయువును, హరించి రక్షించును. అందు మండము దాహము, ఆయాసము, దోషము, వీటిని హరింపజేయుంటయ గాక పచనంబును, ధాతువృద్ధిని, శిరస్సుకు మృదుత్వమును అగ్నిదీపనమును, చమటను, గలుగజేయు.

శ్లో. క్షుత్తృష్ణాగ్లానిదౌర్బల్యకుక్షిరోగజ్వరాపహా
మహానులోమనీ జ్ఞేయా పేయా పాచనదీపనీ.

తా. పేయమనునది, ఆకలి, దాహము, ఆయాసము, దౌర్బల్యము, కుక్షిరోగము, జ్వరము, అనులోమవాయువు వీటిని హరింపజేసి పాచనదీపనములను గలుగ జేయు.

శ్లో. విలేపీ గ్రాహిణీ హృద్యా జ్ఞేయా పాచనదీపనీ.

తా. విలేపియనునది దేహంబున కారోగ్యమును ఆకలిని, పాచనమును, గలుగ జేసి గ్రహణిదోషములను హరింపజేయు.

శ్లో. వ్రణాక్షిరోగసంశుద్ధదుర్బలస్నేహపాయినామ్
సుధాతః ప్రసృతస్స్విన్నస్త్వక్తోష్ణా చోదనో లఘుః.

తా. చక్కగకడిగి పక్వముచేసి వార్చబడిననన్నంబును, లేక, ఇగరబెట్టబడి కించిదుష్ణంబగు నన్నంబును, ఇవి వ్రణరోగంబును, నేత్రరోగంబును, దౌర్బల్యమును తైలపానముచే జనించిన దోషమును, హరింపచేయు. మఱియు రేచనపాచన దీపనములను గలుగజేయు.

శ్లో. ముద్గస్తు పథ్యస్సంశుద్ధవ్రణకంఠాక్షిరోగిణామ్,



తా. పెసలు రేచన పాచన దీపనాదులను గలుగంజేయుంటయగాక వ్రణములను, కంఠరోగములను, నేత్రరోగములను నివృత్తిజేయు.

శ్లో. వాతానులోమీ కౌళిత్థో గుల్మతూనిప్రతూనిజిత్.

తా. ఉలవలు వాతము, అనులోమవాతము, గుల్మము, తూనివాతము, ప్రతూనివాతము వీటిని నశింపంజేయు.

ఇట్లు పథ్యవర్గము ముగిసెను.

---

## మూత్రవర్గము.

శ్లో. మూత్రం గవ్యం తథాజం మనుజభవమపి స్వేదకండూవినాశం
తిక్తం తీక్ష్ణం లఘూష్ణం సలవణసరసం పిత్తలం భేదిరూక్షమ్
హృద్యం రుచ్యం కృమిఘ్నం హుతవహజననం కుష్ఠమేదోవినాశం
గుల్మార్శోనాహశూలోదరకఫవిషజిచ్ఛోఫపాండుప్రణాశమ్.

తా. ఆవు, మేక, ఎద్దు, గాడిదె, వీటిమూత్రము, నరమూత్రము, ఇవికారము, చేదు, తీక్ష్ణము, లఘువు, ఉష్ణము, మధురము, ఉప్పు గలవిగనుండు. ఇందు కృష్ణవర్ణము గలది నుత్తమంబైనది. మఱియు నీమూత్రంబులు చమట, దురద, పిత్తము, విరేచనము, మందము, హృదయమునందలి పురుగులు, కుష్ఠువు, మేదోరోగము, అర్శ, గుల్మశూల, ఉదరశూల, శ్లేష్మము, విషము, శోభ, పాండువు, వీటిని నశింపజేసి దీపనంబును గలుగజేయు.

---

## * శృతశీతోదకగుణము.

శ్లో. పిత్తోత్తరే పిత్తరోగే పిత్తాసృక్కఫపిత్తయోః
మూర్ఛాఛర్దిజ్వరే దాహే తృష్ణాతీసారపీడితే,
ధాతుక్షీణే విషార్తా చ సన్నిపాతే విశేషతః
శస్తం విరోధిరోగే చ శృతశీతం జలం సదా.

తా. కాగిచల్లారినయుదకము, పిత్తోద్రేకము, పైత్యరోగము, రక్తపైత్యము, శ్లేష్మము, పిత్తము, మూర్ఛ, వాంతి, జ్వరము, దాహము, అతిసారము, క్షీణధాతువు, విషము, సన్నిపాతము, విరుద్ధరోగము, వీటికి ప్రశస్తంబుగనుండు.

---

* కాగిచల్లారినయుదకము.

## శీతోదకగుణము.

శ్లో. పార్శ్వశూలే ప్రతిశ్యాయే వాతరోగే గళగ్రహే
ఆధ్మానే స్తిమితే కోష్ఠే సద్యశ్శుద్ధౌ నవజ్వరే.
హిక్కాయాం స్నేహపీతే చ శీతాంబుపరివర్జయేత్.

తా. శీతోదకమును పక్కశూల, జలుబు, వాతరోగము, గళవ్యాధి, కడుపుబ్బరము, మలబద్ధకము, వెక్కిళ్లు, ఇవిగలవారును, జ్వరము శమించినవారును, తైలపానముచే జనించిన పైత్యరోగముగలవారును వర్జింపవలయును.

## ఉష్ణశీతోదకగుణము.

శ్లో. గుల్మార్శోగ్రహణీక్షయేషు జఠరే మందానలాధ్మాతకే
శోఫే పాండుగళగ్రహే వ్రణగదే మేహే చ నేత్రామయే
వాతారుచ్యతిసారకే కఫయుతే కుష్ఠే ప్రతిశ్యాయకే
ఉష్ణం వారి సుశీతలం హితకరం స్వల్పం ప్రదేయం బుధైః.

తా. కాచి పానముజేయుటకు హితంబుగ చల్లారిననీళ్లు, గుల్మము, మూలవ్యాధి సంగ్రహణి, క్షయము, ఉదరరోగము, మందాగ్ని, కడుపుబ్బరము, శోభ, పాండువు, గళగ్రహరోగము, వ్రణము, మేహము, నేత్రరోగము, వాతము, అరుచి, అతిసారము, శ్లేష్మరోగము, కుష్ఠువు, జలుబు, ఈరోగంబులుగలవారు స్వల్పంబుగ పానంబొనర్చిన హితమును గలుగజేయును.

## శుద్ధోదకగుణము,

శ్లో. అజీర్ణే చౌషధం వారి జీర్ణే వారి బలప్రదమ్
భోజనే చామృతం వారి రాత్రౌ వారి విషోపమమ్.

తా. అన్నము జీర్ణముగానియెడల ఉష్ణోదకము త్రాగవలయును. అన్నము జీర్ణమైనపిదప నుదకమును త్రాగిన బలంబును గలుగంజేయును. భోజనానంతరము ఉదకమును త్రాగిన నది అమృతతుల్యంబుగ నుండు. అర్ధరాత్రులయం దుదకమును త్రాగిన నది విషతుల్యమై రోగంబుల జనింపజేయును.

శ్లో. పిబేద్ఘటసహస్రం తు యావన్నాస్తమితే రవౌ
అస్తంగతే దివానాథే బిందురేకో ఘటాయతే,



తా. సూర్యుండస్తమించువఱకు సహస్రఘటంబుల నుదకంబైనను త్రాగవచ్చును. సూర్యుండస్తమించినపిదప నీరుత్రాగిన నందొక బిందువు నొకఘటసమానంబై రోగంబును గలుగజేయును.

శ్లో. తప్తాయఃపిండసంయుక్తం లోష్ఠనిర్వాపితం జలమ్
సర్వదోషహరం పథ్యం సదా నైరుజ్యకారకమ్.

తా. ఉదకమునందు యినపగుండునైనను, కుండపెంకులనైనను, ఇటికరాళ్లనైనను చక్కగాకాల్చివేసి నాయుదకంబును వడియకట్టి పుచ్చుకొనిన సర్వదోషంబులు శమనంబగుటయగాక రోగను గలుగకుండునటుల చేయందగినదిగను, పథ్యకరంబైనదిగను నుండు.

శ్లో. ఉశీరమాంస్యా చ కచూరమేలాలవంగకాంకోలసవారికోష్ఠమ్
హరీతకీగంధమిదం సమం చ జలాధివాసః పృథివీశ్వరాణామ్.

తా. వట్టివేరు, లటామాంసి, కచ్చూరములు, ఏలకాయలు, లవంగములు, కంకోళములు, కురువేరు, కోష్ఠు, కరకకాయలు, శ్రీగంధపుచెక్క, వీటిని సమభాగములుగదంచి చూర్ణముచేసి ఉదకంబునవేసి కాచి రాజులు మొదలగుసుకుమారులు త్రాగిన ఉష్ణము, పిత్తము, శ్లేష్మము, వీటిని హరింపంజేసి శరీరంబున కారోగ్యంబును గలుగంజేయును.

## క్షీరగుణము.

శ్లో. గోక్షీరమనభిష్యంది స్నిగ్ధం గురురసాయనమ్,
రక్తపిత్తహరం శీతం మధురం రసపాకయోః.

తా. ఆవుపాలు స్వల్పముగ స్రవించునదిగను, జిడ్డుగలదిగను, గురుత్వముగను, మధురముగను, నుండుటయగాక నది జరావ్యాధి, రక్తపైత్యము, వీటిని నశింపం జేయునదిగను, వయస్థాపనము, నేత్రములకు హితము, శరీరంబునకు పుష్టి, బలము, ఉల్లాసము, చల్లదనము, వీటిని గలుగజేయునదిగను, పాకంబుల కుపయోగంబైనదిగను నున్నయది.

శ్లో. గవ్యతుల్యగుణం త్వాజం విశేషాచ్ఛోషిణే హితమ్
దీపనం లఘుసంగ్రాహి విశేషాచ్చాపరం శృణు
అజానామల్పకాయత్వాత్కటుతిక్తనిషేవణాత్
నాత్యంబుపానాద్వ్యాయామాత్సర్వవ్యాధిహరం పయః.

తా. మేకపాలు, ఆవుపాలు గుణంబులతో సమమైనదిగ నుండినను నదిక్షయరోగంబునకు విశేషముగ హితంబును, దీపనమును గలుగంజేయుటయగాక లఘువుగను,

గ్రహణిరోగమును హరింపజేయునదిగను నున్నయది. మరియు మేకలు కారము, చేదుగలపదార్థములు, వీని భక్షించుటచేతను, స్వల్పముగ నీరుద్రాగుటచేతను, మిగుల సంచారము చేయుటచేతను, వాటిపాలు సమస్తరోగములను నశింపజేయు.

శ్లో. మహాభిష్యందిమధురం మాహిషం వహ్నినాశనమ్
నిద్రాకరం శీతకరం గవ్యాత్స్నిగ్ధతరం గురు.

తా. బఱ్ఱెపాలు, దట్టముగ స్రవించునదిగను, మధురముగలదిగను, అగ్నిమాంద్యము, నిద్ర, శ్లేష్మము, వీటిని గలుగంజేయునదిగ, నుండినను, నది ఆవుపాలకన్నను నధికమందము, గురుత్వముగలదిగను నున్నయది.

## పెరుగు, మజ్జిగ, గుణములు.

శ్లో గవ్యం చ దీపనం తక్రం మేధ్యమర్శాస్త్రిదోషనుత్.

తా. ఆవుమజ్జిగ దీపనమును, మిగులబుద్ధిని గలుగజేయుటయగాక మూలవ్యాధి, త్రిదోషములు, వీటిని నశింపజేయు.

శ్లో. మాహిషం శ్లేష్మలం తక్రం సాంద్రం శోభకరం గురు.

తా. ఎనపమజ్జిగ కఫము, శోభ, వీటిని గలుగజేయుటయగాక కఠినమైనదిగను, గురుత్వముగలదిగను నున్నయది.

శ్లో. నుస్నిగ్ధం ఛాగలం తక్రం లఘుదోషత్రయాపహమ్,
గుల్మార్శోగ్రహిణీశోఫపాండ్వామయవినాశనమ్.

తా. మేకమజ్జిగ మిక్కిలిస్నిగ్ధము, లఘుత్వము గలదిగను, త్రిదోషములను శమింపజేయునదిగను, గుల్మము, మూలవ్యాధి, సంగ్రహణి, శోభ, పాండువు, ఈరోగంబులను నశింపజేయునదిగను నున్నయది.

శ్లో. ఘోలం మారుతపిత్తహారిసుధితం వాతాపహం శ్లేష్మహృ
త్పిత్తశ్లేష్మవినాశ్యుదశ్విదధికం తక్రం త్రిదోషాపహమ్
మందాగ్న్యావరుచౌ తథైవ నితరామన్యేషు రోగేష్వపి
శ్రేష్ఠం తక్రమిదం వదంతి మునయస్తేనోత్తమం ప్రాణినామ్.

తా. పెరుగులో నుదకంబునుజేర్చి చిలికి వెన్నయెత్తకయుంచబడినమజ్జిగ ఘోలమనబడు. ఇది పిత్తమును, వాతమును, నశింపంజేయు. మఱియు నీరుచేర్చక చిలికి వెన్న తీసినమజ్జిగ మథితమనబడు. ఇది వాతమును, శ్లేష్మమును హరింపజేయు. మఱియు పెఱుగుకు సమముగా జలంబునుచేర్చి చిలికి వెన్నతీసిన. మజ్జిగ ఉదశ్వితమనబడు. ఇది



పిత్తశ్లేష్మములను నివృత్తిజేయు. పెఱుగుకు కాలుభాగము నుదకంబునుజేర్చి చిలికి వెన్నతీసిన తక్రమనబడు. ఇది అన్నిటికన్న నుత్తమంబైనదిగ నుండుటయగాక త్రిదోషంబును శమనంబుజేసి మందాగ్ని, అరుచి, ఇవి మొదలగురోగంబులను పోకడచి నరుల కారోగ్యమును గలుగంజేయు.

శ్లో. వాతేఽమ్లం సైంధవోపేతం స్వాదుపిత్తే సశర్కరమ్
పిబేత్తక్రం కఫే చాగ్నివ్యోషక్షారసమన్వితమ్.

తా. పుల్లనిమజ్జిగలో తగుమాత్రము సైంధవలవణమునుజేర్చి పుచ్చుకొనిన వాతరోగము హరించు. మఱియు నందు శర్కరకలిపి పుచ్చుకొనిన పైత్యరోగము హరించు. చిత్రమూలము, శొంఠి, మిరియాలు, పిప్పళ్లు, సైంధవలవణము, వీటిని తగుమాత్రము చూర్ణముచేసి పుల్లటిమజ్జిగలో కలిపిత్రాగిన శ్లేష్మరోగము హరించు.

శ్లో. తక్రాల్లఘుతరో మంథః కూర్చికా దధితక్రవత్,
గోజామహిషీణాం తక్రం తద్వద్దధిగుణాః పృథక్.

తా. ముందు జెప్పబడిన మథితము మంథమనబడు. అది మిగుల లఘుత్వము గలదిగనుండు. పాలలో పెఱుగుబోసి కాచబడినది కూర్చికమనబడు. దీనికి పెరుగు, మజ్జిగ, వీటిగుణములు గలిగియుండు. ఆవు, మేక, ఎనుము, వీటిమజ్జిగకు ముందు జెప్పబడిన గుణము లెవ్వియో యాయాగుణంబు లాయా పెరుగుకును గలవని యెఱుంగవలయు.

## వెన్నగుణములు.

శ్లో. గవ్యం వా మాహిషం వాపి నవనీతం నవోద్ధృతమ్
శస్యతే బాలవృద్ధస్య బలకృద్ధాతువర్ధనమ్.
సీతం బలాఢ్యం మధురామ్లవృష్యం
శ్లేష్మాపహం పిత్తమరుత్ప్రణాశమ్
శోషక్షయః క్షీణకృశాతివృద్ధ
బాలేషు పథ్యం నవనీతముక్తమ్.

తా. ఆవు, బఱ్ఱె, వీటి పెరుగును చిలికి తోడనే యెత్తబడినవెన్న నవనీతమనబడు. దానని బాలులు, వృద్ధులు, భక్షించిన బలమును, ధాతువృద్ధిని గలుగంజేయు. మరియు వెన్న, శీతలము, మధురము, పులుసు, ఇవిగలదిగ నుండుటయగాక శ్లేష్మఘ్ను, పిత్తము వాతము వీటిని నశింపంజేసి బలమును గలుగంజేయు. మఱియు నావెన్న మూర్ఛ, క్షయము, క్షీణించుట, కృశించుట ఈరోగములుగలవారికిని బాలుఱు వృద్ధులు వీరికిని పథ్యకరంబుగ నుండు.

## ఘృతగుణములు.

శ్లో. సర్పిర్గణానాం చాప్యమృతం విషఘ్నం
చక్షుష్యమారోగ్యకరం చ వృష్యమ్,
రసాయనం మందమతీవ మేధ్యం
స్నేహోత్తమం చేతి బుధాస్తువంతి.

తా. ఆవునెయ్యి అమృతతుల్యంబయి విషంబును నశింపఁజేసి నేత్రంబులకు హితంబును, శరీరంబునకారోగ్యము, పుష్టి, మందము, వీటినిగలుగఁజేయుటయగాక, జిడ్డుగలదిగను, యజ్ఞంబులొనర్చుటకును రసాయనములు, తైలములు, వీటిని జేయుటకును మిగుల నుత్తమంబయినదిగ నుండు. ఇట్టిసుగుణంబులు దీనియం దుండుటచే బుధజనులు దీనిని మిగుల శ్రేష్ఠంబని స్తుతించెదరు.

శ్లో. సర్పిర్మాహిషముత్తమం ధృతికరం సౌఖ్యప్రదం కాంతిదం
వాతశ్లేష్మనిబర్హణం బలకరం వర్ణప్రసాదక్షమమ్
దుర్నామగ్రహణీవికారశమనం మందానలోద్దీపనం
చక్షుష్యం నవగవ్యతః పరమిదం హృద్యం మనోహారి చ.

తా. బఱ్ఱెనెయ్యి ఉత్తమంబైనదిగను, ధైర్యము, ఆరోగ్యము, కాంతి, బలము అగ్నిదీపనము, నేత్రములకుహితము, వీటినిగలుగఁజేయునదిగను నుండుటయగాక వాతము, శ్లేష్మము, మూలవ్యాధి, సంగ్రహణి, ఈరోగంబులను నశింపఁజేయు. మఱియు బఱ్ఱెనెయ్యి ఆవునెయ్యికన్నను శ్రేష్ఠంబయి ఉల్లాసము, ప్రీతి వీటిని గలుగఁజేయునదిగ నున్నయది.

శ్లో. దీపనీయమజాసర్పిశ్చక్షుష్యం బలవర్ధనమ్
కాసే శ్వాసే క్షయే వాపి పథ్యం పానేషు తల్లఘు.

తా. మేకనెయ్యి అగ్నిదీపనమును, నేత్రంబునకు చల్లన, శరీరంబునకు పుష్టి, వీటిని గలుగఁజేయదగినదిగను, దగ్గు, శ్వాసము, క్షయము, వీటికి మిగుల పథ్యకరంబయినదిగను, త్రాగుటకు లఘుత్వముగలదిగను నుండు.

---

## తేనెగుణములు.

శ్లో. త్రిదోషఘ్నం మధు ప్రోక్తమన్యత్స్యాత్సన్నిపాతహమ్
హిక్కాశ్వాసకృమిఛర్దిమోహతృష్ణావిషాపహమ్.

తా. తేనె వాతము, పిత్తము, శ్లేష్మము, ఇతరములగు ననేకసన్నిపాతరోగములు, వెక్కిళ్లు, శ్వాసము, పురుగులు, వమనము, మూర్ఛ, దాహము, విషము, వీటిని నశింపఁజేయు.



## చెఱకుపాలగుణము.

శ్లో. శర్కరా సమవీర్యస్తు దంతనిష్పీడితో రసః
గురుర్విదాహివిష్టంభీ యాంత్రికస్తు ప్రకీర్తితః.

తా. పండ్లతోనమిలి మ్రింగబడిన చెఱకురసము చక్కెరతో సమమయినవీర్యముగలదిగనుండు. గానుగలో ఆడబడిన చెఱకురసము, గురుత్వముగలదిగను, అహంకారము, అతిదాహము, వీటినిగలుగఁజేయునదిగను నున్నయది.

శ్లో. సక్షారో మధురోఽతిమూత్రబహులో రక్తస్య సంశోధనో
మేదోహానికరోఽతిపిత్తశమనో వాతఘ్నవిష్టంభనః
శ్లేష్మాణం జనయంశ్చ బృంహణకరో బల్యస్సదా స్వాస్థ్యకృ
చ్ఛోషఘ్నో విషహాస్రపిత్తశమనస్స్యాద్వి విరేకే సదా.

తా. చెఱకు మధురము, ఉప్పుగలదిగ నుండుటయగాక అతిమూత్రము, శ్లేష్మము, పుష్టి, బలము, ఆరోగ్యము, వీటిని గలుగఁజేసి రక్తగతరోగము, మేదస్సు, అత్యంతపిత్తము, వాతము, బడలిక, రక్తపైత్యము, విషము, విరేచనము వీటిని హరింపఁజేయు.

---

## బెల్లము, కలకండ, తెల్లచక్కెర, వీటిగుణములు.

శ్లో. విణ్మూత్రామయనాశనోఽగ్నిజననః కండూప్రమేహాంతకృ
త్స్నిగ్ధస్స్వాదుతరో లఘుశ్రమహరః పథ్యః పురాణో గుడః.

తా. పాతబెల్లము స్నిగ్ధంబుగను, మధురంబుగను, లఘువుగను, పథ్యకరంబుగను నున్నయది. మరియు విరేచనము, బహుమూత్రము, దురద, ప్రమేహము, ఆయాసము, వీటిని పరిహరించి అగ్నిదీపనమును గలుగఁజేయు.

శ్లో. దాహం నివారయతి పిత్తమపాకరోతి
తృష్ణాం ఛినత్తి వినిహంతి చ మోహమూర్ఛామ్
శోషం వినాశయతి శోధయతీంద్రియాణి
శీతా సదా సమధురా ఖలు శుద్ధఖండా.

తా. కలకండ మధురము, శీతలముగలదిగనుండుటయగాక విదాహము, పిత్తము, మూర్ఛ, శోష, దాహము, ఇంద్రియగతదోషము, వీటిని నశింపఁజేయు.

శ్లో. మూర్ఛామోహతృషాస్యశోషశమనీ దాహజ్వరధ్వంసనీ
శ్వాసఛర్దిమదాత్యయక్లమహరీ హృద్యా చ సంతర్పణీ

క్షీణే రేతసి పావకే చ విషమే క్షీణే క్షతే దుర్బలే
దుర్వారేఽపి చ రక్తపిత్తకగదే సేవ్యా సితా శర్కరా.

తా. మనోరమ్యంబగు తెల్లచక్కెర మూర్ఛ, మోహము, దాహము, ముఖశోషము, జ్వరము, బడలిక, శ్వాసము, ఓకర, వాంతి, ధాతుక్షయము, మందాగ్ని, దుర్బలము, క్షయము, ప్రబలమగు రక్తపైత్యము, వీటిని నశింపంజేయును.

## తైలాదిగుణములు.

శ్లో. కండూహారం కాంతివివర్ధనం చ వర్చోవివృద్ధిం తనురోపణం చ
క్రిమిం నిహన్యాద్బలశుక్రకారి తైలం కృతశ్లేష్మమరుత్ప్రణాశమ్.

తా. నువ్వులనూనె దురదను హరింపంజేసి దేహమునకు కాంతి, బలము, వీర్యవృద్ధి, శ్లేష్మము, వీటిని గలుగంజేయునదిగను, మలమును వృద్ధిజేయునదిగను, వాతము, ఉదరమునందలి పురుగులు, వీటిని నశింపంజేయునదిగను నున్నయది.

శ్లో. కటూష్ణం సార్షపం తైలం కఫశుక్రానిలాపహమ్
లఘుచోష్టం సికృత్స్పర్శాత్కుష్ఠార్శోవ్రణజంతుజిత్.

తా. ఆవనూనె లఘువుగను, కారము, ఉష్ణముగలదిగను, శ్లేష్మము, శుక్లగతదోషము, వాతము, కుష్ఠము, మూలవ్యాధి, జంతురోగము, వ్రణములు వీటిని నశింపచేయునదిగను నున్నయది.

శ్లో. ఏరండతైలంక్రిమినాశనం చ సర్వత్రశూలఘ్నమరుత్ప్రణాశమ్
కుష్టాపహం చాపి రసాయనం చ పిత్తప్రకోపానిలశోధనం చ.

తా. ఆముదము కడుపునందలి పురుగులు, సమస్తఉదరశూలలు, వాతము, కుష్ఠువ్యాధి, వీటిని నశింపజేయును. మరియు దీనిచే చేయంబడు రసాయనములను సేవించిన పిత్తరోగము, వాతరోగము, ఇవి నివృత్తియగు.

శ్లో. బృహద్గుల్మానిలకఫానుదరం విషమజ్వరం,
వాతశూలగజేంద్రాణామేరండస్నేహకేసరీ.

తా. ఆముదము, అండవృద్ధి, గుల్మము, వాతము, శ్లేష్మము ఉదరరోగము విషమజ్వరము, వీటిని నశింపజేయును. మరియు ఏనుగంబోలినవాతశూలలను సింహము

* దీనిని కించిదుష్ణముచేసి వ్రణసంబంధమగు రోగములకు లేపనముచేసిన నవి నశించు.



వలె ఆముదము నశింపజేయును. (అనగా నాముదము పుచ్చుకొనిన వాతశూలలు నివృత్తియగు.

శ్లో. ఆమవాతగజేంద్రస్య శరీరవనచారిణః
ఏక ఏవాగ్రణీర్హంతా ఏరండస్నేహకేసరీ.

తా. శరీరంబను నీవనంబున ఆమవాయువనుగజము సంచరింపుచుండు. అటుల సంచరింపుచుండెడి గజమును ఆముదమను సింహము నొకటేతూరిగ సంహరించు. (అనగా వనంబున సంచరించు ఏనుగను సింహము ఒకతూరిగ హతంబుచేయుచందంబున నాముదము పుచ్చుకొనిన శరీరంబున జనించెడి ఆమవాయువు నశించు.)

శ్లో. కటీతటనికుంజేషు సంచరన్వాతకుంజరః
ఏరండతైలసింహస్య గంధమాఘ్రాయ గచ్ఛతి.

తా. వనతటంబులయందు సంచరించు ఏనుగ సింహగంధము నెరింగి బరుగిడు చందంబున నడుమున జనించెడి వాయువు నాముదపు వాసన తగిలినమాత్రంబున నశించు.

శ్లో. సర్వధాన్యసమావర్తజాతాని ఫలజాని చ
తైలవత్తాని తల్లేపః ఖర్జూకండూవినాశనః.

తా. ఈ చెప్పంబడిన ఆముదపుగుణములే సమస్తధాన్యములయందును, ఫలములయందును, తీయంబడిన తైలములకు గలిగియుండు. ఇవి లేపనముజేసిన వ్రణములు, దురద, ఇవి మానును.

## మద్యగుణము.

శ్లో. వ్రణశోధనసంధానం రోపణం వాతలం మధు
త్రిదోషఘ్నం మధు ప్రోక్తం ఛర్దిశ్వాసవిషాపహమ్.

తా. మద్యము వ్రణములను, గాయములను మాన్పందగినదిగను, భిన్నంబైన యెముకలను, మాంసమును సంధానము చేయందగినదిగను, వాతమును వృద్ధిచేయందగినదిగను నుండుటయగాక త్రిదోషములు, వాంతి, శ్వాసము, విషము, వీటిని నశింపంజేయునదిగ నున్నయది.

ఇట్లు సమస్తపదార్థగుణంబులు ముగిసెను.

## వమనౌషధములు.

శ్లో. గుడేన తుత్థకం దద్యాదుష్ణం వారి పిబేన్ముహుః
పీత్వారాంఠకషాయం వా సింధుకృష్ణాసమన్వితమ్. (వమేత్)

తా. శుద్ధిచేసిన మైలతుత్తమును చూర్ణముచేసి దీనికిసమముగా బెల్లమును కలిపి మాత్ర పక్వమయ్యేవరకు కల్వంబున చక్కగమర్దించి (౪) వరహాయెత్తుకు మించకుండునటుల మాత్రలుచేసి దేహతత్వమునెరింగి అందొకమాత్రను భక్షించి పలుమారు ఉష్ణోదకము త్రాగినను, లేక (౧) తులము మంగకాయలను దంచి సప్తాంశముగ, కషాయముకాచి అందు తగుమాత్రము సైంధవలవణము, పిప్పళ్లు, వీటిని చూర్ణముచేసి కలిపి త్రాగినను, వాంతియగు.

శ్లో. రంగం టంకణతుత్థాని మర్దయేద్ఘటికాత్రయమ్
జీమూతిఫలతోయేన నీలకంఠో భవేద్రసః.
సశర్కరం వల్లయుగ్మం ఛర్దనజ్వరనాశనమ్
పిత్తాదీంశ్చ జ్వరశ్వాసహిధ్మాకాసాదిదోషజిత్.

తా. శుద్ధిచేసిన పాదరసము, శుద్ధిచేసిన గంధకము, శుద్ధిచేసిన మైలతుత్తము, వీటిని సమభాగములుగ ఖల్వంబున చక్కగ మర్దించి పిమ్మట దేవదాలిఫలరసముచే మూడుగడియలు చక్కగమర్దించి ఆరుగురుగింజలప్రమాణము మాత్రలుచేసి నీడనయెండించి అందొకమాత్రను దేహతత్వమునెరింగి చక్కెరతో పుచ్చుకొనిన వాంతియగుటయగాక జ్వరము, పిత్తము, శ్లేష్మము, వెక్కిళ్లు, శ్వాసకాసలు, ఇవి మొదలగు దోషంబులను సగా హరింపచేయును. (ఇది నీలకంఠరస మనంబడును.) ఈ శ్లోకమునందు రం అనిన రసమనియు గం అనిన గంధకమనియు నెరుంగవలయును.

## విరేచనౌషధములు.

శ్లో. త్రివృత్సైంధవశుంఠీనాం చూర్ణముష్ణాంబురేచనమ్
వ్యోషదంతిత్రివృత్పథ్యా నీలీనిర్గుండికాథవా.

తా. శుద్ధిజేసిన తెల్లతెగడ, సైంధవలవణము, శొంఠి, వీటిని సమముగ చూర్ణముజేసి ౩ వరహాలయెత్తు చూర్ణమును ఉష్ణోదకముతో పుచ్చుకొనినను. లేక శొంఠి, పిప్పలి, మిరియాలు, దంతివేరు, శుద్ధిచేసిన తెల్లతెగడ కరక్కాయలు, నీలివేరు, నల్లవావిలిఆకు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి ఉష్ణోదకములో పుచ్చుకొనినను, విరేచనమగు.

---

* మాత్రపక్వము అనగా చేతికి నంటకుండునటుకని నీగ్రంథమునం దెల్లెడల నెరుంగవలయును.



శ్లో. హరీతకీభిః క్వథితం కషాయం
దంత్యగ్నికృష్ణాబిడచూర్ణమిశ్రమ్
విరేచనం తద్రుబుతైలమిశ్రం
నిరత్యయం యోజ్యమథామయఘ్నమ్.

తా. లేతకరక్కాయల కషాయములో దంతివేరు, చిత్రమూలము, పిప్పళ్లు, బిడాలవణము, వీటిని సమభాగములుగ చూర్ణముచేసి ఆందాముదమునుకూడ చేర్చి పుచ్చుకొనిన నిర్వికారంబుగ విరేచనముగలిగి రోగములను నశింపంజేయును.

శ్లో. రసం గంధం చ మరిచం టంకణం నాగరాభయా
జేపాలబీజసంయుక్తం క్రమేణ ద్విగుణం భవేత్.
మర్దయేద్దంతినీరేణ త్విచ్ఛాభేదీరసఃస్మృతః
వల్లద్వయప్రమాణేన పిబేచ్ఛోష్ణోదకం ముహుః.
రేచనం జ్వరగుల్మస్య వాతశూలనివారణమ్.

తా. శుద్ధిచేసిన పాదరసము ౧ భాగము, శుద్ధిచేసిన గంధకము ౨ భాగములు, మిరియాలు ౪ భాగములు, చమురు వెలిగారము ౮ భాగములు, శొంఠి ౧౬ భాగములు, కరక్కాయలు ౩౨ భాగములు, శుద్ధిచేసిన * నేపాళములు ౬౪ భాగములు, యీక్రమంబుగ నుంచుకొని ముందుగ పాదరసము, గంధకము, వీటిని ఖల్వంబునం దునిచి మర్దించి పిదప యితరదినుసులను వెవ్వేరుగ చూర్ణముచేసి వస్త్రగాళితమొనర్చి ఇంతకుముందు మర్దించి యుంచుకొనిన రసగంధకములతోడ కలిపి దంతిమూలకషాయముచే మాత్ర పక్వమయ్యేవరకు ఖల్వమున మర్దించి "ఆఱు గురిగింజలప్రమాణమునకు మించకుండునటుల మాత్రలుజేసి నీడనయెండించి అందొకమాత్రను దేహతత్వము నెరింగి పుచ్చుకొని పలుమారు ఉష్ణోదకము త్రాగిన విరేచనముగలిగి జ్వరము, గుల్మము, వాతము, శూల, వీటిని నశింపంజేయును.

---

* శుద్ధిజేయుంటకు ముందు నేపాళములను రేకులుగ వొలిచి యందలి అగరులనుతీసి పారవేయవలయును. ఇట్లు చేయకనుపేక్షించిన వమనంబు గలుగు.

☞ "ఈగ్రంథమునందు వమన విరేచనాది మాత్రలకు వల్లాది ప్రమాణములు చెప్పంబడియుండినను, "శ్లో. స్థితిర్నాస్త్యేవ మాత్రాయాః కాలమగ్నిం వయోబలమ్, ప్రకృతిం దోషదేశౌ చ దృష్ట్వా మాత్రం ప్రకల్పయేత్. యతో మందాగ్నయో హ్రస్వా హీనసత్వా నరాః కలౌ, అతస్తు మాత్రా తద్యోగ్యా ప్రోచ్యతే సుజ్ఞసమ్మతా." అను వచనముల ప్రకారము ఇక్కలియుగంబున జనులు మిగుల దుర్బలులుగను, మిక్కిలి అగ్నిదీపనము లేనివారుగను నుండుటచే దేశము, కాలము, వయస్సు, ప్రకృతి ఇవి మొదలగువాటిని నెరింగి మాత్రాదులను బ్రయోగింపవలయును.

శ్లో. రసభాగో భవేదేకో గంధం చ ద్విగుణం భవేత్
టంకణస్య త్రయో భాగాశ్శృంగబేరం చతుర్గుణమ్.
మరీచం పంచభాగం చ షడ్భాగా చ హారీతకీ
జేపాలం సప్తభాగం స్యాత్సూక్ష్మచూర్ణాని కారయేత్.
భృంగరాజరసేనైవ ఖల్వే నిక్షిప్య మర్దయేత్
చణప్రమాణా వటికా గుడేన సహ భక్షయేత్.
ఉష్ణం సేకాదికం కుర్యాదుష్ణం వారి పిబేన్ముహుః
ఆమాంతరేచనం కుర్యాదజీర్ణజ్వరనాశనమ్.
జలోదరం కామిలాం చ శోఫశూలవినాశనమ్
రసశ్చింతామణిః ఖ్యాతశ్శూలపాండూదరం హరేత్.

తా. శుద్ధిచేసిన పాదరసము ౧ భాగము, శుద్ధిచేసిన గంధకము ౨ భాగములు, శుద్ధిచేసిన చమురు వెలిగారభస్మము 3 భాగములు, శొంఠి ౪ భాగములు, మిరియాలు ౫ భాగములు, కరక్కాయలు ౬ భాగములు, శుద్ధిచేసిన నేపాళములు ౭ భాగములు, వీటిని పైనజెప్పిన క్రమప్రకారము వెవ్వేరుగ ఖల్వమున క్రమముగా నూరి చూర్ణముగావించి అన్నిటిని యేకముజేసి అందు గుంటగలగరాకు రసముబోసి మాత్ర పక్వమయ్యేవరకు ఖల్వమున మర్దించి శనగలంతప్రమాణము మాత్రలుచేసి నీడన యెండించి దేహతత్వంబు నెరింగి అందొకమాత్రను బెల్లమునం దునిచి భక్షించి ఉష్ణోదకమును త్రాగిన విరేచనమగు. మరియు నుష్ణోదకంబుచే నాభియందు కాపడము వేసిన ఆమకట్టుపడువరకు విరేచనమగుటయేగాక జలోదరములు, కామిలలు, వాపులు, నొప్పులు, పాండురోగము, ఉదరరోగము, శూలలు, వీటిని నశింపంజేయు. (ఇది చింతామణిరసమనంబడు.)

శ్లో. స్తంభనం రేచనాంతే చ దధ్యోదనఘృతోదనమ్
అహిఫేనోథవానందభైరవో వా నియోజయేత్.

తా. విరేచనములు నిలవక యగుచుండెనేని పెరుగన్నమునైనను, ఘృతాన్నము నయినను, మినపగింజంత నల్లమందునైనను, ఆనందభైరవ మాత్రనైనను, పుచ్చుకొనిన తత్క్షణంబున విరేచనములు నిలుచును.

---

## నస్యము.

శ్లో. నస్యం విధేయం గుడనాగరేణ
జలేన వా సైంధవపిప్పలీనామ్
ఘ్రాణస్య మన్యాహనుబాహుపృష్ఠ
శిరోఽక్షికంఠశ్రవనామయేషు.



తా. అల్లపురసములో బెల్లమునుచేర్చి ముక్కులలో పిండినను, లేక పిప్పళ్లు, సైంధవలవణము, వీటిని జలముతోనూరి ముక్కులలో పిండినను, పెదిమలు, భుజములు, వీపు, డొక్క, శిరస్సు, నేత్రములు, మెడ, చెవులు, వీటియందలి సర్వదోషములు హరించు. (ఇది నస్యమనబడు.)

---

## నస్యనిషేధము.

శ్లో. భుక్తవత్యథవా స్నాతే నస్యం యోజ్యం న కర్హిచిత్
కృతే నస్యే శిరస్స్నానం రోగాదీంశ్చ వియోజయేత్.

తా. భోజనము, స్నానము, వీటిని గావించినతోడనే నస్యంబు నుపయోగింపం జనదు. మరియు నస్యం బొనర్చినపిదప శిరస్స్నానంబును జేయందగదు. ఇట్లొనర్చిన రోగంబులు జనించు.

---

## దుష్టరక్తవిమోచనము.

శ్లో. రక్తప్రసాదాన్నభవంతి రోగా
స్తద్వైకృతా ద్వైకురుతే జ్వరాద్గీన్
తన్మోక్షణం తుంబికయా చ శృంగ్యా
జలౌకయా వాపి సిరావిమోక్షాత్.

ఇతి శ్రీమద్వైద్యశిఖామణినామ గోపాలదాసేన విరచితే చికిత్సా
సారనామక వైద్యశాస్త్రే వైద్యకౌశల్యం సమాప్తమ్.

తా. శరీరంబునందు రక్తము నిర్మలముగనుండిన రోగంబులు జనింపవు. మరియు నారక్తము వికారమును జెందెనేని జ్వరాదులను బుట్టించు. కావున సొరకాయ బుఱ్ఱలు, కొమ్ములు, జలగలు, వీటిచేతను, నాడులయందు శస్త్రములచేతను దుష్టరక్తమును స్రవింపచేయవలయు. ఇతర సోపరసశోధనమారణాదుల వచించెద.

ఇట్లు వైద్యశిఖామణియగు శ్రీమద్గోపాలదాసునిచే రచియింపబడిన
చికిత్సాసారంబునందు వైద్యకౌశల్యము ముగిసెను.

---

## పాదరసశుద్ధి.

శ్లో. కుమారీ త్రిఫలా వ్యోషచిత్రకం నింబుకం రసమ్
దినైకం మరితం కృత్వా శుద్ధో భవతి పారదః.

తా. పాదరసమును, కలబందరసముచే నొకదినంబును, కరక్కాయలు, తానికాయలు, నెల్లివరుగు, వీటికషాయంబుచే నొకదినంబును, శొంఠి, పిప్పలి, మిరియాలు, వీటికషాయముచే నొకదినంబును, చిత్రమూలకషాయముచే నొకదినంబును, నిమ్మపండ్లరసముచే నొకదినంబును, నీక్రమంబుగ ద్రవము లేకుండువరకు ఖల్వమున చక్కగ మర్దించిన నది శుద్ధియగు.

శ్లో. కర్కోటీ ముసలీ కన్యాద్రవం దత్వా విశోధయేత్.

తా. పాదరసమును, దేవరదొంగికాయలు, నేలతాటిగడ్డలు, కలబంద వీటిరసముచే వెవ్వేరుగ నొక్కొకదినము ద్రవము లేకుండువరకు ఖల్వమున చక్కగ మర్దించిన నది శుద్ధియగు.

శ్లో. కుమార్యా చ నిశాచూర్ణైర్దినమర్ధే విశోధయేత్.

తా. పాదరసమును, కలబందరసము, పసపుపొడి, వీటిచే వెవ్వేరుగ అరదినము ఖల్వమున మర్దించిన నది శుద్ధియగు.

శ్లో. కురంటకాంబుసంయోగాదాతపే మర్దయేద్రసమ్
శుద్ధో భవేత్తతస్సూతస్సర్వకార్యాణి సాధయేత్.

తా. ఖల్వంబున పాదరసమువైచి గోరింటాకురసముచే ద్రవము లేకుండువరకు నొకదినము యెండన మర్దించిన నది శుద్ధియగు. ఇటుల శుద్ధిచేసినరసము సర్వౌషధములయం దుపయోగింపందగు.

## * గంధకశుద్ధి.

శ్లో. సదుగ్ధభాండే చ విలమ్బ్య వస్త్రస్థితం నిరుద్ధ్వాథ బలిం పుటేత
దుగ్ధం గతోఽసౌ రసజారణాయ రసేన యోగ్యస్సకలక్రియాసు.

తా. ఒకకుండకు సగమువరకు పాలుబోసి నాపాలసమీపమున వ్రేలునటుల నొకవస్త్రమును నాకుండ మూతికిగట్టి యందు గంధకమువైచి ఒకమూకుడుచే దానిని గప్పి చీలమన్ను లేపనముజేసి యాకుండను గొంతువరకు పల్లమునబూడ్చి పుటమువేసిన నందలి గంధకము శుద్ధియగు. ఇట్లు శుద్ధిచేయబడినగంధకమును రసముజేర్చి ఔషధములు గావించుటకును, ఇతరములగు ననేకక్రియలు చేయుటకును నుపయోగించు.

---

☞ ఇటుల పాదరసంబును శుద్ధిగావించినపిదప దాని నొకవస్త్రంబున నునిచి గాజుపాత్రయందు పిండి యందలిరసమునే ఔషధముల కుపయోగింపవలయు.

* నెల్లికాయగంధకము ఔషధములు గావించుటకు శ్రేష్ఠమైనదిగనుండుటచే దానినే స్వీకరించవలయు.



## ఇంగిలీకశుద్ధి.

శ్లో. మేషీదుగ్ధేన దరదమమ్లవర్గేణ భావితమ్
సప్తవారం ప్రయత్నేన శుద్ధిమాయాతి నిశ్చితమ్.

తా. ఇంగిలీకమును మేకపాలచే నొకదినంబును, నిమ్మపండ్లరసము, పుల్లప్రబ్బలి ఇవి మొదలగు పుల్లనిరసములచే ౭ పూటలును, ద్రవము లేకుండువరకు ఖల్వమున మర్దించిన నది శుద్ధియగు.

## హరితాళకశుద్ధి.

శ్లో. తాళకం పోటరీం బద్ధ్వా సమూత్రే కాంజికే పచేత్
డోలాయంత్రేణ యామైకం తతః కూశ్మాండజే రసే.
తిలతైలే పచేద్యామం యామం చ త్రిఫలారసే
డోలాయంత్రే చతుర్యామమేవం శుద్ధ్యతి తాళకః.

తా. హరితాళకమును రేకులుగ వొలిచి సన్నముగ కత్తిరించి మడతగుడ్డన మూటగట్టి యొకకుండయందు గోమూత్రము, కలి, ఇవిబోసి నీటిచే నొకఝామును, బూడిద గుమ్ముడురసముచే నొకఝామును, నువ్వులనూనెచే నొకఝామును, త్రిఫలములు (అనగా కరక్కాయలు, తానికాయలు, నెల్లివరుగు) వీటికషాయముచే నొకఝామును, నిత్తెఱంగున డోలాయంత్రంబున ౪ ఝాములు వండిన నది శుద్ధియగు.

## మణిశిలశుద్ధి.

శ్లో. జయంతికాద్రవే డోలాయంత్రే శుద్ధ్యేన్మనశ్శిలా
దినమేకమజామూత్రే భృంగరాజరసేఽపి వా.

తా. మణిశిలను మడతగుడ్డన మూటగట్టి తక్కలి ఆకురసముచే డోలాయంత్రమున నొకదినమువండినను, లేక నల్లమేక మూత్రముచే నొకదినమువండినను, లేక గుంటగలగర రసముచే నొకదినమువండినను నది శుద్ధియగు.

## మైలతుత్తశుద్ధి.

శ్లో. టంకణేన సమం పిష్ట్వాఽథవా లఘుపుటే పచేత్
తుత్థం శుద్ధం భవేత్క్షౌద్రే పుటితం వా విశేషతః.

**తా.** మైలతుత్తమునకు సమముగా * వెలిగారమును జేర్చి అందుదకము బోసి ద్రవము లేకుండువరకు ఖల్వమున చక్కగ మర్దించి బిళ్లజేసి తగుమాత్రపు ప్రమిదె యందునిచి మరియొక ప్రమిదెచే దానిమూతినిగప్పి చీలమన్ను లేపనముజేసి యెండించి లఘుపుటము వేసినను, లేక అందు తేనెకలిపి మర్దించి బిళ్లజేసి పైక్రమప్రకారము లఘుపుటము వేసినను శుద్ధియగు.

## † కఫరిశుద్ధి.

శ్లో. నరమూత్రే చ గోమూత్రే జంభామ్లే చ ససైంధవమ్
సప్తాహం త్రిదినం వాపి పక్వం శుద్ధ్యతి ఖర్పరమ్.

**తా.** కఫరిని ‡ నరమూత్రము, గుఱ్ఱపుమూత్రము, గోమూత్రము, వీటిలో దేనిచేనైనను ౨ దినములుగాని, ౩ దినములుగాని నానబెట్టినను, లేక, సైంధవలవణమును చూర్ణముచేసి నిమ్మపండ్లరసములో కలిపి ౨ దినములైనను, లేక, ౩ దినములైనను నానబెట్టినను నది శుద్ధియగు.

## హేమమాక్షికశుద్ధి.

శ్లో. అగస్తిపత్రనిర్యాసైశ్శిగ్రుమూలం సుపేషితమ్
తన్మధ్యే పుటితం శుద్ధం నింబుజామ్లేన పాచితమ్.

**తా.** హేమమాక్షికము, తారమాక్షికము, కాకమాక్షికము, వీటిలో దేనినైనను నెఱ్ఱగగాల్చి అవిశఆకు, మునగవేరు, వీటిరసములయం దెఱ్ఱగనగువరకు ముంచుచుండినను, లేక వాటిని నెర్రగ కాల్చి నిమ్మపండ్లరసమున నెర్రగనగుపర్యంతము ముంచుచుండన శుద్ధియగు.

## శిలాజిత్తుశుద్ధి.

శ్లో. గోదుగ్ధే త్రిఫలాక్వాథే భృంగద్రావైశ్చ మర్దయేత్
ఆతపే దినమేకైకం శుష్కం శుద్ధ్యేచ్ఛిలాజతు.

---

* చమురు వెలిగారము ఔషధంబులకు శ్రేష్ఠంబైనదిగ నున్నయది.

† కఫరియనగా పాలతుత్తము.

‡ ఈమూత్రములు కఫరిశుద్ధియగువరకు ప్రతిదినము ప్రాతఃకాలమున పాతమూత్రమును పంచివేసి నూతనముగ నందు మూత్రమును నుంచుచుండవలయును.



**తా.** * శిలాజిత్తును ఆవుపాలచే నొకదినంబును, కరక్కాయలు, తానికాయలు, ఉశిరికవరుగు, వీటికషాయముచే నొకదినంబును, గుంటగలగరాకురసముచే నొకదినంబును ద్రవము లేకుండువరకు ఖల్వమున మర్దించి నీమూడు దినంబులును యెండన యెండించిన నది శుద్ధియగు.

## మణులు, ముత్తియములు, పగడములు, వీటిశుద్ధి.

శ్లో. స్వేదయేద్దోలికాయంత్రే జయంత్యాః స్వరసేన తు
మణిముక్తాప్రవాళాని తథా రత్నాన్యశేషతః.
క్షణాద్వివిధవర్ణాని మ్రియంతే నాత్ర సంశయః.

**తా.** ఒకకుండయందు తక్కలిఆకు రసముబోసి అందు పచ్చలు, ముత్తియములు, పగడములు, ఇతరములగు ననేకరత్నములును వేసి డోలాయంత్రంబున వండిన నారత్నసమూహము వివర్ణముగలదై తత్క్షణంబున శుద్ధియగు.

శ్లో. ఉక్తమాక్షికవన్ముక్తా ప్రవాళాని చ మారయేత్
వజ్రవత్సర్వరత్నాని శోధయేన్మారయేత్తథా.

**తా.** మరియు మాక్షికమును శుద్ధిచేయుతెఱంగున ముత్తియములు, పగడములు, వజ్రములు, మొదలగు నెల్లరత్నములను శుద్ధిచేసిన నవి శుద్ధియగు.

## ఉపరసాదిశుద్ధులు.

శ్లో. మ్లేచ్ఛం స్యాద్విమలామ్లసైంధవజలే పక్వం విశుద్ధం భవే
త్తుత్థం టంకణసంయుతం సముదితం క్షౌద్రేణ వా సంయుతమ్
నిర్దోషం విషతిందుకం తుషజలే క్షిప్త్వా త్రిఘస్రం విషం
తేనై వాథ విభీతకస్య నిహితం కంకుష్ఠకం టంకణాత్.

**తా.** తామ్రమును పలచగ రేకులజేసి నిప్పుయందుకాచి నిమ్మపండ్లు మొదలగు పుల్లని పండ్లరసములో తగుమాత్రము సైంధవలవణమువేసి అందు ముంచవలయును. ఇటుల ౨ పర్యాయములు కాచి ముంచి అందొకదినము నానబెట్టిన నది శుద్ధియగు. మరియు మైలతుత్తము, వెలిగారము, వీటిని సమముగ నుంచుకొని అందు తేనెబోసి

---

* కర్పూరశిలాజిత్తు, ముద్గశిలాజిత్తు, గోమూత్రశిలాజిత్తులన శిలాజిత్తులు ౩ విధంబులు. ఇందు గోమూత్రశిలాజిత్తు శ్రేష్ఠము.

ద్రవము లేకుండువరకు ఖల్వమున మర్దించి బిళ్ళలుచేసి యెండనయెండించి పుటము వేసిన నవి శుద్ధియగు. విషముష్టిగింజలను 3 దినములు కలియందు నానవేసిన నవి శుద్ధియగు. వసనాభి, నల్లమందు, మొదలగువాటిని విషముష్టిగింజల శుద్ధివలెనే కలియందు 3 దినములు నానవేసినను, తానికాయలను కషాయముబెట్టి అందు 3 దినములు నానవేసినను నవి శుద్ధియగు. కంకుష్ఠము (యేనుగదంతము)ను వెలిగారమువలెనే శుద్ధిచేసిన శుద్ధియగు.

శ్లో. కాసీసం టంకణం శంఖవరాటౌ గౌరికం పృథక్
నీలాంజనం ఘునం ఘర్మే శుద్ధం స్యాజ్జంభనీరగమ్.

తా. అన్నభేది, వెలిగారము, శంఖము, గవ్వ, యెఱ్ఱకావిరాయి, అంజనపురాయి వీటిని నిమ్మపండ్లరసమున నొకదినము నానబెట్టి నీరు శుష్కించువరకు యెండన యెండించిన నవి శుద్ధియగు.

శ్లో. విద్రుమం మౌక్తికం శుక్తిసౌరాష్ట్రి చ భుజంగమః
ఇత్యాద్యమ్లేన శుద్ధం స్యాచ్ఛుద్ధం చోపరసాదికమ్.

తా. పగడములు, ముత్తియములు, ముత్తియపుచిప్పలు, సీసము, యర్రకావిరాయి, శిలాజిత్తు ఇవి మొదలగువాటిని పులుసుయందొకదినము నానవేసి యెండన యెండించిన శుద్ధియగు.

శ్లో. జేపాలం నిస్తుషం కృత్వా దుగ్ధే డోలాయుతం పచేత్
అంతర్జిహ్వాం పరిత్యజ్య యుజ్యాశ్చ రసకర్మణి.

తా. నేపాళములను రేకులుగవొలిచి యందలి అగరులనుతీసి పారవైచి పాలతో డోలాయంత్రమున పక్వమగువరకు వండిన నది శుద్ధియగు.

---

## స్వర్ణాదిధాతుశోధన, వాటిమారణము.

శ్లో. * స్వర్ణతారౌ తామ్రనాగౌ వంగం కాంతం చ తీక్ష్ణకమ్
ముండాంతమష్టధా లోహం కాంస్యారం పంచకం త్రిధా
తైలే తక్రే గవాం మూత్రే కాంజికే చ కుళుత్థకే
సప్తధా తప్తనిర్వాపాత్సర్వలోహం విశుద్ధ్యతి.

* స్వర్ణము మొదలైనవన్నియుం లోహములనబడు. కంచు, అయిదువిధములుగను, పిత్తళి మూడువిధములుగను నున్నయవి.



* (కాంతము, ఇనపచిట్టెము, కంచు, ఇవితప్ప) బంగారు, వెండి, తామ్రము, సీసము, తగరము, ఉక్కు, ఇనుము, పిత్తళి, వీటిని రేకులుగజేసి ఎర్రగకాల్చి తైలము, మజ్జిగ, గోమూత్రము, కలి, ఉలవకట్టు వీటిలో ప్రతిదానియందును, నేడేడుపర్యాయములు ముంచిన నవి శుద్ధియగు.

---

## స్వర్ణమారణము.

శ్లో. స్వర్ణపత్రసమం నాగభస్మనింబుజలేపి తమ్
త్రివారం గజపుటే చ సువర్ణం భస్మతాం వ్రజేత్.

తా. బంగారమును పలచగ రేకులుజేసి శుద్ధిగావించి దానికి సమముగ సీసభస్మమును నిమ్మపండ్లరసముచే ఖల్వమున మర్దించి పై బంగారురేకులకు పట్టించి ప్రమిదెయందునిచి చీలమన్ను లేపనముజేసి యెండించి మూడుగజపుటములు వేసిన బంగారము నిర్దోషముగ భస్మంబగు.

---

## రౌప్యమారణము.

శ్లో. మాక్షికం దరదనింబుజప్లుతం లేప్యరౌప్యదళసంచయం పుటేత్
ద్విత్రివారమథ భస్మతాం వ్రజేత్పాతకౌఘ ఇవ శంకరస్మృతేః.

తా. వెండిరేకులకు శుద్ధిజేసిన హేమమాక్షికము, శుద్ధిజేసిన ఇంగిలీకము, వీటిని సమముగ నిమ్మపండ్లరసముచే ఖల్వమున మర్దించి లేపనముజేసి పైక్రమప్రకారము ౨, 3, గజపుటములు వేసిన "శంకరుని నామస్మరణచే పాతకంబులు భస్మంబులగు చందంబున" రజితము భస్మంబగు.

---

## తామ్రాదిమారణము.

శ్లో. తామ్రపాదాంశతస్సూతం తామ్రతుల్యం చ గంధకమ్
కన్యారసేన సంపిష్ట్వా తామ్రపత్రాణి లేపయేత్.
నిక్షిప్య హండికామధ్యే శరావేణ నిరోధయేత్
హండికాం పటునా పూర్య పచేద్యామత్రయం భిషక్
స్వాంగశీతం విచూర్ణ్యాథ వాంతిదోషవివర్జితమ్
(అన్యచ్చ) గంధకత్రిగుణేనాథ గజపుటేన మారణమ్.
(అన్యచ్చ) తామ్రాద్ద్విగుణభాగేన బలినా గజపుటే పచేత్.

* ఈమూటిని స్వస్వరూపముగ నెర్రగ కాల్చియుంచవలయు.

తా. శుద్ధిచేసిన తామ్రమును పలచగ రేకులుచేసి దానికి సమభాగము శుద్ధిజేసినగంధకము, నాలుగవభాగము శుద్ధిచేసిన పాదరసము, వీటిని కలబందరసముచే ఖల్వమున చక్కగ మర్దించి యాతామ్రరేకులకు పట్టించి యెండన యెండించి యొకకుండయందు సగము ఉప్పుబోసి దానిపై నీతామ్రరేకులను పరిచి అందుపై మరల ఉప్పుబోసి ఆకుండకు తగుమైన మూతవేసి చేలమన్ను లేపనముచేసి యెండన యెండించి పిదప నాకుండను మూడుఝాములు గాఢాగ్నిచే వండి సాంగశీతలమున తామ్రరేకులనుదీసి ఖల్వమునందునిచి నున్నగ నూరినను, లేక తామ్రమునకు మూడింతలగంధకమును కలబందరసముచే ఖల్వముననూరి తామ్రరేకులకు పట్టించి చీలమన్ను లేపనముచేసి గజపుటము వేసి సాంగశీతలమునదీసి యాతామ్రరేకులను ఖల్వమున నూరినను, లేక తామ్రరేకులకు రెండింతలు గంధకమును కలబందరసముచే నూరి నారేకులకు పట్టించి గజపుటము వేసి సాంగశీతలమున నారేకులనుదీసి ఖల్వమున నూరినను, వాంతిదోషవర్జితమైన భస్మంబగు. ఈభస్మమును అనుపానవిశేషంబుతో సేవించిన నిది సర్వరోగంబులను నశింపంజేయు.

శ్లో. ఘోషాలవర్తులే తామ్రం సత్వం హన్యాచ్చ యుక్తితః.

తా. శుద్ధిచేసినకంచు, శుద్ధిచేసిన హరితాళకము, శుద్ధిచేసిన వెలిగారము, శుద్ధిచేసిన తామ్రము, ఇవి సమభాగములు, మూసయందునిచి దానిమూతిని పెంకుచే మూసి చీలమన్ను లేపనముచేసి యెండబెట్టి కొలిమియందునిచి యూదిన భస్మమగు.

శ్లో. సత్వం చ రసకాదీనాం నిహన్యాత్తామ్రవత్సదా.

తా. శుద్ధిచేసిన కఫరిని తామ్రభస్మమువలెనే పుటము వేసిన భస్మమగు.

శ్లో. తామ్రవద్ఘోషమారం చ శోధయేన్మారయేద్భిషక్.

తా. తామ్రంబువలెనే కంచును, పిత్తళిని, పుటము వేసిన భస్మంబగు.

---

## వంగాదిమారణము.

శ్లో. మనశ్శిలాగంధయుతాధరూష
తోయప్లుతం*నాగదళం విమృష్టమ్
త్రిభిః పుటైః కుంభమితైః ప్రయాతి
భస్మత్వమేతత్ప్రవదంతి తజ్ఞాః.

తా. శుద్ధిచేసిన మణిశిల, శుద్ధిచేసిన గంధకము, వీటిని అడ్డసరపురసముచే ఖల్వమున నున్నగనూరి శుద్ధిచేసిన సీసపురేకులకు లేపనముచేసి యెండించి దాని తగుమయిన మూకుడుయందునిచి మూతిని బిగించి చీలమన్ను లేపనముచేసి గజపుటము వేసిన భస్మమగు. మరియు నాభస్మంబును అడ్డసరపురసముచే మర్దించి బిళ్లచేసి యెండించి (ఇత్తెఱంగున) రెండుగజపుటములు వేసిన నిర్దుష్టమైన నాగభస్మమగు.

* నాగము అనగా నల్లసీసము.



శ్లో. * వంగం సార్కపయస్తాలలిప్తం శుష్కం పుటైస్త్రిభిః
మ్రియతే భావితే ప్రకే బ్రహ్మకాష్ఠఘర్షణయోగతః.

తా. శుద్ధిచేసినతగరమును పలచగ రేకులుజేసి శుద్ధిజేసిన హరితాళకమును, జిల్లేడుపాలతోనూరి యారేకులకు లేపనముచేసి యెండించి మంగలమందువైచి గాఢాగ్ని యందునిచి యెండిన మోదుగకఱ్ఱతో చక్కగ మర్దింపుచుండిన వంగము భస్మమగు. మరియు నీభస్మంబును జిల్లేడుపాలచేనూరిబిళ్లచేసి యెండించి (ఇత్తెఱంగున) రెండు గజపుటములు వేసిన నిర్దుష్టమైన వంగ భస్మమగు.

శ్లో. పలాశద్రవయుక్తేన వంగపత్రాణి లేపయేత్
తాళేన పుటితం భస్మ త్రివారం జాయతే ధ్రువమ్.

తా. శుద్ధిచేసిన తగరమును పలచని రేకులుగజేసి, శుద్ధిచేసిన హరితాళకమును మోదుగపట్టరసముచే మర్దించి యారేకులకు లేపనముచేసి యెండించి మూకుడుయందునిచి చీలమన్ను లేపనముచేసి క్రమముగ మూడుగజపుటములువేసిన వంగము భస్మమగు.

---

## లోహమారణము.

శ్లో. కాంతం తీక్ష్ణం చ ముండం చ పత్రీకృత్య ప్రయత్నతః
త్రిఫలాకల్కతోయాంతస్తప్తనిర్వాపితం పునః.
యావచ్ఛీర్యంతి పత్రాణి కుర్యాత్తావదతంద్రితః
త్రిఫలాకల్కసంమిశ్రం శరావే త్రిశ్చవా పుటేత్.
లోహం వారితరం తేన జాయతే సర్వరోగజిత్.

తా. కాంతము, ఉక్కు, ఇనుము, వీటిని శుద్ధిచేసి (కాంతమునుదప్ప) నన్నిటిని సన్నపురేకులుగావించి కొలిమినిపూది, కరకకాయ, తానికాయ, ఉశిరికవరుగు వీటికషాయంబున నవి తునకలగువరకు అద్దుచుండవలయు. ఇట్లు చేసిన నవి తునకలగు. ఆతునకలను కరకతాండ్ర ఉశిరికలకషాయముచే ఖల్వమున చక్కగనూరి బిళ్లచేసి యెండించి మూసలోపెట్టి కొలిమియందునిచి పూది క్రమప్రకారము మూడు గజపుట

* వంగమనగా తెల్లసీసము. ఇదియ తగరమనబడు,

ములు వేసిన భస్మమగు. ఈభస్మమును ఖల్వమునసూరి చూర్ణముచేసి యుదకమునందు వేసిన మునగక తేలవలయు. ఇట్టిభస్మమును సేవించిన సర్వరోగములు నశించు.

## కిట్టమారణము.

శ్లో. సూక్ష్మచూర్ణమయః కిట్టం తాపితం ఖర్పరస్థితమ్
నిర్వాపితం తు గోమూత్రే శుద్ధం స్యాత్త్రిఫలాపుటైః
సప్తభిర్యోజయేద్వైద్యో మండూరో రోగనాశనః.

తా. ఇనపచిట్టెమును సన్నగ చూర్ణముచేసి మూసయందునిచి కొలిమిని నెర్రగ నగువరకు నూది పిదప గోమూత్రముచే జల్లార్చిన నది శుద్ధియగు. ఇటుల శుద్ధిచేయబడినద్దానిని కరకతాండ్ర ఉశిరికలకషాయమున నూరి బిళ్లచేసి యెండించి (ఇత్తెఅంగున) క్రమప్రకారము ౭ పుటములు వేసిన సమస్తరోగములను నివృత్తి చేయందగిన మండూరంబగు. ఈమండూరమును రోగబలంబు నెరింగి ప్రయోగింపవలయు. (ఇదియ కిట్టమారణము.

శ్లో. క్షిప్త్వా క్షిప్త్వారనాళే తత్తప్తం కుర్యాచ్చ ఖర్పరే
త్రిస్సప్తధా పుటం చాథ కృత్వా శుధ్యతి చాభ్రకః.

తా. కృష్ణాభ్రకమును పలచగ రేకులుతీసి మూకుడుయందువైచి కొలిమియందునిచి పూది కలియందద్దవలయు. ఇట్లు ౨౧ తూరి జేయుటయగాక ప్రతిపర్యాయమును ఆ కలినివంచి మఱల నూతనముగ కలి బోయుచు నందద్దుచుండిన అభ్రకము శుద్ధియగు.

శ్లో. భాగద్వయం హి శాలీనామేకైకం కాంజికాభ్రయోః
గృహీత్వా కర్పటే వద్ధ్వా కరాభ్యాం మర్దయేత్తతః.
సుదృఢం సజలే పాత్రే తలే పతతి చూర్ణకమ్
తస్మాద్గృహీతం యత్నేన శుష్కం ధాన్యాభ్రముచ్యతే.

తా. ఇట్లు శుద్ధిజేయబడిన కృష్ణాభ్రకమును కలితోనూరి ముద్దజేసి యొకకుండకు వాశనగట్టి దానిమీద యాముద్దనునిచి దానిపై రెండింతలువడ్లు, కలి, బోసి చక్కగరుద్దిన నది చూర్ణమయి పాత్రకడుగున జేరు. ఈచూర్ణమును జాగ్రతగ దీసి యెండబెట్టవలయు. దీనినే ధాన్యాభ్రకమనియెదరు.

శ్లో. ధాన్యాభ్రకం రవిక్షీరైరవిమూలద్రవేణ నా
పిష్ట్వా పిష్ట్వా పుటేత్పాకాత్సప్తధా మ్రియతేఽభ్రకః.



తా. ఈధాన్యాభ్రకమును జిల్లేడుపాలతోనైనను, లేక జిల్లేడువేరు రసముతోనైనను, ఖల్వమున నూరి గజపుటము వేసిన భస్మంబగు. మరియు నీభస్మమును జిల్లేడుపాలతోనైనను, జిల్లేడువేళ్ల రసముతోనైనను నూరి బిళ్ల జేసి (ఇత్తెఅంగున) క్రమప్రకారము ౭ గజపుటములు వేసిన నిర్దుష్టమైన భస్మమగు. ఈభస్మంబును జేయుటకు రెండువిధములు గలవు. వచించెదవినుడు.—

శ్లో. కృష్ణాభ్రం దహనే విశుద్ధ్యతి భృశం తప్తం కాంజికే తాపితం
శుద్ధం తద్ద్రవివారిణా ఘనతరం పిష్ట్వా దినాంతే పుటేత్
కాసఘ్నం స్వరసేన వాథ వరయామమాత్రేణ భావ్యం పున
ర్నిశ్చంద్రోఽపి మృతోఽభవేల్లఘుతరక్షీరాత్పుటైః పంచభిః.

తా. కృష్ణాభ్రకపురాళ్లను మూడుపర్యాయములు కొలిమినవేసి నెర్రగకాల్చి పుల్లనికలిలో మూడుపర్యాయములు ముంచిన నది శుద్ధియగు. పిదప దాని యెండించి గడ్డపారతోదంచి సన్నగ చూర్ణముచేసి అందధికముగ జిల్లేడుపాలుబోసి ఖల్వమున రెండుఝాములు (ద్రవము లేకుండువరకు) మర్దించి బిళ్లచేసి యెండించి నొక్క గజపుటమును, తులసిఆకు, దురదగొండి, నల్లేరు, వీటిరసములచే వెవ్వేరుగ ఖల్వంబున నొక్కొకఝామునూరి యెండించి నొకపుటంబును, కరకతాండ్ర ఉశిరికలకషాయముచేనూరి బిళ్లచేసి యెండించి నొకపుటంబును, గోమూత్రముచే నొకఝాము మర్దించి బిళ్లచేసి యెండించి నొకపుటంబును, మరల జిల్లేడుపాలచే నొకఝామువరకు మర్దించి బిళ్ళచేసి యొకపుటంబును, (ఇత్తెఅంగున) నైదుగజపుటంబులువేసిన నిర్దుష్టమైన నభ్రకభస్మంబగు.

## రససిందూరము.

శ్లో. పలమానం రసం శుద్ధం తావన్మాత్రం చ గంధకమ్
విధివత్కజ్జలీం కృత్వా న్యగ్రోధాంకురవారిణా.
భావనాత్రితయం దత్వా కాచకుప్యాం నిధాపయేత్
నిధాయ కచ్ఛపీయంత్రే వాలుకాభిః ప్రపూరయేత్.
దద్యాత్తదను మందాగ్నిం భిషగ్యామచతుష్టయమ్
జాయతే రససిందూరం తరుణారుణసన్నిభమ్.

తా. శుద్ధిచేసిన పాదరసము, శుద్ధిచేసినగంధకము, ఇవి సమభాగములు, ఈరెంటిని నొకఝాము ఖల్వమున మర్దించి అందు మఱ్ఱిఊనలు, మఱ్ఱిపూడలు, వీటిరసము బోసి మూడుపర్యాయములు * భావనజేసి పిదప కాచకుప్పెయందునిచి ఆకుప్పెకు

* రసము అందిగురువరకు సానవేయుట భావనయనబడు.

నేడుమార్లు చీలమన్ను లేపనముజేసి యెండించి పిదప దానిని * కచ్ఛపయంత్రమున నునిచి యిసుకబోసి క్రమప్రకారము నాలుగుఝాములు మందాగ్నిచే వండి మరునాటి దినముదయమున స్వాంగశీతలమున దీసి నాతుప్పెను పగలగొట్టి యందలి సిందూరమును గ్రహింపవలయు. ఈ సిందూరము బాలసూర్యునివర్ణము గలిగియుండవలయు. మరియు నీసిందూరమును గావించెడి మరియొక్క తెఱంగుగలదది వివరించెద.—

శ్లో. రసగంధకయోః కృత్వా కజ్జలీం సమభాగయోః
నవసాగరకం దత్వా కించిజ్జంబీరవారిణా.
విమర్ద్య త్రిదినం యత్నాత్కాంజికేన పునఃపునః
మృత్కర్పటావృతాయాం తు కాచకుప్యాం వినిక్షిపేత్.
సంరోధ్య వాలుకాయంత్రే సచ్ఛిద్రే త్రిదినం పచేత్
సముద్ధరేన్నాళకస్థం భస్మేంద్రగోపసన్నిభమ్.

తా. శుద్ధిచేసిన పాదరసము, శుద్ధిచేసినగంధకము, ఇవి సమభాగములు. ఈరెంటిని [illegible]మున నున్నగనూరి అందు నాలుగవభాగము నవాసాగరమువేసి నిమ్మపండ్లరసముబోసి మూడుదినంబులు చక్కగ మర్దించి మరల కలితో పలుమారులు నూరి యెండించి 2 పర్యాయములు చీలమన్ను లేపనముచేయబడిన గాజుకుప్పెయందునిచి వాలుకాయంత్రమున నాకుప్పెమూతిని మూయకనే మూడుదినములు క్రమప్రకారము వండి స్వాంగశీతలమున నాకుప్పెను దీసి పగలగొట్టి దానిగొంతుయందుండెడి సిందూరమును గ్రహింపవలయు. ఈసిందూరము నింద్రకోపమను పురుగులవలె నెఱ్ఱగనుండవలయు.

ఇటుల రసోపరసశోధనమారణాదులు ముగిసెను.

—◆—

## పాదరసగుణాగుణములు.

శ్లో. సూతో శుద్ధతయా గుణం న కురుతే కుష్ఠాగ్నిమాంద్యక్రిమి
చ్ఛర్ద్యారోచకజాడ్యదాహమరణం ధత్తే నృణాం సేవనాత్
శుద్ధస్స్యాత్సకరః ... ... ... ...
... ... ... ... కాంతాజనానందనః.

తా. క్రమముగ శుద్ధిచేయంబడని రసభస్మసిందూరములను సేవనజేసిన జాడ్యముకుదరక పోవుటయగాక కుష్ఠువు, అగ్నిమాంద్యము, వాంతి, అరుచి, దాహము,

---

* ఒకకుండయందు మూడంగుళములపాడవు నిసుకబోసి యందు కుప్పెనునిచి దానిగొంతువరకు నిసుకబోయుటయ కచ్ఛపయంత్రమనంబడు.



కృమిజాడ్యము, ఇవి మొదలగురోగంబులు జనించి మరణము సగా గలుగు. క్రమంబుగ శుద్ధిజేయబడిన రసభస్మసిందూరములు సర్వరోగంబులను నశింపంజేసి బలము,వీర్యవృద్ధి, నేత్రములకు హితము, కాంతి, వీటిని గలుగంజేయుటయగాక మృత్యుసమానంబగు జాడ్యంబులను సగా బారందోలు.

—◆—

## తాళకగుణాగుణములు.

శ్లో. తాపస్ఫోటాంగసంకోచకఫమారుతమేహాకృత్
అశుద్ధస్తాళకశ్శుద్ధో భూతఃప్రాగ్రోగహామృతమ్.

తా. క్రమముగ శుద్ధిజేయంబడని తాళకభస్మమును సేవించిన తాపము, వ్రణములు, శ్లేష్మము, వాతము, మేహము, ఈరోగంబులు జనించుటయగాక కాళ్లుచేతులును బిగబట్టికొనిపోవును. క్రమంబుగ శుద్ధిచేయబడిన హరితాళకభస్మ మమృతతుల్యంబగుటచే దానినిసేవించిన తాపాది పూర్వోక్తరోగంబులు నివృత్తియగు,

—◆—

## సువర్ణరౌప్యగుణాగుణములు.

శ్లో. యాన్రోగాన్ ఘ్నంతి లోహాని సంసిద్ధాని మృతాని చ
తానేవ కుర్వతే శుద్ధాన్యమృతాని గురూణి చ.

తా. క్రమంబుగ శుద్ధిచేయబడిన తామ్రాది లోహభస్మములు ఏయేరోగంబులను నశింపంజేయునో ఆరోగంబులనెల్ల క్రమంబుగ శుద్ధిజేయబడని తామ్రాది భస్మంబులు జనింపంజేయు.

శ్లో. ఆయుర్లక్ష్మీప్రభాధీస్మృతికరమఖిలవ్యాధివిధ్వంసిపుణ్యం
భూతావేశప్రశాంతిస్మర ఇవ సుఖదం సౌఖ్యపుష్టిప్రకాశి
గాంగేయం చాథరౌప్యం గదహరమజరాకారిమేహప్రహారి
క్షీణానాం పుష్టికారి స్ఫుటమతికరణం కారణం వీర్యవృద్ధేః.

తా. బంగారును, వెండిని, క్రమముగ భస్మముగావించిన ఆయువు, లక్ష్మి, కాంతి, బుద్ధి, స్మృతి, ఆరోగ్యము, కామము, సౌమ్యపుష్టి, వీర్యవృద్ధి, ఇవి గలుగుటయగాక జ్వరము, మేహము, ఈమొదలగు సర్వరోగంబులును నివృత్తియగు. మరియు భూతప్రేతాదులు దూరంబుగ దొలంగు. పుణ్యంబును గలుగు.

## తామ్రభస్మగుణములు.

శ్లో. గుల్మపాండుపరిణామశూలజిల్లేఖనం కృమిహారం విశోధనమ్
ప్లీహకుష్ఠజఠరవ్రణాపహం శ్లేష్మవాతజ్వరహారం శుచితామ్రమ్.

తా. క్రమంబుగ శుద్ధిచేయబడిన తామ్రభస్మమును సేవించిన గుల్మము, పాండువు, పరిణామశూల, కృమిరోగము, ప్లీహము, కుష్ఠువు, ఉదరరోగము, అనేక విధములగు వ్రణములు, శ్లేష్మము, వాతము, జ్వరము, ఈమొదలగు రోగంబులు నశించి దేహంబున కారోగ్యము గలుగు.

---

## నాగవంగభస్మగుణములు.

శ్లో. వంగం దాహహారం పాండుజంతుమేహవినాశకమ్
తద్వన్నాగం చ దుర్నామవాతహృత్కించిదుష్ణకృత్.

తా. క్రమముగ శుద్ధిచేయబడిన వంగభస్మమును సేవించిన దాహము, పాండువు, జంతురోగము, మేహము, ఇవియన్నియు హరించు. క్రమముగ శుద్ధిచేయబడిన సీసభస్మము, దాహము, పాండువు, జంతురోగము, మేహము, మూలవ్యాధి, వాతము, వీటినన్నిటిని హరింపంజేసి కించిదుష్ణంబును గలుగంజేయు.

---

## లోహభస్మగుణములు.

శ్లో. లోహం జంతువికారపాండుపవనక్షీణత్వపిత్తామయ
స్థౌల్యార్శోగ్రహణీజ్వరార్తికఫజిచ్ఛోఫభః ప్రమేహప్రణుత్
గుల్మప్లీహవిషాపహం బలకరం కుష్ఠాగ్నిమాంద్యప్రణు
త్సౌఖ్యాలంబిరసాయనం మృతిహరం కాంతాదికిట్టం తథా.

తా. క్రమంబుగ శుద్ధిచేయబడిన అయస్కాంతము, ఉక్కు, ఇనుము, ఇనుపచిట్టెము, వీటి సిందూరములను సేవించిన జంతువికారములు, పాండువు, వాతము, క్షయరోగము, పైత్యరోగము, స్థూలత్వము, మూలవ్యాధి, గ్రహణి, జ్వరము, శ్లేష్మము, శోథ, ప్రమేహము, గుల్మము, కడుపులోని గడ్డలు, సర్వవిషములు, కుష్ఠువు, అగ్నిమాంద్యము, ఇవి నశించి దేహంబునకు బలము, ఆరోగ్యము, గలుగు. మరియు వీటిని రసాయనంబులలో మిళితముచేసి సేవించిన మృత్యుసమానంబగు రోగంబులు దూరంబుగ దొలంగు.

---



## అభ్రకభస్మగుణాగుణములు.

శ్లో. అశుద్ధమాయుర్హరణం నిహన్యా
త్కఫానిలోత్థానకరం తథైవ
చంద్రికం జంతుకరం తదత్ర
ఛేదాయ మందానలదం నృణాం స్యాత్.

తా. క్రమంబుగ శుద్ధిచేయబడని అభ్రకభస్మమును సేవించిన, శ్లేష్మము, వాతము, ప్రకోపించుటయగాక ఆయువు క్షయించు. మరియు దీనిని క్రమంబుగ శుద్ధిచేసి భస్మముగావించినను అందు తళుకులు గలిగియుండిన నది ఉదరమునందు పురుగులను, మందాగ్నిని, గలుగంజేసి మృత్యువుపాలు గావించు. క్రమంబుగ శుద్ధిచేయబడిన అభ్రకసిందూరమును సేవించిన పూర్వోక్తరోగంబులన్నియు నివృత్తియగుటయగాక ఆయుర్వృద్ధి సదా గలుగు.

---

## గంధకగుణాగుణములు.

శ్లో. అశుద్ధగంధో భ్రమజాడ్యకుష్ఠ
దాహత్రిశోషం కురుతేఽథ శుద్ధః
విశేషతో మృత్యుహరోఽగ్నికర్తా
రసాయనః కుష్ఠహరో రుజాపహృత్.

తా. క్రమంబుగ శుద్ధిచేయబడని గంధకమును సేవించిన, భ్రమ, జాడ్యము, కుష్టువు, దాహము, శోష, ఇవిజనించు. క్రమంబుగ శుద్ధిచేయబడిన గంధకమును సేవించిన పూర్వోక్తభ్రమాదిరోగంబులు నశించి అగ్నిదీపనము, దేహమున కారోగ్యము గలుగుటయగాక మృత్యుసమానంబగు రోగంబులు సదా దూరంబుగ దొలంగు. దీనిని రసాయనంబులతో మిళితముచేసి సేవించిన కుష్ఠువు, శూల, సమస్త మేహవాయువులు, ఇవి హరించు. మరికొందరు దీనిగుణంబులను వేరు విధంబుగ వచించిరి. అదియు వివరించెద.

(అన్యచ్చ)

శ్లో. గౌరీతేజః పరమమమృతం వాతపిత్తక్షయఘ్నం
ప్రజ్ఞాబోధి ప్రశమితజరం వృష్యమాయుష్యమగ్ర్యమ్
బల్యం స్నిగ్ధం రుచిదమకఫం దీపనం శీతవీర్యం
తత్తద్రోగైస్సకలగదహృద్యోగవ్యమసూతేంద్రబంధి.

ఇతి శ్రీమద్వైద్యశిఖామణినా గోపాలదాసేన విరచితే వైద్యచికిత్సాసారే రసోపరసశోధనమారణగుణాధికారస్సమాప్తః.

తా. క్రమంబుగ శుద్ధిచేయబడిన గంధక మమృతతుల్యం బగుటచే నది వాతము, పిత్తము, క్షయరోగము, శ్లేష్మము, వీటిని నివృత్తిచేసి, బుద్ధి, వీర్యవృద్ధి, ఆయువు, అగ్నిదీపనము, బలము, స్నిగ్ధము, రుచి, వీటిని గలుగంజేయును. ఈగంధకమును అనుపాన విశేషముచే సేవించిన సర్వరోగంబులు నశించు. క్రమంబుగ శుద్ధిచేయబడని అభ్రక సిందూరము, క్రమంబుగ శుద్ధిచేయంబడని రసభస్మము వీటి సేవనచే జనించినరోగములను సగా గంధకము పరిహారింపంజేయును.

ఇట్లు వైద్యశిఖామణియగు గోపాలదాసునిచే రచియింపబడిన వైద్యచికిత్సాసారంబున రసోపరసశోధనమారణ గుణాధికారములు ముగిసెను.

## జ్వరనిదానము.

శ్లో. దక్షాపమానసంక్రుద్ధరుద్రనిశ్వాససంభవః
జ్వరోఽష్టధా పృథగ్ద్వంద్వసంఘాతాగంతుకస్మృతః.

తా. యజ్ఞంబు నొనర్చుచుండెడి దక్షావమానముచే రౌద్రాకారము జెందిన రుద్రుని నిట్టూర్పునుండి జనించిన జ్వరము, వాత, పిత్త, కఫ, వాతపిత్త, వాతకఫ, పిత్తకఫ, సన్నిపాత, ఆగంతుకములన నష్టవిధంబులుగ విలసిల్లె.

శ్లో. మిథ్యాహారవిహారాభ్యాం దోషాహ్యామాశయాశ్రయాః
బహిర్నిరస్య కోష్ఠాగ్నిం జ్వరదాస్యూరసానుగాః.

తా. అకాలమున భుజించుట, అధికముగ భుజించుట, మిగుల సంచారంబొనర్చుట, శక్తినతిక్రమించి సంచారం బొనర్చుట, వీటిచే నామస్థానమున దోషములు జనించి అగ్నిమాంద్యమును గలుగంజేసి రసధాతుస్థానములందు వ్యాపించి జ్వరములను గలుగంజేయును.

శ్లో. సర్వేషా మేవ రోగాణాం నిదానం కుపితామలాః.

తా. మలబద్ధకములచే సమస్తరోగంబులు జనింపుచున్నయవి.

శ్లో. అత్యంబుపానాద్విషమాశనాచ్చ
దివాశయాజ్జాగరణాచ్చ రాత్రౌ
సంధారణాన్మూత్రపురీషయోశ్చ
షడ్భిః ప్రకారైః ప్రభవంతి రోగాః.

తా. అధికముగ నీరుద్రాగుట, అకాలమున నధికముగ భుజించుట, పగలు నిద్రించుట, రాత్రులయందు జాగరణము సేయుట, మలమును, మూత్రమును, బంధించుట ఈ ౬ విధంబులచే రోగములు జనించు.



## వాతజ్వరలక్షణము.

శ్లో. దేహః కంటకితస్సవారినయనం హృత్కండరాకర్షణం
కండూష్ణశ్వసనంచ శోషవమనం మూత్రం సువర్ణప్రభమ్
శైథిల్యం కటిశోధనం స్థిరతనుః కుక్షౌ చ వాతగ్రహ
స్సాన్యద్గాల్యం ముఖవమ్లమిచ్ఛతి గుణైరేభిశ్చ వాతజ్వరః.

తా. శరీరము గగుర్పొడుచుట, కన్నులలో నీరుకారుట, ఱొమ్మదురుట, అవయవములు బిగబట్టుట, దురద, ఉష్ణము, శ్వాసము, శోష, వాంతి, ఇవి కలుగుట, మూత్రము పచ్చగనుండుట, శరీరము శైథిల్యము జెందుట, నడుము, బలహీనముగనుండుట, మత్తతగనుండుట, కడుపు వుబ్బియుండుట, నోరు తియ్యగనుండుట, పులుసుపదార్థములయం దిచ్ఛగలుగుట, ఇట్టి లక్షణంబులుండిన వాతజ్వరమని నెఱుంగవలయును.

శ్లో. సవజ్వరే దివాస్వప్నస్నానాభ్యంగాన్నమైథునమ్
క్రోధప్రవాతవ్యాయామకషాయాంశ్చ వివర్జయేత్.

తా. నూతనముగ జ్వరమువచ్చినపుడు పగలునిద్రించుట, స్నానము, అభ్యంగనము జేయుట, అన్నముభుజించుట, మైథునంబొనర్చుట, కోపముజేయుట, గాలియందుండుట, సంచరించుట, * కషాయద్రవ్యముల సేవించుట, వీటినెల్ల వర్జింపవలయును.

## వాతజ్వరచికిత్స.

శ్లో. శఠీ పుష్కరమూలం చ భార్గీ శృంగీ దురాలభా
గుడూచీ నాగరం పాఠా కిరాతం కటురోహిణీ.
ఏష శఠ్యాదికః క్వాథస్సర్వవాతజ్వరాపహః
కాసాదిషు చ సర్వేషు దద్యాత్తోస్సపద్రవేషు చ.

తా. కచ్చూరములు, తామరగడ్డలు, గంటుభారంగి, కరకపువ్వు, దురదగొండివేరు, తిప్పతీగ, శొంఠి, అగరుశొంఠి, లేక విషబొద్ది, నేలవేము, కటుకరోహిణి, వీటిని సమభాగములుగ దంచి † కషాయముబెట్టి అష్టాంశముగ కాచి పుచ్చుకొనిన సమస్త వాతజ్వరములు, దగ్గు, ఇవి హరించు. ఇది (శఠ్యాదికషాయము.)

శ్లో. కిరాతాబ్దామృతోదీచ్యబృహతీద్వయగోక్షురైః
సస్థిరాకలశీవిశ్వైః క్వాథో వాతజ్వరాపహః.

---

* కషాయద్రవ్యము లనగా, వగరు, మిగుల నెరుపుగలసిన తెలుపు, పరిమళద్రవ్యములు.

† కషాయముల నన్నిటిని ఇదేప్రకారము అష్టాంశముగ కాచవలయును.

తా. నేలవేము, తుంగగడ్డలు, తిప్పతీగె, కురువేరు, చిన్నములక, పెద్దములక, పల్లేరుకాయలు, కోలపొన్న, నేలపొన్న, శొంఠి, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి పుచ్చుకొనిన సమస్త వాతజ్వరములు హరించు. (ఇది కిరాతాదికషాయము.)

శ్లో. పిప్పలీశారిబాద్రాక్షశతపుష్పాహరేణుభిః
కృతః కషాయస్సగుడో హన్యాత్పవనజం జ్వరమ్.

తా. పిప్పళ్లు, తెల్లసుగంధిపాలవేళ్లు, దీపద్రాక్ష, పెద్దసోపు, రేణుకవిత్తులు, వీటిని సమముగ దంచి కషాయముబెట్టి అందు పాతబెల్లంబైనను, చక్కెరసైనను కలిపి పుచ్చుకొనిన వాతజ్వరములు హరించు. (ఇది పిప్పల్యాదికషాయము.)

శ్లో. త్రిఫలావ్యోషసగుడా శర్కరా త్రివృతార్ధకమ్
మోదకం భక్షయిత్వా తు పిబేచ్చోష్ణం జలం పునః.
పార్శ్వశూలేఽరుచౌ కాసే జ్వరే చానిలసంభవే.

తా. కరక్కాయలు, తానికాయలు, నెల్లివరుగు, శొంఠి, పిప్పలి, మిరియాలు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి యీచూర్ణమునకు అరభాగము * శుద్ధిచేసిన తెల్లతెగడ చూర్ణమునుకలిపి పిమ్మట బెల్లము, శర్కర, వీటిని తగుమాత్రముగ పాకము బట్టి అందాచూర్ణమును వైచి ఉశిరికాయలంత మాత్రలుచేసి అందొకమాత్రను పుచ్చుకొని ఉష్ణోదకము త్రాగిన వాతజ్వరము, కుక్షిశూల, అరుచి, దగ్గు, హరించు. (ఇది త్రిఫలాదిమాత్రలు.)

---

## పిత్తజ్వరలక్షణము.

శ్లో. పిత్తే సంభ్రమితా ముఖే కటుకతా శ్వాసోష్ణతా రక్తతా
మూత్రే తీవ్రశిరోర్తిరంగదహనం పార్శ్వే చ బాధారతిః
శోషః పశ్యతి నీలపీతతిమిరే రక్తే చ నేత్రే భ్రమిః
కంపారోచకవిస్మయో విలపనైః పిత్తజ్వరం లక్షయేత్.

తా. భ్రాంతి, శ్వాస, శిరోవేదన, అతితాపము, కుక్షిశూల, శోష, కఫము, అరుచి ఇవి కలుగుట, నోరు చేదుగనుండుట, శరీరము ఉష్ణముగనుండుట, వస్తువులయందు ప్రీతిలేకుండుట, మూత్రం బెర్రగనుండుట, పచ్చగను, నల్లగను, యెర్రగను, చీకటిగను, నేత్రములకగుబడుట, జిహ్వ రుచిహీనముగ నుండుట, ప్రజ్ఞలేకుండుట, పదురుట, నేత్రంబులెర్రగనుండుట, వణుకుట, విలపించుట, ఒడలుదిరుగుట, విస్మయించుట, ఇట్టి లక్షణంబులుగలిగిన పిత్తజ్వరమని ఎరుంగవలయును.

* ఆవుపాలలో తెల్లతెగడను మునుగునటులంజేసి ఆపాలిగురువరకు వండిన శుద్ధియగు.



## పిత్తజ్వరచికిత్స.

శ్లో. ద్రాక్షాభయాపర్పటకాబ్దతిక్తా
క్వాథస్సశమ్యాకఫలో విదధ్యాత్
ప్రలాపమూర్ఛాభ్రమదాహశోష
తృష్ణాన్వితే పిత్తభవేజ్జ్వరే చ.

తా. దీపద్రాక్ష, కరక్కాయలు, పర్పాటకము, తుంగగడ్డలు, కటుకరోహిణి, రేలకాయలలోని గుజ్జు, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి పుచ్చుకొనిన పదురుట, మూర్ఛ, భ్రమ, దాహము, శోష, నాలుకపీల్పు, ఈమొదలగు లక్షణములుగల పిత్తజ్వరము హరించు. (ఇది ద్రాక్షాదికషాయము.)

శ్లో. దురాలభాపర్పటకప్రియంగు
భూనింబవాసాకటురోహిణీనామ్
క్వాథం పిబేచ్ఛర్కరయావగాఢం
తృష్ణాస్రపిత్తజ్వరదాహయుక్తః.

తా. దురదగొండివేరు, పర్పాటకము, ప్రేంకణపువేరు, నేలవేము, అడ్డసరము, కటుకరోహిణి, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి అందు చక్కెర కలిపి పుచ్చుకొనిన, దాహము, రక్తపైత్యజ్వరము, నాలుకపీల్పు, ఇవియన్నియును హరించు. (ఇది దురాలభాదికషాయము)

శ్లో. ఏక ఏవ ఖలు పైత్తికజ్వరం హంతి పర్పటకృతః కషాయకః
చందనోదకమహౌషధాన్వితశ్చేత్తదా కిము పునర్విచారణా.

తా. పర్పాటకమును దంచి కషాయముబెట్టి పుచ్చుకొనిన పిత్తజ్వరము శమించు. మరియు పర్పాటకము, రక్తచందనము, వట్టివేళ్లు, శొంఠి, వీటిని సమముగ దంచి కషాయముబెట్టి పుచ్చుకొనిన నిస్సంశయముగ పిత్తజ్వరము హరించు. (ఇది పర్పటాదికషాయము.)

శ్లో. విదారి దాడిమం లోధ్రం కపిత్థం బీజపూరకమ్
ఏభిః ప్రదిహ్యాన్మూర్ధానం తృడ్దాహార్తస్య దేహినః.

తా. నేలగుమ్మడు, దాడిమవొలుపు, లొద్దుగపట్ట, వెలగపట్ట, మాదీఫలము, వీటిని సమభాగములుగ నుదకముబోసి నూరి కించిదుష్ణముజేసి శిరస్సుకు లేపనముజేసిన అంతిదాహము, తాపము, ఇవి హరించు.

శ్లో. కేసరం మాతులుంగస్య మధుసైంధవసంయుతమ్
జిహ్వాతాలుగళక్లోమశోషే మూర్ధని దాపయేత్.

తా. సైంధవలవణమును చూర్ణముజేసి అందు మాదీఫలపు కేసరములు తేనె వేసి చక్కగమర్దించి బిళ్లగావించి కించిదుష్ణముజేసి శిరస్సునకు కట్టిన జిహ్వా, దవడ, కంఠము, * క్లోమము వీటియందలి శోష హరించు.

శ్లో. ఉదుంబరశిఫాఛిన్నా తజ్జలం సితయాన్వితమ్
పీతం పిత్తజ్వరం హంతి పటోర్యావాశిఫాజలమ్.

తా. అత్తివేరుపట్ట, పెద్దసోపు, తిప్పతీగె, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి అందు చక్కెరకలిపి పుచ్చుకొనినను, లేక చేదుపొట్ల, పెద్దసోపు, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి అందు చక్కెరకలిసి పుచ్చుకొనినను, పిత్తజ్వరము హరించు.

## శ్లేష్మజ్వరలక్షణము.

శ్లో. నేత్రే వారియుతే గళగ్రహయుతశ్శ్వాసో ముఖే క్షారతా
పాదౌ దాహయుతౌ కరౌ చ బహుళం మూత్రం శిరోరోధనమ్
శోషస్సర్వశరీరసంధిషు మహాత్రాసావబాధారతి
స్స్వల్పస్వేదమిదం కళేబరమహో సోఽయం కఫాఖ్యో జ్వరః.

తా. నేత్రములయందు నీరు స్రవించుట, కంఠము కఫయుక్తముగ నుండుట, శ్వాస గలుగుట, నోరు ఉప్పగనుండుట, కాళ్లు చేతులు మండుట, మూత్ర మధికముగ విడుచుట, శిరశ్శూల, శోష, ఇవి గలుగుట, శరీరసంధులయందు నొచ్చుట, ఏవస్తువు యందును ప్రీతిలేకుండుట, స్వల్పముగ చమటపట్టుట, ఇట్టి లక్షణంబులు గలిగిన శ్లేష్మ జ్వరముని ఎరుంగవలయు.

## శ్లేష్మజ్వరచికిత్స.

శ్లో. పిప్పలీ పిప్పలీమూలం చవ్యం చిత్రం చ నాగరమ్
మరీచైలాజమోదేంద్రపాఠారేణుకజీరకమ్
భార్గీమహానింబఫలం హింగురోహిణిసర్షపమ్
విడంగాతివిషామూర్వాగణోఽయం కఫనాశనః.

తా. పిప్పళ్లు, మోడి, చవ్యము, చిత్రమూలము, శొంఠి, మిరియాలు, ఏలకులు, ఓమము, కొడిశవిత్తులు. † అగరుశొంఠి, రేణుకలు, జీలకఱ్ఱ, గంటుభారంగి,

* క్లోమమనగా కడుపులోని కుడిప్రక్కనుండు మాంసఖండము.
† ఇది అభావంబైన వసబొద్దిని జేర్చుకొనవలయు.



వేపవిత్తులు, ఇంగువ, కటుకరోహిణి, ఆవాలు, వాయువిళంగములు, అతివస, దర్భవేరు, వీటిని సమముగదంచి కషాయముబెట్టి పుచ్చుకొనిన శ్లేష్మజ్వరము హరించు. (ఇది పిప్పల్యాదికషాయము.)

శ్లో. పిప్పలీపిప్పలీమూలం చవ్యం చిత్రకనాగరమ్
పంచకోలమిదం ప్రోక్తం శోధనం కఫనాశనమ్.

తా. పిప్పళ్లు, మోడి, చవ్యము, చిత్రమూలము, శొంఠి, వీటిని సమముగదంచి కషాయముబెట్టి పుచ్చుకొనిన శ్లేష్మజ్వరముహరించు. (ఇది పంచకోల కషాయము.)

శ్లో. కటుకీ పిప్పలీమూలం ముస్తా చైవ హరీతకీ
గిరమాలసమః క్వాథ స్సర్వజ్వరవినాశనః.

తా. కటుకరోహిణి, మోడి, తుంగగడ్డలు, కరక్కాయలు, రేలకాయలలోని గుజ్జు. వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి పుచ్చుకొనిన సమస్తజ్వరములు నశించు. (ఇది అరగ్వధపంచక కషాయము.)

శ్లో. పటోలత్రిఫలాతిక్తాశఠీవాసామృతాభవః
క్వాథో మధుయుతః పీతో హన్యాత్కఫకృతం జ్వరమ్.

తా. చేదుపొట్ల, కరక్కాయలు, తానికాయలు, నెల్లివరుగు, కటుకరోహిణి, కచ్చూరములు, అడ్డసరము, తిప్పతీగ, వీటిని సమభాగములుగదంచి కషాయముబెట్టి అందు తేనెకలిపి పుచ్చుకొనిన శ్లేష్మజ్వరము హరించు. (ఇది పటోలాదికషాయము.)

శ్లో. నిదిగ్ధికాఛిన్నరుహోపకుల్యా
విశ్వౌషధైస్సాధితమంబుపీతమ్
హంతి జ్వరం శ్వాసబలాసకాస
శూలాగ్నిమాంద్యం జఠరానిలం చ.

తా. వాకుడువేరు, తిప్పతీగ, పిప్పళ్లు, శొంఠి, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి పుచ్చుకొనిన శ్లేష్మజ్వరము, శ్వాసము, దగ్గు, శూల, అగ్నిమాంద్యము, గర్భవాయువు, ఇవియన్నియు నశించు. (ఇది నిదిగ్ధికాదికషాయము.)

శ్లో. భూనింబనింబపిప్పల్యశ్శటీశుంఠీ శతావరీ
గుడూచీ బృహతీచేతి క్వాథో హన్యాత్కఫజ్వరమ్.

తా. నేలవేము, వేపపట్ట, పిప్పళ్లు, కచ్చూరములు, శొంఠి, చల్లపిల్లిగడ్డలు, తిప్పతీగ, వాకుడు,వీటిని సమముగ దంచి కషాయముబెట్టి పుచ్చుకొనిన కఫజ్వరము హరించు. (ఇది భూనింబాదికషాయము.)

### వాతపిత్తజ్వరలక్షణము.

శ్లో. హృత్కంఠే దహనం శిరోఽర్తిర్వమనం కుక్షౌ చ వాతగ్రహ
శ్శ్వాసో దాహవిమోచనం తృడ్రుచిర్హాహాస్సదా నేత్రయోః
కండూస్స్వేదమతీవ విస్మయకరం కట్వమ్లమాస్యం సదా
మూత్రం ధూమలశ్యామవర్ణమథవా వాతే సపిత్తజ్వరే.

తా. ఱొమ్ము, కంఠము, వీటియందు మంటగలుగుట, తలనొచ్చుట, వాంతి శ్వాసము, తాపము, నాలుకపీల్పు, అరుచి, శరీరమునకు నవ, ఇవి గలుగుట, కుక్షియందు వాయువు బద్ధగించుట, నేత్రములుమండుట, చమటపట్టుట, మిగులవిస్మయించుట, నోరుచేదుగనైనను, పుల్లగనైననునుండుట, మూత్రము నీలవర్ణముగనైనను ధూమ్రవర్ణముగనైనను నుండుట, ఇట్టిలక్షణంబులుగలిగిన వాతపిత్తజ్వరమని ఎఱుంగవలయు.

### వాతపిత్తజ్వరచికిత్స.

శ్లో. గుడూచీ పర్పటం ముస్తా కిరాతం విశ్వభేషజమ్
వాతపిత్తజ్వరే దేయం పంచభద్రమిదం శుభమ్.

తా. తిప్పతీగ, పర్పాటకము, తుంగగడ్డలు, నేలవేము, శొంఠి, వీటిని సమముగ దంచి కషాయముబెట్టి పుచ్చుకొనిన వాతపిత్తజ్వరము హరించు. (ఇది పంచభద్ర కషాయము.)

శ్లో. ద్రాక్షా కిరాతామృతవాసకా శఠీ
క్వాథం పిబేత్పిత్త మరుజ్జ్వరం హరేత్.

తా. దీపద్రాక్ష, నేలవేము, తిప్పతీగ, అడ్డసరము, కచ్చూరములు, వీటిని సముగ దంచి కషాయముబెట్టి పుచ్చుకొనిన వాతపిత్తజ్వరము నశించు. (ఇది ద్రాక్షాది కషాయము.)

శ్లో. ఛిన్నా కిరాతాబ్దసవిశ్వపర్పటాస్సవాతపిత్తజ్వరహృన్నిపీతాః.

తా. తిప్పతీగ, నేలవేము, తుంగగడ్డలు, శొంఠి, పర్పాటకము, వీటిని సమముగ దంచి కషాయముబెట్టి పుచ్చుకొనిన వాతపిత్తజ్వరము నశించు. (ఇది ఛిన్నాదికషాయము.)

### వాతశ్లేష్మజ్వరలక్షణము.

శ్లో. స్నిగ్ధం క్షారముఖం శిరో వ్యథయతే సర్వాంగపీడా భవే
న్నేత్రే వారియుతే కరోతి వమనం రోమాంచతా శ్లేష్మణి
దీర్ఘం నిశ్వసతే తథాతిదహనం చానిద్రదోషాకులం
మూత్రం ఫేనిలపల్వలం నిగదితం వాతజ్వరే శ్లేష్మణి.

తా. శరీరము జిగటగనుండుట, నోరుప్పగనుండుట, శిరోవేదనగలుగుట, సర్వాంగములయందు వేదనగలుగుట, నేత్రములయందు నీరు స్రవించుట, వాంతిగలుగుట, శరీరము గగుర్పొడుచుట, ముక్కుయందు శ్లేష్మము స్రవింపుచుండుట, నిట్టూర్పు, అతితాపము, ఇవిగలుగుట, నిద్రపట్టకుండుట, మూత్రము నురుగుగట్టుట, ఇట్టిలక్షణంబులు గలిగిన వాతశ్లేష్మజ్వరమని ఎఱుంగవలయు.

### వాతశ్లేష్మజ్వరచికిత్స.

శ్లో. ముస్తాపర్పటకే శుంఠీ గుడూచీ సదురాలభా
కఫవాతారుచిచ్ఛర్దిదాహశోషనివారణః.

తా. తుంగగడ్డలు, పర్పాటకము, శొంఠి, తిప్పతీగ, దురదగొండి, వీటిని సముగదంచి కషాయముబెట్టి పుచ్చుకొనిన, వాతశ్లేష్మజ్వరము, అరుచి, వాంతి, దాహము, శోష, ఇవియన్నియుం హరించు. (ఇది ముస్తాదికషాయము.)

శ్లో ఆరగ్వధగ్రంధికముస్తతిక్తాహారీతకీభిః క్వథితః కషాయః
సామే సశూలే కఫవాతయుక్తే జ్వరే హితో దీపనపాచనశ్చ.

తా. రేలకాయగుజ్జు, మోడి, తుంగగడ్డలు, కటుకరోహిణి, కరక్కాయలు, వీటిని సమముగదంచి కషాయముబెట్టి పుచ్చుకొనిన ఆమశూలయుక్తమగు వాతశ్లేష్మ జ్వరము హరించి దీపనపాచనములు గలుగు (ఇది ఆరగ్వధాదికషాయము.)

శ్లో. క్షుద్రామృతానాగరపుష్కరాహ్వైః
కృతః కషాయః కఫమారుతోత్తరే
సశ్వాసకాసారుచిపార్శ్వశూలే
జ్వరే త్రిదోషప్రభవేఽపి శస్యతే.

తా. నేలములక, తిప్పతీగ, శొంఠి, తామరగడ్డలు, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి పుచ్చుకొనిన వాతశ్లేష్మజ్వరము, శ్వాసకాసలు, అరుచి, కుక్షిశూలలు, త్రిదోషజ్వరములు, ఇవి హరించు. (ఇది క్షుద్రాదికషాయము.)

### పిత్తశ్లేష్మజ్వరలక్షణము.

శ్లో. నేత్రైః పశ్యతి నీలపీతతిమిరే రోమ్ణాం తథోద్ధర్షణం
కంఠోఽరోచకవిస్మయో నచరతిర్వక్త్రే కటుక్షారతా

పాదౌ దాహయుతౌ తథా గళగ్రహశ్చాన్నిద్రవాంతీ సదా
మూత్రం కుంకుమపాండురం భిషగిదం పిత్తే కఫాఖ్యే జ్వరే.

**తా.** పచ్చగను, నీలముగను, చీకటిగను, నేత్రములకగుపడుట, గగుర్పాటుచుట, శరీరము వణకుట, నోరు ఆరుచిగను, చేదుగను, ఉప్పగను నుండుట, విస్మయించుట, పాదములు మండుట, కంఠమున కఫముగట్టియుండుట, నిదురపట్టకయుండుట, వాంతిగలుగుట, మూత్రము యెరుపుగను, తెలుపుగనుండుట, ఇట్టిలక్షణంబులుగలిగిన పిత్తశ్లేష్మజ్వరమని ఎరుంగవలయు.

## పిత్తశ్లేష్మజ్వరచికిత్స.

శ్లో. కంటకార్యమృతా భార్గీ నాగరేంద్రయవాసకమ్
భూనింబచందనం ముస్తా పటోలం కటురోహిణీ.
కషాయం పాయయేదేతం పిత్తశ్లేష్మజ్వరాపహమ్
దాహతృష్ణారుచిర్వాంతికాసహృత్పార్శ్వశూలహృత్.

**తా.** వాకుడువేరు, తిప్పతీగ, గంటుభారంగి, శొంఠి, కొడిశపాలవిత్తులు, దురదగొండి, నేలవేము, శ్రీగంధపుచక్క, తుంగగడ్డలు, చేదుపొట్ల, కటుకరోహిణి వీటిని సమభాగములుగదంచి కషాయముబెట్టి పుచ్చుకొనిన పిత్తశ్లేష్మజ్వరము, దాహము, నాలుకపీల్పు, అరుచి, వెక్కిళ్ళు, దగ్గు, గర్భశూల, కుక్షిశూల, ఇవియన్నియు హరించు. (ఇది కంటకార్యాదికషాయము.)

శ్లో. పటోలం చందనం మూర్వా తిక్తా పాఠామృతాగణాః
పిత్తశ్లేష్మారుచిచ్ఛర్దిజ్వరకండూవిషాపహాః.

**తా.** చేదుపొట్ల, శ్రీగంధము, చాగవేళ్ళు, కటుకరోహిణి, అగరుశొంఠి, తిప్పతీగ, పిప్పళ్ళు వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి పుచ్చుకొనిన పిత్తశ్లేష్మజ్వరము, అరుచి, వాంతి, దురద, విషము, ఇవి నశించు. (ఇది పటోలాదికషాయము.)

శ్లో. అమృతారిష్టకటుకాముస్తేంద్రయవనాగరైః
పటోలచందనాభ్యాం చ పిప్పలీచూర్ణయుక్సశృతః.
అమృతాష్టకమేతచ్చ పిత్తశ్లేష్మజ్వరాపహమ్
ఛర్ద్యరోచకహృల్లాసదాహతృష్ణానివారణమ్.

**తా.** తిప్పతీగ, వేపపట్ట, కటుకరోహిణి, తుంగగడ్డలు, కొడిశవిత్తులు, శొంఠి, చేదుపొట్ల, శ్రీగంధపుచక్క, వీటిని సమముగ దంచి కషాయముబెట్టి అందు



పిప్పలిచూర్ణము కలిపి పుచ్చుకొనిన పిత్తశ్లేష్మజ్వరము, వాంతి, అరుచి, ఓకరించుట, దాహము, నాలుకపీల్పు, ఇవియన్నియును హరించు. (ఇది అమృతాష్టకకషాయము.)

శ్లో. తిక్తోశీరబలాధాన్యపర్పటాంభోదరైః కృతః
క్వాథః పునస్సమాయాతం జ్వరం శీఘ్రం నివారయేత్.

**తా.** కటుకరోహిణి, వట్టివేరు, చిట్టాముదపువేరు, ధనియాలు, పర్పాటకము, తుంగగడ్డలు వీటిని సమముగ దంచి కషాయముబెట్టి పుచ్చుకొనిన అపథ్యముచే మరల వచ్చెడి పిత్తశ్లేష్మజ్వరము శీఘ్రంబుగ నశించు. (ఇది తిక్తాది కషాయము.)

శ్లో. జీరకం కారవల్ల్యంబుశీతపూర్వజ్వరే హితమ్.

**తా.** జీలకఱ్ఱను కాకరాకురసముతో నూరి ముద్దజేసి నెల్లికాయంత పుచ్చుకొనిన చలియుక్తమగు జ్వరము నశించు.

## సన్నిపాతజ్వరలక్షణము.

శ్లో. కాసశ్వాసప్రమోహారుచిభ్రమకృశతాః కర్ణయుగ్మం సనాదం
నిద్రానాశోఽతితృష్ణాగురుతరముదరం శీర్షసంధ్యస్థిపీడా
దాహశ్శీతం క్షణేన సతతగళవిరుగ్లోచనే స్రావయుక్తే
నిర్భుగ్నే చాతిరక్తే ప్రలపనముదితం లక్షణం సన్నిపాతే.

**తా.** దగ్గు, శ్వాసము, మోహము, అరుచి, భ్రమ, ఇవి గలుగుట, కృశించుట, చెవులలో శబ్దముగలుగుట, నిదుర బట్టకుండుట, అతిదాహము, మందము, ఇవికలిగియుండుట, శిరస్సు, కీళ్లు, ఇవినొచ్చుట, శరీరము ఒకసమయంబున నుష్ణముగను, మరియొక సమయంబున శీతలముగను నుండుట, కంఠమున కఫము గట్టియుండుట, నేత్రంబులలో నీరుగారుట, కనుబొమలు ముడిబడుట, నేత్రములు యెఱుపుబారియుండుట, ఏడ్చుట, వదురుట, ఇట్టి లక్షణంబులు గలిగిన సన్నిపాతజ్వరమని ఎరుంగవలయు.

(ప్రకారాంతరమ్)

శ్లో. క్షణే దాహః క్షణే శీతమస్థిసంధిశిరోరుజా
సాస్రావే కలుషే రక్తే నిర్భుగ్నే చాపి లోచనే.
సస్వనౌ సరుజౌ కర్ణౌ కంఠశ్శూకైరివావృతః
తంద్రామోహః ప్రలాపశ్చ కాసశ్వాసోఽరుచిర్భ్రమః.
పరిదగ్ధాఖరస్పర్శా జిహ్వా స్రస్తాంగతాపనమ్
ష్ఠీవనం రక్తపిత్తస్య కఫేనోన్మిశ్రితస్య చ.
శిరసోలోఠనం తృష్ణా నిద్రానాశో హృది వ్యథా
స్వేదమూత్రపురీషాణాం చిరాద్దర్శనమల్పశః.

కృశత్వం చాతిగాత్రాణాం సతతం కంఠకూజనమ్
స్ఫోటానాం శ్యావరక్తానాం మణ్డలానాం చ దర్శనమ్.
మూకత్వం స్రోతసాం పాకో గురుత్వముదరస్య చ
చిరాత్పాకశ్చ దోషాణాం సన్నిపాతజ్వరాకృతిః.

తా. శరీరము ఒకసమయంబున నుష్ణముగను మరియొక సమయంబున శీతలముగను నుండుట, అస్థిసంధులయందును, శిరస్సుయందును వేదనగలుగుట, కనుబొమలు ముడిబడుట, నేత్రంబులు నీరుకారుచు కలతబారి ఎఱ్ఱగనుండుట, చెవులయందు విపరీతమయిన శబ్దములు, పోట్లు, ఇవి గలిగియుండుట, నాలుకద్రవము లేక ముల్లుతాకినట్లుండుట, కండ్లు మూతలుబడుట, మోహముగలుగుట, వదురుట, దగ్గు, శ్వాసము, అరుచి, భ్రమ, ఇవి గలుగుట, నాలుకవుడికినట్లు ముండ్లుబారియుండుట, అవయవములు మిగుల శైథిల్యమును జెంది తాపము గలిగియుండుట, కఫము రక్తపీతవర్ణములు గలిగియుండుట, వికారముగ తలద్రిప్పుట, నాలుకపీల్పుకలిగియుండుట, నిదురబట్టకుండుట, బొమ్మలో శూలకలుగుట, ఒకానొకప్పుడు చమటబట్టుట, మలమూత్రములు బంధించి ఒకానొకప్పుడు స్వల్పముగ విసర్జనంబగుట. దినేదినే శరీరము కృశించుట, కంఠమున సదా శబ్దముగలిగియుండుట, శరీరమున నెఱ్ఱని, లేక నల్లని గ్రంథులును, నెఱ్ఱని లేక నల్లని మచ్చలునుగలుగుట, మూకత్వముగలుగుట, ఇంద్రియములు వైకల్యమును జెందియుండుట, దీపనములేకయుండుట, కడుపుకఠినమై రాయివలెనుండుట, దోషములు దీర్ఘకాలంబునకు పక్వమగుట, ఇట్టి లక్షణంబులుగలిగిన సన్నిపాతజ్వరమని ఎరుంగవలయు.

---

## సాధ్యాసాధ్యసన్నిపాతవిచారము.

శ్లో. దోషే వివృద్ధే నష్టేఽగ్నౌ సర్వసంపూర్ణలక్షణః
సన్నిపాతజ్వరోఽసాధ్యః కృచ్ఛ్రసాధ్యస్తతోఽన్యథా.

తా. పూర్వముదహరింపబడిన సన్నిపాతలక్షణంబు లన్నియుంగలిగి అగ్నిదీపనమున్ను నశించి క్రమంబుగ దోషములు వృద్ధిజెందుచుండిన నాసన్నిపాతజ్వరమసాధ్యంబనియు పైనజెప్పంబడిన సన్నిపాతలక్షణంబులన్నియు లేక అందుకొన్నిలక్షణంబులు మాత్రము గలిగి క్రమంబుగ దోషంబులున్ను తగ్గుచుండిన నాసన్నిపాతజ్వరము కష్టసాధ్యంబనియు నెరుంగవలయు.

శ్లో. సన్నిపాతజ్వరస్యాంతే కర్ణమూలే సుదారుణః
శోఫస్సంజాయతే తేన కశ్చిదేవ విముచ్యతే.



తా. సన్నిపాతజ్వరాంతంబున చెవులక్రింద భయంకరమగు వాపుగలిగి గడ్డలు కట్టును. అయిన నీగడ్డలు కొందఱికిమాత్రము స్వస్థంబగు.

---

## సన్నిపాతజ్వరనిర్ణయము.

శ్లో. పిత్తకఫానిలవృద్ధ్యా దశదివసద్వాదశాహసప్తాహాత్
హంతి విముంచత్యాశు త్రిదోషజో ధాతుమలపాకాత్.

తా. పిత్తప్రకోపసన్నిపాతమునకు ౧౦ దినములు, శ్లేష్మప్రకోపసన్నిపాతమునకు ౧౨ దినములు, వాతప్రకోపసన్నిపాతమునకు ౭ దినములు, ప్రమాణము గలిగియుండు. ఇక్కాలప్రమాణంబున సౌమ్యధాతువుగలిగి మలమూత్రములు ధారాళముగ వెడలుచుండిన నారోగి జీవించుననియు, ధాతువుసౌమ్యంబుగాకను, మలమూత్రములు ధారాళముగను, వెడలకుండిన నారోగి నిశ్చయముగ యమపురికేగుననియు నెరుంగవలయు.

శ్లో. సప్తమే దివసే ప్రాప్తే దశమే ద్వాదశేఽపి వా
పునర్ఘోరతరో భూత్వా ప్రశమం యాతి హంతి వా.

తా. పైలక్షణంబులుగల సన్నిపాతము. ౭. ౧౦. ౧౨. ఈదినంబులకుపై అఘోరంబుగ వృద్ధియయ్యెనేని ఆరోగము స్వస్థంబునైనను, మృత్యువునైనను గలుగంజేయు.
(మతాంతరమ్)

శ్లో. సప్తమీద్విగుణా యావన్నవమ్యేకాదశీ తథా
ఏషా త్రిదోషమర్యాదా మోక్షాయ చ వధాయ చ.

తా. వాతపిత్తశ్లేష్మయుక్తమగు సన్నిపాతములు క్రమంబుగ ౧౪. ౧౮. ౨౨. ఈదినంబులలో అఘోరంబుగ వృద్ధియయ్యెనేని నివి స్వస్థంబునైనను, మరణంబునైనను, గలుగంజేయు.

శ్లో. దాహస్స్వేదో భ్రమస్తృష్ణాకంపోవిడ్భేదసంజ్ఞతా
కూజనం చాతివైదగ్ధ్యమాకృతిర్జ్వరమోక్షణే.

తా. దాహము, చమట, భ్రమ, నాలుకపీల్పు, కంపము, ఇవి కలిగియుండుట, మలవిసర్జనంబగుట, ప్రజ్ఞలేకుండుట, కంఠమున శబ్దము గలుగుట, ఇట్టిలక్షణంబులు సన్నిపాతజ్వరము నశించునపుడు గలుగు.

శ్లో. సన్నిపాతజ్వరే పూర్వం కుర్యాదామకఫాపహమ్
పశ్చాచ్ఛ్లేష్మణి సంక్షీణే శమయేత్పిత్తమారుతౌ.

తా. సన్నిపాతజ్వరమునందు ఆమము, కఫము, వీటిని హరించెడి ఔషధములను ప్రథమంబున బుచ్చుకొనవలయు. కఫము క్షీణించినతోడనే వాతపిత్తంబులు రెండును శమించు.

శ్లో. లంఘనం వాలుకాస్వేదో నస్యనిష్ఠీవనం తథా
అవలేహాంజనం చైవ ప్రాక్ప్రయోజ్యం త్రిదోషజే.

తా. లంఘనముచేయుట, ఇసుకనావిరిపట్టుట, నస్యముజేయుట, వమనముగ ఔషధము బుచ్చుకొనుట, జ్వరమును హరించు నౌషధంబుల నేవించుట, అంజనము వేసికొనుట, వీటిని సన్నిపాతజ్వరారంభమున జేయవలయు.

శ్లో. త్రిరాత్రం పంచరాత్రం వా దశరాత్రమథాపి వా
లంఘనం సన్నిపాతే తు కుర్యాదారోగ్యదర్శనాత్.

తా. సన్నిపాతరోగమునందు 3, లేక, ౫, లేక ౧౦ దినంబులైనను, రోగము కుదురువఱకైనను లంఘనము వేయవలయు.

శ్లో. దోషాణామేవ సా శక్తిర్లంఘనే యా సహిష్ణుతా
కిశ్చిద్దోషవిముక్తోఽపి లంఘనం సహతే నరః.

తా. మరియు లంఘనము ప్రాణమునకు క్లేశమును గలుగంజేయ దగినదిగనుండినను దోషప్రాబల్యము లంఘనమును నోర్చునటుల జేయుచున్నయది. కొందటికి రోగము నివృత్తియైనను లంఘనముచే క్లేశము జనింపకయుండు. కావున రోగనివృత్తికాలంబు తెరింగి లంఘనమును వర్జింపవలయు.

శ్లో. ఆదౌ చామవినాశాయ ద్వితీయే పిత్తనాశనమ్
తృతీయే కఫనాశశ్చ చతుర్థే వాతనాశనమ్.
పంచమే చ క్షుధోత్పత్తిష్షష్ఠే చ లఘుగాత్రతా
సప్తమే జ్వరపాకస్స్యాదష్టమే జ్వరనాశనమ్
నవమే సర్వదోషఘ్నం లంఘనం కథ్యతే బుధైః.

తా. మొదటి లంఘనమున ఆమము, రెండవ లంఘనమున పిత్తము, మూడవ లంఘనమున శ్లేష్మము, నాలవలంఘనమున వాతము, శమించు. మరియు నైదవలంఘనమున నాకలి గలుగు. ఆఱవలంఘనమున శరీరము లఘువుగనుండు. ఏడవలంఘనమున జ్వరము పక్వమగు. ఎనిమిదవ లంఘనమున జ్వరమునశించు. తొమ్మిదవ లంఘనమున సర్వదోషంబులును హరించుగాన నిటుల లంఘనములు వేయవలయు.

శ్లో. జ్వరే లంఘనమేవాదావుపదిశ్యేదృతే జ్వరాత్
క్షయానిలభయక్రోధకామశోకశ్రమోద్భవాత్.

తా. జ్వరము వచ్చినతోడనే లంఘనము వేయవలయు. అయినను, క్షీణధాతువు గలవారికిని, వాతరోగము, భయము, క్రోధము, కామము, శోకము, శ్రమ వీటిచే జ్వరము జనించినవారికిని లంఘనముచేయంజనదు. (ఇది లంఘననిషేధము.)



శ్లో. ఆమాశయస్థో హత్వాగ్నిం రసమార్గాన్పిధాయ చ
విదధాతి జ్వరం దోషస్తస్మాత్కుర్వీత లంఘనమ్.

తా. ఆమమునాశ్రయించిన దోషము అగ్నిని నశింపజేసి రసమార్గముల నడ్డగించి జ్వరంబును గలుగంజేయుంగాన లంఘనము వేయవలయు. ఇట్లుజేసిన ఆమదోషము నశించుటయగాక జ్వరంబును హరించు. (ఇదియలంఘనహేతువు.)

శ్లో. ప్రాణావిరోధినా చైనం లంఘనేనోపవాసయేత్
బలాధిష్ఠానమారోగ్యం యదర్థే సత్క్రియాక్రమః.

తా. మరియు ప్రాణంబునకు విరోధము గలుగకుండునటుల లంఘనములు వేయవలయు. ప్రాణంబులుండిన బలమును నారోగ్యమును గలుగుటయగాక ధర్మాదిసత్కార్యంబులు సగా నొనర్పందగు. (లంఘనమనగా భోజనమును వర్జించియుండుట.)

శ్లో. తచ్చ మారుతక్షుత్తృష్ణాముఖశోషభ్రమాన్వితే
కార్యం బాలేన వృద్ధేవా గర్భిణ్యాం న చ దుర్బలే.

తా. మరియు వాతరోగము, క్షుత్తు, దాహము, ముఖశోష, భ్రమ, దుర్బలము ఇవిగలవారికిని, బాలురు, వృద్ధులు, గర్భిణిస్త్రీలు ఈమొదలగువారికిని లంఘనము వేయంజనదు. (ఇది ద్వితీయలంఘననిషేధము.)

శ్లో. మృదుజ్వరో లఘుర్దేహశ్చలితాశ్చ యదా మలాః
పక్వం దోషం విజానీయాజ్జ్వరే దేయం తదౌషధమ్.

తా. జ్వరము స్వల్పముగనుండుట, దేహము తేలికగనుండుట, మలముజారుట, ఇట్టి లక్షణంబులు గలిగిన జ్వరము పక్వమైనదని యెఱింగి ఔషధంబుల బుచ్చుకొనవలయు.

శ్లో. ఊష్మా పిత్తాదృతేనాస్తి జ్వరో నాస్త్యూష్మణా వినా
తస్మాత్పిత్తవిరుద్ధాని పిబేత్పిత్తేధికేధికమ్.

తా. ఉష్ణము పిత్తసంబంధము లేక జనింపదు. ఉష్ణసంబంధములేక జ్వరము జనింపదు. కావున పిత్తహరమగు నౌషధంబుల బుచ్చుకొనవలయు.

## సన్నిపాతజ్వరచికిత్స.

శ్లో. మాతులుంగార్ద్రకరసం కోష్ణం త్రిలవణాన్వితమ్
నస్యాద్వా సిద్ధవిహితం నస్యం తీక్ష్ణం ప్రయోజయేత్.

తా. కోష్ఠు, ఉప్పు, సైంధవలవణము, పాదరలవణము వీటిని సమముగ చూర్ణముజేసి అందు మాదీఫలము, అల్లము, వీటిరసము బోసి నూరి నస్యముజేసిన సన్నిపాత

జ్వరము నివృత్తియగు. ఇటులజేసినను శమింపదేని దీనికన్నను తీక్ష్ణంబగు నస్యంబును జేయవలయు.

శ్లో. మధూకసారసింధూత్థవచోషణకణాస్సమాః
శ్లక్ష్ణం పిష్ట్వాంభసా నస్యం కుర్యాత్సంజ్ఞాప్రబోధనమ్.

తా. ఇప్పబంక, సైంధవలవణము, వస, మిరియాలు, పిప్పళ్లు, వీటిని సమముగ నుంచుకొని అందుదకముబోసి నూరి నస్యముజేసిన సన్నిపాతజ్వరము నశించు.

శ్లో. శిరీషబీజగోమూత్రకృష్ణామరిచసైంధవైః
అంజనం స్యాత్ప్రబోధాయ సరసోనశిలావచైః.

తా. దిరిశనపువిత్తులు, పిప్పళ్ళు, మిరియాలు, సైంధవలవణము, వెల్లుల్లి, మణిశిల, వస, వీటిని గోమూత్రముచే గంధముదీసి అంజనమువేసిన సన్నిపాతజర్వము హరించు.

శ్లో. కట్ఫలం పుష్కరం శృంగీ కృష్ణా చ మధునా సహ
శ్వాసకాసజ్వరహరశ్శ్రేష్ఠో లేహః కఫాంతకః.

తా. కాయఫలము, తామరగడ్డలు, కరకపువ్వు, పిప్పళ్ళు, వీటిని సమముగ చూర్ణముజేసి అందు తేనెబోసి లేహపాకముగ వండి రేగుబండంత పుచ్చుకొనిన శ్వాసము, దగ్గు, సన్నిపాతజ్వరము, కఫము, ఇవి యన్నియు హరించు.

శ్లో. భూనింబదారుదశమూలమహౌషధాబ్ద
తిక్తేంద్రబీజధనికేభకణా కషాయః
తంద్రాప్రలాపకసనారుచిదాహమోహ
శ్వాసాదియుక్తమఖిలజ్వరమాశు హంతి.

తా. నేలవేము, దేవదారు, దశమూలములు (అనగా బిల్వవేరు, తక్కలి, దుండిలము, గుమ్ముడు, కలిగొట్టు, * ముయ్యాకుపొన్న, † క్కతోపొన్న, వాకుడు, పెద్దములక, పల్లేరు) శొంఠి, తుంగగడ్డలు, కటుకరోహిణి, కొడిశవిత్తులు, దనియాలు, గజపిప్పలి వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి పుచ్చుకొనిన, తంద్ర, ప్రలాపము, దగ్గు, అరుచి, దాహము, మోహము, శ్వాస వీటియుక్తమగు సన్నిపాతము మొదలగు సమస్తజ్వరములు నశించు.

శ్లో. భార్గీభూనింబనింబైర్ఘనకటుకవచావ్యోషవాసావిశాలా
రాస్నానంతాపటోలీ సురతరురజనీపాటలాతిందుకైశ్చ
బ్రాహ్మీదార్వీగుడూచీత్రివృతమతివిషాపుష్కరత్రాయమాణై
ర్వ్యాఘ్రీసింహీకలింగైస్త్రిఫలసటియుతైః కల్పితస్తుల్యభాగైః.

* కొలపొన్న. † నేలపొన్న.



క్వాథో ద్వాత్రింశనామా త్రిభిరధికదశాన్ సన్నిపాతాన్నిహంతి
శూలం కాసాదిహిక్కాశ్వసనగుదరుజాధ్మానవిధ్వంసకారీ
ఊరుస్తంభాంత్రవృద్ధిగళగదమరుచిం సర్వసంధిగ్రహార్తి
ర్మాతంగౌఘం నిహన్యాన్మృగరిపురివ చేద్రోగజాలం తథైవ.

తా. గంటుభారంగి, నేలవేము, వేపపట్ట, తుంగగడ్డలు, కటుకరోహిణి, వస, శొంఠి, పిప్పలి, మిరియాలు, అడ్డసరము, పెద్దపాపర, సన్నరాష్ట్రకము, దురదగొండి, చేదుపొట్ల, దేవదారు, పసపు, కలిగొట్టు, నల్లతుమికి, సరస్వతిఆకు, మానిపసపు, తిప్పతీగ, తెల్లితెగడ, అతివస, తామరగడ్డలు, ములుగోరింట, వాకుడు, పెద్దములక, కొడిశవిత్తులు, కరక్కాయలు, తానికాయలు, నెల్లివరుగు, కచ్చూరములు; వీటిని సమముగ దంచి కషాయముబెట్టి పుచ్చుకొనిన ౧౩ సన్నిపాతములు, శూలలు, దగ్గు, వెక్కిళ్ళు, శ్వాస, గుదరోగము, ఆధ్మానము, ఊరుస్తంభము, ఆంత్రవృద్ధి, గళరోగము, అరుచి, కీళ్ళుబిగపట్టడము, ఈమొదలగు నేనుగవంటిరోగంబులను సింహంబుంబోలిన నీకషాయము నశింపంజేయు. (ఇది ద్వాత్రింశన్నామక కషాయము.)

శ్లో. స్వేదోద్గమే భృష్టకుళుత్థచూర్ణం
నిపాతనం శస్తమితి బ్రువంతి
మృత్యుశ్చ తస్మిన్బహుపిచ్ఛలత్వా
చ్ఛీతస్య జంతోః పురతస్సరత్వాత్.

తా. సన్నిపాతజ్వరము శీతలంబును నాశ్రయించి ప్రవర్తింపుచుండుటచే నధికముగ చమట స్రవింపుచుండు. మఱియు నిటులస్రవించెడి చమట కొంతకాలమునకు జిగటయగు. అప్పుడారోగికి మృత్యువాసన్నంబైయుండు గాన నీచమట హరించుటకై, ఉలవలువేయించి దానిని పిండిగావించి శరీరమునకు లేపనము జేయవలయు. (ఇది నిపాతన చూర్ణము.)

శ్లో. దార్వ్యంబుదస్తిక్తపలత్రికం చ క్షుద్రా పటోలీ రజనీ సనింబా
క్వాథో విదధ్యాజ్జ్వరసన్నిపాతే నిశ్చేతనే పుంసి విబోధనార్థమ్.

తా. మానిపసపు, తుంగగడ్డలు, కటుకరోహిణి, కరక్కాయలు, తానికాయలు, నెల్లివరుగు, వాకుడు, చేదుపొట్ల, పసపు, వేపవేరుపట్ట, వీటిని సమముగ దంచి కషాయముబెట్టి పుచ్చుకొనిన సన్నిపాతజ్వరమునందలి భ్రమ నివృత్తియగుటయగాక తెలివియును గలుగు. (ఇది దార్వ్యాదికషాయము.)

శ్లో. లశునం తిక్తకం కాండం భార్గీ చాతివిషా తథా
నరమూత్రేణ చ క్వాథస్సన్నిపాతే సుదారుణః.

తా. వెల్లుల్లి, నేలవేము, కాకిదొండవేరు, గంటుభారంగి, అతివస వీటిని సమముగ దంచి నరమూత్రములో కషాయముబెట్టి పుచ్చుకొనిన నతిఘోరంబగు సన్నిపాతము సగా హరించు. (ఇది లశునాదికషాయము.)

శ్లో. విషభాగో భవేదేకో మరీచానాం త్రయో మతాః
ఆరణ్యోపలజో భస్మ షోడశాంశసమన్వితమ్.
ఏకత్ర మిళితం చూర్ణం ధూర్తవరసభావితమ్
ఆతపే శోషితం తచ్చ శీతస్వేదహరం పరమ్.

తా. వసనాభి ౧ భాగము. మిరియాలు 3 భాగములు. అడవియేరుపిడకల భస్మము ౧౬ భాగములు ఇటుల వీటినన్నిటిని చూర్ణముగావించి యేకముజేసి నల్లవుమ్మెత్తాకురసముచే తడిపి యెండబెట్టి శరీరమునకు లేపనముజేసిన సన్నిపాతజ్వరమునందు శైత్యప్రాబల్యముచే గలిగిన చమట హరించు. (ఇది వసనాభ్యాదిలేపనము.)

శ్లో. అథవా చణకా భ్రష్టా యవానీ చూర్ణమిశ్రితాః
వచోషణరజోయుక్తాస్స్వేదసంశోషణా మతాః.

తా. వేయించినశనగలు, ఓమము, వస, మిరియాలు వీటిని సమభాగములుగ జూర్ణముజేసి శరీరమునకు లేపనముజేసిన సన్నిపాతమునందు శైత్యప్రాబల్యముచే స్రవింపుచుండెడి చమట హరించు. (ఇది చణకాదిలేపనము.)

శ్లో. ఉచ్ఛ్రూకాం స్ఫుటితాం జిహ్వాం ద్రాక్షయా మధుపిష్టయా
ప్రలేపయేత్సఘృతయా సన్నిపాతాత్మకే జ్వరే.

తా. సన్నిపాతజ్వరమునందు నాలుక ముల్లుతాకినట్లయినను, పగిలినట్లయినను నుండిన దీపద్రాక్షను తేనెతోనూరి అందు కొంచము నెయ్యికలిపి జిహ్వకు పలుమారు లేపనముజేసిన నందలి దోషంబులన్నియును హరించు. (ఇది ఉచ్ఛ్రూకాదిలేపనము.)

శ్లో. సనాగరం దేవదారు రాస్నాచిత్రకపేషితమ్
ప్రలేపనమిదం శ్రేష్ఠం గళశోఫవినాశనమ్.

తా. శొంఠి, దేవదారు, సన్నరాష్ట్రకము, చిత్రమూలము, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి అందుదకముబోసి నూరి కించిదుష్ణముజేసి పలుమారు కంఠమునకు లేపనముజేసిన సన్నిపాతజ్వరమునందు కంఠమున జనించిన వాపులన్నియును నశించు. (ఇది నాగరాదిలేపనము.)

శ్లో. కుళుత్థం కట్ఫలం శుంఠీ కారవీ చ సమాంశకైః
సుఖోష్ణలేపనం కార్యం కర్ణమూలే ముహుర్ముహుః.



తా. ఉలవలు, కాయఫలము, శొంఠి, చేదుజీలకఱ్ఱ, వీటిని సమభాగములుగ చూర్ణముచేసి అందుదకముబోసి నూరి వుడికించి సుఖోష్ణముగ కర్ణమూలములయందలి శోథలకు పలుమారు లేపనముజేసిన నవిహరించు. (ఇదికుళుత్థాదిలేపనము.)

శ్లో. ఇంగుదినిశావిశాలా సైంధవసురదారురవిదుగ్ధైః
దత్తః క్రమేణ లేపో హరతి మహాకర్ణకగ్రంథిమ్.

తా. గారపండ్లగుజ్జు, పసపు, పెద్దపాపరపేళ్లు, సైంధవలవణము, దేవదారు, వీటిని సమభాగములుగ చూర్ణముచేసి అందు జిల్లేడుపాలుబోసి నూరి పలుమారు కర్ణమూలములయందు లేపనముచేసిన నందలి వాపులు హరించు (ఇది ఇంగుదీలేపనము.)

శ్లో. కిరాతం కటుకా పథ్యా కణా కాయఫలం వచా
ఉద్ధూళనం త్రిదోషే చ సదా శైత్యే చ శస్యతే.

తా. నేలవేము, కటుకరోణి, కరక్కాయలు, పిప్పళ్ళు, కాయఫలము, వస వీటిని సమభాగములుగ చూర్ణముచేసి శరీరమునకు పలుమారు పట్టించిన శీతలముచే స్రవింపుచుండెడి చమట హరించు. (ఇది ఉద్ధూళనలేపనము.)

శ్లో. కస్తూరీ మరిచం వాజిలాలా చ మధునాంజనమ్,
తంద్రాం నివారయత్యాశు వ్యోషప్రధమనం తథా.

తా. కస్తూరి, మిరియాలు, వీటిని చూర్ణముజేసి అందు గుఱ్ఱపుజొల్లు, తేనెవేసి చక్కగనూరి నేత్రములకు అంజనమువేసినను, శొంఠి, పిప్పలి మిరియాలు, వీటిని సన్నగనూరి నస్యముజేసినను, తంద్ర హరించు. (ఇది కస్తూర్యాద్యంజనము )

శ్లో. తురంగలాలా సహితా మనశ్శిలా.
నిహంతి తంద్రాం సకృదంజనేన

తా. మణిశిలను చూర్ణముజేసి అందు గుఱ్ఱపుజొల్లువేసి చక్కగనూరి నేత్రముల కంజనమువేసిన తంద్ర హరించు. (ఇది మణిశిలాద్యంజనము.)

శ్లో. బబ్బూలపత్రాణి హరీతకీ చ సంస్వేదితా స్వేదవికారహంత్రీ.

తా. కరక్కాయలను చూర్ణముచేసి అందు నల్లతుమ్మఆకురసము బోసి నూరి శరీరమునకు లేపనముచేసిన శీతలముచే నధికముగ స్రవింపుచుండెడి చమట హరించు. (ఇది బబ్బూలాదిలేపనము.)

శ్లో. బిల్వోఽగ్నిమంథశ్శ్యోనాకః కాశ్మరీ పాటలా తథా
శాలిపర్ణీ పృశ్నిపర్ణీ బృహతీద్వయగోక్షురైః
ఉభయం దశమూలం స్యాత్సన్నిపాతహరో గణః

తా. దశమూలములు, (అనగా, మారేడు, తక్కలి, దుండిలము, గుమ్ముడు, కలిగొట్టు, కోలపొన్న, నేలపొన్న, చిన్నములక, పెద్దములక, పల్లేరు) వీటివేళ్లను సమముగ దంచి కషాయముబెట్టి పుచ్చుకొనిన సన్నిపాతజ్వరములు హరించు. (ఇది దశమూల కషాయము.)

శ్లో. ఆర్ద్రికస్వరసోపేతం సైంధవం సకటుత్రయమ్
ఆకంఠే ధారయేచ్చాస్యే నిష్ఠీవేచ్చ పునఃపునః
తేనాస్య హృదయచ్ఛ్లేష్మా మన్యాపార్శ్వశిరోగళాత్
లీనో వ్యాకృష్యతే శుష్కో లాఘవం చాస్య జాయతే.

తా. సైంధవలవణము, శొంఠి, పిప్పలి, మిరియాలు, వీటిని సమభాగములుగ చూర్ణముచేసి అందల్లపురసముబోసి చక్కగ మర్దించి నేరేడుపండంత మాత్రలుచేసి పుక్కిటనుంచుకొని దానిసారమును మ్రింగుటయగాక పలుమారు కఫమును ఉమ్మివేయుచుండవలయు. ఇటులచేసిన హృదయము, పెడతల నరము, పార్శ్వములు, శిరస్సు, కంఠము, వీటియం దణిగియుండెడి కఫము నశించు. ఇటుల కఫము హరించుటచే దేహము లఘువుగనుండు.

శ్లో. సద్యస్త్రిపంచసప్తాహాద్దశాహాద్ద్వాదశాదపి
ఏకత్రింశద్దినైశ్శుద్ధసన్నిపాతీ సుజీవతి.

తా. సన్నిపాతజ్వరము తత్కాలంబుననైనను, ౩, ౫, ౭, ౧౦, ౧౨, ౨౧, ౩౧, ఈదినంబులలోనైనను, స్వస్థంబయ్యెనేని యారోగి జీవించు.

శ్లో. ఆమ్లస్నిగ్ధోష్ణతీక్ష్ణైః కటుమధురసురాతాపసేవాకషాయై
స్స్వాదుక్రోధాలిరూక్షైర్గురుతరపిశితాహారసౌహిత్యశీతైః
శోకవ్యాయామచింతాగ్రహగణవనితాత్యంతసంగప్రసంగైః
ప్రాయః కుప్యంతి పుంసాం మధుసమయశరద్వర్షణే సన్నిపాతాః.

తా. సన్నిపాతజ్వరారంభమున, పులుసు, స్నిగ్ధము, ఉష్ణము, తీక్ష్ణము, కారము, మధురము, వగరు, రుచి, ఇవిగలపదార్థములు, అతిరూక్షగలపదార్థములు, గురుత్వముగల మాంసములు, తృప్తినిగలుగజేసెడి పదార్థములు, శీతలపదార్థములు, వీటిని భుజించుటచేతను, మద్యపానంబొనర్చుటచేతను, యెండయందుండుటచేతను, క్రోధము, శోకము, వ్యాయామము, చింత, వీటిచేతను, అనిష్టగ్రహములు సోకుటచేతను, అనేకస్త్రీలతో సంభోగంబొనర్చుటచేతను, అతిమైథునంబొనర్చుటచేతను, సన్నిపాతములు ప్రకోపమునుజెందు. మరియు, వసంతఋతువు, వర్షఋతువు, ఈఋతువులయందును సన్నిపాతంబులు సహజముగ ప్రకోపించు.



## ఆగంతుకజ్వరలక్షణము.

శ్లో. అభిచారాభిఘాతాభ్యామభిషంగాభిశాపతః
ఆగంతుర్జాయతే దోషైర్యథా స్వంతం విభావయేత్.

తా. మాంత్రికప్రయోగములచే జనించెడిజ్వరము అభిచారమనియు, కట్టెలు, రాళ్లు, వీటిదెబ్బలచే జనించుజ్వరము అభిఘాతమనియు, పిశాచములు మొదలగునవి సోకుటచే గలిగినజ్వరము అభిషంగమనియు, శపించుటచే నుత్పన్నంబైనజ్వరము అభిశాపమనియు జెప్పంబడు. కావున నివియన్నియు ఆంగతుకంబులగుటచే వాటివాటిలక్షణంబుల నెఱింగి చికిత్సలం జేయవలయు.

శ్లో. అభిచారాభిశాపాభ్యాం మోహస్తృష్ణా చ జాయతే,
భూతాభిషంగాత్కుప్యంతి భూతసామాన్యలక్షణాః.

తా. మోహము, తాపము, ఇవికలిగిన నభిచారాభిశాపజ్వరములనియు, ఆవేశము, విపరీతములగుమాటలు ఇవికలిగినభూతజ్వరమనియు, నెఱుంగవలయు. మరియు నీభూతజ్వరమున నం దనేకదోషంబులు జనించు. వాటిని వివరించెద.—

శ్లో. వమనమరుచిశోషస్సర్వథోద్గారతృష్ణా
హృదయజఠరబాధాదాహసంతాపమూర్ఛాః
వదనవిరసతాస్యాద్గాత్రభంగోథకర్కం
వదతి పరవశత్వం దోషసంభూతతాపమ్.

తా. వాంతి, అరుచి, శోష, తేనుపులు, దాహము, కడుపు, రొమ్ము, వీటియందునొచ్చుట, తాపము, క్రోధము, మూర్ఛ, ఇవిగలుగుట, నోరుయెండుట, ఒడలు విరిచికొనుట, విపరీతముగను, కఠినముగను మాటలాడుట, పరవశముగనుండుట, ఇట్టిలక్షణంబులు కలిగియుండిన భూతజ్వరమని యెఱుంగవలయు.

శ్లో. అభిచారాభిశాపోత్థౌ జ్వరౌ హోమాదినా జయేత్
దానస్వస్త్యయనాతిథ్యే హ్యుత్పాతగ్రహపీడనైః.

తా. అభిచారము, అభిశాపము, ఉత్పాతములు, గ్రహపీడలు, వీటిచే జనించిన జ్వరములకు హోమము, దేవపూజ, పుణ్యాహవాచనము, తీర్థయాత్ర, వీటిని గావించుట, గ్రహణపుణ్యకాలములయందు పుణ్యస్థలములయందు స్నానంబొనర్చుట, ఇట్టి కార్యంబులు జేయుటచే నవి శమించు.

శ్లో. భూతవిద్యాసముద్దిష్టైర్బంధావేశనతాడనైః
జయేద్భూతాభిషంగోత్థమనుశాంత్యా చ మానవః.

తా. భూతసంబంధముచే జనించిన జ్వరములకు భూతవిద్యయందు జెప్పంబడిన యంత్రములను గట్టుట, గ్రహావేశము జేయించుట, ప్రహరించుట, పంచాక్షరి మొదలగు మంత్రములను జపించుట, దిగదుడుపులు మొదలగు నుపచారంబుల గావించుట, ఈమొదలగు కార్యంబు లొనర్చుటచే నవి శమించు.

## ఆగంతుకజ్వరచికిత్స.

శ్లో. మధూకసారం మరిచం సైంధవం పిప్పలీ వచా
సంజ్ఞాప్రబోధనం నస్యం దేయం భూతజ్వరే సదా.

తా. ఇప్పచెక్క, మిరియాలు, సైంధవలవణము, పిప్పళ్లు, వస, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి భూతావేశజ్వరితులకు నస్యము జేయించవలయును. (ఇది సంజ్ఞా ప్రబోధన నస్యము.)

శ్లో. నిదిగ్ధికానాగరికామృతానాం క్వాథం పిబేన్మిశ్రితపిప్పలీకమ్
జీర్ణజ్వరారోచకకాసశూలశ్వాసాగ్నిమాంద్యార్దితపీనసేషు.

తా. వాకుడువేళ్లు, శొంఠి, తిప్పతీగ, వీటిని సమభాగములుగ దంచి కషాయము బెట్టి అందు పిప్పలిచూర్ణము కలిపి పుచ్చుకొనిన జీర్ణజ్వరము, అరుచి, శ్వాస, దగ్గు శూల, అగ్నిమాంద్యము, అర్దితవాతము, పీనస, ఇవియన్నియు హరించు.

## విషమజ్వరలక్షణము.

శ్లో. దోషోల్పోహితసంభూతో జ్వరోత్సృష్టస్య వా పునః
ధాతుమన్యతమం ప్రాప్య కరోతి విషమజ్వరమ్.

తా. జ్వరవిముక్తుడపథ్యం బొనర్చుటచే స్వల్పముగ దోషము జనించి అదిసప్త ధాతువులలో నొకధాతువు నాశ్రయించుకొని విషమజ్వరముగ పరిణమించు. వాటిలక్షణంబులెవ్వియనిన.

శ్లో. శీతపూర్వస్స విజ్ఞేయో దాహపూర్వో నిరంతరమ్
ఏకద్విత్రిచతుర్థస్స్యాద్విషమోన్యస్తు జీర్ణకః
ఏతే పంచజ్వరాః పీడాం కుర్వంతి బహువాసరమ్.

తా. మరియు విషమజ్వరము శీతలముకైనను, ఉష్ణంబుకైనను, ప్రధానంబుగగలదియై స్థిరముగ శరీరమున వ్యాపించి ఐకాహిక, ద్వ్యాహిక, త్ర్యాహిక, చాతుర్థికములను జ్వరములలో నేదైన నొకటిగ బరిణమిల్లినదిక్రమంబుగ నజీర్ణజ్వరముగ విలసిల్లు. మఱియు



సైకాహికాదిజ్వరములును, అజీర్ణజ్వరంబును గూడి ౫ విధములగు విషమజ్వరము లగుచున్నయవి. ఈజ్వరములే అనేకదినంబుల రోగులను బాధింపుచుండు.

శ్లో. యస్స్యాదనియతాత్కాలాచ్ఛీతోష్ణాభ్యాం తథైవ చ
వేగతశ్చాపి విషమో జ్వరస్స విషమో మతః.

తా. ఒకానొకసమయంబున శీతలముగను, మరియొకసమయంబున నుష్ణంబుగ నుండుట, కాలము నియతంబులేక జ్వరమువచ్చుట, ఒకానొకసమయంబున నధికముగను, మరియొకసమయంబున తక్కువగను, జ్వరము గలిగియుండుట, ఇట్టిలక్షణంబులుకలిగిన విషమజ్వరమని యెఱుంగవలయును.

## విషమజ్వరచికిత్స.

శ్లో. ముస్తామలకగుడూచీ విశ్వా చ కంటకారికాక్వాథః
పీతస్సకణాచూర్ణమధుభ్యాం విషమజ్వరం హంతి.

తా. తుంగగడ్డలు, నెల్లివరుగు, తిప్పతీగ, శొంఠి, వాకుడువేరు, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి అందు పిప్పలిచూర్ణము తేనెకలిపి పుచ్చుకొనిన విషమజ్వరములు నశించు.

శ్లో. మహౌషధామృతా ముస్తా చందనోశీరధాన్యకైః
క్వాథస్తృతీయకం హంతి శర్కరామధుయోజితః.

తా. శొంఠి, తిప్పతీగ, తుంగగడ్డలు, శ్రీగంధపుచెక్క, వట్టివేళ్లు, ధనియాలు, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి అందు తేనె శర్కరకలిపి పుచ్చుకొనిన త్ర్యాహికజ్వరము నశించు.

శ్లో. వాసా ధాత్రీ స్థిరా దారు ధాన్యనాగరసాధితమ్
సితామధుయుతం కుర్యాచ్చాతుర్థకనివారణమ్.

తా. అడ్డసరము, నెల్లివరుగు, కోలపొన్న, దేవదారు, ధనియాలు, శొంఠి, వీటిని సమభాగములుగదంచి కషాయముబెట్టి అందు తేనె శర్కర కలిపి పుచ్చుకొనిన చాతుర్థికజ్వరము హరించు.

శ్లో. కన్యాకర్తితసూత్రేణ హ్యపామార్గస్య మూలికా
రవౌ బద్ధ్వా జ్వరం హంతి తృతీయకచతుర్థకమ్.

తా. కన్యకచే దారము వడికించి అందైదుపోగులు బుచ్చుకొని పసపున దడిపి వుంచుకొని మరుసటిదిన ముదయమగు నాదివారంబున శుచిస్థలంబుననుండి యుత్తరేణి

చెట్టుయొద్దికేతెంచి దానిని షోడశోపచారంబులచే బూజించి వేరు తెగకుండునటుల బెరికి తెచ్చి సాంబ్రాణిధూపము వేసి జ్వరపీడితుని సందిటగట్టిన త్ర్యాహిక, చాతుర్థిక జ్వరములు నివృత్తియగు.

శ్లో. కాకజంఘాబలాశ్యామాభృంగరాజాపమార్గకాః
ఏకైకం పుష్యయోగేన బద్ధ్వా చాతుర్థికం హరేత్.

తా. * వెలుమసంధివేరు, చిట్టాముదపువేరు, నల్లసుగంధిపాలవేరు, గుంటగలగరవేరు, ఉత్తరేణివేరు, వీటిలో దేనినైననొకటిని పుష్యమీనక్షత్రమున దెచ్చి పసపుధారంబున నామూలికనుగట్టి రెట్టనుగట్టుకొనిన చాతుర్థికజ్వరము నశించు.

శ్లో. కృష్ణాంబరే దృఢం బద్ధో గుగ్గులూలూకపుచ్ఛజః
ధూపశ్చాతుర్థికం హన్యాత్తమస్సూర్య ఇవోదితః.

తా. గుగ్గిలమునైనను, గుడ్లగూబ తోకయీకలనైనను, నీలివస్త్రంబున దృఢముగ మూటగట్టి ధూపము వేసిన, సూర్యుని తేజంబుచే నంధకారము నశించుతెఱంగున చాతుర్థికజ్వరము నశించు.

శ్లో. శోకాత్క్రోధాత్తథాజీర్ణాత్సంతాపాద్బలహానితః
అంతకాలే చ మర్త్యానాం జాయంతే దారుణా జ్వరాః.

తా. శోకము, క్రోధము, అజీర్ణము, సంతాపము, బలహాని, వీటిచే నంత్యకాలమాసన్నంబగువానికి దారుణమగు జ్వరము జనించు.

శ్లో. సర్వజ్వరాపహం నీలీ మూలం రాత్రిర్జ్వరాపహమ్
దుగ్ధికామూలికాకర్ణే హంతి వేళాజ్వరం తథా.

తా. నీలివేరుపట్ట. పసపు, వీటిని నుదకముచే మర్దించి కర్ణములయందుంచుకొనిన సర్వజ్వరములు హరించు. మరియు చిటిపాలవేరును నుదకముచే మర్దించి చెవులయందుంచుకొనిన కాలముతప్పక వచ్చెడిజ్వరము నశించు.

శ్లో. ఆతంకముక్తే కృశతాశ్రయాణాం
విముక్తపథ్యానుచితక్రియాణామ్
అల్పోఽపి దోషో విషమం విదధ్యా
జ్జ్వరం వివృద్ధం ప్రతిపక్షరుద్ధమ్.

తా. జ్వరవిముక్తుడు దినేదినే కృశింపుచు పథ్యమును వర్జించి అనుచితమగు క్రియలంజేయుచుండిన వానికి గలిగియుండెడిదోషము నల్పంబైనను నది క్రమముగ ప్రకోపించి ప్రతిపక్షరుద్ధమగు విషమజ్వరమును జనింపంజేయును.

---

* చీకివెలగవేరు.



శ్లో. పటోలయష్టీ మధుతిక్తరోహిణీ
ఘనాభయాభిర్విషమజ్వరఘ్నః
కృతః కషాయస్త్రిఫలామృతావిషైః
పృథక్పృథగ్వా విషమజ్వరఘ్నః.

తా. చేదుపొట్ల, అతిమధురము, కటుకరోహిణి, తుంగగడ్డలు, కరక్కాయలు వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి పుచ్చుకొనినను, లేక, కరక్కాయలు తానికాయలు, నెల్లివరుగు, తిప్పతీగ, అడ్డసరము, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి పుచ్చుకొనినను, లేక యీరెంటిని యేకముజేసి కషాయముబెట్టి పుచ్చుకొనినను, సమస్తవిషమజ్వరములు హరించు. (ఇది పటోలాదికషాయము.)

శ్లో. ఆమలం చిత్రకం పథ్యా సైంధవం పిప్పలీకృతమ్
చూర్ణం తోయం గణో హ్యేషస్సర్వజ్వరవినాశనః
భేదీరుచికరశ్శ్లేష్మజేతా దీపనపాచనః.

తా. ఉశిరికవరుగు, చిత్రమూలము, కరక్కాయలు, సైంధవలవణము, పిప్పళ్లు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి ఉష్ణోదకముతో పుచ్చుకొనిన సుఖముగ విరేచనముగలిగి సమస్తజ్వరములు, శ్లేష్మము, ఇవి హరించుటయగాక నోటికి రుచియు, దీపనపాచనములను గలుగు.

శ్లో. పథ్యాస్థిరానాగరదేవదారుధాత్రీవృషైరుత్క్వథితః కషాయః
సితోపలామాక్షికసంప్రయుక్తశ్చాతుర్థికం హంత్యచిరేణ పీతః.

తా. కరక్కాయలు, కోలపొన్న, శొంఠి, దేవదారు, ఉశిరికవరుగు, అడ్డసరము, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి అందు ఖండశర్కర, తేనె కలిపి పుచ్చుకొనిన చాతుర్థికజ్వర మతిశీఘ్రంబుగ నశించు. (ఇది పథ్యాదికషాయము.)

శ్లో. త్రిభిరథపరివృద్ధం పంచభిస్సప్తభిర్వా
దశభిరథ వివృద్ధం పిప్పలీవర్ధమానమ్
ఇతి పిబతి పయో యస్తస్య న శ్వాసకాస
జ్వరజఠరగుదార్శోవాతరక్తాక్షయాస్స్యుః.

తా. విషమజ్వరపీడితులు ప్రథమదివసంబున ౩ పిప్పళ్లు ౨ దివసంబున ౫ పిప్పళ్ళు ౩ వ దివసంబున ౭ పిప్పళ్ళు ౪ వ దివసంబున ౧౦ పిప్పళ్ళు ఈప్రకారము పిప్పళ్లను ఆవుపాలలో వేసి ఆపాలకు సమముగ నీళ్లుబోసి నీరిగురుపర్యంతము కాచి పుచ్చుకొనిన శ్వాసకాసలు, విషమజ్వరము, ఉదరరోగము, మూలవ్యాధి, వాతము, రక్తముపడుట, క్షయములు, ఇవియన్నియు హరించు.

(ప్రకారాంతరమ్.)

శ్లో. క్షీరేణ పిప్పలీపంచకక్షీరాన్నం భుజ్యతేతు యః
దశాహం పంచవృద్ధిస్స్యాదపకర్షస్తథైవ చ.

తా. ఆవుపాలకు సమముగ నీరుబోసి అందు ప్రథమదివసంబున ౫ పిప్పళ్ళు. ౨ వ దివసంబున ౬. ౩ వ దివసంబున ౭. ౪ వ దినమున ౮. ౫ వ దినంబున ౯. ౬ వ దినంబున ౧౦ యీప్రకారముగ పిప్పళ్లను హెచ్చించి, ౭ వ దినంబున ౯. ౮ వ దినంబున ౮. ౯ వ దినంబున ౭. ౧౦ వ దినంబున ౬. ౧౧ వ దినంబున ౫. ఇటుల క్రమముగ పిప్పళ్లను తగ్గించి నీరిగురువరకు కాచి పుచ్చుకొనిన శ్వాసకాసలు, విషమజ్వరము, ఉదరరోగము, మూలవ్యాధి, వాతము, రక్తముపడుట, క్షయము, ఇవి యన్నియుు హరించు. ఇందుకుపథ్యము. పాలుఅన్నమును భుజింపవలయుు.

శ్లో. జ్వరేంజనం నిశాతైలకృష్ణామరిచసైంధవైః
వచాహారీతకీసర్పిర్ధూపస్స్యాద్విషమజ్వరే.

తా. పసపు, నువ్వులనూనె, పిప్పళ్లు, మిరియాలు, సైంధవలవణము, వీటిని సమభాగములుగ ఖల్వమున మర్దించి నేత్రములకు అంజనము వేసినను, లేక వస, కరక్కాయలు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి అందు కొంచముగ నెయ్యికలిపి ధూపము వేసినను, విషమజ్వరములు హరించు. (ఇవి అంజనధూపములు.)

శ్లో. అజాయాశ్చర్మరోమాణి వచాకుష్ఠం పలం కషా
నింబపత్రాణి మధు చ ధూపనం జ్వరనాశనమ్.

తా. వెండ్రుకల యుక్తమగు మేకచర్మము, వస, కోష్ఠు, గుగ్గిలము, వేపాకు, తేనె, వీటిని మర్దించి ధూపము వేసిన విషమజ్వరములు హరించు.

శ్లో. పలం కషానింబపత్రవచాకుష్ఠం హారీతకీ
సర్షపాస్సయవాస్సర్పిర్ధూపనం జ్వరనాశనమ్.

తా. గుగ్గిలము, వేపాకు, వస, కోష్ఠు, కరక్కాయలు, ఆవాలు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి అందు యవలపిండి నెయ్యికలిపి, ధూపము వేసిన విషమజ్వరములు హరించు. (ఇది అష్టాంగధూపము.)

శ్లో. సర్పత్వచా సర్షపహింగునింబ
పత్రాణ్యమీషాం సమచూర్ణధూపః
వినిగ్రహం రాక్షసడాకినీనాం
కరోతి రక్షాం విషమజ్వరస్య.

తా. పాముకుసుము, ఆవాలు, ఇంగువ, వేపాకు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి బ్రహ్మరక్షస్సు, శాకిని, డాకిని, ఇవి మొదలగుగ్రహములు సోకినవారికి ధూపము వేసిన నవి నివృత్తియగు. మరియుు విషమజ్వరములు నగా హరించు.



శ్లో. కుమారీమూలకర్షైకం పీత్వా కోలజలైర్వమేత్
విషమం తు జ్వరం హంతి వాతశ్లేష్మగదానపి.

తా. ఒకతులము కలబంద వేరును పిప్పలికషాయముచే నూరి పుచ్చుకొనిన వమనముకలిగి విషమజ్వరము, వాతరోగము, శ్లేష్మరోగము, ఇవియన్నియుు హరించు.

శ్లో. త్రిఫలారజనీయుగ్మం కంటకారీయుగం సటీ
త్రికటుగ్రంధికం మూర్వా గుడూచీధన్వయాసకః.
కటుకా పర్పటో ముస్తా త్రాయమాణా చ వాలకమ్
నింబపుష్కరమూలం చ మధుయష్టీ చ వత్సకః.
యవానీంద్రయవాభార్గీశిగ్రుబీజం సురాష్ట్రజా
వచాత్వక్పద్మకోశీరచందనాతివిషా బలా
శాలిపర్ణీ పృశ్నిపర్ణీ విడంగం తగరం తథా
చిత్రకం దేవకాష్ఠం చ చవ్యం ద్రాక్షాపటోలకమ్.
జీవకర్షభకౌ చైవ లవంగం వంశరోచనా
పుండరీకం చ కాకోలీ పత్రజం జాతిపత్రకమ్.
తాళీసపత్రం చ తథా సమాగాని చూర్ణయేత్
సర్వచూర్ణస్య చార్ధాంశం కైరాతం ప్రక్షిపేత్సుధీః.
ఏతత్సుదర్శనం నామ చూర్ణం, దోషత్రయాపహమ్
జ్వరాంశ్చ నిఖిలాన్ హంతి నాత్ర కార్యా విచారణా.
పృథగ్ద్వంద్వాగంతుకాంశ్చ ధాతుస్థాన్విషమజ్వరాన్
సన్నిపాతభవాంశ్చాపి పీనసానపి నాశయేత్.
శీతజ్వరైకాహికాదీన్మోహం తంద్రాం భ్రమం తృషామ్
శ్వాసకాసౌ చ పాండుం చ హృద్రోగం హంతి కామలామ్.
త్రికపృష్ఠకటీజానుపార్శ్వశూలనివారణమ్
శీతాంబునా పిబేద్ధీమాన్సర్వజ్వరనివృత్తయే.
సుదర్శనం యథా చక్రం దానవానాం వినాశనమ్
తద్వజ్జ్వరాణాం సర్వేషామిదం చూర్ణం ప్రణాశనమ్.

తా. కరక్కాయలు, తానికాయలు, నెల్లివరుగు, పసపు, మానిపసపు, నేలములక, పెద్దములక, కచ్చూరములు, శొంఠి, పిప్పలి, మిరియాలు, మోడి, చాగవేళ్లు, తిప్పతీగ, దురదగొండి, కటుకరోహిణి, పర్పాటకము, తుంగగడ్డలు, సూగుదోశ

విత్తులు, కానుగవేళ్లు, వేపవేరుపట్ట, తామరగడ్డలు, అతిమధురము, తెల్లకొడిశవిత్తులు, ఓమము, నల్లకొడిశవిత్తులు, గంటుభారంగి, మునగవిత్తులు, కావిరాళ్లు, వస, లవంగపట్ట, తామరతూండ్లు, వట్టివేళ్లు, శ్రీగంధము, అతివస, చిట్టాముదపువేరు, కోలపొన్న, కేలపొన్న, వాయువిళంగములు, గ్రంధితగరము, చిత్రమూలము, దేవదారు, చవ్యము, దీపద్రాక్ష, చేదుపొట్ల, * జీవకము, ఋషభకము, లవంగములు, వెదురుప్ప, తెల్లతామర, తేలుమణిచెట్టుసమూలము, లవంగపత్రి, జాపత్రి, తాళిశపత్రి, వీటిని సమభాగములుగ చూర్ణముచేసి యీ చూర్ణమునకు సగము నేలవేముచూర్ణము కలిపి శీతోదకముచే నొకతులము సేవించిన ప్రబలములగు వాతపిత్తశ్లేష్మజ్వరములు, వాతపిత్త, వాతశ్లేష్మ, పిత్తశ్లేష్మ, జ్వరములు, ఆగంతుకజ్వరములు, ధాతుగతజ్వరములు, విషమజ్వరములు, సన్నిపాతజ్వరములు, ఈ మొదలగు జ్వరములును, శీతజ్వరము, ఐకాహికాదిజ్వరములును, మోహము, తంద్ర, భ్రమ, పీనస, దాహము, శ్వాసము, కాసము, పాండువు, హృద్రోగము, కామిల, ఈ మొదలగు రోగంబులును. త్రికప్రదేశము (అనగా వెన్నెముకకు క్రిందిభాగము,) వీపు, నడుము, మోకాళ్లు, పార్శ్వములు, ఈ మొదలగువాటియందుగలిగెడి శూలలును, నిస్సంశయముగ హరించు. (ఇది సుదర్శనచూర్ణమనంబరగు.) శ్రీమన్నారాయణుని సుదర్శనము దానవులను సంహరించు భంగిని సుదర్శనచూర్ణము సర్వరోగంబులను హతంబుగావించు.

శ్లో. జీర్ణే జ్వరే కఫే క్షీణే క్షీరం స్యాదమృతోపమమ్
తదేవ తరుణే పీతం విషవద్ధంతి మానవమ్.

తా. జ్వరము జీర్ణంబై కఫము క్షీణించియుండునపుడు పాలుత్రాగిన నది అమృతపానతుల్యంబై సర్వరోగంబులను నశింపజేయు. ఐనను తరుణజ్వరమున పాలుత్రాగిన నది విషమించి రోగిని మృత్యువుపాలు గావించుగాన తరుణజ్వరమున పాలుత్రాగం జనదు.

శ్లో. అన్నకాంక్షా శిరఃకండూ క్షువథుర్గాత్రలాఘవమ్
ప్రస్వేదో ముఖపాకశ్చ జ్వరముక్తస్య లక్షణమ్.

తా. అన్నముమీద నిచ్ఛగలుగుట, శిరస్సు నవగొనుట, తుమ్ములుగలుగుట, శరీరము లఘువుగనుండుట, చమటపట్టుట, నోరు రుచిగనుండుట. ఈలక్షణంబులుగలిగిన జ్వరము నివృత్తిఐనదని ఎరుంగవలయు.

శ్లో. వ్యాయామం చ వ్యవాయం చ స్నానం చంక్రమణం తథా
జ్వరముక్తో న సేవేత యావన్న బలవాన్భవేత్.

---

* జీవకము, ఋషభకము, ఇవిదొరుకుట దుర్లభముగాన వీటికిబదులుగ, నేలగుమ్ముడు, వేగిసపట్ట, పెద్దపిల్లిపీచర, ఇరుగుడు, అడ్డసరము, వీటిలో వేటిఐనను రెంటిని గ్రహింపవలెను.



తా. కఠినమగు పనులొనర్చుట, మైథునంబొనర్చుట, స్నానముజేయుట, తిరుగులాడుట, వీటిని జ్వరవిముక్తుడు శరీరంబునకు చక్కగ బలమువచ్చువరకు వర్జింపవలయు. ఇక జ్వరాదులకు రసచికిత్సలం జెప్పెద.

## జ్వరములకు రసచికిత్సలు.

శ్లో. రంగం హింగులజేపాలం వృద్ధ్యాదంత్యంబుమర్దయేత్
దినార్ధేన జ్వరం హంతి తమస్సూర్యోదయో యథా.

తా. శుద్ధిజేసిన పాదరసము ౧ భాగము, శుద్ధిజేసిన గంధకము ౨ భాగములు. శుద్ధిజేసిన ఇంగిలీకము ౩ భాగములు. * శుద్ధిజేసిన నేపాళములు ౪ భాగములు, వీటిని భాగముల ప్రకారము ఖల్వమున నునిచి నేపాళములం దప్ప అన్నిటిని కలియనూరి పిదప నందు నేపాళములం జేర్చి నేలదంతివేరు కషాయముచే ఒకదినము చక్కగ ఖల్వమున మర్దించి రెండు గురిగింజలంతేసి మాత్రలుజేసి నీడనయెండించి అందొకమాత్రను సేవించిన, సూర్యుని తేజంబుచే నంధకారము నశించుచందంబున, రెండుఝాములలో జ్వరము హరించు. (ఇది బాలార్కరసము.)

శ్లో. శుద్ధసూతం విషం గంధం ధూర్తబీజం త్రిభిస్సమమ్
చతుర్ణాం ద్విగుణం వ్యోషం చూర్ణం గుంజాద్వయం హితమ్.
పక్వజంబీరకద్రావైర్యుక్తార్ద్రస్య ద్రవైర్యుతమ్
మహాజ్వరాంకుశో నామ జ్వరాణామంతకో భవేత్.
ఐకాహికం ద్వ్యాహికం వా త్ర్యాహికం వా చతుర్థకమ్
విషమం వా త్రిదోషోత్థం నాశయేద్యామమాత్రతః.

తా. శుద్ధిజేసిన పాదరసము ౧ భాగము. శుద్ధిచేసిన వసనాభి. ౧ భాగము. శుద్ధిచేసిన గంధకము ౧ భాగము. ఈ ప్రకారము వీటినన్నిటిని ఖల్వమున కలియనూరి అందు శుద్ధిచేసిన నల్లఉమ్మెత్తవిత్తులను మూడుభాగములు చూర్ణముజేసి కలిపి పిమ్మట శొంఠి ౪ భాగములు. పిప్పళ్లు ౪ భాగములు. మిరియాలు ౪ భాగములు. ఇత్తెఱంగున వీటినన్నిటిని చూర్ణముజేసి పైచూర్ణంబుతో కలిపి నిమ్మపండ్లరసముచే ౧ దినము. అల్లపురసముచే ౧ దినము. ఖల్వమున చక్కగమర్దించి, రెండు గురిగింజలంత ప్రమాణము మాత్రలుజేసి నీడనయెండించి అందొకమాత్రను అనుపానవిశేషముచే బుచ్చుకొనిన నొకఝాములో ఐకాహిక, ద్వ్యాహిక, త్ర్యాహిక, చాతుర్థికజ్వరములు, విషమజ్వరములు, సన్నిపాతజ్వరములు, ఇవియన్నియు నశించు. (ఇది మహాజ్వరాంకుశము.)

---

* నేపాళంబులను శుద్ధిజేయుటకు ముందు అందలి అగరులనుతీసి పారవేయవలయు.

శ్లో. సూతశుల్బత్రివృతాబలితిక్తాదంతిబీజచపలావిషతిందుః
పథ్యయాసహవిచూర్ణ్యసమాంశం హేమవారిసహితందినమేకం.
వల్లయుగ్మఘుటికార్ద్రికవారానాశయేదభినవజ్వరమాశు
విశ్వతాపహరణోత్ర చ పథ్యం ముద్గమాషసహితం దినమేకమ్.

తా. శుద్ధిచేసిన పాదరసము, తామ్రభస్మము, శుద్ధిచేసిన తెల్లతెగడ, శుద్ధిచేసిన గంధకము, కటుకరోహిణి, శుద్ధిచేసిన నేపాళములు, పిప్పళ్ళు, శుద్ధిచేసిన విషముష్టిగింజలు, కరక్కాయలు, వీటిని సమభాగములుగ నుంచుకొని ప్రథమంబున రసగంధకములను ఖల్వములో నునిచి కలియనూరి పైదినుసులలో చూర్ణము జేయందగినవాటిని చూర్ణముజేసి అన్నిటిని నొక్కటిగజేర్చి నల్లఉమ్మెత్తాకురసముచే నొకదినము మర్దించి అణుగురిగింజలకు మించకుండునటుల మాత్రలుజేసి నీడనయెండించి యందొకమాత్రను అల్లపురసముతో బుచ్చుకొనిన నవీనముగ వచ్చినజ్వరములు, నొకదినములో హరించు. (ఇది విశ్వతాపహరణరసము.) ఇందుకు పథ్యము:—పెసరకట్టు అన్నమును భుజింపవలయును.

శ్లో. సూతం గంధం లోహకిట్టం విమర్ద్యం
సర్వైస్తుల్యం వత్సనాభం వియుంజాత్
ఆర్ద్రం భృంగం బీజపూరం జయంతీ
నిర్గుండీకాభృంగరాజద్రవైశ్చ.
యుక్త్వా వైద్యో భావయిత్వా విధేయా
శాణార్ధార్ధం సన్నిపాతస్య నూనమ్
శీతల వాతం నిర్మలం స్నానపానం
పథ్యం దుగ్ధం శర్కరాభిర్యుతం చ.

తా. శుద్ధిచేసిన పాదరసము, శుద్ధిచేసిన గంధకము, మండూరము, ఇవి సమభాగములుగ నుంచుకొని వీటికి సమముగ శుద్ధిచేసినవసనాభిని చూర్ణముగావించి అందుజేర్చి అల్లపురసంబున నొకదినంబును, లవంగపట్టకషాయముచే నొకదినంబును, మాదీఫలరసంబున నొకదినంబును, భంగిఆకురసంబున నొకదినంబును, గుంటగలగరరసంబున నొకదినంబును, వావిలిఆకురసంబున నొకదినంబును, ఇత్తెఱంగున ప్రతిరసముచేతను, ఖల్వంబున చక్కగ మర్దించి * మాష ప్రమాణములంత మాత్రలుజేసి నీడన రొండించి అందొకమాత్రను యనుపానవిశేషంబుచే బుచ్చుకొని ప్రత్యహము శీతోదకస్నానపానంబు లొనర్చుచు, శీతలపదార్థములను భుజింపుచుండిన సన్నిపా

* మాషప్రమాణము అనగా నాలుగుగురిగింజలయెత్తు.



తంబులు నశించు. ఇందుకు పథ్యము:—పాలు, అన్నము, చక్కెర, వీటిని భక్షింపవలయును. (ఇది సన్నిపాత భైరవరసము.)

శ్లో. హింగుళం చ విషం వ్యోషం టంకణం మాగధీ శిఫా
సంచూర్ణ్య భావయేత్త్రేధా సురసార్ద్రిక హేమభిః.
రసస్త్రిభువనే కీర్తిర్గుంజైకార్ద్రిద్రవేణ వై
సర్వజ్వరవినాశం చ సన్నిపాతాంస్త్రయోదశ.

తా. శుద్ధిజేసిన ఇంగిలీకము, శుద్ధిజేసిన వసనాభి, శొంఠి, పిప్పలి, మిరియాలు, శుద్ధిజేసిన వెలిగారము, మోడి వీటిని సమభాగములుగ చూర్ణముజేసి తులసిఆకురసంబుచే నొకదినంబును, అల్లపురసముచే నొకదినంబును, శుద్ధిజేసిన నల్లఉమ్మెత్తాకురసముచే నొకదినంబును, ఈరీతిన ప్రతిరసముచేతను ఖల్వమున చక్కగ మర్దించి గురిగింజలంతేసి మాత్రలుజేసి నీడన యెండించి యందొకమాత్రను దేహతత్వము నెఱింగి అల్లపురసముచే బుచ్చుకొనిన సమస్తజ్వరములును, పదమూడు సన్నిపాతంబులును నశించును. (ఇది త్రిభువనకీర్తిరసము.)

శ్లో. రసం గంధకం టంకణం వత్సనాభం
సమం మర్దయేద్ధూర్తబీజేన యామమ్
తతో వత్సనాగేన క్వాథైశ్చ బీజై
రసైర్భావయేచ్చ త్రివారం త్రివారమ్
కటుత్ర్యాదికం పంచవారం తతస్స్యా
దయం సూతరాజో మృతప్రాణదాయీ.

తా. శుద్ధిజేసిన పాదరసము, శుద్ధిజేసిన గంధకము, శుద్ధిజేసిన వెలిగారము, శుద్ధిజేసిన వసనాభి, వీటిని సమభాగములుగ చూర్ణముగావించి శుద్ధిజేసిన నల్లఉమ్మెత్తవిత్తులకషాయముచే నొకఝాము ఖల్వమున చక్కగ మర్దించి ఇదేరీతిన రెండు మారులుగావించి, పిదప శుద్ధిజేసిన వసనాభికషాయముచే నాప్రకారమే మూడుమారులు వదలక భావనజేసి, పిదప తంగేడువిత్తులకషాయముచే నదేప్రకారము, మూడుపర్యాయములు భావనచేసి, శొంఠి, పిప్పలి, మిరియాలు, వీటికషాయంబుచే మరల నైదుమారులు భావనజేసి గురిగింజలంతేసి మాత్రలుజేయవలయును. (ఇది సూతరాజమృతప్రాణదాయీరసము.)

శ్లో. జ్వరే సన్నిపాతే జ్వరే నూతనే వా
మహాశ్లేష్మరోగే చ గుంజాప్రమాణమ్
పయఃపాయసం దధ్యాధికం తక్రభక్తం
సితా వా నవీనజ్వరే చార్ద్రనీరైః.

జ్వరే చాతిసారే ఘనద్రావయుక్తే
గ్రహణ్యర్శసాం క్షౌద్రసం సీతయా వా
జ్వరే వాయునామ్నిత్రికట్వగ్నిపీతం
ప్రకంపే చ బాహ్వాకయేకాంగవాతే.
అపస్మారమున్మాదవాతం నిహంతి
ప్రయుక్తో సితా పఞ్చభిర్ధాత్రబీజైః.

తా. ఈసూతరాజమృతప్రాణదాయీరసంబునం దొకమాత్రను అల్లపురసముచే బుచ్చుకొని పాలఅన్నంబునైనను, పెరుగన్నంబునైనను, మజ్జిగన్నంబునైనను, శర్కరాన్నంబునైనను, పాయసంబునైనను, భక్షించిన నది సన్నిపాతజ్వరము, నవీన జ్వరము, ప్రబలమైన శ్లేష్మరోగము, వీటిని హరించు. మరియు నీసూతరాజమృత ప్రాణదాయీరసమాత్రను జ్వరాతిసారములకు తుంగగడ్డల కషాయములోను, గ్రహణీరోగము, మూలవ్యాధి, వీటికి తేనె, శర్కరతోను, వాతజ్వరమునకు శొంఠి, పిప్పలి, మిరియాలు, వీటికషాయముతోను, కంపవాయువు, బాహువాయువు, ఏకాంగవాయువు, వీటికి చిత్రమూలకషాయముతోను సేవింపవలయు. మరియు దీనిని శుద్ధిజేసిన ఉమ్మెత్త విత్తులలో నైదును చూర్ణముగావించి యందు చక్కెరకలిపి సేవించిన అపస్మారవాయువు, ఉన్మాదవాయువు, ఇవి నశించు. (ఇది సూతరాజమృతప్రాణదాయీరస గుణములు.)

## విషమజ్వరములకు రసచికిత్సలు.

శ్లో. తాళకఖర్పరమూషకయుగ్మం కాంచనపల్లవజరసేన ఘృష్టమ్.
మర్దయమర్దయ పునరపి మర్దయ శీతభయాదినివారణఘుటికా.

తా. శుద్ధిచేసిన హరితాళకము, శుద్ధిచేసిన కఫరి, శుద్ధచేసిన గౌరీపాషాణము, శుద్ధిచేసిన ఉల్లిపాషాణము, వీటిని నల్లఉమ్మెత్తాకురసముచే ఖల్వమున పలుమారుమర్దించి గురిగింజలంతేసి మాత్రలుజేసి నీడనయెండించి యందొకమాత్రను దేహతత్వమునెరింగి పుచ్చుకొనిన చలియుక్తమగు శీతజ్వరము నశించు. దేహంబున నుష్ణమును గలుగు. (ఇది శీతాగ్నిరసము.)

శ్లో. పిష్ట్వా తాళకమేకభాగమమలం శంబూకచూర్ణం తుపే
ద్దత్వా చాథ నవాంశతోఽపి చ శిఖిగ్రీవం పునః పేషయేత్
కౌమారీరసమర్దితో గజపుటే పాకం చ శీతం తతో
గృహ్ణీయాదథ గుంజయా జర్వహరః ఖండేన సంయోజయేత్.
ఏకద్విత్రిభవం చతుర్థకమయం వేళాజ్వరం నాశయేత్
శీతారిశ్చ పలాయతే జ్వర ఇమం భానుం యథా శర్వరీ.



తా. శుద్ధిచేసిన హరితాళము ౧ భాగము. శంఖభస్మము ౧ భాగము. శుద్ధిజేసిన మైలతుత్తము ౮. భాగములు. ఇత్తీరున వీటినెల్ల చూర్ణముగావించి అందు కలబందరసముబోసి ఖల్వమున నూరి బిళ్ళలుచేసి మూకుడుయందునిచి దానిని మరియొక మూకుడుచే గప్పి చేలమన్ను లేపనముజేసి యెండనయెండించి గజపుటము వేసి స్వాంగశీతలమున గ్రహించి ఆభస్మమును గురిగింజయెత్తు ఖండశర్కరతో సేవించిన, ఏకాహిక, ద్వ్యాహిక, త్ర్యాహిక, చాతుర్థికజ్వరములు, సూర్యుని గాంచినమాత్రంబున రాత్రి బరుగిడుభంగి, యీయౌషధంబును గాంచినమాత్రంబున నవి నశించు. (ఇది శీతారి రసము.)

శ్లో. తుత్థం టంకణతాళకం బలివిషం స్యాత్ఖర్పరం పారద
స్సర్వం ఖల్వతలే విమర్ద్య మతిమాం స్తత్కారవల్లీరసైః
గుంజైకప్రమితా చ శర్కరయుతా సాజీరకేణాథవా
హ్యేకద్విత్రిచతుర్థశీతహరణశ్శీతాంకుశో నామతః.

తా. మైలతుత్తము, వెలిగారము, హరితాళకము, గంధకము, వసనాభి, కఫరి, పాదరసము, వీటినన్నిటిని శుద్ధిజేసి కాకరచెట్టుసమూలమును దంచి రసముతీసి అందారసమునుబోసి యొకదినము ఖల్వమున మర్దించి గురిగింజలంతేసి మాత్రలుజేసి అందొక మాత్రను చక్కెరతోనైనను, జీలకఱ్ఱతోనయినను, సేవించిన ఏకాహిక, ద్వ్యాహిక, త్ర్యాహిక, చాతుర్థికాది శీతజ్వరములు హరించు. (ఇది శీతాంకుశరసము.)

శ్లో. చలదలతరుసేవా హోమమంత్రౌ త్రినేత్ర
ద్విజగురుజనపూజా విష్ణునామ్నాం సహస్రమ్
మణిధృతిరపి దానాన్యాశిషస్తాపసానాం
సకలమిదమరిష్టం యుక్తమష్టజ్వరాణామ్.

ఇతి శ్రీమద్వైద్యశిఖామణినా గోపాలదాసేన విరచితే
చికిత్సాసారే సర్వజ్వరలక్షణోపచారస్సమాప్తః.

తా. అశ్వత్థప్రదక్షిణము, నవగ్రహహోమము, పంచాక్షర్యాది మంత్రజపములు, రుద్రాభిషేకము, బ్రాహ్మణపూజ, గురుపూజ, విష్ణుసహస్రనామపఠనము, మణిధారణము, దానము, ఇవి యొనర్చుట, తాపసులచే నాశీర్వాదంబులు బొందుట, ఇవి సర్వజ్వరములను, సకలారిష్టంబులను, నశింపంజేయు. మఱియు "శ్లో. సముద్రస్యోత్తరేతీరే ద్వివిదో నామవానరః తస్య స్మరణమాత్రేణ జ్వరోయాతి దిగంతరమ్". అను నీమంత్రమును ౧౦౮ పర్యాయములు జపించిన సర్వజ్వరములు హరించు.

ఇట్లు వైద్యశిఖామణియగు గోపాలదాసునిచే రచియింపబడిన చికిత్సాసారంబున సర్వజ్వరలక్షణోపచారములు ముగిసెను.

## అతిసారలక్షణము.

శ్లో. అరుణం ఫేనిలం రూక్షమల్పమల్పం ముహుర్ముహుః
సకృదామం సరుక్ఛబ్దం మారుతేనాతిసార్యతే.
పిత్తాత్పీతం హారితం లోహితం వా
తృష్ణామూర్ఛాదాహపాకజ్వరార్తః
శుక్లం సాంద్రశ్లేష్మణా శ్లేష్మజుష్టం
విస్రం శీతం హృష్టరోమా మనుష్యః.
వారాహ స్నేహమాంసాంబుసదృశం సర్వరూపిణమ్
కృచ్ఛ్రసాధ్యమతీసారం విద్యాద్దోషత్రయోద్భవమ్.
జ్వరాతిసారయోరుక్తం నిదానం చ పృథక్పృథక్
తస్మాజ్జ్వరాతిసారస్య తేన నాత్రోదితం పునః.

తా. వాతాతీసారంబున మలము గొల్లగను, నురుగునురుగుగను, ఉష్ణంబుగను, స్వల్పంబుగను, పదేపదే ఆమమిశ్రమమై బద్ధగించి అపానవాయువులోగూడి శబ్దంబుతోడ బయలువెడలు. మఱియు ఆసనమున వ్యథయును గలిగియుండు. పిత్తాతీసారంబున మలము పచ్చగనయినను, పసరువర్ణంబుగనయినను, ఎరుపుగనయినను నుండుటయగాక దాహము, మూర్ఛ, జ్వరము, ఇవియును గలిగి గుదస్థానంబున వ్రణంబును గలిగియుండు. కఫాతీసారంబున మలము తెలుపువర్ణముగను, దట్టముగను, కఫమిశ్రముగను నుండుటయగాక అపక్వమాంస గంధముగలదయి స్రవించుచుండు. మఱియు చలి, గగుర్పాటు, ఇవియును గలిగియుండు. త్రిదోషయుక్తమగు నతిసారంబున మలము పందికొవ్వువలెనయినను, మాంసరసమువలెనయినను, ఇంక ననేకవర్ణంబులుగనయినను నుండు. ఇట్టి త్రిదోషయుక్తమగు నతిసారము కష్టసాధ్యంబని యెఱుంగవలయు. జ్వరములు అతిసారములు, వీటికి వెవ్వేరుగ నిదానంబులను వివరించియుండుటచే నిచట జ్వరాతిసారంబునకు ప్రత్యేకముగ లక్షణములు చెప్పంబడవయ్యె.

శ్లో. ఆమపక్వక్రియాం హిత్వా నాతిసారే క్రియా హితా
అతస్సర్వాతిసారేషు జ్ఞేయం పక్వామలక్షణమ్.

తా. సమస్త అతిసారంబులకును ప్రథమంబున ఆమమును పక్వముజేసికొని పిదప అతిసారంబునకు చికిత్సంజేయవలయు.

శ్లో. ఆమే విలంఘనం శస్తమాదౌ పాచనమేవ చ
కార్యం వానశనస్యాంతే సద్రవం లఘుభోజనమ్.

తా. అతిసారంబులకు ప్రథమంబున లంఘనము వేసిన ఆమము పక్వంబగు. లంఘనానంతరమున ద్రవముగ నుండెడి అన్నమును లఘువుగ భుజింపవలయు.

---



## అతిసారచికిత్స.

శ్లో. నాగరాతివిషా ముస్తా భూనింబామృతవత్సకైః
సర్వజ్వరహరః క్వాథస్సర్వాతీసారనాశనః.

తా. శొంఠి, అతివస, తుంగగడ్డలు, నేలవేము, తిప్పతీగ, కొడిశవిత్తులు, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి పుచ్చుకొనిన సమస్త అతిసారములు, జ్వరము, ఇవి నశించు. (ఇది నాగరాదికషాయము.)

శ్లో. ధాన్యాబ్దవాలకం బిల్వం నాగరైస్సాధితం జలమ్
దద్యాత్పాచనకం పూర్వమామాతీసారనాశనమ్.

తా. దనియాలు, తుంగగడ్డలు, కురువేరు, మారేడుపండు, శొంఠి, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి పుచ్చుకొనిన ఆమము పక్వంబై ఆమాతిసారము హరించు. (ఇది ధాన్యాదికషాయము.)

శ్లో. నాగరం దేవకాష్ఠం చ ధాన్యకం బృహతీద్వయమ్
దద్యాత్పాచనకం పూర్వం జ్వరితాయ జ్వరాపహమ్.

తా. శొంఠి, దేవదారు, దనియాలు, వాకుడు, పెద్దములక, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి పుచ్చుకొనిన ఆమము పక్వమగుటయగాక జ్వరాతిసారము నగా హరించు. (ఇది ధాన్యపంచకకషాయము.)

శ్లో. సవత్సకస్సాతివిషస్సబిల్వస్సోదీచ్యముస్తశ్చ కృతః కషాయః
సామే సశూలే చ సశోణితే చ చిరప్రవృత్తేఽపి హితోఽతిసారే.

తా. కొడిశవిత్తులు, అతివస, మారేడుపండు, కురువేరు, తుంగగడ్డలు, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి పుచ్చుకొనిన ఆమము, శూల, రక్తము, వీటితోగూడి బహుకాలముండి బాధింపుచుండెడి అతిసారము నశించు.

శ్లో. స్నానాభ్యంగావగాహం చ గురుస్నిగ్ధాదిభోజనమ్
వ్యాయామమగ్నిసంతాపమతిసారీ వివర్జయేత్.

తా. స్నానము, అభ్యంజనము, వీటిని గావించుట, ఉదకంబున గ్రుంకుట, గురుపదార్థములను స్నిగ్ధపదార్థములను భక్షించుట, సంచరించుట, నిప్పుళగ కాచుకొనుట, ఈ మొదలగువాటిని అతిసారరోగులు వర్జింపవలయు.

శ్లో. సదేవదారుస్సవిషస్సపాఠ
స్సజంతుశత్రుస్సఘనస్సతిక్తః
సవత్సకః క్వాథ ఉదాహృతోఽసౌ
శ్లేష్మాతిసారాంబుధికుంభజన్మా.

తా. దేవదారు, అతివస, అగరుశొంఠి, లేక విషబొద్ది, వాయువిళంగములు, తుంగగడ్డలు, మిరియాలు, కొడిశవిత్తులు, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి పుచ్చుకొనిన "అగస్త్యమహాముని సముద్రమును నాపోశనం బొనర్చినటుల" శోభాతిసారంబులు హరించు. (ఇది దేవదార్వాది కషాయము.)

శ్లో. విడంగాతివిషా ముస్తా దారుపాఠాకలింగకమ్
మరీచేన సమాయుక్తం శోభాతీసారనాశనమ్.

తా. వాయువిళంగములు, అతివస, తుంగగడ్డలు, దేవదారు, అగరుశొంఠి, లేక విషబొద్ది, కొడిశవిత్తులు, మిరియాలు, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి పుచ్చుకొనిన నతిశీఘ్రంబుగ శోభాతిసారములు హరించు. (ఇది విడంగాది కషాయము.)

శ్లో. న తు సంగ్రహణం దద్యాత్పూర్వమామాతిసారిణామ్
దోషాహ్యాదా వర్ధమానో జనయత్యామయాన్బహూన్.

తా. ఆమాతిసారమునందు ప్రథమంబున ఆమమును బంధించెడి ఔషధమును బ్రయోగింపం జనదు. అటులంజేసిన ఆమము బద్ధగించి యా ఆమదోషము దేహంబున వ్యాపించి యనేక రోగంబులను గలుగంజేయు.

శ్లో. డింభకస్థవిరో వాపి వాతపిత్తాత్మకశ్చ యః
క్షీణధాతుబలార్తశ్చ బహుదోషోఽతివిశ్రుతః.
ఆమోఽపి స్తంభనీయస్స్యాత్పాచనాన్మరణం భవేత్.

తా. బాలురు, వృద్ధులు, వీరికిని, వాత, పిత్త, దోషంబులు గలవారికిని, ధాతుక్షయము, దౌర్బల్యము, ఇవి గలిగియుండుటచే ననేకదోషంబులు జనించియుండుగాన ఆమమును బంధింపవలయు. ఇట్లు జేయక పాచనంబునకిచ్చిన మరణంబు గలుగు.

శ్లో. కిరాతాబ్దామృతావిశ్వచందనోశీరవత్సకైః
శోభాతిసారశమనం విశేషాజ్జ్వరనాశనమ్.

తా. నేలవేము, తుంగగడ్డలు, తిప్పతీగ, శొంఠి, శ్రీగంధపుచక్క, వట్టివేరు, కొడిశవిత్తులు, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి పుచ్చుకొనిన, శోభాతిసారములు, జ్వరములు, ఇవి నశించు.

శ్లో. సల్లకీ బదరీ జంబూ ప్రియాళ్వామ్రార్జునత్వచః
పీతాః క్షీరేణ మధ్వాఢ్యాః పృథక్శోణితనాశనః.

తా. అందుగపట్ట, రేగుపట్ట, నేరేడుపట్ట, చారపట్ట, మామిడిపట్ట, మద్దిపట్ట, వీటిలో దేనినైనను, ఆవుపాలతో దంచి రసముదీసి యందు తేనెవేసి త్రాగిన రక్తాతిసారము హరించు.

శ్లో. జంబ్వామ్రామలకీనాం చ పల్లవైశ్చ రసో జయేత్
మధ్వాజ్యక్షీరసంయుక్తో రక్తాతీసారనాశనః.



తా. నేరేడు, మామిడి, ఉసిరి, వీటిచిగుళ్లను చక్కగ దంచి రసముదీసి అందు తేనె, నెయ్యి, పాలు, ఇవి కలిపి పుచ్చుకొనిన రక్తాతిసారము హరించు.

శ్లో. పుటపాకేన విపచేత్సుపక్వం దాడిమీఫలమ్
తద్రసో మధుసంయుక్తస్సర్వాతీసారనాశనః.

తా. చక్కగపండిన దాడిమఫలంబునైనను, దాని చిగుళ్ళనైనను దెచ్చి వస్త్రంబున మూటగట్టి దానిపై పేడ, మన్ను, ఇవిపొదిగి కుమ్ములోవేసి యుడికించి పిదప యందలి రసమును పిండుకొని అందు తేనెకలిపి త్రాగిన అతిసారంబులన్నియు నశించు.

శ్లో. చూర్ణం కించిద్ఘృతాభ్యక్తం శుంఠ్యా ఏరండజైర్దళైః
వేష్టితం పుటపాకేన విపచేన్మందవహ్నినా.
తత ఉద్ధృత్య తచ్చూర్ణం గ్రాహ్యం ప్రాతస్సితాసమమ్
తేన యాంతి శమం పీడా ఆమాతీసారసంభవాః.

తా. శొంఠిచూర్ణములో కొంచము నెయ్యిబోసి ముద్దజేసి యాముద్దను ఆముదపాకులో మూటగట్టి దానిని పేడ, మన్ను, వీటిలో పొదిగి కుమ్ములోవేసి యుడికించి యందుండిదీసి దానికిసమముగ శర్కర కలిపి ప్రాతఃకాలంబున రేగుబండంత సేవించిన ఆమాతీసారములు నశించు.

శ్లో. గుడేన ఖాదయేద్బిల్వం రక్తాతీసారనాశనమ్
ఆమశూలవిబంధఘ్నం కుక్షిరోగవినాశనమ్.

తా. మారేడుపండు గుజ్జుకుసమముగ బెల్లమును జేర్చి ప్రాతస్సాయంకాలములయందు ఉశిరికాయంత సేవించిన రక్తాతిసారము, ఆమశూల, అవష్టంభనము, కుక్షిరోగము, ఇవియన్నియు హరించు.

శ్లో. పీత్వా శతావరీకల్కం పయసా క్షీరభుగ్జయేత్
రక్తాతిసారం పీత్వా వా తథా సిద్ధం ఘృతం నరః.

తా. చల్లపిల్లిగడ్డలను దంచి రసముదీసి దీనికి సమముగ పాలుబోసి చక్కగ కాచి త్రాగినను, చల్లపిల్లిగడ్డలరసములో నెయ్యిబోసి రసముచుంచువరకు కాచి యందొకతులము సేవించినను, రక్తాతిసారము హరించు. యిందుకుపథ్యము:— పాలుఅన్నము భుజింపవలయు.

శ్లో. గుదదాహే ప్రపాకే వా పటోలమధుకాంబునా
సేకాదికం ప్రశంసంతి ఛాగేన పయసాథవా.

తా. చేదుపొట్ల, అతిమధురము, వీటిని సమభాగములుగ కషాయముబెట్టి అందు వస్త్రంబును తడిపి కించిదుష్ణముగ ఆసనమున ఒత్తడము వేయుటయగాక నాకషాయంబుచే ఆసనమును కడుగుచుండినను, లేక, మేకపాలును కాగబెట్టి యదేప్రకారము

ఆసనమున కాపడమువేసినను, అతిసారముచే జనించిన గుదవ్రణము, గుదసంతాపము ఇవి మానును.

శ్లో. కల్కస్తిలానాం కృష్ణానాం శర్కరాద్యస్థభాగికః
అజేన పయసా పీతస్సద్యోర క్తం నియచ్ఛతి.

తా. నల్లనువ్వులపిండి ౧ భాగము, శర్కర ౧౼ భాగము, మేకపాలు నాలుగు భాగములు, ఈతీరున వీటినన్నిటిని నొకటిగజేర్చి కాచి త్రాగిన రక్తాతిసారము హరించు.

శ్లో. మధ్యం లిహ్యాత్కపిత్థస్య సవ్యోషక్షౌద్రశర్కరమ్
కట్ఫలం మధుయుక్తం వా ముచ్యతే జఠరామయాత్.

తా. వెలగపండుగుజ్జు, శొంఠి, పిప్పళ్లు, మిరియాలు, తేనె, చక్కెర, వీటిని సమముగ మర్దించి ముద్దజేసి తగుమాత్రము భక్షించినను, లేక కాయిఫలమును చూర్ణముజేసి యందు తేనెకలిపి సేవించినను, జఠరాగ్ని సంబంధమగు ఆమదోషము హరించు.

శ్లో. కర్షోన్మితా తుగాక్షీరీ చాతుర్జాతం త్రికర్షకమ్
యవానీ ధాన్యకా జాజీ గ్రంథి వ్యోషపలాంశకమ్.
ఫలాని దాడిమాన్యష్టౌ సితాయాశ్చైకతః కృతమ్
గుణైః కపిత్థాష్టకవచ్చూర్ణయేద్దాడిమాష్టకమ్.

తా. వెదురుప్పు ౧ తులము, లవంగపట్ట ౻ తులము, లవంగపత్రి ౻ తులము, ఏలకులు ౻ తులము, నాగకేసరములు ౻ తులము, ఓమము, దనియాలు, జీలకర్ర, మోడి, శొంఠి, పిప్పళ్లు, మిరియాలు, ఇవియన్నియు ౮ తులములు, దాడింబపండు ౮ తులములు, ఈతీరున వీటినన్నిటిని చూర్ణముజేసి యందు ౩౨ తులముల చక్కెర కలిపి ఆచూర్ణంబున నొకతులము సేవించిన జఠరాగ్నిసంబంధమగు ఆమదోషము హరించు. (ఇది దాడిమాష్టకచూర్ణము.)

## అతిసారములకు రసచికిత్సలు.

శ్లో. హింగులం వత్సనాభం చ టంకణం మరిచం కణాః
మర్దయేదహిఫేనేన రసో హ్యానందభైరవః.

తా. శుద్ధిచేసిన ఇంగిలీకము, శుద్ధిచేసిన వసనాభి, శుద్ధిచేసిన వెలిగారము, మిరియాలు, పిప్పళ్లు, శుద్ధిచేసిన నల్లమందు, వీటిని సమభాగములుగ ఖల్వమున నునిచి కొడిశపట్టకషాయముచే చక్కగ మర్దించి గురిగింజలంతప్రమాణముగ మాత్రలుజేసి నీడన యెండించవలయును. (ఇది ఆనందభైరవరసము.)



శ్లో. గుంజైకం వా ద్విగుంజం వా బలం జ్ఞాత్వా ప్రయోజయేత్
మధునా లేహయేచ్చాను కుటజస్య త్వచాపలమ్
చూర్ణితం కర్షమాత్రం తు త్రిదోషోత్థాతిసారజిత్.

తా. మఱియు నీ ఆనందభైరవమాత్రలలో ౧ లేక ౨ మాత్రలను దేహబలంబును, వ్యాధిబలంబును, నెఱింగి తేనెతోనైనను, ఒకపలము కొడిశపట్టచూర్ణములోనైనను, సేవించిన త్రిదోషములచే జనించిన అతిసారములు హరించు. (ఇది ఆనందభైరవ రసగుణములు.)

(ప్రకారాంతరమ్)

శ్లో. జాతీఫలం సైంధవహింగుళం చ వరాటశుంఠీవిషహేమబీజమ్
సపిప్పలీకం వటికాంచ కుర్యాద్గుంజాప్రమాణా జఠరామయఘ్నీ.
నిహంతి వాతం కఫశూలమాత్ర
మామాతిసారం గ్రహణీవికారమ్
నిహంతి శుష్కం సితయా సమేతం
రసోయమానంద ఇతి ప్రదిష్టః.

తా. జాజికాయ, సైంధవలవణము, శుద్ధిచేసిన ఇంగిలీకము, గవ్వలభస్మము, శొంఠి, శుద్ధిచేసిన వసనాభి, శుద్ధిచేసిన నల్లఉమ్మెత్తవిత్తులు, పిప్పళ్లు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి అందు కొడిశచక్కకషాయముబోసి ఖల్వమున చక్కగ మర్దించి గురిగింజలంతప్రమాణము మాత్రలుజేసి నీడనయెండించి అందొకమాత్రను శర్కరతో భక్షించిన వాతము, శ్లేష్మము, శూలము, ఆమాతిసారము, సంగ్రహణి, యోనిరోగము, ఇవియన్నియు నశించు. (ఇది ఆనందభైరవరసము.)

శ్లో. జాతీఫలం సర్పఫేనం టంకం గంధకజీరకే
ఏతాని సమభాగాని బాలదాడిమజీరకైః
పేషయేత్తేన కల్కేన పూరయేద్దాడిమీఫలమ్
అంగారే తచ్చ గోధూమచూర్ణేనాలేపితం పచేత్
అతిసారస్తంభనం స్యాత్పరం దీపనపాచనమ్.

తా. జాజికాయ, శుద్ధిచేసిన నల్లమందు, శుద్ధిజేసిన వెలిగారము, శుద్ధిచేసిన గంధకము, జీలకఱ్ఱ, వీటిని సమభాగములుగ చూర్ణముచేసి దీనికి సమముగ లేత దాడిమవిత్తులనువైచి ఖల్వమున మర్దించి ముద్దగజేసి యీముద్దను విత్తులుదీసిన దాడిమచిప్పలయం దునిచి దానిపై గోధుమపిండిపొదిగి కుమ్ములోవేసి యుడికించి సాంగశీతలమున దీసి దానిని ఖల్వమునం దునిచి చక్కగమర్దించి రెండుగురిగింజలంతేసి మాత్రలుజేసి నీడనయెండించి దేహతత్త్వము నెఱింగి యందొకమాత్రనైనను, రెండుమాత్రలనైనను,

భక్షించిన సర్వాతిసారంబులు హరించి దీపనపాచనములును గలుగు. (ఇది అతిసార స్తంభనమాత్రలు)

శ్లో. అతిసారే జ్వరే చైవ రక్తపిత్తే దృగామయే
ఆదౌ న ప్రతికుర్వీత వ్యాధిర్వేగో హి దుస్తరః.

తా. అతిసారము, జ్వరము, రక్తపిత్తము, నేత్రరోగము, ఇవి జనించునపుడు చికిత్స చేయం జనదు. ఇటులచేసిన నవి ప్రబలంబులై చికిత్సచేయుటకు కష్టసాధ్యంబులగు.

ఇట్లు అతిసారరోగచికిత్స ముగిసెను.

సంగ్రహణీరోగలక్షణము.

శ్లో. అతీసారే నివృత్తేఽపి మందాగ్నేరహితాశినః
భూయస్సందూషితో వహ్నిర్గ్రహణీమభిదూషయేత్.
పక్వం వాసరుజం పూతిముహుర్బద్ధం ముహుర్ద్రవమ్
గ్రహణీరోగమాహుస్తమాయుర్వేదవిదో జనాః.

తా. అతిసారము నివృత్తియైనను అగ్నిమాంద్యము గలిగియుండుగాన నపథ్యము గావింపం జనదు. అటుల నపథ్యంబొనర్చిన, మరియు నత్యంతముగ అగ్ని నశించు. ఇటుల అగ్ని నశించుటవలన పిత్తధరయనునాడికి వైకల్యము గలిగినందుచే ఆ నాడిగతదోషము భక్షించినఅన్నమును పక్వాపక్వముగను, దుర్గంధముగను, నొకసమయంబున మలమును బద్ధగింపుచును, మరియొకసమయమున ద్రవముగను, మరల బద్ధగింపుచును, ద్రవముగను, ఆసనమున వ్యథను గలుగంజేయుచును. ఆమముతోడ బైటవెడలంజేయును. దీనినే ఆయుర్వేదవేత్తలు గ్రహణీరోగ మనియెదరు.

శ్లో. ఏకైకశస్సర్వశశ్చ దోషైరత్యర్థముచ్ఛ్రితైః
సా దుష్టా బహుశో ముక్తమామమేవ విముంచతి.

తా. మరియు నాపిత్తధర యనునాడి ఒక్కొక ధాతుదోషంబులతోనైనను, అనేకధాతువుల దోషంబులతోనైనను, గలిసి మిగులవృద్ధిజెంది ధాతుప్రదుష్టమై పలుమారు ఆమమునే బైటవెడలింపం జేయుచుండు.

శ్లో. గ్రహణీమాశ్రితం దోషమజీర్ణవదుపాచరేత్
అతిసారోక్తవిధినా తస్యామామం విపాచయేత్.

తా. గ్రహణిని నాశ్రయించుకొనియుండెడి దోషంబులకు అజీర్ణమునకు జెప్పబోయ్యెడి చికిత్సలనే జేయవలయు. సంగ్రహణులయందు ఆమమును పక్వముజేయుటకై అతిసారమునకు జెప్పియుండెడి చికిత్సలనే జేయవలయు.



సంగ్రహణీచికిత్స.

శ్లో. శుంఠీ సముస్తాతివిషాంగుడూచీంపిబేజ్జలేనక్వథితాంసమాంశామ్
మందానలత్వే సతతామవాతే సామానుబంధే గ్రహణీగదే చ.

తా. శొంఠి, తుంగగడ్డలు, అతివస, తిప్పతీగ, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి పుచ్చుకొనిన మందాగ్ని, ఆమవాతము, ఆమయుక్తమగు సంగ్రహణీ, ఇవియన్నియు హరించు.

శ్లో. చూర్ణం చవ్యకచిత్రశ్రీవిశ్వభేషజనిర్మితమ్
తక్రేణ సహితం హంతి గ్రహణీం దుఃఖకారిణీమ్.

తా. చవ్యము, చిత్రమూలము, మారేడుపండు, శొంఠి, వీటిని సమభాగములుగ చూర్ణముచేసి మజ్జిగలో కలిపి పుచ్చుకొనిన ఘోరంబగు సంగ్రహణి సగా నశించు.

శ్లో. రుచకాగ్నిమరీచానాం చూర్ణం తక్రేణ సేవితమ్
గ్రహణ్యుదరగుల్మార్శః క్షున్మాంద్యప్లీహనాశనమ్.

తా. పాదరలవణము, చిత్రమూలము, మిరియాలు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి మజ్జిగలో కలిపిపుచ్చుకొనిన, సంగ్రహణి, ఉదరరోగము, గుల్మము, మూలవ్యాధి, అగ్నిమాంద్యము, ప్లీహము, ఇవియన్నియు హరించు.

శ్లో. ఆమ్రమామ్రాతకం జంబూత్వక్కషాయే పచేద్భిషక్
యవాగూం శాలిభిర్యుక్తాం భుక్త్వా తాం గ్రహణీం జయేత్.

తా. మామిడిపట్ట, అంబాళపుపట్ట, నేరేడుపట్ట, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి యందు వరిబియ్యమువైచి గంజిగ కాచి త్రాగిన సంగ్రహణి నివృత్తియగు.

శ్లో. భల్లాతకం త్రికటుకం త్రిఫలాలవణత్రయమ్
అంతర్ధూమం ద్విపలికం గోపురీషాగ్నినా దహేత్.
సక్షౌరస్సర్పిషా పీతో భోజ్యోవాప్యవచూర్ణితః
హృద్రోగపాండుగ్రహణిగుల్మోదావర్తశూలనుత్.

తా. జీడిగింజలు, శొంఠి, పిప్పలి, మిరియాలు, కరక్కాయలు, తానికాయలు, ఉసిరికపరుగు, సైంధవలవణము, పాదరలవణము, ఉప్పు, ఇవి దినుసుకు నొక్కొకతులము, కరుధూపము, ౨ పలములు ఇటుల వీటినెల్ల చూర్ణముచేసి యొకపాత్రయందునిచి దానిమూతిని మరియొకపెంకుతో మూసి చీలమన్ను లేపనముజేసి అడవిపిడకలతో పుటముజేసి సాంగశీతలమున నాక్షారమును గ్రహించి ఖల్వమున నూరి దేహతత్త్వముకొలదిని ఒకవరహాయెత్తుతు మించకుండునటుల సేవించినను, లేక నాక్షారంబును

మాత్రము సేవించినను, హృద్రోగము, పాండురోగము, గ్రహణి, గుల్మము, ఉదావర్తము, శూల, ఇవియన్నియు నశించు. (ఇది భల్లాతకాదిక్షారము.)

శ్లో. చిత్రకం పిప్పలీమూలం ద్వౌ క్షారౌ లవణాని చ
వ్యోషం హింగ్వజమోదం చ చవ్యమేకత్ర చూర్ణయేత్.
గుటికా మాతులుంగస్య దాడిమస్య రసేన వా
కృతా విపాచయత్యామం దీపయత్యాశు చానలమ్.

తా. చిత్రమూలము, మోడి, సద్యక్షారము, యవక్షారము, ఉప్పు, సైంధవలవణము, పాదరిలవణము, శొంఠి, పిప్పలి, మిరియాలు, ఇంగువ, ఓమము, చవ్యము, వీటిని సమభాగములుగ చూర్ణముచేసి యందు మాదీఫలపురసంబునైనను, దాడిమఫలరసంబునైనను బోసి నూరి రేగుపండంతమాత్రలుజేసి నీడనయెండించి దేహతత్త్వము నెఱింగి భక్షించిన ఆమము పక్వంబై మందాగ్నిహరించి దీపనము గలుగు.

శ్లో. గ్రహణీదోషిణాం తక్రం దీపనం గ్రాహి లాఘువాత్
పథ్యం మధురపాకిత్వాన్న చ పిత్తప్రకోపనమ్.

తా. ఆవుమజ్జిగ పథ్యకారిగను, లఘువుగను, మధురముగను, నుండుటయగాక పిత్తమును శాంతిచేయందగినదిగ నుండుటచే గ్రహణీరోగులు నాయావుమజ్జిగను గ్రహింపవలయు. ఇటులజేసిన గ్రహణులు నశించి అగ్నిదీపనము గలుగు.

శ్లో. బిడం యవానీం విష్టంభే పిబేదుష్ణేన వారిణా.

తా. బిడాలవణము, ఓమము, వీటిని సమభాగములుగ చూర్ణముచేసి ఉష్ణోదకములో పుచ్చుకొనిన మలబద్ధకము నశించు.

## సంగ్రహణులకు రసచికిత్సలు.

శ్లో. హింగులం మరిచం గంధం పిప్పలీటంకణం విషమ్
కనకస్య చ బీజాని సమాంశం విజయాద్రవైః.
మర్దయేద్యామమాత్రం తు చణమాత్రా వటీకృతా
భక్షణాద్గ్రహణీం హంతి రసః కనకసుందరః
అగ్నిమాంద్యం జ్వరం తీవ్రమతిసారం చ నాశయేత్
దధ్యన్నం దాపయేత్పథ్యం తథా తక్రోదనం చరేత్.

తా. శుద్ధిచేసిన ఇంగిలీకము, మిరియాలు, శుద్ధిచేసిన గంధకము, పిప్పళ్లు, శుద్ధిచేసిన వెలిగారము, శుద్ధిచేసిన వసనాభి, శుద్ధిజేసిన నల్లఉమ్మెత్తవిత్తులు, వీటిని సమభాగములుగ చూర్ణముచేసి భంగికల్లీలకషాయముబోసి ౧ ఝాము ఖల్వమున మర్దించి శనగలంత మాత్రలుచేసి నీడనయెండించి అందొకమాత్రను భక్షించిన, సంగ్రహణి, అగ్నిమాంద్యము, తాపజ్వరము, అతిసారము, ఇవియన్నియుం హరించు. ఇందుకుపథ్యము:— పెరుగన్నంబునైనను, మజ్జిగన్నంబునైనను భక్షింపవలయు. (ఇది కనకసుందరరసము.)



శ్లో. శుద్ధైః కర్కవరాటకైర్గణనయా భల్లాతకాం స్తత్సమా
న్ప్రోతాన్బబ్బులకంటకైర్లఘుపుటే పక్వాంఘ్రిభాగం రసమ్
లేలీనేన సమం విచూర్ణ్య విజయాసప్తానుభావ్యం శివ
ప్రోక్తోఽయం గ్రహణీకవాటకరసస్త్రివల్లకస్త్వౌషధః.

తా. * శుద్ధిజేయబడిన తెల్లగవ్వలకైనను శంఖములకైనను సమముగ జీడిగింజలనుంచుకొని ఆజీడిగింజలను తుమ్మముండ్లచే తూట్లుపొడిచి యాగవ్వలను జీడిగింజలను తగుమైన కుండయందునిచి దానిమూతిని పెంకుచేగప్పి చీలమన్ను లేపనముజేసి లఘుపుటమువేసిన నవి భస్మంబగు. ఈభస్మంబును గ్రహించి ఇందుకు నాలవభాగము శుద్ధిచేసిన పాదరసము, శుద్ధిజేసిన గంధకము, వీటినిగలిపి అన్నిటిని నొకటిగజేర్చి నూరి పిదప భంగికల్లీలకషాయముతో ౭ పర్యాయములు భావనజేసి ఖల్వమున మర్దించి మూడువల్లముల యెత్తు మాత్రలుజేసి నీడయెండించి అందొకమాత్రను దేహతత్వమునెఱింగి పుచ్చుకొనిన అగ్నిమాంద్యము, తాపజ్వరము, అతిసారము, సంగ్రహణి, ఇవియన్నియు హరించునని జగద్రక్షకుడగు పరమేశ్వరుడు వచించె. ఇందుకు పథ్యము:— పెరుగన్నమునైనను, మజ్జిగన్నమునైనను, భక్షింపవలయు (ఇది సంగ్రహణీకవాటకరసము.)

ఇట్లు సంగ్రహణీచికిత్స ముగిసెను.

## † అర్శోరోగలక్షణము.

శ్లో. పృథగ్దోషైస్సమస్తైశ్చ శోణితాత్సహజాని చ
అర్శాంసి షట్ప్రకారాణి విద్యాద్గుదవళిత్రయే.
ప్రసారిణీ స్ర్జనీ చ గ్రాహికేతి వళీత్రయమ్.

తా. వాత, పిత్త, శ్లేష్మముల ప్రత్యేకదోషములచేనైనను, లేక, ద్వంద్వము, సన్నిపాతము, రక్తము, వీటిదోషంబులచేనైనను, అర్శోరోగము జనించు. మరియు నీఅర్శస్సు ప్రసారిణి, గ్రహణి, సర్జనీ అనుమూడువళులతో గూడియుండు.

శ్లో. గుదాదాపం కురాస్తేస్యుస్సహజాశ్శోణితోద్భవాః.

* గవ్వలను నొకదినము నిమ్మపండ్లరసములో నానబెట్టిన నవి శుద్ధియగు.
† ఇదియ మూలవ్యాధి.

తా. మరియు నీరక్తార్శస్సున గుదస్థానంబునందలి వళులయందు మొలకలు గలిగి రక్తము స్రవింపుచుండు.

శ్లో. ఏకదోషా బాహ్యవళిస్సాదా్య వన్యా స్త్వసాధ్యకాః.

తా. ఒకదోషముచే జనించి బైటవెడలిన వళులుగలిగియుండెడి అర్శోరోగము సాధ్యంబనియు, తక్కినవి యసాధ్యంబులనియు నెఱుంగవలయు.

శ్లో. అర్శోతిసారగ్రహణీవికారాః ప్రాయేణచాన్యోన్యనిదానభూతాః
శాంతేఽనలే సంతి వసంతి దీప్తే రక్షేదత స్తేషు విశేషతోఽగ్నిమ్.

తా. మూలవ్యాధి, అతిసారము, సంగ్రహణి, ఇవి యొకటినినొకటి ఆశ్రయించి జనించు. ఇవి జనించుట కగ్నిమాంద్యము కారణముగాన అగ్నిని ప్రజ్వలింపంజేసెడి యౌషధంబుల సేవింపవలయు.

శ్లో. దుర్నామ్నాం సాధనోపాయశ్చతుర్ధా పరికీర్తితాః
భేషజక్షారశస్త్రాగ్నిసాధ్యత్వం యాప్యముచ్యతే.

తా. ఈ అర్శోరోగంబునకు ఔషధము, క్షారము, శస్త్రము, అగ్ని, యీ నాలుగువిధంబులగు నుపచారంబులం జేయవలయు. ఇటులజేసిన నవి శమించు.

---

## అర్శోరోగచికిత్స.

శ్లో. తిలభల్లాతకం పథ్యా గుడశ్చేతి సమాంశకమ్
దుర్నామశ్వాసకాసఘ్నం ప్లీహపాండుజ్వరాపహమ్.

తా. నువ్వులు, * శుద్ధిజేసిన జీడిగింజలు, కరక్కాయలు, బెల్లము వీటిని సమభాగములుగ నూరి రేగుగింజంతమాత్రలు జేసి అందొకమాత్రను దేహతత్వమునెఱింగి భక్షించిన మూలవ్యాధి, శ్వాస, కాసలు, ప్లీహము, పాండు, జ్వరము, ఇవియన్నియు హరించు.

శ్లో. కృష్ణాశిరీషబీజార్కక్షీరైస్సామరసైంధవైః
హరిద్రాబుకువిడ్గుంజాగోమూత్రైః పిప్పలీయుతైః
ఏతల్లేపత్రయం యోజ్యం శీఘ్రమర్శోవినాశనమ్.

తా. జటామాంసి, దిరిశనపువిత్తులు, దుప్పికొమ్ము, సైంధవలవణము, పసపు, జింకపెంటికలు, గురిగింజలు, పిప్పళ్ళు, వీటిని సమభాగములుగ చూర్ణముచేసి అందు

* జీడిగింజలను గోమయముతో నుడికించిన నవి శుద్ధియగు. ఇటుల శుద్ధిచేసిన జీడిగింజలనే సర్వత్ర గ్రహింపవలయు,



జిల్లేడుపాలు, గోమూత్రముబోసి చక్కగనూరి మూడుపూటలును ఆసనమునందలి మొలకలకు లేపనముజేసిన మూలవ్యాధులు శీఘ్రంబుగ నశించు.

శ్లో. గుడేనశుంఠీమథవోపకుల్యాం పథ్యాంతృతీయామథ దాడిమంవా
ఆమేష్వజీర్ణేషు గుదామయేషు వర్చోవిబంధేషు చ నిత్యమిష్టమ్.

శొంఠి, పిప్పళ్లు, కరక్కాయలు, దాడిమకాయబెరడు, వీటిలో దేనినైనను బెల్లముతో నూరి భక్షించిన ఆమము, అజీర్ణము, మూలవ్యాధి, మలబద్ధము, ఇవి యన్నియు హరించు.

శ్లో. జ్యోతిష్కబీజకల్కేన లేపో రక్తార్శసాం హితః.

తా. మాల్కంగణివిత్తులను దంచి అందుదకముబోసి నూరి ఉడికించి హితోష్ణముగ రక్తముస్రవించెడి మూలవ్యాధులకు లేపనముజేసిన నవి నివృత్తియగు.

శ్లో. స్నుహ్యగ్నిలాంగలీదంతిమూలైర్లేపోర్శసాం హితః.

తా. చిత్రమూలము, చన్నచర్లగడ్డ, నేలదంతివేరు, వీటిని సమభాగములుగ దంచి చూర్ణముజేసి దీనిని బొంతజెముడుపాలచే నూరి ఆసనమునందలి మొలకలకు లేపనముజేసిన నవి నశించు.

శ్లో. సౌరణం కందమాదాయ పుటపాకేన పాచయేత్
సతైలగుడసంయుక్తో రసశ్చార్శోవికారనుత్.

తా. అడవికందగడ్డలకు తడివస్త్రమునుచుట్టి దానిపై పేడ, మన్ను, వీటిని లేపనముజేసి కుమ్ములోవేసి యుడికించి అందావాలతైలము, బెల్లము, వీటిని సమభాగములుగజేర్చి నూరి భక్షించిన మూలవ్యాధులు నశించు.

శ్లో. అపామార్గస్య బీజానాం కల్కస్తండులవారిణా
పీతో రక్తార్శసాం నాశం కురుతే నాస్తి సంశయః.

తా. ఉత్తరేణివిత్తులను బియ్యపుకడుగుతో నూరి యుడికించి పుచ్చుకొనిన రక్తముస్రవించెడి మూలవ్యాధులు నిస్సంశయముగ హరించు.

శ్లో. విదారీమూలకల్కేన తిలకల్కం తు యోజయేత్
మధుక్షీరయుతః కుర్యాద్రక్తాతీసారనాశనమ్.

తా. నేలగుమ్ముడుగడ్డ, నువ్వులు, వీటిని సమభాగములుగ దంచి ఆవుపాలతో నూరి కల్కముజేసి అందు తేనెకలిపి పుచ్చుకొనిన రక్తముస్రవించెడి మూలవ్యాధులు నతిశీఘ్రంబుగ నశించు.

శ్లో. నవనీతతిలైః కల్కో జేతా రక్తార్శసాం మతః
నవనీతసితానాగకేసరైశ్చాపి తద్విధః.

తా. నువ్వులతోసమముగ ఆవువెన్నను జేర్చి నూరి భక్షించినను, లేక నాగకేసర ములను చూర్ణముచేసి దానికిసమముగ ఆవువెన్న, చకక్కెర వీటినిజేర్చినూరి భక్షించి నను, రక్తముస్రవించెడి మూలవ్యాధులు నశించు.

శ్లో. అర్కక్షీరం పయస్సుధాకాండం కటుకాలాబుపల్లవాః
కరంజో బస్తమూత్రేణ లేపనం శ్రేష్ఠమర్శసామ్.

తా. బొంతజెముడుచిగుళ్లు, కటుకరోహిణి, చేదుసొరచిగుళ్లు, కానుగవిత్తులు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి అందు జిల్లేడుపాలు, మేకమూత్రముబోసి నూరి యుడికించి సుఖోష్ణముగ మూలవ్యాధులకు లేపనముజేసిన నవి హరించు. ఇది మూల వ్యాధులకు మిగుల శ్రేష్ఠమైనలేపనముగ నున్నయది.

శ్లో. కటుతుంబ్యాస్తథా దంత్యాశ్శకృచ్ఛ కుక్కుటస్య చ
ముసల్యాశ్వాశ్వగంధాయాశ్చిత్రకస్య చ యత్నతః.
మూలైస్తుల్యైః కృతం చూర్ణమర్కక్షీరేణ భావయేత్
స్నుహీక్షీరేణ మతిమాన్వారిణా పరిపేషయేత్.
వస్త్రవర్త్యా గుదం తేన సమాలిప్య సమంతతః
గుదే వినిక్షిపేద్యత్నాత్ప్రాతస్సాయం చ బుద్ధిమాన్.
వేదనా చ భవేత్తీవ్రా వహ్నినా స్వేదయేద్ధ్రువమ్
నోపశామ్యేత్తదా తేన తదా చైవోష్ణవారిణి.
వినివేశ్య గుదం తిష్ఠేద్వేదనాశమకారణాత్
అద్యాద్వృష్యమథాన్నం చ శిశిరం జలమాపిబేత్
గుదజానాం వినాశార్థం సప్తాహం తు సమాహితః
విధిమేవం ప్రకుర్వీత గతశంకస్తు మానవః.

తా. చేదుసొరచిగుళ్లు, దంతివేరుపట్ట, యెండిన చల్లపిల్లిగడ్డలు, పెన్నేరుగడ్డ, చిత్రమూలము, వీటిని సమభాగములుగ చూర్ణముగావించి అందు కోడిమలముజేసి కలిపి దానిని జిల్లేడుపాలు, బొంతజెముడుపాలు, వీటిచే వెవ్వేరుగ భావనజేసి యం దుదకముబోసి నూరి వస్త్రమునకు పట్టించి ప్రాతస్సాయంకాలములయందు ఆసనమునకు లేపనముచేసినను, లేక దానిని వస్త్రమునకు పట్టించి వత్తిజేసి ఆసనంబున నెక్కించినను, మూలవ్యాధులు నశించు. ఇటులచేయుటచే నధికముగ మంటలుగలిగెనేని ఉష్ణోదకము మొదలగువాటిచే కాపడమువేయవలయు. ఇటులచేసియు నామంట శాంతిబొందకుండె నేని మనుజుడు కూర్చుండందగినపాత్రయం దుష్ణోదకముబోసి యందొకింతసేపు రోగిని కూర్చుండబెట్టిన నది శమించు, పిదప మధురము, మృదువు, మనస్సునకింపుగలపదార్థ



అన్నమును భుజించి, శీతోదకంబును త్రాగవలయు. ఇటుల భయరహితుడై సప్తదినం బులు గావించిన మూలవ్యాధులు నశించు.

శ్లో. గుంజాసూరణకూశ్మాండబీజైర్వర్తిస్తథాగుణా.

తా. గురిగింజలు, అడవికంద, బూడిదెగుమ్మడు, లేక, దీనివిత్తులు, వీటిని సమ భాగములుగ దంచి అం దుదకముబోసి నూరి వస్త్రమునకు పట్టించి ఆసనమునకు వేసినను లేక, వత్తిజేసి ఆసనమునం దెక్కించినను మూలవ్యాధులు హరించు.

శ్లో. నృకేశాస్సర్పనిర్మోకం వృషదంశస్య వర్మ చ
అర్కమూలం శమీపత్ర మర్శేభ్యో ధూపనం హితమ్.

తా. మనుష్యులవెంట్రుకలు, పాముకూసము, పిల్లిచర్మము, జిల్లేడువేరు, జమ్మి ఆకు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి ఆసనమునకు పొగవేసిన మూలవ్యాధికి హితంబుగనుండు.

శ్లో. స్నుహీక్షీరనిశాలేపస్తథా గోమూత్రకల్కితః
యోజితో గోభవక్షీరవహ్నిమూలావచూర్ణితమ్.
పిబంస్తదేవ తేనైవ భుంజానో గుదజాంకురాన్.

తా. పసపుపొడియందు బొంతజెముడుపాలు, గోమూత్రముబోసి నూరి లేప నముజేసినను, లేక, చిత్రమూలమును చూర్ణముజేసి యం దావుపాలుబోసి కలిపి త్రాగి నను, మూలవ్యాధియందలి మొలకలు హరించు. ఇందుకు పథ్యము.— పాలన్నము భుజింపవలయును.

శ్లో. పిబేదహరహస్తక్రం నిరన్నో వాతనాశతః
సప్తాహం వా దశాహం వా మాసార్థం మాసమేవ వా.
బలకాలవికారజ్ఞో భిషక్తక్రం ప్రయోజయేత్.

తా. వాతార్శస్సుగలవాని దేహతత్త్వము నెఱింగి ప్రాణంబులకు విరోధము గలుగకుండునటుల ౭, ౧౦, ౧౫, ౩౦, యీదినములలో రోగి తాళుపర్యంతము అన్నమునుబెట్టక మజ్జిగను త్రాగించుచుండిన వాతార్శస్సు హరించు.

శ్లో. గౌరీపాషాణకర్షైకం స్నుహీకాండే వినిక్షిపేత్
పాచయేత్పుటపాకేన తత ఉద్ధృత్య యత్నతః.
రేవాచినీచకుష్ఠం చ కల్కీకృత్య త్రయం సమమ్
లేపయేత్తేన అర్శాంసి నివార్యంతే న సంశయః.

తా. బొంతజెముడుదుంపను తొఱ్ఱజేసి యందొకతులము గౌరీపాషాణము నునిచి, దానికి చీలమన్నులేపనముజేసి పుటపాకముచే పక్వముజేసి సాంగశీతలమున

గ్రహించి దానికిసమముగ రేవలచిన్ని, శొంఠి, వీటినిజేర్చి బొంతజెముడుపాలచే చక్కగనూరి మూలవ్యాధిమొలకలకు లేపనముజేసిన నవి నిస్సంశయముగ హరించు.

శ్లో. దగ్ధ్వా న్యగ్రోధపత్రాణి తైలేన సహ లేపయేత్.

తా. పండు మఱ్ఱిఆకులనుగాల్చి భస్మముజేసి దానిని నువ్వులనూనెతోనైనను లేక ఆవనూనెతోనైనను మూలవ్యాధులకు లేపనముజేసిన నవి నశించు.

శ్లో. త్వచవిచిత్రకమూలస్య పిష్ట్వా కుంభే ప్రలేపయేత్
తక్రం వా దధి వా తత్ర జాతమర్శోహరం పిబేత్.

తా. చిత్రమూలపువేరుపట్టను నుదకముచే ఖల్వమున చక్కగ మర్దించి యొక కొత్తకుండలో దళముగ లేపనముజేసి యందు పెరుగునైనను మజ్జిగనైనను బోసియుంచి పిదప దానిని మూలవ్యాధిపీడితులు పానంబొనర్చిన నామూలవ్యాధులు హరించు.

శ్లో. గుడవ్యోషవరా వేల్లతిలారుష్కరచిత్రకైః
అర్శాంసి హంతి గుటికా త్వగ్వికారం చ శీలితా.

తా. శొంఠి, పిప్పలి, మిరియాలు, కరక్కాయలు, తానికాయలు, శెల్లివరుగు, వాయువిళంగములు, నువ్వులు, జీడిగింజలు, చిత్రమూలము, వీటిని సమభాగములుగ దంచి చూర్ణముజేసి యందు బెల్లమువేసి నూరి రేగుపండంతమాత్రలుజేసి భక్షించిన మూలవ్యాధులు, చర్మమునందు వ్యాపించియుండెడిరోగములు ఇవియన్నియు నివృత్తియగు.

శ్లో. అరళుత్వగ్వహ్నిసురేంద్రయవా
న్బిరిబిల్వససైంధవశుంఠియుతాత్
మథితేన పిబేద్యది సప్తదిన
మర్శాంసి హంతి సమూలమరమ్.

తా. పెద్దమానిపట్ట, లవంగపట్ట, చిత్రమూలము, కొడిశవిత్తులు, కానుగవిత్తులు, సైంధవలవణము, శొంఠి, వీటిని సమభాగములుగ చూర్ణముగావించి యందు చిక్కని మజ్జిగవైచి కలిపి ౨ దినములు పుచ్చుకొనిన మొలకలూడిపడి మూలవ్యాధులు హరించు.

శ్లో. కాంచనీ విషపాషాణం యవక్షారం చ హింగులమ్
జలే పిష్ట్వా న్యసేద్గుహ్యే ఏవం కుర్యాద్దినత్రయమ్.
క్షీరస్వేదం తథా కుర్యాత్క్షీరాహారీ ఘృతౌదనమ్
అర్శోరోగం నిహంత్యాశు సిద్ధం రోగ ఉదాహృతః.

తా. పసపు, పాషాణము, యవక్షారము, ఇంగిలీకము, వీటిని సమభాగములుగ నుంచుకొని అం దుదకముబోసి నూరి మాత్రలుచేసి యెండించి గంధముదీసి గుడ్డకు పట్టించి వత్తిచేసి మూడుదినములు గుదస్థానంబున కెక్కించుచుండుటయగాక పాలను



గాచి అందు వస్త్రము తడిపి ఆసనంబునకు యొత్తడమువేయుచుండిన మూలవ్యాధులు హరించు. ఇందుకు పథ్యము:—ఘృతౌన్నమును, పాలన్నమును, భక్షింపవలయు. ఇది మిగుల శ్రేష్ఠంబైన క్రియ.

## మూలరోగహరమంత్రము.

వాక్యాని. కంకరకురంకరంతరకంతాఖిలమిళితిరీయేరాజకరంతరఆరక్తా సారక్తాజోజాణే ఇహమంత్రాతాకేవసనహోయఅరిసాజాణావృక్షు ప్రకటనకరితాంకేస ప్తకపిలామరకిహత్యా. ఏతన్మంత్రం ప్రత్యహం జపం కుర్యాత్.

తా. ఈమంత్రంబును ప్రత్యహము జపించిన మూలవ్యాధులు హరించు.

శ్లో. సమూలపత్రకోకంబం బలద్వయమితం శుభమ్
భల్లాతఫలమజ్జాయామరీచస్య బలం పలమ్.
ఏతచ్చూర్ణీకృతం సూక్ష్మం భక్షయేత్కర్షసమ్మితమ్
అర్శాంకురాన్నిహంత్యాశు సబాహ్యాభ్యంతరానపి.

తా. కోకంబము, దానివేరు, దానిఆకులు, దానికాయలు, దానిపువ్వులు, దానిపట్ట, ఇవియన్నియు రెండుపలములు. జీడిపప్పు ౧ పలము, మిరియాలు ౧ పలము, వీటినన్నిటిని చూర్ణముచేసి ౧ తులముపుచ్చుకొనిన ఆసనమునను వెలపటను నుండెడి మూలవ్యాధిమొలకలు నశించు.

## మూలవ్యాధికి రసచికిత్స.

శ్లో. సంమర్ద్య ప్రతిసారితా బహురసౌ తాభ్యాం చ గంధం సమం
లాంగల్యాసితసూరణేన చ పృథక్కత్వాచ తావత్పచేత్
గోళం జ్వాలముపైతి భాండనిహితం చుల్యామథస్త్వౌషధై
స్సస్యాదర్శకుఠారకో స్రపవనార్శఃపూర్వకవ్యాధిషు.

తా. శుద్ధిచేసిన నేపాళములు ౧ తులము, శుద్ధిచేసిన పాదరసము ౧ తులము, శుద్ధిచేసిన గంధకము ౨ తులములు, (ఇత్తెఱంగున) వీటిని ఖల్వమున మర్దించి పిదప చన్న చర్లగడ్డ ౧ తులము, తెల్లఆడవికంద ౧ తులము, వీటికి వస్త్రంబునుచుట్టి చీలమన్ను లేపనముచేసి కుమ్ములోవైచి దురద హరించువరకు పక్వముగ నుడికించి దీనిని పైసేపాళాదులతో చేర్చి మర్దించి నెయ్యిలేపనముచేసిన భాండమునందునిచి అం దావిరివచ్చువరకు వండి ౨ గురిగింజలంతేసి మాత్రలుచేసి నీడనయెండించి అం దొకమాత్రను బుచ్చుకొనిన రక్తవాతము, మూలవ్యాధి, ఇవి మొదలగురోగంబులు హరించు. (ఇది అర్శకుఠారము.)

శ్లో. వేగావరోధస్త్రీప్రసృష్టయానాన్యుత్కటుకాశనమ్
యథా స్వం దోషలం చాన్నమర్శసాం పరివర్జయేత్.

తా. మలమూత్రములు బంధించుట, స్త్రీసంగమం బొనర్చుట, అశ్వాదుల నెక్కుట, కారముగనుండెడి పదార్థములను, దోషమును జనింపంజేసెడి అన్నములను భుజించుట, వీటిని మూలవ్యాధిగలవారు వర్జింపవలయు.

ఇట్లు అర్శోరోగచికిత్స ముగిసెను.

## అజీర్ణలక్షణము.

శ్లో. అత్యంబుపానాద్విషమాశనాద్వా
సంధారణాత్స్వప్నవిపర్యయాచ్చ
కాలేపి సాత్మ్యం లఘు చాతిభుక్త
మన్నం న సమ్యక్పరిణామమేతి.

తా. అధికముగ జలపానంబొనర్చుట, అకాలమున భుజించుట, మలమూత్రములను బంధించుట, అకాలమున నిద్రించుట, అధికముగ భుజించుట, వీటిచే భక్షించినయన్నము జీర్ణింపకయుండు.

శ్లో. యచ్చావలంబతే భుక్తం స్థిరం చాపి న జీర్యతే
ఆమం విదగ్ధం విష్టబ్ధం రసశేషమజీర్ణకమ్.

తా. భుజించినయన్నము జీర్ణింపక ఉదరంబుననుండునదియ యజీర్ణమనబడు. అందు ఆమాజీర్ణము, విదగ్ధాజీర్ణము, విష్టబ్ధాజీర్ణము, రసశేషాజీర్ణము, లన నజీర్ణంబులు నాలుగువిధంబులుగ నున్నయవి. అన్నము జీర్ణింపక మలంబులోనైనను, వమనంబులోనైనను, గలిసి బైలువెడలునది ఆమాజీర్ణమనియు, పులితేనుపులతో బైలువెడలునది విదగ్ధాజీర్ణమనియు, ఉదరము వుబ్బియుండునది విష్టబ్ధాజీర్ణమనియు, అన్నమునం దిచ్ఛ లేకుండునది రసశేషాజీర్ణమనియు, నెఱుంగవలయు.

శ్లో. సూచీభిరివ గాత్రాణి తుదన్సంతిష్ఠతేఽనిలః
యస్యాజీర్ణేన సా వైద్యైర్విషూచీతి నిగద్యతే.

తా. అజీర్ణముగలవారికి సూదులచే పొడిచినటుల దేహంబున వాతవేదన గలిగియుండు. ఇదియ విషూచియన బరంగు.

## అజీర్ణచికిత్స.

శ్లో. సాముద్రసౌవర్చలసైంధవానాం క్షారోయవానాం చ తథాజ [మోదా
హరీతకీపిప్పలిశృంగబేరం హింగుర్విడంగం చ సమాని కుర్యాత్.



ఏతాని చూర్ణాని ఘృతప్లుతాని భుంజీతగ్రాసాన్ప్రథమం చ పంచ
అజీర్ణవాతం గుదగుల్మవాతంవాతప్రమేహం విషమంచవాతమ్.
విషూచికాకామలపాండురోగం శ్వాసం చ కాసం చ హరేత్ప్ర
[యుక్తమ్.

తా. ఉప్పు, పాదరలవణము, సైంధవలవణము, యవక్షారము, ఓమము, కరక్కాయలు, పిప్పళ్లు, శొంఠి, ఇంగువ, వాయువిళంగములు, వీటిని సమభాగములుగ చూర్ణముచేసి అన్నంబునకలుపుకొని నేతితో నయిదుకబళములు భక్షించిన అజీర్ణవాతము, గుదవాతము, గుల్మవాతము, వాతప్రమేహము, విషమవాతము, విషూచి, కామిల, పాండువు, శ్వాస, కాస, ఇవియన్నియు హరించు. (ఇది సాముద్రాదిచూర్ణము.)

శ్లో. త్రికటుకమజమోదాసైంధవం జీరకే ద్వే
సమచరణధృతానామష్టమో హింగుభాగః
ప్రథమకబళభోజీ సర్పిషాచూర్ణమేత
జ్జనయతి జఠరాగ్నిం వాతగుల్మం నిహంతి.

తా. శొంఠి, పిప్పలి, మిరియాలు, ఓమము, సైంధవలవణము, జీలకఱ్ఱ, సహజీర; వీటిని సమభాగములుగ చూర్ణముచేసి యొకతులములో ౮ దవ భాగము నేతితో పొంగించిన యింగువను చూర్ణముచేసి పైచూర్ణమునందు కలిపి ౧ తులము గొత్తు అన్నంబున కలుపుకొని నేతితో నొకకబళము భక్షించిన, వాతగుల్మము, హరించుటయగాక అగ్నిదీపనమును గలుగు. (ఇది హింగ్వష్టకచూర్ణము.)

శ్లో. విషూచ్యామతివృద్ధాయాం పార్ష్ణ్యోర్దాహః ప్రశస్యతే
గంధకం కుంకుమం వాపి దద్యాన్నింబుజలేన వా.

తా. విషూచిరోగము గలవారికి మడిమలయందు రక్షలు వేసినను, చిల్లపెంకులను గాల్చి వాటిని త్రొక్కునటుల జేసినను, శుద్ధిచేసిన గంధకమునయినను, కుంకుమపువ్వైనను, నిమ్మపండ్లరసముచే నూరి త్రాగించినను, విషూచిరోగములు నశించు.

శ్లో. వ్యోషం కరంజస్య ఫలం హరిద్రానింబుకద్రవైః
నస్యాంజనే ప్రయోక్తవ్యే కుర్యాచ్చ జలసేచనమ్.

తా. శొంఠి, పిప్పలి, మిరియాలు, కానుగవిత్తులు, పసపు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి, అందు నిమ్మపండ్లరసము కలిపి నస్యముజేసినను, లేక అంజనము వేసికొని శీతోదకముచే దేహమును తడుపుచుండినను, విషూచిరోగము హరించు.

శ్లో. లశునజీరకసైంధవసంచలం త్రికటురామఠచూర్ణమిదం సమమ్
సపది నింబురసేన విషూచికాం హరతి భో రతిభోగవిచక్షణే.

తా. వెల్లుల్లి, జీలకఱ్ఱ, సైంధవలవణము, పాదరలవణము, శొంఠి, పిప్పలి, మిరియాలు, నేతితో వేయించిన యింగువ, వీటిని సమభాగములుగ చూర్ణముచేసి అందు నిమ్మపండ్లరసముబోసి చక్కగ ఖల్వమున మర్దించి రేగుపండ్లంత మాత్రలుజేసి అందొక మాత్రను సేవించిన వాంతి, భ్రాంతులు, శీఘ్రంబుగ నశించు.

శ్లో. విడంగభల్లాతకచిత్రకాభయా
స్సనాగరాస్తుల్యగుడేన సర్పిషా
నిహంతి తే మందహుతాశనాన్నరా
భవంతి తే బాడబతుల్యవహ్నయః.

తా. వాయువిళంగములు, శుద్ధిజేసిన జీడిగింజలు, చిత్రమూలము, కరక్కాయలు, శొంఠి, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి దీనికిసమముగ బెల్లము, నెయ్యి వేసి కలిపి నెల్లికాయంత భక్షించిన మందాగ్ని నశించి బడబాగ్ని సమానంబగు. (అనగా మిగుల యగ్నిదీపనము గలుగు.) (ఇది విడంగాద్యవలేహికము.)

శ్లో. కుష్ఠసైంధవయోః కల్కం చుక్రతైలసమన్వితమ్
విషూచ్యాం మర్దనం కోష్ణం ఖల్లీశూలనివారణమ్.

తా. కోష్ఠు, సైంధవలవణము, వీటిని సమభాగములుగ చూర్ణముచేసి దీనికితగు మాత్రము పుల్లనికలి, నూనెబోసి చక్కగ కలిపి కించిదుష్ణముచేసి శరీరమునకు లేపనముచేసిన విషూచి, వాతశూల, యివి హరించు.

శ్లో. నింబూరసం చించిణిగాసమేతం విషూచికాశోషహరం కఫం చ
దుగ్ధేనపీతోయదిటంకణోసౌ ప్రశామ్యతేయంవమనంనిరుద్ధ్యాత్.

తా. నిమ్మపండ్లరసములో పాతచింతపండుగుజ్జు కలిపిత్రాగిన విషూచి, శోష, శ్లేష్మము, ఇవి హరించు. మఱియు పేల్చిన వెలిగారమును భస్మముచేసి పాలలో వేసి త్రాగిన, విషూచి తత్క్షణంబున నివృత్తియగు.

---

## అజీర్ణములకు రసచికిత్సలు.

శ్లో. శుద్ధసూతం విషం గంధం ప్రత్యేకం చ సమం సమమ్
మరీచం సర్వతుల్యాంశం కంటకారీ ఫలద్రవైః.
మర్దయేద్భావయేద్యత్నా దేకవింశతివారకమ్
గుంజాత్రయమిదం ఖాదేత్సర్వాజీర్ణప్రశాంతయే
సర్వోపద్రవసంయుక్తాం విషూచిమపి నాశయేత్.

తా. శుద్ధిచేసిన పాదరసము, శుద్ధిచేసిన వసనాభి, శుద్ధిచేసిన గంధకము, ఇవి సమభాగములు, వీటికిసమముగ మిరియాలు వేసి వాకుడుఫలరసముచే ఖల్వమున ౨౧ దినము ఆరగఆరగ నూరి మూడుగురిగింజలంతేసి మాత్రలుచేసి నీడనయెండించి అందొక మాత్రను భక్షించిన సమస్తాజీర్ణములు, అనేకరోగములతో కూడియుండెడి వాంతి, భ్రాంతులు, ఇవి నశించు. (ఇది అజీర్ణకంటకరసము.)



శ్లో. రసేన గంధం సహ టంకణేన సమం విషం యోజ్యమతస్త్రిభాగమ్
కపర్దశంఖావపి నేత్రభాగౌ మరీచకం చాష్టగుణం విమర్ద్య.
సుపక్వజంబీరరసేన ఖల్వే శుద్ధో భవత్యగ్నికుమారకోఽయమ్
అజీర్ణవాతం గుదగుల్మవాతం విషూచికాద్యం వినిహంతి సద్యః.

తా. శుద్ధిచేసిన పాదరసము, శుద్ధిచేసిన గంధకము, పేల్చిన వెలిగారభస్మము, ఇవి సమభాగములు. వీటికిసమముగ శుద్ధిచేసిన వసనాభి, గవ్వలభస్మము ౨ భాగములు, శంఖభస్మము ౨ భాగములు, మిరియాలు ౮ భాగములు, వీటినన్నిటిని యేకముచేసి చూర్ణముగావించి అందు చక్కగపండిన నిమ్మపండ్లరసముబోసి మూడుదినములు మర్దించి మూడుగురిగింజలంత మాత్రలుచేసి నీడనయెండించి అందొకమాత్రను భక్షించిన అజీర్ణవాతము, గుదవాతము, గుల్మవాతము, విషూచి, ఇవి మొదలగురోగంబులు హరించు. (ఇది అగ్నికుమారకరసము.)

శ్లో. వ్యాయామప్రమదాధ్వవాహనరతాః ఖిన్నానతీసారిణ
శ్శూలశ్వాసవతస్తృషాపరిగతాః హిక్కామరుత్పీడితాః
క్షీణాః క్షీణకఫాశ్శిశూన్మదహతాన్వృద్ధాంస్తథాజీర్ణినో
రాత్రౌ జాగరితాన్నరాన్నిరశనాన్కామం దివా స్వాపయేత్.

తా. సంచారము, స్త్రీసంభోగము, వాహనారోహణము, వీటిని నధికముగ నొనర్చుటచే ఖేదముజెందినవారును, అతిసారరోగులును, శూల, శ్వాస, దాహము, వెక్కిళ్ళు, వాతరోగము, ఇవి గలవారును, కృశించినవారును, క్షీణకఫముగలవారును, శిశువులు, మత్తులు, వృద్ధులు, అజీర్ణరోగులు, వీరును, అల్పాహారం బొనర్చినవారును, రాత్రులయందు జాగరణముచేసినవారును, పగటియందు నిద్రింపవలయు.

ఇట్లు అజీర్ణరోగచికిత్స ముగిసెను.

---

## క్రిమిరోగలక్షణము.

శ్లో. జ్వరో వివర్ణతా శూలం హృద్రోగశ్ఛర్దనం భ్రమః
భక్తద్వేషోఽతిసారశ్చ సంజాతకృమిలక్షణమ్.

తా. జ్వరము, ముఖవైవర్ణ్యము, శూల, హృద్రోగము, వాంతి, భ్రమ, అన్నద్వేషము, అతిసారము, ఇవి గలిగియుండిన జంతురోగమని యెఱుంగవలయు.

---

## క్రిమిరోగచికిత్స.

శ్లో. ముస్తాఖుపర్ణీ ఫలదారుశిగ్రుక్వాథస్సకృష్ణాక్రిమిశత్రుకల్కః
మార్గద్వయేనాపి చిరప్రవృత్తాన్క్రిమీన్ నిహన్యాత్క్రిమిజాం
[శ్చ రోగాన్.

తా. తుంగగడ్డలు, ఎలుకచెవ్విత్తులు, కొడిశవిత్తులు, దేవదారు, మునగపట్ట, వీటిని సమభాగములుగ కషాయముబెట్టి అందు పిప్పళ్లు, వాయువిళంగములు, ఇవి చూర్ణముజేసి నా కషాయములో కలిపిపుచ్చుకొనిన బహుకాలముగ నోరు, ఆసనము, వీటినుండిపడుచుండెడి పురుగులు నశించు.

శ్లో. విడంగం పారిభద్రాగ్రం బ్రహ్మబీజం పృథక్పృథక్
మధునా క్రిమినాశాయ నింబం వా హింగుసంయుతమ్.

తా. వాయువిళంగములు, వేపచిగురు, మోదుగవిత్తులు, వీటిలో దేనినైనను చూర్ణముచేసిన యందు తేనెకలిపి పుచ్చుకొనినను, లేక వేపచిగుళ్లలో యింగువవేసి యుదకముచే నూరి దేహతత్త్వమునెఱింగి భక్షించినను, పురుగులు హరించు.

శ్లో. భల్లాతకం వా దధ్నా చ చించామ్లేన హరేత్క్రిమీన్.

తా. జీడిగింజలను నుదకముచే నూరి పెరుగుతోనైనను, చింతపండుపులుసుతోనైనను కలిపిత్రాగిన, క్రిమిరోగము హరించు.

శ్లో. పలాశబీజం వల్లైకం స్నుహిక్షీరేణ జంతుజిత్.

తా. మోదుగగింజలను బొంతజెముడుపాలతో నూరి గురిగింజలంత భక్షించిన క్రిమిరోగము నశించు.

శ్లో. సౌవీరం పత్రశాకాంశ్చ వర్జయేత్క్రిమివాన్నరః.

తా. జంతురోగి, రేగుపండ్లు, ఆకుకూరలు, వీటిని భక్షింపంజనదు.

శ్లో. ఖదిరః కుటజః పిచుమందవచా
త్రికటుత్రిఫలాత్రివృతా సహితమ్
పశుమూత్రయుతం పిబ సప్తదినం
క్రిమికోటిశతాన్యపి హంత్యచిరాత్.

తా. చంద్రచావ, కొడిశవిత్తులు, వేపవిత్తులు, వస, శొంఠి, పిప్పళ్ళు, మిరియాలు, కరక్కాయలు, తానికాయలు, నెల్లివరుగు, తెల్లతెగడ, వీటిని సమభాగములుగ దంచి గోమూత్రముచే కషాయముబెట్టి సప్తదినంబులు పుచ్చుకొనిన ఉదరంబునందలి పురుగులు నశించు.

శ్లో. నింబవత్సకవిడంగసంయుతం రామఠేన సహ జంతునాశనమ్
నింబపత్రమజమోదకాన్వితం చూర్ణమేవ మధునా ప్రశస్యతే.



తా. వేపవిత్తులు, కొడిశవిత్తులు, వాయువిళంగములు, ఇంగువ, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి గోమూత్రముచే బుచ్చుకొనినను, లేక, వేపచిగురు, ఓమము, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి తేనెతో పుచ్చుకొనినను, క్రిమిరోగము నశించు.

శ్లో. ఆఖుపర్ణిదళైః పిష్టైః పిష్టగేన చ పూపకాన్
భుక్త్వా సౌవీరకం చాను పిబేత్క్రిమిహరం పరమ్.

తా. ఎలుకచెవ్వి ఆకులను దంచి చూర్ణముజేసి అందు గోధుమపిండి కలిపి రొట్టెలుజేసి భక్షించి గోధుమలగంజి త్రాగిన క్రిమిజాడ్యము నశించు.

శ్లో. సువర్చికారామఠపత్రికాహ్వా విడంగబాహ్లీకకణాగ్నివిశ్వా
యవానికాగ్రంథికభద్రముస్తా తక్రేణ చూర్ణం క్రిమికోటిహారీ.

తా. సద్యక్షారము, ఇంగువ, జాపత్రి, వాయువిళంగములు, కుంకుమపువ్వు, పిప్పళ్లు, చిత్రమూలము, శొంఠి, ఓమము, మోడి, తుంగగడ్డలు, వీటిని సమభాగములుగ చూర్ణముగావించి అందు మజ్జిగకలిపి త్రాగిన నుదరమునందలి పురుగులు నశించు.

శ్లో. సారనాళాఖుపర్ణీవా తక్రం పాలాశబీజయుక్
హింగ్వాజమోదం తక్రం వా క్రిమిరోగం వినశ్యతి.

తా. ఎలుకచెవ్వి ఆకులచూర్ణము, మోదుగవిత్తులు, వీటిని సమభాగములుగ పుల్లనికలితో నూరి మజ్జిగలో కలిపి అందు ఇంగువ, ఓమము, వీటిచూర్ణమువేసి పుచ్చుకొనిన క్రిమిరోగము హరించు.

శ్లో. క్షీరాణి మాంసాని ఘృతాని చైవ దధీని శాకాని చ పత్రవంతి
సమాసతోమ్లంమధురాన్రసాంశ్చ క్రిమింజిఘాంసుః పరివర్జయేచ్చ.

తా. పాలు, మాంసము, నెయ్యి, పెరుగు, ఆకుకూరలు, మధురము, పులుసు ఇవిగల రసద్రవ్యములు, వీటిని క్రిమిరోగపీడితులు వర్జింపవలయు.

ఇట్లు క్రిమిరోగచికిత్స ముగిసెను.

---

## పాండురోగలక్షణము.

శ్లో. భ్రూనేత్రగుదవన్నాభిగుహ్యాశోఫోవివర్ణతా
బలాగ్నినాశనం కార్శ్యం పాండౌ సాసృగ్వివేచనమ్.

తా. కనుబొమలు, నేత్రములు, గుదస్థానము, పాదములు, నాభి, గుహ్యస్థలము, వీటియందు శోభగలిగి తేజోవిహీనమై బలము, అగ్నిదీపనము, ఇవి నశించి కృశింపుచు రక్తవిరేచనములగుచుండిన పాండురోగమని ఎఱుంగవలయు.

శ్లో. జ్వరారోచకహృల్లాసఛర్దిస్తృష్ణాక్లమాన్వితమ్
క్షీణం హతేంద్రియం వృద్ధం సంత్యజేత్పాండురోగిణమ్.

తా. జ్వరము, అరుచి, హృదయమునందు వ్యథ, ఓకర, దాహము, ఆయాసము, క్షీణత్వము, ఇంద్రియవైకల్యము, ఈలక్షణంబులుగల పాండురోగికిని, ముదిమియందు పాండురోగము జనించినవారికిని చికిత్స జేయంజనదు.

శ్లో. పాండుదంతనఖోయశ్చ పాండునేత్రస్తు యో భవేత్
పాండుసంఘాతదర్శీ చ పాండురోగీ వినశ్యతి.

తా. దంతములు, నేత్రములు, నఖములు, ఇవియును దేహంబంతయును, రక్తవిహీనమై తెల్లబారియుండెనేని యీపాండురోగి యమపురమున నివసించునని ఎఱుంగవలయు.

శ్లో. పీతనేత్రాననఖారుచిర్దౌర్బల్యదాహకృత్
కామిలాబహుపిత్తైషా చిరాస్యాత్కుంభకామిలా.

తా. నేత్రములు, గోళ్లు, ముఖము, ఇవి పచ్చగనుండుట, అరుచి, దౌర్బల్యము, దాహము, ఇవికలుగుట, ఇట్టిలక్షణంబులు గలిగెనేని నత్యంతపైత్యముచే జనించిన కామిలారోగంబనియు, నిది బహుకాలముగ దేహంబునం దంటియుండెనేని కుంభకామిలయనియు నెఱుంగవలయు.

శ్లో. కృష్ణపీతశకృన్మూత్రశూలతృడ్దాహమోహవాన్
రక్తనేత్రాననస్త్వాజ్యః కామిలాఛర్ద్యరోచకీ.

తా. నల్లగను, పచ్చగను, మలమూత్రంబులు విడుచుట,శూలతాపము, మోహము, ఇవి కలిగియుండుట, నేత్రములు, ముఖము, ఇవి ఎఱుపుబారియుండుట, అరుచి, వాంతి, ఇవి కలిగియుండుట, ఇట్టి లక్షణంబులుగల కామిలారోగము అశక్యంబని ఎఱుంగవలయు.

శ్లో. హరితశ్యావపీతత్వగ్బలయతంద్రాగ్నినాశనైః
హలీమకం విజానీయాదంగమర్దస్తృషాభ్రమైః.

తా. శరీరము పింగళవర్ణము, ఆకుపసరువర్ణము, పసపువర్ణము, వీటిలో దేనితోనయినను గూడి రక్తమాంసములు మొదలగునవి క్షీణించియుండుట, తంద్రగలుగుట, అగ్నిదీపనము లేకుండుట, ఒడలువిరుచుట, దాహము, భ్రమ, ఇవి కలుగుట, ఇట్టి లక్షణంబులుగలిగిన హలీమక కామిలారోగంబని ఎఱుంగవలయు.



## పాండురోగాదిచికిత్స.

శ్లో. ఫలత్రికామృతావాసా తిక్తా భూనింబనింబజః
క్వాథః క్షౌద్రయుతో హన్యాత్పాండురోగం సకామిలమ్.

తా. కరక్కాయ, తానికాయ, నెల్లివరుగు, తిప్పతీగ, అడ్డసరము, కటుకరోహిణి, నేలవేము, వేపపట్ట, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి అందు తగుమాత్రము తేనెవేసి త్రాగిన పాండురోగము, కామిలారోగము, ఇవి నశించు.

శ్లో. రసమామలకానాం తు సంశుద్ధం యత్ర పీడితమ్
ద్రోణం పచేచ్చ మృద్వగ్నౌ తత్రేమాని ప్రదాపయేత్.
చూర్ణితం పిప్పలీప్రస్థం మధుకం ద్విపలం తథా
ప్రస్థం గోస్తనికాయాశ్చ ద్రాక్షాయాః కల్కపేషితమ్.
శృంగబేరపలే ద్వేతు తుగాక్షీర్యాః పలద్వయమ్
తులార్ధం శర్కరాయాశ్చ ఘనీభూతం సముద్ధరేత్.
మధుప్రస్థసమాయుక్తం లేహయేత్పలసమ్మితమ్
హలీమకం కామిలాం చ పాండుత్వం చాపకర్షతి.

తా. ౧౦౨౪ తులముల నెల్లికాయలరసమును మందాగ్నిచే చక్కగా కాచి అందు పిప్పలిచూర్ణము ౬౪ తులములు, అతిమధురచూర్ణము ౮ తులములు, విత్తులు తీసి మెత్తగదంచిన నల్లద్రాక్ష ౬౪ తులములు, శొంఠి, చూర్ణము ౮ తులములు, వెదురుప్పు ౮ తులములు, చక్కెర ౨౦౦ తులములు, యిత్తెఱంగున వీటినన్నిటిని నేకము గావించి పక్వముగ వండి దించుకొని అందుఱువదినాలుగు తులములతేనెబోసి చక్కగ కలిపి ప్రాతకు నాలుగుతులములచొప్పున సేవించిన హలీమకకామిల, పాండువు, యివి నశించు. (ఇది అమలకాదిలేహము.)

శ్లో. పునర్నవానింబపటోలశుంఠీతిక్తామృతాదార్వ్యభయాకషాయః
సర్వాంగశోథోదరపాండురోగస్థౌల్యప్రసేకోర్ధ్వకఫామయేషు.

తా. తెల్లగలిజేరువేళ్ళు, వేపపట్ట, చేదుపొట్ల, శొంఠి, కటుకరోహిణి, తిప్పతీగ, మానిపసపు, కరక్కాయలు, వీటిని సమభాగములుగ కషాయముబెట్టి పుచ్చుకొనిన సర్వాంగశోథ, ఉదరరోగము, పాండువు, స్థూలత్వము, నోట నీరుస్రవించుట, శ్లేష్మము, యివియన్నియు నశించు.

శ్లో. అయస్తిలస్త్ర్యూషణకోలభాగై
స్సర్వైస్సమం మాక్షికధాతుచూర్ణమ్
తైర్మోదకః క్షౌద్రయుతోఽపి భుక్తః
పాండ్వామయే దూరగతేఽపి శస్తః.

తా. నువ్వులు ౧ తులము, శొంఠి ౧ తులము, పిప్పలి ౧ తులము, మిరియాలు ౧ తులము, రేగుబండ్లబొబ్బర ౧ తులము, ఇటుల వీటినెల్ల చూర్ణముగావించి అందు, లోహభస్మము ౧ తులము, హేమమాక్షికభస్మము ౨ తులములువేసి తేనెతో ఖల్వమున చక్కగ మర్దించి రేగుగింజలంత మాత్రలుజేసి అందొకమాత్రను తేనెతో భక్షించిన అసాధ్యంబులగు పాండువులు సగా నశించు.

శ్లో. యవగోధూమశాల్యన్నం రసైర్జాంగలజైశ్శుభైః
యద్గాఢకీమసూరాద్యైస్తయోర్భోజనమిష్యతే.

తా. యవలపిండి, గోధుమపిండి, వరిఅన్నము, అడవిమృగమాంసములు, పెసలు, కందులు, చిరిశనగలు, ఇవి మొదలగువాటిని కామిల, పాండురోగము, ఇవిగలవారు భుజింపవలయు.

శ్లో. త్రిఫలాయా గుడూచ్యా వా దార్వ్యా నింబస్య వా రసమ్
ప్రాతర్మధుయుతం వైద్యః కామిలార్తాయ యోజయేత్.

తా. కరక్కాయలు, తానికాయలు, నెల్లివరుగు, వీటిని సమభాగములుగ కషాయముబెట్టి అందు తేనెకలిపి పుచ్చుకొనినను, తిప్పతీగె, మానిపసపు, వేపపట్ట, వీటిలో దేనినైనను కషాయముబెట్టి అందు తేనెకలిపి ప్రాతఃకాలంబున పుచ్చుకొనినను, కామిలారోగములు హరించు.

శ్లో. ధాత్రీలోహరజోవ్యోషనిశాక్షౌద్రాజ్యశర్కరాః
లేహో నివారయత్యాశు కామిలాం శుద్ధతామపి.

తా. ఉసిరికవరుగు, (లోహభస్మము) శొంఠి, పిప్పలి, మిరియాలు, మానిపసపు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి అందు తేనె, నెయ్యి, చక్కెర వేసి, లేహముజేసి పూటకు తులముయెత్తు పుచ్చుకొనిన కామిల, పాండువు, ఇవి నశించు.

శ్లో. అంజనం కామలార్తానాం ద్రోణపుష్పీరసం శుభమ్
నిశాగైరికధాత్రీణాం చూర్ణంవాసం ప్రకల్పయేత్.

తా. తుమ్మిపువ్వులరసమును కన్నులలోపిండినను, లేక, మానిపసపు, కావిరాయి, నెల్లిపప్పు, వీటిని గంధముతీసి కన్నులయందు వేసినను కామిలలు హరించు.



శ్లో. గుడూచీస్వరసేసర్పిస్సక్షీరం మాహిషం ఘృతమ్
చతుర్గుణేన పయసా పాయయేత్తద్ధలీమకే.

తా. తిప్పతీగెరసములో నెయ్యి, పాలు, కలిపి త్రాగినను, లేక బఱ్ఱెనేతిలో ౪ గింతలు పాలుబోసిత్రాగినను, హాలీమకకామిల హరించు.

శ్లో. వ్యోషాగ్నివేల్లత్రిఫలాముస్తైస్తుల్యమయోరజః
చూర్ణితం తక్రమధ్వాజ్యకోష్ణతోయోపయోజితమ్
కామిలాపాండుహృద్రోగకుష్ఠార్శోమేహనాశనమ్.

తా. శొంఠి, పిప్పలి, మిరియాలు, చిత్రమూలము, వాయువిళంగములు, కరక్కాయ, తానికాయ, నెల్లివరుగు, తుంగగడ్డలు, వీటిని సమభాగములుగ చూర్ణముచేసి దీనికిసమముగ లోహభస్మమువేసి కలిపి, మజ్జిగె, తేనె, నెయ్యి, ఉష్ణోదకము, వీటి అనుపానములచే దేహతత్త్వము నెఱింగి పుచ్చుకొనిన కామిల, పాండువు, హృద్రోగము, కుష్ఠువు, మూలవ్యాధి, మేహము, ఇవియన్నియు హరించు.

శ్లో. అయే మనోజ్ఞకుండలే స్ఫురన్ముఖేందుమండలే
గవాంపయస్సనాగరం నిహంతి కామిలాభరమ్.

తా. శొంఠిచూర్ణమును ఆవుపాలలోకలిపి పుచ్చుకొనిన కామిలలు హరించు.

శ్లో. అర్కమూలం హరేన్నస్యాత్కామలాం తండులోదకైః.

తా. తెల్లజిల్లేడువేరుపట్టను బియ్యపుకడుగుతో నూరి ముక్కులలోపిండిన కామిలలు హరించు.

శ్లో. వ్యోషబిల్వద్విరజనీత్రిఫలాద్విపునర్నవా
ముస్తా చాయోరజః పాఠా విడంగం దేవదారు చ.
వృశ్చికాలీ చ భార్గీ చ సక్షీరైస్తైర్ఘృతం శ్రుతమ్
సర్వాన్ప్రశమయత్యాశు వికారాన్మృత్తికాకృతాన్.

తా. శొంఠి, పిప్పలి, మిరియాలు, మారేడుపండుగుజ్జు, పసపు, మ్రానిపసపు, కరక్కాయలు, తానికాయలు, నెల్లివరుగు, ఎఱ్ఱగలిజేరు, తెల్లగలిజేరు, తుంగగడ్డలు, లోహభస్మము, అగరుశొంఠి, వాయువిళంగములు, దేవదారు, తేలుమణివేరు, లేక మేకకొమ్ముభస్మము, గంటుభారంగి, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి దీనికి రెండింతలు నెయ్యి, పాలుబోసి ఘృతపాకముగ కాచి ౧ తులము పుచ్చుకొనిన పాండువు, కామిలలు, మన్నుభక్షించుటచే జనించినరోగములు, ఇవియన్నియు హరించు.

శ్లో. తద్వత్కేసరయష్ట్యాహ్వాపిప్పలీసురసాహ్వయైః
మృద్వేషణాయతల్లోల్యే వితరే భావితాం మృదమ్.

తా. నాగకేసరములు, అతిమధురము, పిప్పళ్లు, పసపు, తులసి, వీటిని సమభాగములుగ కషాయముబెట్టి అందు రేగటిమన్ను వేసి 3 పర్యాయములు భావనచేసి భక్షించిన పూర్వము భక్షించిన మన్నుదోషము నశించు.

శ్లో. తిలపిష్టనిభం యస్తు కామిలావాన్ సృజేన్మలమ్
కఫరుద్ధపథం తస్య పిత్తం కఫహరైర్జయేత్.

తా. కామిలారోగికి నువ్వులపిండివలె మలంబుండు. మఱియు కంఠంబున కఫమును కట్టియుండు. కావున నాపిత్తకఫమును హరించెడి యౌషధమును బుచ్చుకొనవలయు.

శ్లో. గోమూత్రేణ పిబేత్కుంభకామిలాయాం శిలాజతు.

తా. గోమూత్రములో శిలాజిత్తుభస్మమును కలిపిత్రాగిన కుంభకామిల హరించు.

శ్లో. వేణీఫలం న్యసేత్తోయే రాత్రౌ పర్యుషితం చ తత్
హంతి నస్యవిధానేన కామిలాం శుద్ధతామపి.

తా. దేవదడొంగిపండ్లను నలియగొట్టి రాత్రియందు శీతోదకంబున నానవేసి దానిరసమును నుదయమున పిండి ముక్కులలోవైచిన పాండువు, కామిలలు ఇవి హరించు.

శ్లో. ద్రోణపుష్పీరసోపేతా రోచనా హింగుసంయుతా
ధాత్రీనిశాగైరికా వా కామిలాపహమంజనమ్.

తా. తుమ్మిపువ్వులరసములో గోరోచనము, కొద్దిగ మంచి ఇంగువ, వీటిని కలిపియైనను, లేక నెల్లివరుగు, మానిపసపు, కావిరాయి, వీటిని గంధముతీసియైనను కన్నులకు అంజనమువేసిన సమస్తకామిలలు హరించు.

శ్లో. లోహచూర్ణం నిశాయుగ్మం త్రిఫలా కటురోహిణీ
ప్రలిహ్య మధుసర్పిర్భ్యాం కామలార్తస్సుఖీ భవేత్.

తా. లోహభస్మము, పసపు, మానిపసపు, కరక్కాయలు, తానికాయలు, ఉసిరికవరుగు, కటుకరోహిణి, వీటిని సమభాగములుగ చూర్ణముచేసి అందు తేనె, నెయ్యి, ఇవి సమభాగములుగ గలిపి భక్షించిన కామిలలు హరించు.



శ్లో. మండూరం చూర్ణయేచ్ఛ్లక్ష్ణం గోమూత్రేష్టగుణే పచేత్
పంచకోలం దేవదారుముస్తావ్యోషఫలత్రయమ్.
విడంగం స్యాత్ప్రిలఫలం పాకాంతే చూర్ణితం క్షిపేత్
భక్షయేత్కర్షమాత్రం చ తక్రేణ తక్రభోజనమ్.
పాండుశోఫహలీమం చ ఊరుస్తంభం చ కామిలామ్
అర్శాంసి హంతి నోచిత్రం హంసమండూరకోహ్వయమ్.

తా. మండూరచూర్ణము ४ తులములు, దీనికి ౮ దింతలు గోమూత్రముబోసి కషాయముబెట్టి అందు పిప్పళ్లు, మోడి, చవ్యము, చిత్రమూలము, శొంఠి, దేవదారు, తుంగగడ్డలు, ఏలకులు, ఆకుపత్రి, లవంగములు, కరక్కాయలు, తానికాయలు, నెల్లివరుగు, వాయువిళంగములు, వీటిని దినుసుకు ౭ తులములచొప్పున చూర్ణముగావించివైచి ఘుట్టిపడువరకు నుడికించి యాఔషధమునం దొకతులమును మజ్జిగలో కలిపిత్రాగిన, పాండువు, శోథ, హలీమకమను కామిల, ఊరుస్తంభవాయువు, కామిలలు, మూలవ్యాధి, ఈరోగంబులన్నియు నశించు. ఇందుకు పథ్యము:—మజ్జిగన్నమును భుజింపవలయు. (ఇది హంసమండూరము.)

శ్లో. రసగంధాభ్రలోహైక్యం పాండ్వరిఃపుటితం త్రిధా
కుమార్యా తు చతుర్వల్లం పాండుకామిలపూర్వహృత్.

తా. శుద్ధిచేసిన పాదరసము, శుద్ధిచేసిన గంధకము, అభ్రకభస్మము, లోహభస్మము, వీటిని సమభాగములుగ నుంచుకొని అందు కలబందరసముబోసి నూరి 3 పర్యాయములు గజపుటమువేసి దేహతత్త్వము నెఱింగి ౧-౨ గురిగింజలప్రమాణము సేవించిన పాండువు, కామిలలు, ఇవి నశించు. (ఇది పాండ్వరీరసము.)

ఇట్లు పాండురోగాదిచికిత్సలు ముగిసెను.

## రక్తపిత్తలక్షణము.

శ్లో. రక్తపిత్తాద్భ్రుశం రక్తమూర్ధ్వం చాధః ప్రవర్తతే
రోమకూపైశ్చ యుగపచ్ఛైత్యకాంక్షారుచిర్వమిః.
ఊర్ధ్వం కర్ణాక్షినాసాస్యైర్మేఢ్రయోనిగుదైరధః
సాధ్యమూర్ధ్వమధో యాప్యమసాధ్యం యుగపద్గతమ్.

తా. నోరు, ఆసనము, రోమరంధ్రములు, వీటినుండి మిగుల రక్తముస్రవించుట, శీతలపదార్థములయం దిచ్ఛగలిగియుండుట, అరుచి, వాంతి, ఇవి కలుగుట, ఇట్టిలక్షణంబులుగలిగిన రక్తపిత్తంబని ఎఱుంగవలయు. శరీరోర్ధ్వద్వారంబులగు చెవులు, నేత్ర

ములు, ముక్కు, నోరు, వీటినుండి అధికముగ రక్తము స్రవింపుచుండిన సాధ్యంబనియు, అధోద్వారంబులగు శిశ్నము, యోని, గుదము, వీటినుండి అధికముగ రక్తము స్రవింపుచుండిన కష్టసాధ్యంబనియు, ఊర్ధ్వముఖంబుగను, అధోముఖంబుగను రక్తము స్రవింపుచుండిన నసాధ్యంబనియు నెఱుంగవలయు.

శ్లో. లోహితం ఛర్దయేద్యస్తు సతతం లోహితేక్షణః
లోహితాంగారస్వప్నేక్షీ రక్తపిత్తీ వినశ్యతి.

తా. రక్తమును వమనంబొనర్చుట, సదా నేత్రంబులు నెఱ్ఱగనుండుట, స్వప్నంబున వస్తువులన్నియు నెఱ్ఱగనుండునట్టు గనుగొనుట, ఇట్టిలక్షణంబులుగల రక్తపిత్తరోగి యమునిసదనంబున నివసించునని యెఱుంగవలయు.

శ్లో. అక్షీణబలమాంసాగ్నేః కర్తవ్యమపతర్పణమ్.

తా. ఇట్టిలక్షణంబులుగల రక్తపిత్తరోగికి బలము, మాంసము, అగ్నిదీపనము, ఇవి నశింపకయుండిన నారోగిని చికిత్సలచే జీవింపఁజేయనగు.

శ్లో. ఊర్ధ్వగే రేచనం శస్త్రమధోగే వమనం హితమ్.

తా. ఊర్ధ్వరంధ్రంబులనుండి రక్తము స్రవింపుచుండిన రేచనమునకును అధోముఖముగ రక్తము స్రవింపుచుండిన వమనంబునకును నివ్వవలయు.

## రక్తపిత్తచికిత్స.

శ్లో. ఆరగ్వధేన ధాత్ర్యా వా త్రివృతాపథ్యయాథవా
విరేచనం ప్రయోక్తవ్యం శర్కరామాక్షికోత్తరమ్.

తా. రేలకాయగుజ్జు, ఉసిరివరుగు, వీటిని కషాయముబెట్టి అందు తేనె, చక్కెర వేసి పుచ్చుకొనినను, లేక తెల్లతెగడ, కరక్కాయలు, వీటిని కషాయముబెట్టి అందు తేనె చక్కెర కలిపి పుచ్చుకొనినను, విరేచనంబై రక్తపిత్తము హరించు.

శ్లో. నస్యం దాడిమపుష్పోత్థం రసో దూర్వాభవోఽథవా
ఆమ్రాస్థితః పలాండోర్వా నాసికాచ్యుతరక్తజిత్.

తా. దాడిమపువ్వులరసము, గరికెరసము, మామిడివిత్తులరసము, తెల్లవుల్లిగడ్డలరసము, వీటిలో దేనినైనను నస్యముజేసిన నాసికమునుండి స్రవించెడి రక్తరోగము నివృత్తియగు.

శ్లో. భృంగీగృహం తు క్షీరేణ నారీణాం నావనాంజయేత్
లోహం ఖదిరసారేణ నాసికారక్తనాశనమ్.



తా. తుమ్మెదగూడును చనుబాలతో నూరియైనను, లోహసిందూరమును చండ్రచావరసంబులో కలిపియైనను, నస్యముచేసిన నాసికంబునుంచి స్రవించెడిరక్తము నశించు.

శ్లో. వృషపత్రాణి నిష్పీడ్య రసం సమధుశర్కరమ్
అనేన ప్రశమం యాతి రక్తపిత్తం సుదారుణమ్.

తా. అడ్డసరపాకురసములో తేనె, చక్కెర కలిపి పుచ్చుకొనిన మిగుల నఘోరంబగు రక్తపిత్తము హరించు.

శ్లో. హ్రీబేరధాన్యకం శుంఠీ చందనం మధుయష్టికా
వృషోశీరయుతః క్వాథశ్శర్కరామధుయోజితః.

తా. కురువేరు, దనియాలు, శొంఠి, శ్రీగంధము, అతిమధురము, అడ్డసరపాకురసము, నల్లవట్టివేళ్లు, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి అందు చక్కెర, తేనె, కలిపి పుచ్చుకొనిన రక్తపిత్తము శమించుటయగాక, దాహము, పిత్తము, జ్వరము ఇవియన్నియు నశించు.

శ్లో. ఆటరూషకమృద్వీకా పథ్యా క్వాథస్సశర్కరః
క్షౌద్రాఢ్యస్సకణశ్శ్వాసరక్తపిత్తనిబర్హణః.

తా. అడ్డసరపాకు, దీపద్రాక్ష, కరక్కాయలు, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి అందు చక్కెర, తేనె, పిప్పలిచూర్ణము, వేసి పుచ్చుకొనిన రక్తపిత్తము, శ్వాస, ఇవి హరించు.

శ్లో. ముద్గాస్సలాజాస్సయవాస్సకృష్ణాస్సోశీరముస్తాస్సహచందనేన
బలాజలైః పర్యుషితః కషాయస్సరక్తపిత్తం శమయత్యుదీర్ణమ్.

తా. పెసలు, వరిపేలాలు, యవలసత్తు, పిప్పళ్లు, వట్టివేళ్లు, తుంగగడ్డలు, శ్రీగంధము, చిట్టాముదపువేరు, వీటిని సమభాగములుగ దంచి శీతోదకమున నానవేసి మరుదిన ముదయమున కషాయముబెట్టి పుచ్చుకొనిన రక్తపిత్తము నశించు.

శ్లో. పక్వోదుంబరకాశ్మర్యపథ్యా ఖర్జూరగోస్తనీః
మధునా ఘ్నంతి సంలీఢా రక్తపిత్తం పృథక్పృథక్.

తా. అత్తిపండ్లు, గుమ్ముడుపండ్లు, కరక్కాయలు, ఖర్జూరము, దీపద్రాక్ష, వీటిలో దేనినైనను తేనెతోమర్దించి సేవించిన, రక్తపిత్తము శమించు.

శ్లో. శృంగగైరికయోఃకల్కం ధాతక్యా మధుకస్య చ
ఘూర్ణిణస్తుతేసృజిప్రోక్తం యోషిత్క్షీరేణ నావనమ్.

తా. అల్లము, కావిరాయి, ఆరెపువ్వు అతిమధురము, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి అందు చనుబాలుబోసి నస్యముజేసిన రక్తపిత్తము నశించు.

శ్లో. మూలాని పుష్పాణి చ మాతులుంగ్యా
స్సమం పిబేత్తండులధావనేన
ఘ్రాణప్రవృత్తే కలమాశు దేయం
సశర్కరం నాసికయోః పయో వా.

తా. మాదీఫలపువేరుపట్టలైనను, దానిపువ్వులలైనను, బియ్యపుకడుగులో నూరి పుచ్చుకొనినను, లేక దానిరసములో చక్కెర, చనుబాలు కలిపి ముక్కులలో పిండినను రక్తపిత్తము హరించు.

శ్లో. ఉదుంబరాణి పక్వాని గుడేన మధునా పిబ
ఉపభుక్తాని నిఘ్నంతి నాసారక్తం నృణాం ధ్రువమ్.

తా. అత్తిపండ్లను సమముగ పాతబెల్లమునైనను, తేనెనైనను, జేర్చి భక్షించిన నాసికారక్తము హరించు.

శ్లో. హరీతకీదాడిమపుష్పదూర్వాలాక్షారసోనస్య విధానయోగాత్
నివారయత్యేవ చిరప్రవృత్తమప్యాశు నాసాంతరశోణితౌఘమ్.

1 తా. కరక్కాయలు, దాడింబపువ్వులు, గరికె, లక్క, వీటిని సమభాగములుగ నుదకముచే దంచి రసముదీసి ముక్కులలో పిడిచిన బహుకాలముగ స్రవింపుచుండెడి నాసికారక్తము హరించు.

శ్లో. శృతేనాజేన పయసా సుపిష్టం కుంకుమం పిబేత్
ఊర్ధ్వరక్తవినాశాయ తేనైవాజేన భోజనమ్.

తా. కుంకుమపువ్వును మేకపాలచే నూరి యుడికించిత్రాగిన ఊర్ధ్వముఖమునుండి స్రవించెడి రక్తపిత్తము హరించు. ఇందుకు పథ్యము.—మేకపాలతో అన్నమును భుజింపవలయు.

శ్లో. యష్టిమధుసమాయుక్తం క్షీరం సంక్వాథ్య శీతలమ్
శర్కరామధుసంమిశ్రం రక్తపిత్తాపహం పిబేత్.

తా. ఆవుపాలలో అతిమధురంబును వైచి చక్కగకాచి కించిదుష్ణంబుగ నుండునపుడు అందు చక్కెరతేనెవేసి పుచ్చుకొనిన రక్తపైత్యం బతిశీఘ్రంబుగ నశించు.

శ్లో. పలాశకల్కః క్వాథో వా సుశీతశ్శర్కరాన్వితః
పిబేద్వా మధుసర్పిర్భ్యాం గవాశ్వశకృతోరసమ్.

తా. మోదుగపువ్వులను నుదకంబుచే నూరి అందు చక్కెర కలిపిత్రాగినను, లేక ఆపువ్వులను కషాయముబెట్టి అందు చక్కెర జేర్చి త్రాగినను, లేక ఆవుపేడ రసమునందైనను, గుఱ్ఱపులద్దరసమునందైనను, తేనె, నెయ్యి, కలిపి త్రాగినను, రక్తపిత్తము నశించు.



శ్లో. సక్షౌద్రం గ్రంథితే రక్తే లిహ్యాత్పారావతం శకృత్.

తా. తేనెలో పావురపిట్టమలమును కలిపి సేవించిన శరీరమునందలి గ్రంథులు నశించు.

శ్లో. అతినిస్సృతరక్తో వా క్షౌద్రేణ రుధిరం పిబేత్.

తా. రక్తపిత్తాదులచే మిగుల రక్తవిహీనంబైనరోగి, కుంకుమపువ్వును తేనెలో నూరి సేవించిన రక్తము వృద్ధియగు.

శ్లో. ఖదిరస్య ప్రియంగూనాం కోవిదారస్య శాల్మలేః
పుష్పచూర్ణాని మధునా లిహ్యాద్వా రక్తపిత్తనుత్.

తా. చండ్రపువ్వులు, ప్రేంకణపుపువ్వులు, ఎఱ్ఱకాంచనపువ్వులు, బూరుగపువ్వులు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి అందు తేనెకలిపి సేవించిన రక్తపిత్తము హరించు.

శ్లో. అశ్వత్థపత్రాగ్రరసాత్షడంశో
బోళోఽథ తస్మాద్ద్విగుణం మధు స్యాత్
రక్తప్రవాహో హృదయస్థితం వా
వాతో యథాభ్రం హరతే తథైవ.

తా. రావిచిగురురసము ౧ భాగము, రక్తబోళము ౬ భాగములు, తేనె ౧౨ భాగములు, ఇత్తెఱంగున వీటిని నేకముజేసిత్రాగిన రక్తస్రావము, హృదయమున గూడు కట్టుకొనియుండెడిరక్తము, "వాయువు మేఘుంబుల నెగరగొట్టుచందంబున" ఇవి హరించు.

శ్లో. జయేన్నాసాశ్రితం రక్తం లీఢం వా క్షౌద్రపావకమ్.

తా. చిత్రమూలమును చూర్ణముజేసి అందు తేనెకలిపి సేవించిన బహుకాలంబుగ నాసికమునుండి స్రవింపుచుండెడిరక్తము హరించు.

శ్లో. గంధం సూతం మాక్షికం లోహచూర్ణం
సర్వం ఘృష్టం త్రైఫలేనోదకేన
లోహే పాత్రే గోపయస్యేవ ధృత్వా
రాత్రౌ దద్యాద్రక్తపిత్తప్రశాంత్యై.

తా: శుద్ధిజేసిన గంధకము, శుద్ధిజేసిన పాదరసము, హేమమాక్షికభస్మము లోహభస్మము, వీటిని సమభాగములుగ నొకటిగజేర్చి ఇనుపపాత్రయం దునిచి కరకతాండ్ర ఉశిరికలకషాయముచే చక్కగ మర్దించి అందొక వరహాయెత్తును ఆవుపాలతో రాత్రులయందు బుచ్చుకొనిన రక్తపిత్తములు హరించు. (ఇది రక్తపిత్తసుధ యనబడు.

శ్లో. శాలిషష్టికనీవారచణముద్గామసూరకాః
శ్యామాకాశ్చ ప్రియంగుశ్చ భోజనం రక్తపిత్తినామ్.

తా. ౬౦ దినంబులకుఫలించెడి వరిబియ్యము,నీవారతండులము, (అనఁగా నివ్వరి బియ్యము) శనగలు, పెసలు, చిరిశనగలు, చామబియ్యము, కొఱ్ఱబియ్యము, వీటిని రక్తపిత్తరోగులు భుజింపవలయును.

ఇట్లు రక్తపిత్తచికిత్స ముగిసెను.

## * రాజయక్ష్మలక్షణము.

శ్లో. దైన్యం కాసమదాంగభేదవమథుశ్లేష్మాప్యతిశ్వాసతా
శోషస్తాలుతలేఽగ్నిమాంద్యమసకృన్నిష్ఠీవనం గాత్రరుక్
దాహః పాదకరాంబుజే స్వరహతిర్జాడ్యం చ హిక్కాజ్వరో
విడ్భేదక్లమపీనసారుచియుతస్స్యాద్రాజయక్ష్మా గదః.

తా. దైన్యము, కాస, మదము, శరీరమునొప్పి, వాంతి, కఫము, అతిశ్వాస, పీనస, అరుచి, అగ్నిమాంద్యము, శరీరము పోట్లు, కాళ్లుచేతులుమంట, స్వరభేదము, జడత్వము, వెక్కిళ్ళు, జ్వరము, బడలిక, ఇవి గలుగుట, దవడలు శుష్కించుట, సదా గళ్ళలుపడుచుండుట, మలము పెంటికలుకట్టి వుంటలుగవిడుచుట, ఇట్టి లక్షణంబులు గలిగిన రాజయక్ష్మరోగంబని యెఱుంగవలయును.

శ్లో. కించిల్లింగయుతం దీప్తపావకం త్వకృశం నరమ్
ఉపాచరేదాత్మవంతం యక్ష్మిణం సాధ్యలక్షణమ్.

తా. పైలక్షణంబులలో కొన్నిలక్షణంబులును, అగ్నిదీపనమును, గలిగి దేహము శుష్కింపక బలంబును గలిగియుండెనేని యట్టియక్ష్మరోగి చికిత్స కర్హుండగు.

శ్లో. అర్ధలింగైః కృచ్ఛ్రసాధ్యం సర్వలింగైః పరిత్యజేత్.

తా. మరియు నాయక్ష్మరోగికి పైన జెప్పినలక్షణంబులలో అర్ధలక్షణంబులు మాత్రము కలిగియుండిన కష్టసాధ్యంబనియు, అన్నిలక్షణంబులుండిన నసాధ్యంబనియు యెఱుంగవలయును.

శ్లో. అన్నస్య ద్వేషిణం కృచ్ఛ్రమేహినం శుక్లలక్షణమ్
స్త్రీసక్తం పథ్యహీనం వా క్షీణశుక్రం పరిత్యజేత్.

* ఇదియ క్షయరోగము.



తా. అన్నద్వేషముగలుగుట, అతిప్రయాసతో శుక్లయుక్తమగు మూత్రమును విసర్జించుట, మైథునమును వర్జింపకయుండుట, క్షీణధాతువు గలిగియుండుట, ఇట్టిలక్షణంబులు గలయక్ష్మరోగి జీవించుట దుర్లభముగాన చికిత్సజేయం జనదు.

శ్లో. క్షీయంతే ధాతవస్సర్వే తతశ్శుష్యతి మానవః
పరం దినసహస్రం తు యది జీవతి మానవః.
సుభిషగ్భిరుపక్రాంతస్తరుణశ్శోషపీడితః.

తా. క్షయరోగికి సర్వధాతువులు నశించి దేహము దినేదినే క్షీణింపుచుండు. కావున నిది యుత్పత్తియగునపుడే తగినచికిత్సలం జేయవలయు. ఇట్లు చికిత్సలుజేసినను నాయక్ష్మరోగి ౧౦౦౦ దినములలో యమపురికేగు.

శ్లో. మలాయత్తం బలం పుంసాం శుక్రాయత్తం తు జీవితమ్
తస్మాద్యత్నేన సంరక్షేద్యక్ష్మిణో బలరేతసీ.

తా. నరునకు బలంబునకు మలంబును, జీవించియుండుటకు శుక్రంబును కారణములు గాన యక్ష్మరోగి సర్వప్రయత్నములచే రేతస్సు, మలము, వీటిని సంరక్షింపుచుండవలయును.

శ్లో. పురీషం యత్నతో రక్షేచ్ఛుష్యతో రాజయక్ష్మిణః
సర్వధాతుక్షయార్తస్య బలం తస్య హి విడ్బలమ్.

తా. యక్ష్మరోగముచే శుష్కించినవారికి స్వల్పముగ మలముజారెడు ఔషధములను నివ్వవలయు. సర్వధాతువులకును మలమే బలంబుగనుండుటచే మలపుష్టి గలుగునటుల తగినఔషధాదులను సగా నివ్వవలయును.

శ్లో. క్షయాదౌ శోధనం దద్యాద్వమనం రేచనం తథా
వాతశ్లేష్మహరం క్వాథం దద్యాద్దోషాపహం పురః.

తా. క్షయరోగారంభమున వమనమునకైనను, విరేచనమునకైనను, ఔషధంబును బుచ్చుకొనుటయగాక వాతశ్లేష్మంబులనుహరించెడి కషాయాదులను సగా సేవింపవలయును.

## రాజయక్ష్మచికిత్స.

శ్లో. కృష్ణాద్రాక్షా సితాలేహః క్షయహా క్షౌద్రతైలవాన్
మధుసర్పిర్యుతో వాశ్వగంధా కృష్ణాసితోద్భవః.

తా. పిప్పళ్ళు, దీపద్రాక్ష, చక్కెర, తేనె, ఆవనూనె, వీటిని లేహముజేసి నెల్లికాయంత భక్షించినను, లేక తేనె, నెయ్యి, పెన్నేరుగడ్డ, పిప్పళ్ళు, చక్కెర, వీటిని లేహముజేసి నెల్లికాయంత భక్షించినను, యక్ష్మరోగము శమించు.

శ్లో. ఫలత్రికక్వాథవిశుద్ధమాదా
సిద్ధం గుడూచ్యా దశమూలసిద్ధమ్
స్థిరాదికాకోలియుగాదిసిద్ధం
శిలాజతు స్యాత్క్షయిషు ప్రశస్తమ్.

తా. కర్పూరశిలాజిత్తును నున్నగనూరి మడతబట్టన మూటగట్టి కరక్కాయ, తానికాయ, ఉశిరికవరగు, వీటికషాయముచే నుడికించి పిదప తిప్పతీగకషాయము, దశమూలములకషాయము, ముయ్యాకుపొన్నకషాయము, కాకోలికషాయము, క్షీరకాకోలి కషాయము, వీటిచే వెవ్వేరుగ భావనజేసి ౩ గురిగింజలయెత్తు సేవించిన యక్ష్మరోగము శమించు.

శ్లో. వృంతాకం కారవేల్లంచ తైలం బిల్వం చ రాజికామ్
మైథునం చ దివానిద్రాం క్షయీ కోపం వివర్జయేత్.

తా. వంకాయలు, కాకరకాయలు, నువ్వులనూనె, మారేడుపిందెలు, ఆవాలు, మైథునము, పగలునిద్రించుట, కోపము, వీటిని యక్ష్మరోగి వర్జింపవలయు.

శ్లో. దశమూలబలారాస్నాపుష్కరాదారునాగరైః క్వథితమ్
పేయం పార్శ్వాంసశిరోరుక్షతకాసాదిశాంతయే సలిలమ్.

తా. దశమూలములు, చిట్టాముదపువేరు, సన్నరాష్ట్రకము, తామరగడ్డలు, దేవదారు, తుంగగడ్డలు, వీటిని సమభాగములుగ కషాయముబెట్టి పుచ్చుకొనిన పార్శ్వములు, భుజములు, శిరస్సు, రొమ్ము, వీటియందలి శూలలు, దగ్గు, శ్వాసము, ఇవియన్నియు హరించు. (ఇది దశమూలకషాయము.)

శ్లో. శర్కరామధుసంయుక్తం నవనీతం లిహన్క్షయీ
క్షీరాశీ లభతే పుష్టిమతుల్యే చాజ్యమాక్షికే.

తా. కలకండను చూర్ణముజేసి అందు తేనె, వెన్న కలిపి భక్షించినను, లేక, తేనె, నెయ్యి కలిపి పుచ్చుకొనినను క్షయము శమించు. మఱియు క్షయరోగి పాలు త్రాగిన శరీరంబునకు పుష్టిగలుగు.

శ్లో. కూశ్మాండకగిరోత్థేన రసేన పరిపేషితమ్
లాక్షాకర్షద్వయం పీత్వా జయేద్రక్తక్షయం తథా.

తా. అడవిగుమ్మడుకాయ రసముదీసి అందు ౨ తులముల లక్కచూర్ణము కలిపి త్రాగిన రక్తక్షయము శమించు.

శ్లో. శతపుష్పాసమధుకం కుష్ఠం తగరచందనే
ఆలేపనం స్యాత్సఘృతం శిరఃపార్శ్వాంసశూలనుత్.

* నెయ్యి, తేనె, వీటిని సమముగ జేర్పందగదు.



తా. పెద్దసోపు, అతిమధురము, కోష్ఠు, గ్రంథితగరము, శ్రీగంధము, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి అందు నెయ్యిబోసి నూరి, తలనొప్పి, పార్శ్వపునొప్పి, భుజములనొప్పి, వీటికి లేపనముజేసిన నవి హరించు.

శ్లో. ఏలాపత్రం నాగపుష్పం లవంగా
భాగాస్త్వేషాం ద్వౌ చ ఖర్జూరకస్య
ద్రాక్షాయష్టీశర్కరాపిప్పలీనాం
చత్వార్యేతత్క్షౌద్రయుక్తం క్షయే స్యాత్.

తా. ఏలకాయలు, లవంగపత్రి, నాగకేసరములు, లవంగములు, ఇవి దినుసు ౧ కి ౧ భాగము, ఖర్జూరపుకాయలు ౨ భాగములు, ద్రాక్ష, అతిమధురము, చక్కెర, పిప్పళ్ళు ఇవి ౪ భాగములు, ఈతీరున వీటిని చూర్ణముజేసి అందు తేనె కలిపి భక్షించిన క్షయరోగము శమించు.

శ్లో. బలా విదారీ శ్రీపర్ణీ బహుపత్రీ పునర్నవా
పయసా నిత్యమభ్యస్తాశ్శమయంతి క్షతక్షయమ్.

తా. చిట్టాముదపువేరు, నేలగుమ్ముడుగడ్డ, గుమ్ముడువేరు, మల్లుచామంతి, తెల్లగలిజేరువేరు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి అందు ఆవుపాలు కలిపి త్రాగిన క్షయము శమించు.

శ్లో. సధాన్యయవగోధూమాముద్గాశ్చాపి సదా హితాః
స్త్రియశ్చతుష్పదే శ్రేష్ఠాః పుమాంసో విహగామతాః.

తా. దనియాలు, యవలసత్తు, గోధుములసత్తు, పెసలు, ఆడమృగాదులమాంసము, మొగపక్షిమాంసము, వీటిని భక్షించుటచే క్షయరోగికి హితంబు గలుగు.

శ్లో. ఛాగం మాంసం పయశ్ఛాగం సర్పిశ్ఛాగం సశర్కరమ్
ఛాగోపసేవా సతతం ఛాగమధ్యే తు యక్ష్మనుత్.

తా. మేకమాంసము, మేకపాలు, మేకనెయ్యి, చక్కెర, వీటిని భక్షించినను, లేక క్షయరోగి మేకలమందలో సదా కూర్చుండియుండినను సమస్తక్షయరోగములు శమించు.

శ్లో. గీతావాదిత్రశబ్దైశ్చ ప్రియస్తుతిభిరేవ చ
హర్షణాశ్వాసనైర్నిత్యం గురూణాం సముపాసనైః.
బ్రహ్మచర్యేణ దానేన తపసా దేవతార్చనైః
సత్యేనాచారయోగేన రవిమండలసేవయా.
వైద్యవిప్రార్చనాచ్చైవ రోగరాజో నివర్తతే.

తా. గీతము, వాద్యము, వేదఘోషము, ప్రియమగుస్తుతి, సంతోషము, వీటిచే యక్ష్మరోగికి హితము గలుగు. మరియు గురుసేవజేయుట, బ్రహ్మచర్యమునందుండుట, దానంబిచ్చుట, తపంబొనర్చుట, దేవతార్చనజేయుట, సూర్యోపాసనము గావించుట, సత్యము, ఆచారము, ఇవి గలిగియుండుట, వైద్యులను, బ్రాహ్మణులను బూజించుట, వీటిచే రాజయక్ష్మరోగము నివృత్తియగు.

---

## రాజయక్ష్మరోగమునకు రసచికిత్స.

శ్లో. రసభస్మత్రిభాగం స్యాద్భాగైకం హేమభస్మకమ్
మృతతామ్రస్య భాగైకం శిలాగంధకతాళకమ్.
ప్రతిభాగద్వయం శుద్ధమేకీకృత్వావచూర్ణయేత్
వరాటాన్పూరయేత్తేన చాజాక్షీరేణ టంకణమ్.
పిష్ట్వా తేన ముఖం రుద్ధ్వా మృద్భాండే సన్నిధాపయేత్
శుష్కం గజపుటే పాచ్యం చూర్ణయేత్స్వాంగశీతలమ్.
రసో రాజమృగాంకోఽయం చతుర్గుంజః క్షయాపహః
ఏకోనత్రింశన్మరిచైర్ఘృతేన సహ భక్షయేత్.
దశానాం పిప్పలీనాం చ చూర్ణం దత్వా ప్రదాపయేత్
క్షయే కాసజ్వరే పాండౌ గ్రహణ్యాం చాతిసారకే.

తా. పాదరసభస్మము ౩ భాగములు, సువర్ణభస్మము ౧ భాగము, తామ్రభస్మము ౧ భాగము, శుద్ధిజేసిన మణిశిల ౨ భాగములు, శుద్ధిజేసిన గంధకము ౨ భాగములు, శుద్ధిజేసిన హరితాళకము ౨ భాగములు, ఈరీతి వీటినెల్ల ఖల్వమున చక్కగ ౧ దినము మర్దించి పెద్దతొఱ్ఱగవ్వలయం దీభస్మంబు నునిచి వెలిగారమును మేకపాలతో నూరి ఆగవ్వలమూతికి సందులేకుండునటుల పూదగి యెండబెట్టి తగుమాత్రపుకుండయం దాగవ్వలనునిచి దానిమూతిని ప్రమిదచే మూసి చీలమన్నుపట్టించి గజపుటమువేసి స్వాంగశీతలమున దానిని గ్రహించి ఖల్వమునందుంచి సన్నగ నూరియుంచుకొని ౨౯ గట్టిమిరియాలను వెచ్చజేసి చూర్ణముగావించి అందు నాలుగుగురిగింజలయెత్తు ఔషధమునువేసి సేవించినను, లేక ౧౦ పిప్పళ్లను వెచ్చజేసి చూర్ణముగావించి అందు ౪ గురిగింజలయెత్తు ఔషధమును వైచి దానికిసమముగ నెయ్యిగలిపి సేవించినను, క్షయరోగములు, దగ్గు, జ్వరములు, పాండువు, గ్రహణి, అతిసారము, ఇవియన్నియు నివృత్తియగు. (ఇది రాజమృగాంకరసము.)

ఇట్లు రాజయక్ష్మరోగచికిత్స ముగిసెను.

---



## కాసలక్షణము.

శ్లో. ప్రాణోహ్యుదానానుగతః ప్రదుష్ట
స్సంభిన్నకాంస్యస్వనతుల్యఘోషః
నిరేతి వక్త్రాత్సహసా సఘోషో
మనీషిభిః కాస ఇతి ప్రదిష్టః.

తా. ప్రాణవాయువు యుదానవాయువుతోడంగూడి దుష్టమై భిన్నంబైన కంచుభాండము మ్రోగుచందంబున" రోగి వాగ్ద్వారంబునుండి అకస్మాత్తుగ శబ్దంబులు జనింపుచుండు. ఇటుల జనించెడిశబ్దములే కాస యనంబడు.

శ్లో. పంచకాసా స్మృతా వాతపిత్తశ్లేష్మక్షతక్షయైః
క్షయాయోపేక్షితాస్సర్వే బలినశ్చ యథోత్తరమ్.

తా. వాతపిత్తశ్లేష్మములు ప్రకోపించి హృదయస్థానము నాశ్రయించుకొని క్షయరూపకమై క్రమేణ వాతకాస, పిత్తకాస, కఫకాస, ఉరక్షతకాస, క్షయకాస, లను ౫ విధములగు కాసలు జనించి క్రమేణ నొకటికన్న నొకటి ప్రబలమై యనేక కాసక్షయరోగంబులను జనింపంజేయు. ఇట్లుత్పన్నంబయ్యెడి కాసక్షయములు కుదురుట దుర్లభంబయినను, వాటికి చికిత్సలం జేయుచుండవలయు. అట్లు చికిత్సలంజేయక ఉపేక్షించిన నారోగి యతిసత్వరంబుగ యమపురికి నంపంబడు.

శ్లో. శుష్కం వినిష్ఠీవతి దుర్బలస్తు
ప్రక్షీణమాంసం రుధిరం సపూయమ్
తం సర్వలింగం భృశదుశ్చికిత్స్యం
చికిత్సితజ్ఞాః క్షయజం వదంతి.

తా. దినదినంబునకును దుర్బలంబుచే శరీరము కృశించి, "శుష్కించిన కాష్ఠంబుభంగి" ఎముకలు, మాంసము, రక్తము, చీము, ఇవి నశించి రక్తయుక్తమయి దుర్గంధముతోగూడి శుష్కించియుండెడి కఫము వాగ్ద్వారంబునుండి వెడలుచుండిన నదియ క్షయకాస మనబడు. ఈకాసరోగమే వృద్ధియై క్షయరోగంబును ఉత్పత్తిచేయునని ధన్వంతర మొదలగు ఆయుర్వేదగ్రంథకర్తలు వక్కాణించిరి. కావున నిది అసాధ్యమయినరోగంబుగ నున్నయది.

---

## కాసచికిత్స.

శ్లో. అమృతా నాగరం ఫంజీ వ్యాఘ్రిపర్ణీ చ సాధితః క్వాథః
పీతస్సకణాచూర్ణశ్శ్వాసకాసౌ జయత్యాశు.

తా. తిప్పతీగె, తుంగగడ్డలు, గంటుభారంగి, యఱ్ఱఆముదపువేరు, కోలపొన్న, వీటిని సమభాగములుగ కషాయముబెట్టి అందు పిప్పలిచూర్ణము కలిపి త్రాగిన శ్వాసకాసలు హరించు.

శ్లో. తాళీశపత్రం మరిచం నాగరం పిప్పలీతుగా
యథోత్తరం భాగవృద్ధ్యా త్వగేలాచార్ధభాగికీ.
పిప్పల్యష్టగుణా చాత్ర ప్రదేయా సితశర్కరా
శ్వాసకాసారుచిహరం తచ్చూర్ణం దీపనం పరమ్
హృత్పాండుగ్రహణీశోషప్లీహశోషజ్వరాపహమ్
ఛర్ద్యతీసారశూలఘ్నం మలవాతానులోమనమ్.

తా. తాళిసపత్రి ౧ తులము, మిరియాలు ౨ తులములు, తుంగగడ్డలు ౩ తులములు, పిప్పళ్లు ౮ తులములు, వెదురుప్పు ౫ తులములు, లవంగపట్ట ౪ తులము, ఏలకులు ౪ తులము, ఇత్తీరున వీటిని చూర్ణంబుగావించి అందు ఖండశర్కర ౩౨ తులములు కలిపి సాయంప్రాతఃకాలములయందు సేవించిన శ్వాసకాసలు, అరుచి, హృద్రోగము, పాండురోగము, సంగ్రహణి, క్షయము, ప్లీహము, శోభ, జ్వరము, వాంతి, అతిసారము, శూల, మలబద్ధవాయువు అనులోమవాయువు, ఈ మొదలగు రోగంబులు హరించి అగ్నిదీపనము సగా గలుగు. (ఇది తాళిసచూర్ణము.)

శ్లో. అపామార్గస్య పంచాంగం సంపిష్టం నీలికారసే
శిలాతాళకసంయుక్తం వస్త్రే పర్పటికావృతా.
సాగ్నౌ క్షిప్త్వా భవేద్ధూమస్తం నిపీయ ముఖేన తు
వారయేద్దుస్తరం కాసం శ్వాసం ఘోరం భయావహమ్.

తా. ఉత్తరేణి పంచాంగములు (అనగా, ఉత్తరేణవేళ్లు, విత్తులు, ఆకులు, పట్ట, పువ్వులు) వీటిని నల్లవావిలియాకురసముచే నూరి అందు మణిశిల, హరితాళకము, వీటిని సమభాగములుగ కలిపి నూరి ఉశిరికాయంత ప్రమాణమునకు మించకుండునటుల వడియములు జేసి యెండించి వస్త్రమున మూటగట్టి అగ్నియందునిచి దానిపొగను త్రాగిన నఘోరంబగు శ్వాసకాసలు హరించు.

శ్లో. సంయుతం మధుసర్పిర్భ్యాం చూర్ణం త్రికటుసంభవమ్
నిహంతి తరసా కాసాన్ప్రాసాదివ సతాం హరిః.

తా. శొంఠి, పిప్పలి, మిరియాలు వీటిని సమభాగములుగ చూర్ణముచేసి అందు తేనె నెయ్యి కలిపి భక్షించిన "సాధువుల వ్యసనంబును శ్రీహరి పరిహరించుచందంబున" శీఘ్రంబుగ శ్వాసకాసలు హరించు.

శ్లో.



శ్లో. సేవితం మధుఖండాభ్యాం చూర్ణం మరిచజం యది
కిమర్థం క్రియతే చింతా శ్వాసకాసపరాజితైః.

తా. తేనె, కలకండ, వీటిని సమభాగములుగ * మిరియాలచూర్ణంబున కలిపి ప్రతిదినము సేవింపుచుండిన శ్వాసకాసలు నివృత్తియగు.

శ్లో. పిప్పలీ పిప్పలీమూలం విశ్వౌషధవిభీతకైః
మధునా సేవితం కాసః ప్రశామ్యతి కుతూహలాత్.

తా. పిప్పళ్ళు, మోడి, శొంఠి, వస, తానికాయ, వీటిని సమభాగములుగ చూర్ణముగావించి అందు తేనెకలిపి పుచ్చుకొనిన శ్వాసకాసలు హరించు.

శ్లో. వచేత్క్షుద్రాం సపంచాంగాం పుటపాకేన తద్రసః
పిప్పలీచూర్ణసంయుక్తః కాసశ్వాసజ్వరాపహః.

తా., నేలములకవేరు, ఆకులు, పూలు, విత్తులు, పట్ట, వీటిని దంచి రసము దీసి వెచ్చజేసి యందు పిప్పలిచూర్ణము కలిపి త్రాగిన శ్వాసకాశలు, జ్వరము, ఇవి హరించు.

శ్లో. భార్గీద్రాక్షాసటీశృంగీపిప్పలీవిశ్వభేషజైః
గుడతైలయుతో లేహో హితో మారుతకాసినామ్.

తా. గంటుభారంగి, దీపద్రాక్ష, కచ్చూరములు, కరకపువ్వు, పిప్పళ్లు, శొంఠి, వీటిని సమభాగములుగ చూర్ణముగావించి అందు బెల్లము, ఆవనూనె వయిచి లేహపక్వముగవండి ౧ తులము భక్షించిన వాయువుచే జనించిన శ్వాసకాసలు హరించు.

శ్లో. శ్రీఖండయష్టి మధుశాలిపర్ణీ
పాఠా పటోలేంద్రయవాబృహత్యౌ
మూర్వా గుడూచీ కటుకా కషాయః
క్షయోత్థకాసే చ సపిప్పలీకః.

తా. శ్రీగంధము, అతిమధురము, కోలపొన్న, అగరు, శొంఠి, చేదుపొట్ల, కొడిశ విత్తులు, చిన్నములక, పెద్దములక, చాగవేరు, తిప్పతీగె, కటుకరోహిణి, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి అందు పిప్పలి చూర్ణము కలిపి త్రాగిన క్షయంబుచే జనించిన శ్వాసకాసలు హరించు. (ఇది శ్రీఖండాదికషాయము.)

శ్లో. కుల్యాలవంగమరిచాక్షపలత్వచస్స్య
స్సరైర్వస్సమో నిగదితః ఖదిరస్యసారః

---

* మిరియాలచూర్ణమును నధికముగ నుంచుకొనవలయు.

బబ్బూలవల్కలకషాయజుషాం చతుర్ణాం
కాసాం నిహంతి వటికా ఘటికాత్రయేణ.

తా. లవంగములు, మిరియాలు, తానికాయలబెరడు, వీటిని సమభాగములుగ చూర్ణములుజేసి దీనికిసమముగ చంద్రాచావచూర్ణమును కలిపి అందు నల్లతుమ్మపట్ట కషాయము బోసి నూరి వడియములుజేసి యెండించి భక్షించిన 3 గడియలలో దగ్గు హరించు.

శ్లో. సౌభాగ్యహింగుళకణౌగరళం మరీచం
సంమర్ద్య నింబుజరసేన దినత్రయం చ
ఆనందభైరవవటీ తువరీ ప్రమాణా
నానానుపానసహితా సకలామయఘ్నీ.

తా. శుద్ధిజేసిన వెలిగారము, శుద్ధిజేసిన ఇంగిలీకము, శుద్ధిజేసిన వసనాభి, పిప్పళ్లు, మిరియాలు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి అందు నిమ్మపండ్లరసము బోసి 3 దినములు మర్దించి కందిగింజలంతప్రమాణము మాత్రలుజేసి యెండించి అందొకమాత్రను యుక్తానుపానంబులచే సేవించిన సర్వరోగములు హరించు. (ఇది పంచానందభైరవము.)

శ్లో. అర్కమూలశిలే తుల్యే తతోర్ధే సకటుత్రికమ్
చూర్ణితం వహ్నినిక్షిప్తం పిబేద్ధూమం తు యోగవిత్.
భక్షయేదథ తాంబూలం పిబేద్దుగ్ధమథాంబువా
కాసాః పంచవిధా యాంతి శాంతిమాశు న సంశయః.

తా. జిల్లేడువేరుపట్ట, మణిశిల, ఇవి యొక్కొకతులము, శొంఠి, పిప్పలి, మిరియాలు, ఇవి దినుసుకు ౪ తులము, ఇటుల వీటినెల్ల చూర్ణంబుగావించి అగ్నియందు వయిచి యాపొగను త్రాగి తాంబూలచర్వణముచేసినను, లేక పాలనయినను, ఉదకంబునయినను త్రాగినను, ౫ విధములగు శ్వాసకాసలు నిస్సంశయముగ నశించు.

శ్లో. మనశ్శిలాలంమరిచం మాంసీ ముస్తా తథేంగుదీ
ఏషాం ధూమాం పిబేచ్చాను సుఖోష్ణం సగుడం పయః.

తా. మణిశిల, మిరియాలు, జటామాంసి, తుంగగడ్డలు, గారచెట్టుపట్ట, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి అగ్నియందు వయిచి ఆపొగను త్రాగి పిదప యుష్ణోదకములో బెల్లము కలిపి త్రాగిన శ్వాసకాసలు హరించు. (ఇది మణిశిలధూపము)

శ్లో. ఏషకాసాన్పృథగ్ద్వంద్వసన్నిపాతసముద్భవాన్
శనైరపి ప్రయోగేణ సాధయేదప్రసాధితాన్.



తా. పైనజెప్పబడిన ధూపాదులచే సమస్తశ్వాసకాసలు శమించు.

శ్లో. మనశ్శిలాలిప్తదళం బదర్యాశ్శుష్కమాతపే
సక్షారం ధూమపానం చ మహాకాసనిబర్హణమ్.

తా. మణిశిల, యవక్షారము, వీటిని నుదకముచే నూరి రేగాకులకు పట్టించి యెండబెట్టి అగ్నియందునిచి యా పొగను త్రాగిన ప్రబలమగుశ్వాసకాసలు హరించు.

శ్లో. శ్వాసకాసహరా బర్హిపాదా వా క్షౌద్రసర్పిషా
లిహ్యాన్మరిచచూర్ణం వా సఘృతం క్షౌద్రశర్కరమ్.

తా. నెమలికాళ్ళనుసరికి చూర్ణముజేసి అందు తేనె, నెయ్యి, ఇవి సమముగ కలిపి పూటకు ౧ తులముచొప్పున సేవించినను, లేక మిరియాలచూర్ణముతో తేనె, నెయ్యి, చక్కెర, వీటిని సమముగ కలిపి పుచ్చుకొనినను శ్వాసకాసలు హరించు.

శ్లో. బదరీపత్రకల్కం వా ఘృతం భృష్టం ససైంధవమ్
స్వరోపఘాతే కాసే చ లేహమేతం ప్రయోజయేత్.

తా. రేగుఆకులను నూరి కల్కముజేసి అందు నెయ్యిబోసి సైంధవలవణమును కొంచెముగ జేర్చి లేహపాకముగ వండి భక్షించిన కాస, స్వరభేదము, ఇవి హరించు.

శ్లో. జాతీజటాకిసలయైర్బదరీదళైశ్చ
జాతీమసూరకఫలైస్సమనశ్శిలైశ్చ
స్యాద్ధూమవర్తిరిహ గుగ్గులునా సమేతైః
కాసే స్థితే బదరికాగ్నివిదహ్యమానైః.

తా. జాజివేరు, జాజిచిగుళ్లు, రేగుఆకులు, జాజికాయ, చిరిశనగపప్పు, మణిశిల, తెల్లగుగ్గిలము, వీటిని సమభాగములుగ చూర్ణముచేసి దీనిని రేగుకట్టెల నిప్పులలో వేసి యందలి పొగనుత్రాగిన శ్వాసకాసలు హరించు. (ఇది జాత్యాదిధూపము.)

శ్లో. గుడక్షారోషణకణా దాడిమం శ్వాసకాసజిత్
క్రమాత్పలద్వయార్ధాక్షకర్షార్ధాక్షపలోన్మితమ్.

తా. బెల్లము ౨ తులములు, యవక్షారము ౪ తులము, మిరియాలు ౪ తులము, పిప్పళ్లు ౧ తులము, దాడిమవొలుపు ౮ తులములు, ఇటుల వీటినన్నిటిని చూర్ణముజేసి అందుదకముబోసి ఖల్వమున మర్దించి రేగుగింజలంత మాత్రలుచేసి యందొకమాత్రను భక్షించిన శ్వాసకాసలు హరించు.

శ్లో. త్రిజాతిమర్ధకర్షాంశం పిప్పల్యర్ధపలం సితా
ద్రాక్షామధుకఖర్జూరం పలాంశం శ్లక్ష్ణకల్కితమ్.
మధునా ఘుటికా ఘ్నంతి తా వృష్యా పిత్తశోణితమ్
కాసశ్వాసారుచిఛర్దిమూర్ఛాహిధ్మమతిభ్రమాన్.

క్షతక్షయస్వరభ్రంశప్లీహశోషాఢ్యమారుతాన్

రక్తనిష్ఠీవహృత్పార్శ్వరుక్పిపాసాజ్వరానపి.

తా. లవంగపట్ట ౪ తులము, లవంగపత్రి ౪ తులము, ఏలకులు ౪ తులము, పిప్పళ్లు ౨ తులములు, ఖండశర్కర, దీపద్రాక్ష, అతిమధురము, ఖర్జూరము, ఇవి దినుసుకు నాలుగు తులములు. ఇటుల వీటినన్నిటిని చూర్ణముగావించి అందు తేనెబోసి ఖల్వమున మర్దించి రేగుగింజలంత మాత్రలుజేసి యందొకమాత్రను భక్షించిన వీర్యవృద్ధి గలుటయగాక శ్వాసకాసలు, రక్తపిత్తము, అరుచి, ఓకర, మూర్ఛ, వెక్కిళ్ళు, మతిభ్రమ, ఉరఃక్షతము, క్షయము, స్వరభేదము, ప్లీహము, శోష, వాయువు, నోటరక్తముపడుట, పార్శ్వశూలలు, శూలలు, దాహము, జ్వరము, ఇవియన్నియు నశించు. (ఇది త్రిజాతకగుటిక.)

శ్లో. అభ్రకం హారబీజం చ తీక్ష్ణశుల్బసమన్వితమ్

కాసమర్దవరాగస్తివేతసామ్లైర్విభావయేత్.

చతుర్గుంజావటీ హంతి కాసం పంచవిధం తథా.

తా. అభ్రకభస్మము, శుద్ధిజేసిన పాదరసము, శుద్ధిజేసిన గంధకము, ఉక్కుభస్మము, తామరభస్మము, వీటిని సమభాగములుగ ఖల్వమునం దునిచి దురదగొండివేళ్ళు, కరక్కాయలు, తానికాయలు, నెల్లివరుగు, అవిశాకు, పుల్లప్రబ్బలి, వీటి కషాయములచే వెవ్వేరుగ భావనజేసి పిదప చక్కగ మర్దించి ౮ గురిగింజలయెత్తు మాత్రలుజేసి నీడనయెండించి అం దొకమాత్రను భక్షించిన ౫ విధములగు శ్వాసకాసలు నశించు. (ఇది కాసారి రసము.)

ఇట్లు కాసచికిత్స ముగిసెను.

## * హిక్కాశ్వాసలక్షణము.

శ్లో. ముహుర్ముహుర్వాయురుదేతి సస్వనో

యకృత్ప్లిహాంత్రాణి ముఖాదివాక్షిపన్

సఘోషవానాశు హినస్తి యస్మా

త్తతస్తు హిక్కేత్యభిధీయతే బుధైః.

తా. వాయువు శబ్దంబుతోగూడి పలుమారు బైలువెడలునపుడు † యకృత్తు ప్లీహము, ఆంత్రము, వీటిని కక్కునట్లు ధ్వనితోడ బైలువెడలునదియ హిక్కారోగము. మరియు నిది ప్రాణములను నశింపజేయుటచే హిక్కా యనబడు.

---

* హిక్కా అనగా వెక్కిళ్లు.

† ఉదర దక్షిణపార్శ్వంబునం దుండెడి కృష్ణవర్ణయుక్తమగు మాంసము, ప్లీహమనం డెడమప్రక్కనుండెడి పచ్చనిమాంసము. పేగులు,



శ్లో. యైరేవ కారణైర్హిక్కా బహుభిస్సంప్రజాయతే

తైరేవ కారణైశ్శ్వాసో ఘోరో భవతి దేహినామ్.

తా. ఏకారణంబులచే హిక్కారోగము జనింపుచున్నదో ఆకారణంబుల చేతనే మహాఘోరంబగు శ్వాసకాసలును జనించు.

శ్లో. ఊర్ధ్వశ్వాసే ప్రకుపితే హ్యధశ్శ్వాసో నిరుధ్యతే

ముహ్యతే తామ్యతే చోర్ధ్వం శ్వాసస్తస్యైవ హంత్యసూన్.

తా. ఇటులజనించిన ఊర్ధ్వశ్వాసము ప్రకోపించెనేని అధశ్శ్వాసము అడ్డగింపబడు. ఇటుల అడ్డగింపబడుటచే మోహము, తాపము, ఇవి జనించుటయగాక నిది అపానస్థానంబున కుపితమయి ప్రాణవాయువును నశింపజేయు.

శ్లో. గ్రీవాశిరసిసంగృహ్య శ్లేష్మాణం సముదీర్య చ

కరోతి పీనసం తేన రుద్ధో ఘుర్ఘురుకం తథా.

తా. మఱియు నీయూర్ధ్వశ్వాసము, కంఠము, శిరస్సు, వీటియందు వ్యాపకమయి కఫమును నాకర్షించి పీనసమును జనింపజేయుటచే కంఠమున గుఱ్ఱుగుఱ్ఱుమను నొక శబ్దము జనించు.

శ్లో. శ్లేష్మణా దహ్యమానేన భృశం భవతి దుఃఖితః

తస్యైవ చ విమోక్షాంతే ముహూర్తం లభతే సుఖమ్.

తా. కఫమును శ్వాసముపీల్చి ఘట్టిపరచి యది బయిలువెడలకుండునటుల నిరోధింపుచుండుటచే మహాబాధ గలుగు. ఆకఫము బయిటికి వెడలినపిదప నొకముహూర్తకాలము సుఖంబుగ నుండు.

## హిక్కా శ్వాసచికిత్స.

శ్లో. హిక్కాశ్వాసీ పిబేద్భార్గీం సవిశ్వాముష్ణవారిణా

నాగరం వా సితాభార్గీం సౌవర్చలసమన్వితమ్.

తా. గంటుభారంగి, శొంఠి, వీటిని సమభాగములుగ చూర్ణముచేసి ఆం దుష్ణోదకము కలిపిత్రాగినను, లేక శొంఠి, చక్కెర, గంటుభారంగి, పాదరలవణము వీటిని సమభాగములుగ చూర్ణముజేసి ఉష్ణోదకంబున కలిపిద్రాగినను, వెక్కిళ్లు, శ్వాస ఇవి హరించు.

శ్లో. శృంగికటుత్రికఫలత్రయకంటకారీ

భార్గీసపుష్కరజటాలవణాని పంచ

చూర్ణం పిబేదశిశిరేణ జలేన హిక్కా-
శ్వాసోర్ధ్వవాతకసవారుచిషు ప్రశస్తమ్.

తా. కరకపువ్వు, శొంఠి, పిప్పలి, మిరియాలు, కరక్కాయలు, తానికాయలు, వెల్లివరుగు, నేలములక, గంటుభారంగి, తామరగడ్డలు, జటామాంసి, సైంధవలవణము, పాదరలవణము, బిడాలవణము, కాచలవణము, ఉప్పు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి అం దుష్ణోదకము కలిపి త్రాగిన వెక్కిళ్లు, శ్వాస, ఊర్ధ్వవాతము, దగ్గు, అరుచి, ఇవియన్నియు హరించు. ఇది శృంగ్యాదిచూర్ణము.

శ్లో. శుంఠీకణామరిచనాగదళంత్వగేలా
చూర్ణం కృతం క్రమవివర్ధితమూర్ధ్వముత్యాత్
ఖాదేదిదం సమసితం గుడజాగ్నిమాంద్య
కాసారుచిశ్వసనకంఠహృదామయేషు.

తా. శొంఠి ౬ భాగములు, పిప్పళ్ళు ౫ భాగములు, మిరియాలు ౪ భాగములు, తమలపాకులు ౩ భాగములు, లవంగపట్ట ౨ భాగములు, ఏలక్కాయలు ౧ భాగము, యిటుల వీటినెల్ల చూర్ణముగావించి దీనికిసమముగ చక్కెరకలిపి పుచ్చుకొనిన హిక్కాశ్వాసము, మూలవ్యాధి, అగ్నిమాంద్యము, దగ్గు, అరుచి, కంఠరోగము, హృద్రోగము, యివియన్నియు నశించు.

శ్లో. మధుకం మధుసంయుక్తం పిప్పలీశర్కరాన్వితా
నాగరం గుడసంయుక్తం హిక్కాఘ్నం నావనత్రయమ్.

తా. అతిమధురము,తేనె,వీటిని సమభాగములుగ నూరి నస్యముజేసినను, పిప్పళ్లు, చక్కెర, వీటిని సమముగ నూరి నస్యముజేసినను, అల్లము, బెల్లము, వీటిని సమముగ నూరి నస్యముజేసినను, వెక్కిళ్ళు హరించు.

శ్లో. కటుతైలేన సంయుక్తో గుడో యావన్న సేవితః
తావన్నశ్యతి కింశ్వాసః పీయూషమధురాధరే.

౧ తా. ఆవనూనెలో బెల్లము కలిపిసేవించిన ఊర్ధ్వశ్వాసయుక్తమగు వెక్కిళ్ళు తత్క్షణంబున హరించు.

శ్లో. కపిత్థస్వరసో వాపి రస ఆమలకస్య చ
పిప్పలీక్షౌద్రసంయుక్తో హిక్కాశ్వాసనివారణః.

తా. వెలగగుజ్జు, వెల్లికాయరసము, వీటిలో దేనియందయినను, పిప్పలిచూర్ణము తేనె కలిపి భక్షించిన వెక్కిళ్లు, శ్వాసలు, యివి హరించు.

శ్లో. ఖర్జూరం పిప్పలీద్రాక్షాశర్కరా చేతి తత్సమమ్
మధుసర్పిర్యుతో లేహో హిక్కాశ్వాసనివారణః.



తా. ఖర్జూరము ౧ భాగము, పిప్పళ్లు ౧ భాగము, దీపద్రాక్ష ౧ భాగము ఇటుల వీటినెల్ల చూర్ణముగావించి, అందు చక్కెర ౧ భాగము, తేనె ౧ భాగము, నెయ్యి ౧ భాగము కలిపి లేహపక్వముగ వండిభక్షించిన వెక్కిళ్లు, శ్వాసలు ఇవి నశించు.

శ్లో. మర్కటీనాం తు బీజానాం చూర్ణం మాక్షికసర్పిషా
ప్రలిహ్యాత్ప్రాతరుత్థాయ శ్వాసార్తస్స్వాస్థ్యమాప్నుయాత్.

తా. దురదగొండివిత్తులను చూర్ణముచేసి అందు తేనె, నెయ్యి కలిపి ప్రాతఃకాలంబున సేవించిన హిక్కాశ్వాసలు హరించు.

శ్లో. హింగుసౌవర్చలా జాజీ బిడపుష్కరచిత్రకైః,
సిద్ధా కర్కటశృంగ్యా చ యవాగూశ్శ్వాసహిక్కినామ్.

తా. ఇంగువ, పాదరలవణము, జీలకఱ్ఱ, బిడాలవణము, తామరగడ్డలు, చిత్రమూలము, కరకపువ్వులు వీటిని సమభాగములుగ చూర్ణముచేసి యందు కలిపివైచి కాచి త్రాగిన వెక్కిళ్లు, శ్వాసలు, ఇవి హరించు.

శ్లో. గుడోషణ నిశా రాస్నా ద్రాక్షా మాగధికా స్సమాః
తైలేన చూర్ణితా లీఢా స్తీవ్రశ్వాసనుదస్స్మృతాః.

తా. మిరియాలు, పసుపు, సన్నరాష్ట్రకము, దీపద్రాక్ష, పిప్పళ్లు, వీటిని సమభాగములుగ చూర్ణముచేసి దీనికైదవభాగము బెల్లమునుకలిపి అం దావనూనె బోసి పుచ్చుకొనిన మహాప్రబలమగు హిక్కాశ్వాసకాసలు నశించు.

శ్లో. కాసమర్దకపత్రాణాం యూషశ్శోభాంజనస్య చ
శుష్కమూలకమండస్తు హిక్కాశ్వాసనివారణః.

తా. దురదగొండిఆకులు, మునగవేరుపట్ట, యెండిన ముల్లంగిగడ్డలు వీటిలో దేనినయినను కషాయముబెట్టి పుచ్చుకొనిన హిక్కాశ్వాసలు హరించు,

శ్లో. హరిద్రాపత్రమేరండమూలం లాక్షాం మనశ్శిలాం
సదేవదార్వలం మాంసీ పిష్ట్వా వర్తిం ప్రకల్పయేత్
తాం ఘృతాక్తాం పిబేద్ధూమం యవాన్వా ఘృతసంయుతాన్.

తా. పసపుఆకులు, ఆముదమువేరుపట్ట, లక్క, మణిశిల, దేవదారుపట్ట, హరితాళకము, జటామాంసి, వీటిని సమభాగములుగ చూర్ణముచేసి అం దుదకము బోసి నూరి వస్త్రంబునకు లేపనముజేసి వత్తిగావించి యెండించి నేతిలో తడిపి అగ్నియందు కాల్చి దానిపొగను త్రాగినను, లేక, యవలపిండితో నెయ్యికలిపి అగ్నియందు వైచి దానిపొగనుత్రాగినను, హిక్కాశ్వాసలు హరించు.

శ్లో. పిప్పలీమూలమధుకగుడగోశ్వశకృద్రసాన్
హిక్కాభిష్యందకాసఘ్నాన్ లిహ్యాన్మధుఘృతాన్వితాన్.

తా. మోడి, అతిమధురము, బెల్లము వీటిని సమభాగములుగ దంచి ఆవుపేడ, గుఱ్ఱపులద్దా, వీటిరసములచే కషాయముబెట్టి అందు తేనె, నెయ్యి కలిపి పుచ్చుకొనిన వెక్కిళ్లు, శ్వాస, అభిష్యందము ఇవి నశించు.

శ్లో. కులుత్థనాగరవ్యాఘ్రీ వాసాభిః క్వథితం జలమ్
పీతం పౌష్కరసంయుక్తం కాసశ్వాసనివారణమ్.

తా. ఉలవలు, శొంఠి, వాకుడువేరు, అడ్డసరపాకులు, తామరగడ్డలు, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి పుచ్చుకొనిన హిక్కాయుక్త మగుశ్వాసకాసలు హరించు.

శ్లో. ద్రాక్షాం హరీతకీం ముస్తాం కర్కటాఖ్యాం దురాలభాం
సర్పిర్మధుభ్యాం విలిహన్ శ్వాసాన్ హంతి సుదారుణాన్.

తా. దీపద్రాక్ష, కరక్కాయలు, తుంగగడ్డలు, కరకపువ్వు, దురదగొండివేరు, వీటిని సమభాగములుగ చూర్ణముచేసి అందు తేనె, నెయ్యి, వైచి లేహపక్వముగ వండి భక్షించిన మహాభయంకరమగు హిక్కాశ్వాసలు హరించు.

## హిక్కాశ్వాసలకు రసచికిత్స.

శ్లో. రసాభ్ర హేమభస్మాని వైక్రాంతం సర్వతుల్యకం
సర్వైః పంచగుణం శంఖచూర్ణం శుష్కం విమర్దయేత్.

శ్లో. లేహయేన్మధునా మాషచతుష్కం సానుపానకం
హిక్కాం పంచవిధాం హంతి ముమూర్షోరపి తత్క్షణాత్.

తా. పాదరసభస్మము ౧ భాగము, అభ్రకభస్మము ౧ భాగము, సువర్ణభస్మము ౧ భాగము, వైక్రాంతభస్మము ౧3 భాగములు, శంఖభస్మము 30 భాగములు, ఇత్తె అంగున వీటినన్నిటిని యేకముజేసి ఖల్వమున చక్కగ మర్దించి పూటకు ౪ మాషముల యెత్తుభస్మమును తేనెతో సేవించిన * ఐదువిధంబులగు వెక్కిళ్లు, మరణకాలంబున గలిగెడివెక్కిళ్లు, ఇవి నశించు.

శ్లో. కాసప్రకరణోక్తం చ భిషగత్ర నియోజయేత్
క్షయోక్తం వాత్ర కాసే చ హిక్కాశ్వాసే నియోజయేత్.

తా. కాసరోగంబునకు జెప్పంబడిన యౌషధంబులనే హిక్కాశ్వాసరోగంబునకు నుపయోగింపందగు. మఱియు క్షయరోగంబునకు జెప్పంబడినయౌషధంబులనే శ్వాస, కాస, వెక్కిళ్లు, ఈరోగంబులకును నుపయోగింపందగు.

ఇట్లు హిక్కాశ్వాసచికిత్స ముగిసెను.

---

* అన్నజము, యమళము, క్షుద్రము, గంభీరము, మహతి, అన హిక్కారోగంబు లైదువిధంబులుగ నుండు.



## స్వరభేదలక్షణము.

శ్లో. అత్యుచ్చభాషణవిషాధ్యయనాభిఘాత
సందూషణైః ప్రకుపితః పవనాదయశ్చ
స్రోతస్సు తేస్వరవహేషు కతాః ప్రదుష్టా
హన్యుస్స్వరం భవతి చాపి హి షడ్విధస్సః.

తా. కంఠశోషమగునటుల మాటలాడుట, బిగ్గర అధ్యయనాదుల గావించుట, విషసంపర్కము, అభిఘాతము, వీటిచే వాతపిత్తశ్లేష్మములు ప్రకోపించి దుష్టంబులై శబ్దవాహినులగు నాడీచతుష్టయములయందు వ్యాపించి వాతము, పిత్తము, శ్లేష్మము, సన్నిపాతము, క్షయము, మేదస్సు, లన ౬ విధంబులగు స్వరభేదములను గలుగంజేయు.

శ్లో. వాతేన కృష్ణనయనాననమూత్రవర్చా
భిన్నస్వరై ర్వదతి గర్దభవత్స్వరం చ
పిత్తేన పీతనయనాననమూత్రవర్చా
బ్రూయాద్గళేన చ సదాహసమన్వితేన.
బ్రూయాత్కఫేన సతతం కఫపూర్ణకంఠ
స్స్వల్పం శనైర్వదతి చావిదివావిశేషాత్
సర్వాత్మకే భవతి సర్వవికారలింగం
తం చాప్యసాధ్యమృషయస్స్వరభేదమాహుః.

తా. ముఖము, నేత్రములు, మూత్రము, మలము, ఇవి నల్లగనుండుట, కంఠము పగిలి గాడిదెకూతవంటిస్వరము గలిగియుండుట, ఇట్టిలక్షణంబులు గలిగియుండిన వాతముచేజనించిన స్వరభేదమనియు, నేత్రములు, ముఖము, మూత్రము, మలము, ఇవి పచ్చగనుండుట, కంఠము తాపయుక్తమై స్వరము భిన్నమైయుండుట, ఇట్టిలక్షణంబులు గలిగియుండిన పైత్యముచేజనించిన స్వరభేదమనియు, సదా కంఠము కఫయుక్తమై హీనస్వరము గలిగియుండుట, పగటికాలంబున మృదువుగ మాటలాడుట, ఇట్టిలక్షణంబులు గలిగియుండిన శ్లేష్మముచే జనించిన స్వరభేదమనియు, వాతపిత్తశ్లేష్మస్వరభేదములయం దుదహరింపంబడిన లక్షణంబులన్నియు గలిగియుండిన త్రిదోషములచే జనించిన స్వరభేదమనియు నెఱుంగవలయు. ఈత్రిదోషయుక్తమగు స్వరభేదం బసాధ్యంబని ఆయుర్వేదవేత్తలు వచించిరి.

## స్వరభేదచికిత్స.

**శ్లో.** విభీతకఫలైర్యుక్తా పిప్పలీసైంధవం తథా
కాంజికేన భవేత్సాధ్యం స్వరభేదాద్విముచ్యతే.

**తా.** తానికాయలు, పిప్పళ్ళు, సైంధవలవణము, వీటిని సమభాగములుగ చూర్ణముచేసి వస్త్రగాలితమొనర్చి అందు పుల్లనికలి కలిపిపుచ్చుకొనిన స్వరభేదము నశించు.

**శ్లో.** పిప్పలీ పిప్పలీమూలం మరిచం విశ్వభేషజం
పిబేన్మూత్రేణ మతిమాన్ కఫజే స్వరసంక్షయే.

**తా.** పిప్పళ్ళు, మోడి, మిరియాలు, శొంఠి, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి అందు గోమూత్రముల కలిపిపుచ్చుకొనిన కఫముచేజనించిన స్వరభేదము నశించు.

**శ్లో.** చవ్యామ్లవేతసకటుత్రయతింత్రిడీకం
తాలీసజీరకతుగాదహనైస్సమాంశైః
చూర్ణం గుడప్రముదితం త్రిసుగంధియుక్తం
వైస్వర్యపీనసకఫారుచిషు ప్రశస్తమ్.

**తా.** చవ్యము, పుల్లప్రబ్బలి, శొంఠి, పిప్పళ్ళు, మిరియాలు, చింతాకుపులుసు, తాళీశపత్రి, జీలకఱ్ఱ, వెదురుప్పు, చిత్రమూలము, లవంగపట్ట, లవంగపత్రి, ఏలక్కాయలు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి దీనికిసమముగ బెల్లముకలిపి పుచ్చుకొనిన స్వరభేదము, పీనస, శ్లేష్మము, అరుచి, ఇవియన్నియు హరించు.

**శ్లో.** కాసమర్దకవార్తాక మార్కవైస్స్వరసైర్యుతం
క్షీరానుపానం పైత్తేషు పిబేత్సర్పిరతంద్రితః.

**తా.** దురదగొండివేళ్ళు, వంగవేళ్ళు, గుంటగలగర, వీటియందు సమముగ రసముదీసి అందు నెయ్యికలిపి ౧ పలము సేవించినపిదప ఆవుపాలు త్రాగిన పైత్యముచేగలిగిన స్వరభేదము హరించు.

**శ్లో.** ఆద్యేకోష్ణజలం పేయం జగ్ధ్వా ఘృతగుడౌదనం
పీతం ఘృతం హంత్యనిలం సిద్ధం మార్కవజే రసే.

**తా.** అన్నములో నెయ్యి, బెల్లము, వీటినికలుపుకొని భక్షించి యుంష్ణోదకమును త్రాగినను, లేక గుంటగలగరరసములో నెయ్యికలిపి పక్వముగ కాచి ఆవునెయ్యిని త్రాగినను వాయువుచేజనించిన స్వరభేదము హరించు.

**శ్లో.** అశ్నీయాచ్చ ససర్పిష్కం యష్టీమధుకపాయసమ్.



**తా.** పాయసములో నెయ్యి, అతిమధురచూర్ణము, వీటినివైచి భక్షించిన స్వరభేదము నశించు.

**శ్లో.** శర్కరామధుమిశ్రాణి శృతాని మధురైస్సహ
పిబేత్పయాంసి యస్యోచ్చైర్వదతోఽభిహతస్స్వరః.

**తా.** అతిమధురము, బాదముపప్పు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి పాలలోకలిపి యందు శర్కర, తేనె, వీటినివైచి పక్వముగ కాచిత్రాగిన బిగ్గరగ మాటలాడుటచే జనించిన స్వరభేదము హరించు.

**శ్లో.** వ్యాఘ్రీస్వరసవిపక్వం రాస్నావాట్యాలగోక్షురవ్యోషైః
సర్పిస్స్వరోపఘాతం హన్యాత్కాసం చ పంచవిధమ్.

**తా.** వాకుడువేరుసమూలమును దంచి రసముదీసి పక్వముగ కాచి అందు నెయ్యికలిపి పుచ్చుకొనినను, లేక, సన్నరాష్టకము, చిట్టాముదపువేళ్ళు, పల్లేరుకాయలు, శొంఠి, పిప్పలి, మిరియాలు, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి అందు నెయ్యిజేర్చి పుచ్చుకొనినను, స్వరభేదము, ౫ విధంబులగు శ్వాసకాసలు, ఇవి హరించు.

**శ్లో.** విహితమసృణచూర్ణాన్యారనాళేన సార్థం
కలితరుఫలకృష్ణా సైంధవాని ప్రలిహ్యాత్.

**తా.** తానికాయలు, పిప్పళ్ళు, సైంధవలవణము, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి వస్త్రగాలితమొనర్చి అందు పుల్లనికలి కలిపి పుచ్చుకొనిన స్వరభేదము నశించు.

**శ్లో.** అభిలషతి విజేతుం యస్స్వరస్య ప్రణాశం
స పిబతి సహ దుగ్ధేనామలక్యాః ఫలం వా.

**తా.** చక్కగఫలించిన ఉశిరికాయలపప్పును చూర్ణముజేసి పాలలో కలిపి త్రాగిన స్వరభేదము నశించు.

**వాక్యమ్.** కాసశ్వాసోపయుక్తా రసాః ప్రయోక్తవ్యాః.

**తా.** కాసశ్వాసలకు జెప్పియుండెడి రసమాత్రలను స్వరభేదములుగలవారును భుజింపవలయు.

**వాక్యమ్.** స్వరభేదస్య క్షయరోగాంతఃపాతిత్వాత్క్షయరోగోక్తమేవ కార్యమ్.

**తా.** స్వరభేదము క్షయరోగాంతర్గతంబై యుండుటచేత క్షయరోగంబునకు జెప్పియుండెడి చికిత్సలనే స్వరభేదమునకును జేయవలయు.

ఇట్లు స్వరభేదచికిత్స ముగిసెను.

### అరోచకలక్షణము.

శ్లో. వాతాదిభిశ్శోకభయాతిలోభక్రోధైర్మనోఘ్నాశనరూపగంధైః
అరోచకాస్స్యుఃపరిహృష్టదంతకషాయవక్త్రస్యసతోఽనిలేన.

తా. వాతము, పిత్తము, కఫము, సన్నిపాతము, శోకము, భయము, అతిక్రోధము, లోభము, వీటిచే అరోచకరోగము జనించు. ఇటుల అరోచకము జనించినపిదప మనోవేదనయును, అన్నాదిరూపకమైన దుర్గంధంబును గలుగు. మఱియుఁ వాతముచే జనించన అరుచికి దంతములు పులిసినట్టును, నోరు వగరుగను నుండు.

### అరోచక చికిత్స.

శ్లో. అమ్లికాగుడతోయం చ త్వగేలామరిచాన్వితం
అభక్తచ్ఛందరోగేషు శస్తం కబళధారణమ్.

తా. లవంగపట్ట, ఏలకులు, వేయించినమిరియాలు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి చింతపండు, బెల్లము, వీటిని నుదకంబున వయిచి కలిపి వడియగట్టుకొని నీరసంబును యాచూర్ణంబునకలిపి పుచ్చుకొనుటయగాక అన్నములో సగా కలుపుకొని భక్షించిన అరుచి నశించు.

శ్లో. కుష్ఠసౌవర్చలాజాజీ శర్కరా మరిచంబిడం
ధాన్యైలాపద్మకోశీరపిప్పల్యశ్చందనోత్పలం
లోధ్రతేజోవతీపథ్యా త్ర్యూషణం సయవాగ్రజం
ఆర్ద్రదాడిమనిర్యాసస్సాజాజీ శర్కరాయుతః
సతైలమాక్షికాహ్యాతే చత్వారః కబళగ్రహాః
చతురోఽరోచకాన్ ఘ్నంతి వాతాద్యేకజ సర్వజాన్.

తా. కోష్ఠు, పాదరలవణము, జీలకఱ్ఱ, మిరియాలు, బిడాలవణము, వీటిని సమభాగములుగ చూర్ణముగావించి అందు తేనె, చక్కెర, ఆవనూనె, సమముగకలిపి లేహపక్వముగవండి ప్రాతస్సాయంకాలములయందు రేగుబండంతసేవించినను, లేక, ధనియాలు, ఏలకులు, తామరదుంపలు, వట్టివేళ్ళు, పిప్పళ్ళు, శ్రీగంధము, నల్లకలువగడ్డలు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి అందు చక్కెర, ఆవనూనె, తేనె, సమముగ కలిపి లేహపక్వముగవండి రేగుబండంత సేవించినను, లేక లొద్దుగపట్ట, మాల్కంగణీ విత్తులు, కరక్కాయలు, శొంఠి, పిప్పళ్ళు, మిరియాలు, యవక్షారము, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి అందు శర్కర, ఆవనూనె, తేనె, సమముగకలిపి లేహపక్వముగవండి రేగుబండంత ప్రాతస్సాయంకాలములయందు సేవించినను, లేక, జీలకఱ్ఱను చూర్ణముచేసి అందు దాడిమపండురసము, అల్లపురసము, చక్కెర, ఆవనూనె,



తేనె, వీటిని సమముగకలిపి లేహపక్వముగ వండి రేగుబండంత సేవించినను, వాతము, పైత్యము, కఫము, సన్నిపాతము, వీటిచేజనించిన అరుచి నశించు.

శ్లో. శమయతి కేసరమరుచిం సలవణఘృతమాశు మాతులుంగస్య
దాడిమచర్వణమథవా చరకో రుచికారి సూచయామాస.

తా. మాదీఫలపుకేసరములు, సైంధవలవణము, వీటిని సమభాగములుగ చూర్ణముచేసి అందు తగుమాత్రమునెయ్యికలిపి ప్రాతస్సాయంకాలములయందు భక్షించినను, లేక పుల్లదాడిమగింజలనైనను, తియ్యదాడిమగింజలనైనను, చక్కగనమిలి భక్షించినను అరుచి నశించునని చరకసంహితయం దుదహరింపబడి యున్నయది.

శ్లో. పిష్టాజాజీసధాన్యాకం ఘృతప్రస్థే విపాచయేత్
కఫపిత్తారుచిహరం మందానలవమిం జయేత్.

తా. జీలకఱ్ఱ ౬౪ తులములు, ధనియాలు ౬౪ తులములు, ఇటుల వీటిని దంచి చూర్ణముగావించి యం దరువదినాలుగుతులముల ఆవునెయ్యిబోసి లేహపక్వముగవండి దేహతత్వమునెఱింగి తగుమాత్రముసేవించిన కఫము, పిత్తము, వీటిచే జనించిన అరుచి, మందాగ్ని, వాంతి, ఇవి హరించు.

శ్లో. అజాజీమరిచం కుష్ఠం బిడం సౌవర్చలం తథా
మధుకం శర్కరాతైలం వాతికే ముఖధావనమ్.

తా. జీలకఱ్ఱ, మిరియాలు, కోష్ఠు, బిడాలవణము, పాదరలవణము, అతిమధురము, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి అందు చక్కెర, ఆవనూనె, కలిపి పక్వముగవండి దంతధావనము, జిహ్వాకు లేపనము, వీటిని గావించిన వాతముచే నుత్పన్నంబైన అరుచి శీఘ్రంబుగ హరించు.

శ్లో. కారంజం దంతకాష్ఠం చ విధేయమరుచౌ సదా
కించిల్లవణసంయుక్తమారనాళం విపాచయేత్
తేన గండూషకం కుర్యాదాస్యవైరస్యశాంతయే.

తా. కానుగపుల్లలచే దంతధావనం బొనర్చి పుల్లనికలిలో కొంచెముగ ఉప్పు కలిపి కాచి పుక్కిలించిన అరుచి హరించు.

శ్లో. శర్కరాదాడిమం చాథ ద్రాక్షాఖర్జూరమేవ చ
కేసరం మాతులుంగస్య సింధునా మధునాపి వా
ఆస్యవైరస్యశమనం భక్షయేత్కర్షసమ్మితమ్.

తా. దీపద్రాక్ష, ఖర్జూరము, మాదీఫలపుకాయలలోని కుసుమములు, వీటిని సమభాగములుగ దంచి అందు శర్కర, దాడిమపండురసము వైచి సైంధవలవణము

నైనను, తేనెనైనను కలిపి లేహపక్వముగవండి అందొకతులము సేవించిన అరుచిహరించు జిహ్వకు రుచిగలుగు.

శ్లో. విడంగచూర్ణకర్షైకం క్షౌద్రైశ్చతుర్గుణైర్యుతం
అసాధ్యమపి సంహన్యాదరుచిం వక్త్రధారణాత్.

తా. ౧ తులము వాయువిళంగముల చూర్ణమునందు ౪ తులముల తేనె కలిపి కొంచము వెచ్చజేసి ఘట్టియైనపిదప రేగుబండంత మాత్రలుజేసి యందొకమాత్రను పుక్కిట నునిచికొని దానిరసమును మ్రింగుచుండిన బహుకాలంబుగనుండెడి అరుచి హరించు.

శ్లో. త్రిత్వక్త్ర్యూషణాని త్రిఫలారజనీద్వయం చ
చూర్ణీకృతాని యవశూకవిమిశ్రితాని
క్షౌద్రాన్వితాని వితరేన్ముఖధావనార్థ
మన్యాని తిక్తకటుకాని చ భేషజాని.

తా. లవంగపట్ట, ఏలకాయలు, లవంగపత్రి, శొంఠి, పిప్పళ్లు, మిరియాలు, కరక్కాయలు, తానికాయలు, నెల్లివరుగు, పసపు, మానిపసపు, యవాగ్రములు, వీటిని సమభాగములుగ చూర్ణముచేసి అందు తేనెకలిపి, దంతధావనం బొనర్చుకాలంబున జిహ్వకును, దంతములకును, లేపనముజేసినను, లేక చేదు, కారముగల ఔషధంబులను సేవించినను, అరుచి హరించు.

శ్లో. సితావ్యోషకపిత్థానాం చూర్ణం క్షౌద్రేణ తద్వటీ
సర్వారోచకశాంత్యర్థం ధారయే ద్వదనాంబుజే.

తా. శొంఠి, పిప్పలి, మిరియాలు, వీటిని సమభాగములుగ చూర్ణముచేసి అందు శర్కర, వెలగపండుగుజ్జు, తేనె కలిపి పక్వముగవండి నెల్లికాయంత పుక్కిట నునిచికొని దానిరసమును మ్రింగుచుండిన అరుచి శీఘ్రముగ నశించు.

ఇట్లు అరోచకచికిత్స ముగిసెను.

## ఛర్దిరోగలక్షణము.

శ్లో. శ్వాసకాసౌ జ్వరో హిక్కా తృష్ణా వైస్వర్యమేవ చ
హృద్రోగస్తమకశ్చైవ జ్ఞేయాశ్ఛర్దేరుపద్రవా.

తా. ఛర్దిరోగంబున శ్వాసము, కాసము, జ్వరము, వెక్కిళ్ళు, దాహము, స్వరభేదము, హృద్రోగము, మైకము, ఈయుపద్రవములు గలిగియుండు.



శ్లో. ఈషదుష్ణా సఫేనాయా సశూలా చ పునఃపునః
ఛర్దిర్భవతి లక్ష్మైతద్వాతచ్ఛర్దేః ప్రకీర్తితమ్.

తా. కించిదుష్ణము, నురుగు, కడుపుశూల వీటితోగూడి వమనం బగుచుండిన వాతఛర్దిరోగం బని నెఱుంగవలయు.

శ్లో. సదాహా లోహితా పీతా హరితోష్ణాథవా భవేత్
ఛర్దిరేవ భవేల్లక్ష్మ పిత్తచ్ఛర్దేరసంశయః.

తా. తాపముగలిగి ఎఱుపు, పసపు, ఈవర్ణంబులు గలిగియైనను లేక ఆకుపసరు వర్ణముగలిగి ఉష్ణముగనైనను, వమనంబగుచుండిన పిత్తఛర్దిరోగంబని ఎఱుంగవలయు.

శ్లో. కఫమిశ్రా సహృద్దాహా ముహుర్ముహుస్సఘుర్ఘురా
సలాలా జంబాలయుతా శ్లేష్మఛర్దిః ప్రకీర్తితా.

తా. కఫమిశ్రమై హృదయంబున తాపముగలిగి కంఠమున సదా గుఱుగుఱు మను శబ్దముతోగూడి జొల్లుస్రవింపుచు జిగటగ వమనంబగుచుండిన శ్లేష్మఛర్దిరోగంబని ఎఱుంగవలయు.

శ్లో. ఛర్దనం వమనం జ్ఞేయం కురాత్యుత్తచ్ఛాంతి భేషజమ్.

తా. వమనము, ఓకర, ఇవియ ఛర్దియనబడు. ఈ ఛర్దిరోగంబునకు ముందుద హరింపంబొయ్యెడి యౌషధంబులను సేవింపవలయు.

## ఛర్దిరోగచికిత్స.

శ్లో. ఏలాలవంగగజకేసరకోలమజ్జా
లాజప్రియంగుఘనచందనపిప్పలీనాం
చూర్ణాని మాక్షికసితాసహితాని లీఢ్వా
ఛర్దిం నిహంతి కఫమారుతపిత్తజాతామ్.

తా. ఏలకులు, లవంగములు, నాగకేసరములు, రేగుగింజలలోని పప్పు, వరిపేలాలు, ప్రేంకణపువేళ్లు, తుంగగడ్డలు, శ్రీగంధపుచూరు, పిప్పళ్లు, వీటిని సమభాగములుగ చూర్ణముచేసి అందు తేనె, చక్కెర, సమముగ కలిపి రేగుపండంత సేవించిన వాతపిత్తశ్లేష్మంబులచే జనించినఛర్ది హరించు.

శ్లో. చందనం చ మృణాళం చ వాలకం నాగరం వృషం
సతండులోదకక్షౌద్రైః పీతః కల్కో వమిం జయేత్.

తా. శ్రీగంధము, తామరపువ్వులలోని గద్దెలు, లేక తామరగడ్డలు, వట్టివేళ్లు, తుంగగడ్డలు, వీటిని సమముగ చూర్ణముచేసి అందు అడ్డసరపాకురసము, బియ్యపుకడుగు, తేనె కలిపి త్రాగిన ఛర్దులు హరించు.

శ్లో. సౌదీచ్యగైరికం దేయం సేవ్యం వా తండులాంబునా
జాతీపత్రరసం కృష్ణామరిచం శర్కరాన్వితం
ఏతాని మధుయుక్తాని ఘ్నంతి ఛర్దిం చిరోద్భవామ్.

తా. కురువేరు, కావిరాయి, వీటిని సమభాగములుగ బియ్యపుకడుగుతో దంచి అందు తేనె కలిపిత్రాగినను, లేక పిప్పళ్లు, మిరియాలు, వీటిని సమభాగములుగ చూర్ణముచేసి అందు జాజాకురసము, తేనె, చక్కెర, కలిపిత్రాగినను, బహుకాలంబుగనుండెడి ఛర్ది హరించు.

శ్లో. చందనే హ్యక్షమాత్రే చ సంయోజ్యామలకీరసం
పిబేన్మాక్షికసంయుక్తం ఛర్దిస్తేన నివార్యతే.

తా. ౧ తులము శ్రీగంధపుచక్కచూర్ణంబున నెల్లికాయలరసము, తేనె, వీటిని తగుమాత్రముగ కలిపిత్రాగిన ఛర్ది హరించు.

శ్లో. కషాయో భ్రష్టముద్గానాం సలాజమధుశర్కరః
ఛర్ద్యతీసారదాహఘ్నో జ్వరఘ్నస్సంప్రకాశితః.

తా. వేయించిన పచ్చపెసలను కషాయముబెట్టి అందు వరిపేలపిండి, తేనె, శర్కర, కలిపిత్రాగిన వాంతులు, అతిసారము, దాహము, జ్వరము, ఇవియన్నియు హరించు.

శ్లో. కోలమజ్జాకణాబర్హి పక్షభస్మ సశర్కరం
మధునా లేహయేచ్ఛర్దిహిక్కాకోపస్య శాంతయే.

తా. రేగువిత్తులలోనిగుజ్జు, పిప్పళ్లు, వీటిని సమభాగములుగ చూర్ణము గావించి యందు తేనె, నెమలియీకలభస్మము, చక్కెర, కలిపి పుచ్చుకొనిన వాంతి, వెక్కిళ్ళు, ఇవి హరించు.

శ్లో. బీజపూరామ్రజంబూనాం పల్లవాని జటా పృథక్
విపచేత్పుటపాకేన క్షౌద్రయుక్తశ్చ తద్రసః.
ఛర్దిం నివారయేత్సద్యస్సర్వదోషసముద్భవామ్.



తా. మాదీఫలము, మామిడి, నేరేడు, వీటిచిగుళ్ళయందైనను, వేళ్ళపట్టయందైనను, రసముదీసి అందు తేనెకలిపి కించిదుష్ణముచేసి పుచ్చుకొనిన సర్వదోషయుక్తమగువాంతి శీఘ్రంబుగ హరించు.

శ్లో. పిత్తచ్ఛర్దిర్వ్రజేద్దూర్వాతండులోదకపానతః
ధాత్రీరసేన వా పీతా సితా లాజాశ్చ హంతి తామ్.

తా. గరికరసమున బియ్యపుకడుగు కలిపిత్రాగినను లేక, నెల్లికాయలరసమున శర్కర, వరిపేలపిండి, కలిపి భక్షించినను, పిత్తచ్ఛర్ది హరించు.

శ్లో. సైంధవం సర్పిషా పీతం వాతచ్ఛర్దినివారణమ్.

తా. సైంధవలవణంబున నెయ్యి కలిపిసేవించిన వాతచ్ఛర్ది హరించు.

శ్లో. హరీతకీనాం చూర్ణం తు లిహ్యాన్మాక్షికసంయుతమ్
అధోభాగీకృతే దోషే ఛర్దిస్తేన నివార్యతే.

తా. కరక్కాయల చూర్ణమునకు సమముగా తేనె కలిపి సేవించిన అధోభాగగతమయిన ఛర్ది సగా హరించు.

శ్లో. ఆరక్తశాలిభక్తం గోదధిశర్కరావిమిశ్రం చ
కుర్యాద్భోజనమేతత్కఫచ్ఛర్దిచ్ఛిదం జంతోః.

తా. ఎఱ్ఱవడ్ల బియ్యపుఅన్నంబున ఆవుపెరుగు, శర్కర, కలుపుకొని భక్షించిన కఫయుక్తమగు ఛర్దులు హరించు.

శ్లో. మృద్భ్రష్టలోష్టప్రభవం సుశీతం సలిలం పిబేత్.

తా. మంటిపుంటలనైనను, మంటిపెంకులనైనను, నెఱ్ఱగకాల్చి నుదకంబున వైచి వడియగట్టి యాయుదకంబును చల్లార్చి త్రాగిన ఛర్ది హరించు.

శ్లో. జంబ్వామ్రపల్లవోశీరవటశృంగావరోహజః
క్వాథః క్షౌద్రయుతశ్శీతః పీతో వా వినియచ్ఛతి.
ఛర్దిజ్వరమతీసారం మూర్ఛాం తృష్ణాం చ దుర్జయామ్.

తా. నేరేడుచిగుళ్ళు, మామిడిచిగుళ్ళు, వట్టివేళ్ళు, మఱ్ఱిఊడలు, లేక మఱ్ఱిచిగుళ్ళు, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి అందు తేనె కలిపి పుచ్చుకొనిన వాంతి, జ్వరము, అతిసారము, మూర్ఛ, దాహము, ఇవి ప్రబలంబుగనుండినను, శీఘ్రంబుగ నశించు.

శ్లో. హింగునా శారిబామూలం సర్వవాంతిహరం పరమ్
జాతీఫలం వమా శోషే జాగరే విప్రయోజయేత్.

తా. సుగంధిపాలవేరును దంచి కషాయముబెట్టి అందు నేతిలో పొంగించిన ఇంగువను స్వల్పముగ కలిపిపుచ్చుకొనిన సమస్తవాంతులు హరించు. మఱియు జాజికాయను కషాయముబెట్టి పుచ్చుకొనినను, లేక దానిని చూర్ణముగావించి యుష్ణోదకముతో సేవించినను వాంతి, ఓకర, శోష, నిదురరాకుండుట, ఇవియన్నియు హరించు.

శ్లో. ఉగ్రగంధారనాళేన పీతా ఛర్దిం నివారయేత్.

తా. వసను చూర్ణముగావించి పుల్లనికలితో బుచ్చుకొనిన ఛర్ది హరించు.

ఇట్లు ఛర్దిరోగచికిత్స ముగిసెను.

## తృష్ణాలక్షణము.

శ్లో. సతతం యః పిబేత్తోయం న తృప్తిమధిగచ్ఛతి
పునః కాంక్షతి తోయం చ తం తృష్ణార్దితమాదిశేత్.

తా. సంతతము నీరుద్రాగుచుండినను తృప్తిలేకుండుట, పలుమారు నీరుద్రాగుట కిచ్ఛయించుట, ఇట్టిలక్షణంబులుగలిగిన తృష్ణయని యెఱుంగవలయు.

## తృష్ణాచికిత్స.

శ్లో. కాశ్మర్యశర్కరాయుక్తం చందనోశీరపద్మకమ్
ద్రాక్షామధుకసంయుక్తం పిత్తతృష్ణో జలం పిబేత్.

తా. గుమ్ముడుపండ్లు, శ్రీగంధము, వట్టివేరు, తామరతూండ్లు, దీపద్రాక్ష, అతిమధురము, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి అందు చక్కెరకలిపి పుచ్చుకొనిన పైత్యముచే జనించిన తృష్ణ (దాహము) హరించు.

శ్లో. సజీరధాన్యార్ద్రికశృంగబేరసౌవర్చలాన్యర్ధపరిప్లుతాని
మద్యాని హృద్యాని చ గంధవంతి పీతాని సద్యశ్శమయంతి
[తృష్ణామ్.

తా. జీలకఱ్ఱ, ధనియాలు, అల్లము, వట్టివేరు, పొదరలవణము, వీటిని సమభాగములుగ చూర్ణముగావించి దీనిని మిగులశ్రేష్ఠంబగు కల్లునందు కలిపి పానముచేసిన దాహము హరించు.

శ్లో. ఆమ్రజంబూకషాయం వా పిబేన్మాక్షికసంయుతమ్
ఛర్దిం సర్వాం ప్రణుదతి తృష్ణాం చైవాపకర్షతి.



తా. మామిడిపట్ట, నేరేడుపట్ట, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి అందు తేనె కలిపిపుచ్చుకొనిన సమస్తఛర్దులు, దాహము, ఇవి హరించు.

శ్లో. గోస్తనీక్షురసక్షీరయష్టీమధుమధూత్పలైః
నియతం నస్యతో పీతైస్తృష్ణా శామ్యతి తత్క్షణాత్.

తా. నల్లద్రాక్ష, అతిమధురము, నల్లకలువగడ్డలు, వీటిని సమభాగములుగ చూర్ణముచేసి అందు చెఱకురసము, పాలు, తేనె, వీటిని కలిపిత్రాగినను, లేక పైచూర్ణమును నస్యముజేసినను, తృష్ణ తత్క్షణంబున హరించు.

శ్లో. జీరకుస్తుంబరీద్రాక్షాచందనోత్పలశీతలమ్
శీతలేన సమం దద్యాత్తృష్ణాం హంత్యతిశీతలమ్.

తా. జీలకఱ్ఱ, ధనియాలు, దీపద్రాక్ష, శ్రీగంధము, నల్లకలువగడ్డలు, పచ్చకర్పూరము, వీటిని సమభాగములుగ దంచి శీతోదకంబుననాననేసి పుచ్చుకొనిన దాహము హరించు.

శ్లో. రుగ్లాజాబ్దవటప్రరోహమధుకైర్మధ్వన్వితైః కల్పితా
వ్యగ్రామాశు తృషాం భృశం ప్రశమయేదాస్యాంతరస్థా గుటీ.

తా. కోష్ఠు, వరిపేలాలు, తుంగగడ్డలు, మఱ్ఱిచిగుళ్ళు, అతిమధురము, వీటిని సమభాగములుగ దంచి చూర్ణముజేసి అందు తేనెకలిపి మర్దించి మాత్రలుజేసి పుక్కిట నునిచికొని దానిరసమును మ్రింగుచుండిన ప్రబలముగనుండెడి అతిదాహము శీఘ్రముగ నశించు.

శ్లో. నిర్వాపితం తప్తలోష్టకపాలసికతాదిభిః
తృష్ణాయాం వమనోత్థాయాం సగుడం దధి శస్యతే.

తా. మంటిగడ్డలు, కుండఅంచుపెంకులు, దళమైనఇసుక, వీటిలో దేనినైనను నెఱ్ఱగకాల్చి అవుపెరుగునందువేసి చల్లార్చి తేటగవంచుకొని అందు బెల్లము కలిపి సేవించిన వమనముచేగలిగిన అతిదాహము హరించు.

శ్లో. పిత్తజాయాం సితాయుక్తః పక్వోదుంబరజో రసః.

తా. చక్కగపండిన అత్తిపండ్లరసంబునందు చక్కెర కలిపిత్రాగిన పిత్తముచే జనించినదాహము హరించు.

శ్లో. మథితం శర్కరాయుక్తం లాజపిష్టైర్యుతం పిబేత్
సర్వాంగే లేపనం వా స్యాత్తిలపిష్టైస్సకాంజికైః.

తా. చిక్కమజ్జిగలో శర్కరవేసి యందు వరిపేలపిండి కలిపిత్రాగినను, లేక, గానుగపిండిని పుల్లనికలితో నూరి సర్వాంగములకు లేపనముజేసినను, యెండలో సంచరించుటచే జనించిన అతిదాహము హరించు.

శ్లో. రోగోపసర్గజాతాయాం ధాన్యాంబుససితా మధు
వటప్రరోహయష్ట్యాహ్వ కణా మధుకృతా వటీ.
ముఖస్థాచిరకాలోత్థాం తృష్ణాం హన్యాత్సుదుస్తరామ్.

తా. ధనియాలను ఉదకంబుచే నూరి దానిరసమును పిసుకొని అందు తేనె, చక్కెర, కలిపిత్రాగిన జ్వరాదిరోగంబులచే జనించినతృష్ణ హరించు. మరియు నే యుపచారంబులచేతను దాహము శమింపకుండెనేని మఱ్ఱిచిగుళ్ళు, లేక మఱ్ఱియూడలకొనలు, అతిమధురము, పిప్పళ్ళు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి అందు తేనెబోసి చక్కగ ఖల్వమున మర్దించి మాత్రలుజేసి అందొకమాత్రను పుక్కిట నునిచికొని దాని రసమును మ్రింగుచుండిన బహుకాలంబుగ పీడింపుచుండెడిదాహము నశించు.

ఇట్లు తృష్ణాచికిత్స ముగిసెను.

## మూర్ఛాలక్షణము.

శ్లో. సంజ్ఞావహాసు నాడీషు పిహితాస్వనిలాదిభిః
తమోఽభ్యుపైతి సహసా సుఖదుఃఖవ్యపోహకృత్.
సుఖదుఃఖవ్యపోహాచ్చ నరః పతతి కాష్ఠవత్.

తా. శరీరమునందలి జ్ఞానవాహినులగునాడులు వాతాదిదోషంబులచే నాక్రమింపబడెనేని నప్పుడు దేహి మోహమునుజెంది సుఖదుఃఖజ్ఞానరహితుడై భూమియందు "కాష్ఠంబువలె" బ్రడు. ఇట్టిలక్షణంబులుగలిగిన మూర్ఛారోగమనియు, మోహరోగంబనియు, నెఱుంగవలయు.

శ్లో. హృత్పీడాజృంభణం గ్లానిస్సంజ్ఞాదౌర్బల్యమేవ చ
సర్వాసాం పూర్వరూపాణి యథా స్వం చ విభావయేత్.
మోహమూర్ఛేతి తామాహుష్షడ్విధా సా ప్రకీర్తితా.

తా. ఈమూర్ఛారోగము, వాత, పిత్త, శ్లేష్మము, రక్తము, వీటిప్రకోపములచేతను, మద్యముచేతను, విషముచేతను, జనించు. ఇయ్యారువిధంబులగు మూర్ఛారోగంబుల హృద్రోగము, ఒడలువిరుచుకొనుట, లేక, ఆవలింతలు, బడలిక, ప్రజ్ఞావిహీనము, ఇట్టిలక్షణంబులు గలుగు.

శ్లో. యథా దోషకషాయాంశ్చ జ్వరఘ్నాంశ్చ ప్రయోజయేత్.



తా. వాతాదిదోషంబులచే జనించినజ్వరములు నివృత్తియగుటకై జెప్పంబడియుండెడి కషాయంబులను నిమ్మూర్ఛారోగంబులయందు వాతాదిదోషంబుల నెఱింగి పుచ్చుకొనవలయు.

శ్లో. రక్తజాయాం చ మూర్ఛాయాం హితశ్శీతక్రియావిధిః
మద్యజాయాం వమేన్మద్యం నిద్రాం సేవేద్యథా సుఖమ్.
విషజాయాం విషఘ్నాని భిషజాని ప్రదాపయేత్.

తా. రక్తదోషముచేజనించిన మూర్ఛారోగమునకు శీతలమై హితంబుగనుండు ఔషధంబుల బుచ్చుకొనవలయు. మద్యముచే జనించినమూర్ఛకు యామద్యము బైలువెడలునటుల వమనంబునకు బుచ్చుకొనుటయగాక నిద్రం జెందవలయు. విషముచే జనించినమూర్ఛకు విషంబులహరించెడి యౌషధంబుల బుచ్చుకొనవలయు. ఇట్లొనర్చినమూర్ఛలు నివృత్తియగు.

## మూర్ఛాచికిత్స.

శ్లో. కోలమజ్జాకణోశీరకేసరం శీతవారిణా
పీతం మూర్ఛాం జయేల్లీఢ్వా కృష్ణాం వా మధుసంయుతామ్.

తా. రేగుగింజలగుజ్జు, పిప్పళ్లు, వట్టివేరు, నాగకేసరములు వీటిని సమభాగములుగ నుదకముచే దంచి రసముదీసిత్రాగినను, పిప్పళ్లచూర్ణమును తేనెలో కలిపి పుచ్చుకొనినను, మూర్ఛ హరించు.

శ్లో. మధునా హంత్యుపయుక్తా త్రిఫలా రాత్రౌ గుడార్ద్రకం ప్రాతః
సప్తాహాత్పథ్యభుజో మదమూర్ఛాకాసకామలామోహాన్.

తా. కరక్కాయలు, తానికాయలు, నెల్లివరుగు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి అందు తేనెకలిపి 2 రాత్రులు సేవించుటయగాక, అల్లమును నూరి అందు బెల్లమునుజేర్చి రేగుపండంతముద్దజేసి ఏడుదినంబులు ప్రాతఃకాలంబున సేవించి యుక్తమగు పథ్యంబులొనర్చిన, మదమూర్ఛ, కాస, కామిల, మోహము, ఇవి హరించు.

శ్లో. మహౌషధామృతాద్రాక్షాపౌష్కరగ్రంధికోద్భవమ్
పిబేత్కణాయుతం క్వాథం మూర్ఛాయాం చ మదేషు చ.

తా. శొంఠి, తిప్పతీగ, దీపద్రాక్ష, తామరగడ్డలు, మోడి, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి అందు పిప్పలిచూర్ణము కలిపి సేవించిన మూర్ఛ, మదము, ఇవి హరించు.

శ్లో. పిబేద్దురాలభాక్వాథం సఘృతం భ్రమశాంతయే
అంజనాన్యపి పీడాశ్చ ధూమాః ప్రధమనాని చ.

తా. దురదగొండివేళ్లను దంచి కషాయముబెట్టి యందు నెయ్యి కలిపి త్రాగినను, నేత్రములకు తగుమైనఅంజనములు వేసికొనినను, రక్షలు మొదలగువాటిచే వ్యథనుకలుగ జేసినను యుక్తమైన పొగనుత్రాగినను తగుమైన నస్యముజేసినను మూర్ఛ హరించు.

శ్లో. సూచీభిస్తోదనం శస్తం దాహపీడానఖాంతరే
లుంచనం నఖరోమ్ణాం చ దంతైర్దంశనమేవ చ.

తా. దేహమును సూదులచే బొడుచుట, నఖాంతరములయందగ్నిచే తాపమును గలుగంజేయుట, వెంట్రుకలను చిమటాలచే దీయుట, దంతములచే కొరుకుట, వీటిచే మూర్ఛరోగికి ప్రజ్ఞగలుగు.

శ్లో. ఆత్మగుప్తావఘర్షశ్చ హితస్తస్యావబోధనే.

తా. తీటకోయలకాయమీది నూగునైనను, దురదగొండిపై నూగునైనను, శరీరమునకు లేపనముజేసిన ప్రజ్ఞగలుగు.

ఇట్లు మూర్ఛారోగచికిత్స ముగిసెను.

---

## మదాత్యయరోగలక్షణము.

శ్లో. యేవిషస్య గుణాః ప్రోక్తాస్తేఽపి మద్యే ప్రకీర్తితాః
తేన మిథ్యోపయుక్తేన భవత్యుగ్రో మదాత్యయః.

✓ తా. విషసంబంధముచే గలిగెడిగుణంబులే కల్లు, సారాయి, ఈ మొదలగువాటికిని గలిగియుండు కావున ప్రమాణమునతిక్రమించి మిగుల మద్యపానాదులొనర్పందగదు. ఇటులజేసిన మదాత్యయరోగము జనించు.

శ్లో. అత్యన్నభక్ష్యావతతోదరేణ సాజీర్ణభుక్తేన తథా బలేన
ఉష్ణాభితప్తేన చ సేవ్యమానం కరోతి మద్యం వివిధాన్వికారాన్.

తా. మిగుల అన్నమునుభుజించుట, మిగుల జలపానం బొనర్చుట, వీటిచే గడుపుపుబ్బియుండెడువాడును, అజీర్ణము గలిగియుండునపుడు భుజించినవాడును, దుర్బలుడును, యెండచే దపింపబడినవాడును, వీరలు మద్యపానం బొనర్పందగదు. ఇటులజేసిన మదాత్యయాద్యనేకరోగంబులు జనించు.



శ్లో. హృద్గాత్రతోదకఫసంస్రుతికంఠధూమ
మూర్ఛావమీజ్వరశిరోవదనప్రదాహాః
ఆధ్మానముగ్రమథవోద్గిరణం విదాహః
పానే జరాసముపగచ్ఛతి లక్షణాని.

తా. హృదయము, శరీరము, వీటియందు పొడిచినట్లు బాధ గలిగియుండుట, కఫము బైలువెడలుట, కంఠమున ఆవిరి వెడలుట, ముఖము, శిరస్సు వీటియందు తాపము గలుగుట, మూర్ఛ, వాంతి, జ్వరము, అతిదుర్బలము, తేనుపులు, విదాహము ఇవి గలుగుట, కడుపుబ్బుట, ఇట్టి లక్షణంబులుగలిగిన మదాత్యయరోగంబని యెఱుంగవలయు.

---

## మదాత్యయరోగచికిత్స.

శ్లో. సౌవర్చలమజాజీ చ వృక్షామ్లం సామ్లవేతసమ్
త్వగేలామరిచార్ధాంశం శర్కరాభాగయోజితమ్.
ఏతల్లవణమష్టాంగమగ్నిసందీపనం పరమ్
మదాత్యయే కఫప్రాయే దద్యాత్స్రోతోవిశోధనమ్.

తా. పాదరలవణము, జీలకఱ్ఱ, చింతపండు పులుసు, పుల్లప్రబ్బలి, లవంగపట్ట, ఏలకులు, మిరియాలు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి దీనికిరెండింతలు చక్కెర కలిపి ౧ తులము సేవించిన కఫయుక్తమగు మదాత్యయరోగము హరించి అగ్నిదీపనము గలుగు. (ఇది అష్టాంగలవణము.)

శ్లో. చవ్యం సౌవర్చలం హింగుపూరకం విశ్వభేషజమ్ .
చూర్ణం మద్యేన పాతవ్యం పానాత్యయరుజాపహమ్.

తా. చవ్యము, పాదరలవణము, ఇంగువ, మాదీఫలము, శొంఠి, వీటిని సమభాగములుగ చూర్ణముగావించి మద్యములో కలిపి త్రాగిన మదాత్యయరోగము హరించు.

శ్లో. త్రిఫలాయా రసో వాపి వ్యోషచూర్ణసమాహితః
శుష్కమూలకజో యూషః కౌలిత్థో వా మధూత్కటః.
సర్వైస్సర్వమేవేవం ప్రయోక్తవ్యం చికిత్సితమ్.

తా. కరక్కాయలు, తానికాయలు, నెల్లివరుగు, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి అందు శొంఠి, పిప్పలి, మిరియాలు, వీటిచూర్ణమును కలిపి త్రాగినను, లేక యెండిన ముల్లంగిగడ్డలను కషాయముబెట్టి పుచ్చుకొనినను, లేక ఉలవకట్టులో తేనె కలిపి త్రాగినను, మదాత్యయరోగము నశించు.

శ్లో. త్వక్పిప్పలీభుజగపుష్పబిడైరుపేతం
సేవేత హింగుమరిచైలయుతం ఫలామ్లమ్
ఉష్ణాంబుసైంధవయుతాత్వథవా బిడత్వ
క్చవ్యైలమూలమగధాఫలహింగుశుంఠీ.

తా. లవంగపట్ట, పిప్పళ్లు, నాగకేసరములు, బిడాలవణము, ఇంగువ, మిరియాలు, ఏలకులు, పుల్లప్రబ్బలి, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి సేవించినను, లేక సైంధవలవణము, లేక బిడాలవణము, లవంగపట్ట, చవ్యము, ఏలకులు, మోడి, పిప్పలి, యింగువ, శొంఠి, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి ఉష్ణోదకముతో బుచ్చుకొనినను, మదాత్యయరోగము నివృత్తియగు.

ఇట్లు మదాత్యయరోగచికిత్స ముగిసెను.

## * దాహలక్షణము.

శ్లో. త్వచం ప్రాప్తస్సమానోష్మా పిత్తరక్తాభిమూర్ఛితః
దాహం ప్రకురుతే ఘోరం పిత్తవత్తత్ర భేషజమ్.

తా. సమానవాతంబువలన జనించిన ఉష్ణము చర్మమునందు వ్యాపించుటచే పిత్తరక్తము జెడు. అందుచే ఘోరంబగు తాపముజనించు. కావున నీ అతితాపమునకు పిత్తంబునకు జెప్పియుండెడి చికిత్సలనే జేయవలయు.

## దాహచికిత్స.

శ్లో. శీతాంబుశీతలతరైశ్చ శయానమేనం
హారైర్మృణాళవలయైరబలాస్పృశేయుః
భిన్నోత్పలోజ్జ్వలహిమే శయనే శయీత
యంత్రేషు వాస జలబిందుషు పద్మినీనామ్.

తా. తామరకమలములయందు శయనించుట, ఊటగలబావులు, చెరువులు, గుంటలు, జలయంత్రములు, వీటికి సమీపంబున నుండుట, సుందరులగుస్త్రీల నాలింగనం బొనర్చికొనుట, ఇట్టి కార్యంబులచే దాహము శమించు.

శ్లో. బదరీపల్లవోత్థేన ఫేనేనారిష్టకస్య వా
సురామండాంబుదధ్యామ్లం మాతులుంగరసో మధు.

* దాహమనగా తాపము,



తా. రేగాకులనైనను వేపాకులనైనను, దంచి నురుగుదీసి యందు మద్యమువిూది నీళ్లు, పెరుగువిూదినీళ్లు, మాదీఫలపురసము, కలిపి త్రాగిన తాపము శమించు.

శ్లో. సంపూర్ణమవగాహేత ద్రోణీం దాహార్దితో నరః.

తా. దాహపీడితుడు దోనీలలో శీతోదకంబును బోసి అందు మునిగియుండిన దాహము శమించు.

శ్లో. వాప్యః కమలహాసిన్యో జలయంత్రగృహాశ్శుభాః
నార్యశ్చందనదిగ్ధాంగ్యో దాహదైన్యహరామతాః.

తా. తామరకమలంబులుగల కొలంకులలోనైనను, బావులలోనైనను, స్నానము చేయుటచేతను, శ్రీగంధమును నలదికొనినస్త్రీల నాలింగనం బొనర్చికొనుటచేతను, దాహము శమించు.

శ్లో. ప్రాతఃపర్యుషితం ధాన్యం సలిలం సితయాయుతమ్
అంతర్దాహం హరేత్పీతం దుఃఖం మృత్యుంజయో యథా.

తా. రాత్రి చారెడుధనియాలను దంచి శీతోదకమున నానబోసి ప్రాతఃకాలమునం దానీరును వడియగట్టి అందు చక్కెర కలిపి త్రాగిన "సాంబమూర్తి సాధువుల దుఃఖంబుల పరిహారింపం జేయుచందంబున" అంతర్దాహము నశించు.

శ్లో. సహస్రధౌతేన ఘృతేన దిగ్ధదేహస్య దాహః కృశతాం బిభర్తి
అన్యాంగనాసంగమసాదరస్య స్వీయేషు దారేషు యథాభిలాషః.

తా. నెయ్యిని వేయిమారులు శీతోదకంబుచే రుద్ది వెన్నవలెజేసి శరీరమునకు లేపనముజేసికొనిన "పరస్త్రీసంగమముచే స్వకామినియం దభిలాష తరుగుచందంబున" దాహము శీఘ్రంబుగ శమించు.

శ్లో. తృడ్దాహమోహాః ప్రశమం ప్రయాంతి
నింబప్రవాళోత్థితఫేనలేపాత్
యథా నరాణాం ధనినాం ధనాని
సమాగమాద్వారవిలాసినీనామ్.

తా. వేపచిగుళ్ళలో నుదకముబోసి దంచి రసముదీసి దానిని చిలికి పైనతేలిన నురుగును దేహమునకు లేపనముజేసికొనిన "ధనికునిధనము వేశ్యాస్త్రీసంగమముచే నశించుచాడ్పున" తాపము, తృష, మోహము, ఇవియన్నియు నశించు.

శ్లో. దాహేఽతిశిశిరం తోయం క్రియా కార్యా సుశీతలా.

తా. ఇంతజెప్పనేల "శీతోదకమును పానం బొనర్చుటచేతను, దానిని ఉపచరించుటచేతను, దాహము శమించు.

శ్లో. సర్వాంగే చందనాలేపశ్చంద్రకస్తూరికాయుతః
సితనీరజలేపో వా ధారాగారాతివేశనమ్.

తా. పచ్చకర్పూరము, కుంకుమపువ్వు, కస్తూరి, శ్రీగంధము, వీటిని సర్వాంగములకు లేపనము జేసికొనినను, తెల్లని తామరకమలములను నుదకముచే నూరి దేహమునకు లేపనము జేసికొనినను, జలయంత్రములు గలగృహంబున బరుండినను, తాపము శాంతిజెందు.

శ్లో. సహజస్నేహసోత్సాహముగ్ధమంజుళలాపినామ్
బాలకానాం సమాశ్లేష స్తాపం నిర్వాపయేజ్జవాత్.

తా. సహజస్నేహంబును, ఉత్సాహంబును, మనోజ్ఞంబు లగుమాటలును, గల బాలుర నాలింగనము జేసికొనుటచే, తాపము శమించు.

శ్లో. ఉశీరాగారశయనం తాళవృంతానువర్తనమ్
సాహిత్యసరసావాణి కవీనాం తాపహృత్త్రయమ్.

తా. వట్టివేళ్లచే నిర్మింపంబడిన గృహములయందు బరుండుటచేతను, విసనకఱ్ఱలచే విసురుకొనుటచేతను, పండితులు, కవీశ్వరులు, వీరలతో సంభాషించుటచేతను, తాపము శమించు.

శ్లో. పానీయామలకీద్రాక్షా నారికేళం సుశర్కరమ్
గాయనం సుకుమారీణాం దాహమూర్ఛాం హరేద్ధ్రుతమ్.

తా. నెల్లికాయలు, దీపద్రాక్ష, వీటిరసమును ద్రాగుటచేతను, టెంకాయనీరులో చక్కెరకలిపి త్రాగుటచేతను, సుకుమారులగు ప్రౌఢస్త్రీలగానముల నాలకించుటచేతను, తాపము, మూర్ఛ, ఇవి హరించు.

శ్లో. సేవనాయ హితం తాపే కోమలం మాత్రలం ఫలమ్.

తా. దాహపీడితుడు మృదువగుఫలంబులభక్షించిన మూత్రోత్సర్జనము చల్లనగు.

ఇట్లు దాహచికిత్స ముగిసెను.

---

## ఉన్మాదలక్షణము.

శ్లో. ధీవిభ్రమస్సత్వపరిప్లవశ్చ పర్యాకులాదృష్టిరధీరతాచ [లింగమ్.
అబద్ధవాక్యం హృదయం చ శూన్యం సామాన్యమున్మాదగదస్య

తా. చిత్తభ్రాంతి గలుగుట, సత్వగుణము లేకుండుట, వికారముగ జూచుట, అధైర్యము జెందియుండుట, అసంగతముగ సంభాషించుట, అంతఃకరణము శూన్యముగనుండుట, ఇట్టిలక్షణంబులు గలిగిన ఉన్మాదరోగంబని ఎరుంగవలయు,



[స్స్యాత్
శ్లో. యస్సన్నిపాతప్రభవోఽతిఘోరస్సర్వైస్సము త్థైస్సతు హేతుభి
అత్యర్థవాగ్విక్రమవీర్యచేష్టో జ్ఞానాదివిజ్ఞానబలాదివీర్యః.
ఉన్మాదకాలే నియతశ్చ తస్య భూతోత్థఉన్మాదముదాహరంతి.

తా. సన్నిపాతోన్మాదంబున సన్నిపాతజ్వరమునకు గలలక్షణంబులన్నియు దృశ్యంబులగుటచే నీయఘోరంబగు యున్మాదం బసాధ్యంబుగాన నిట్టియున్మాదంబు గల రోగి చికిత్స కర్హుండుగాడని సుశ్రుతాద్యాయుర్వేదగ్రంథములయం దుపన్యసింపంబడి యున్నయది. మరియు సన్నిపాతోన్మాదలక్షణంబులన్నియు గలిగి మిగుల సంభాషణ, పరాక్రమము, అతిచేష్ట, తత్వజ్ఞానము, శిల్పాదిజ్ఞానము, స్మృత్యాదికథనము, బలము, ఇవియును గలిగియుండిన భూతోన్మాదంబని ఎఱుంగవలయు.

---

## ఉన్మాదచికిత్స.

శ్లో. త్ర్యూషణం హింగులవణం వచాకటురోహిణీ
శిరీషనక్తమూలానాం బీజం శ్వేతాశ్చసర్షపాః.
గోమూత్రపిష్టైరేతైస్తు వర్తిర్నేత్రాంజనే హితా
చాతుర్థికమపస్మార ఉన్మాదం చ నియచ్ఛతి.

తా. శొంఠి, పిప్పలి,మిరియాలు, ఇంగువ, సైంధవలవణము, వస, కటుకరోహిణి, దిరిశనపువిత్తులు, కానుగవిత్తులు, తెల్లావాలు, వీటిని సమభాగములుగ గోమూత్రముచే దంచి రసముదీసి అందు వస్త్రంబునుదడిపి కన్నులలోపిండిన చాతుర్థికజ్వరము, అపస్మారము, ఉన్మాదము, ఇవియన్నియు నివృత్తియగు. (ఇది త్ర్యూషణవర్తి.) •

శ్లో. సిద్ధార్థకవచాహింగు కరంజోదేవదారు చ
మంజిష్ఠాత్రిఫలాశ్వేతా కటభీత్వక్కటుత్రికాః.
సమాంశం చ ప్రియంగుశ్చ శిరీషో రజనీద్వయమ్
బస్తమూత్రేణ పిష్ట్వేద మగదం పానమంజనమ్.
నస్యమాలేపనం చైవ స్నానముద్వర్తనం తథా
అపస్మారవిషోన్మాదకృత్యాలక్ష్మీ జ్వరాపహామ్.
భూతేభ్యశ్చ భయంహంతి రాజద్వారే చ శస్యతే
సర్పిరేతేన సిద్ధం వా సగోమూత్రం తదర్థకృత్.

తా. తెల్లావాలు, వస, ఇంగువ, కానుగవిత్తులు, దేవదారుపట్ట, మంజిష్ఠి, కరక్కాయలు, తానికాయలు, నెల్లివరుగు,కటిక, మాల్కంగిణీవిత్తులు, లవంగపట్ట, శొంఠి,

పిప్పళ్ళు, మిరియాలు, కొఱ్ఱబియ్యము, దిరిశనపువిత్తులు, పసపు, మానిపసుపు, వీటిని సమముగ మేకపోతుమూత్రముచే నూరి బుచ్చుకొనినను, అంజనము, నస్యము, లేపనము, స్నానము, వీటిని గావించినను, అపస్మారము, విషము, ఉన్మాదము, కృత్యాప్రయోగము, జ్వరము, భూతబాధ, ఇవియన్నియుం నశించు. మరియు నీయౌషధంబునందు నెయ్యి కలిపి పక్వముజేసి నాఘృతంబున సగము గోమూత్రముబోసి పుచ్చుకొనిన రాజద్వారంబున సగా గుణమును గలుగంజేయుం. (ఇది సిద్ధార్థకయోగము.)

శ్లో. కామశోకభయక్రోధహార్షేర్ష్యాలోభసంభవాన్
పరస్పరప్రతిద్వంద్వైరేభిరేవ శమం నయేత్.

తా. మరియుం నీసిద్ధార్థకయోగమును సేవించిన కామము, శోకము, భయము, క్రోధము, సంతోషము, అసూయ, లోభము, వీటిచే ప్రత్యేకములుగనైనను, ద్వంద్వములుగనైనను జనించినరోగంబులు నివృత్తియగు.

శ్లో. కార్పాసాస్థిమయూరపిఞ్ఛబృహతీనిర్మాల్యపిండీతక
త్వఙ్మాంసీవృషదంశవిట్తుషవచాకేశాహినిర్మోచనైః
నాగేంద్రద్విజశృంగహింగుమరిచైస్తుల్యైస్తు ధూపః కృత
స్స్కందోన్మాదపిశాచరాక్షససురావేశజ్వరఘ్నస్స్మృతః.

తా. ప్రత్తిగింజలు, నెమిలియీకెలు, వాకుడు, మొగిలిపుష్పము, మంగకాయలు, లవంగపట్ట, జటామాంసి, మార్జాలవిష్ఠము, వరిపొట్టు, వస, మనుజునివెంట్రుకలు, పాముకూసము, ఏనుగదంతము, దుప్పికొమ్ము, ఇంగువ, మిరియాలు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి ధూపమువేసిన స్కందోన్మాదము, అపస్మారము, ఉన్మాదము, పిశాచములు, రాక్షసులు, దేవతాసంచారము, వీటిచే నుత్పన్నంబయిన జ్వరములు నశించు.

ఇట్లు ఉన్మాదచికిత్స ముగిసెను.

## అపస్మారలక్షణము.

శ్లో. తమఃప్రవేశస్సంరంభో వేగోద్రేకో హతస్మృతిః
అపస్మార ఇతి జ్ఞేయో గదో ఘోరస్సఫేనకః.

తా. తమోగుణము, తొందర, వెఱపు, అతివేగము, ఇవి గలిగియుండుట, స్మృతి నశించియుండుట, నోట నురుగు ప్రవించుట, ఇట్టిలక్షణంబులు గలిగిన మిగుల ఘోరమయిన అపస్మారరోగంబని ఎరుంగవలయుం.



శ్లో. వాతికం వస్తిభిః ప్రాయః పైత్తికం చ విరేచనైః
కఫజం వమనప్రాయైరపస్మారముపాచరేత్.

తా. వాతముచేజనించిన నపస్మారంబునకు తరుచుగ వస్తికర్మ చేయవలయుం. పైత్యముచే జనించిన నపస్మారంబునకు, విరేచనమునకు బుచ్చుకొనవలయుం. శ్లేష్మముచే జనించిన నపస్మారంబునకు వమనమునకు బుచ్చుకొనవలయుం.

## అపస్మారచికిత్స.

శ్లో. పుష్యోద్ధృతం శునఃపిత్తమపస్మారఘ్నమంజనమ్
తదేవ సర్పిషా యుక్తం ధూపనం పరమం హితమ్.

తా. పుష్యమీనక్షత్రమున కుక్కపిత్తమును దీసి నేత్రముల కంజనమువేసినను, లేక దానిని నేతితో కలిపి ధూపమువేసినను, అపస్మారము నశించు.

శ్లో. మనోహ్వాతార్క్ష్యకం చైవ శకృత్పారావతస్య చ
అంజనం హంత్యపస్మారమున్మాదం చ విశేషతః.

తా. మణిశిల, రసాంజనము, పావురపుపెంటికలు, వీటిని నేత్రముల కంజనము వేసిన, అపస్మారము, ఉన్మాదము, ఇవి నశించు.

శ్లో. యష్టీహింగువచావక్రీశిరీషలశునామయైః
సాజమూత్రైరపస్మారే సోన్మాదేనావనాంజనే.

తా. అతిమధురము, ఇంగువ, వస, దిరిశనపువిత్తులు, వెల్లుల్లి, కోష్ఠు, వీటిని సమభాగములుగ దంచి అందు బొంతజెముడుపాలు, మేకపంచితము కలిపి చక్కగ నూరి నేత్రముల కంజనమువేసినను, లేక నస్యముజేసినను, అపస్మారము, ఉన్మాదము, ఇవి హరించు.

శ్లో. వచామృతావ్యోషమధూకసారరుద్రాక్షసింధూద్భవబార్హతాని
ఫలం సముద్రస్య రసోనకల్కం ధ్మాతం హి నాసాపుటమధ్యదేశే.
అపస్మృతిశ్లేష్మమరుచ్ఛిరోరుత్ప్రలాపతంద్రాభ్రమజాడ్యమోహాన్
సన్నిపాతశ్రుతికాక్షిభంగాన్ సపీనసం హంతి హలీమకం చ.
రసాయనం భైరవనామధేయం జ్ఞాతం విచారాత్కవివిష్ఠలేన.

తా. వస, తిప్పతీగ, శొంఠి, పిప్పలి, మిరియాలు, ఇప్పబంక, రుద్రాక్ష, సైంధవలవణము, వాకుడుకాయ, తెల్లగడ్డలు, వీటిని సమభాగములుగ ములకపండ్లరసముచే నూరి అందు దుదకముకలిపి ముక్కులలో పిండిన అపస్మారము, శ్లేష్మరోగము, వాయువు,

కపాలరోగము, వదురుట, తంద్ర, భ్రమ, మోహము, సన్నిపాతము, కర్ణరోగము, నేత్రవికారములు, పీనస, హలీమక మనుకామిల, ఇవియన్నియు హరించు. (ఇది విఠ్ఠలాచార్యులచే వచింపబడిన భైరవరసాయనము.)

శ్లో. శంఖపుష్పీవచాకుష్ఠైస్సిద్ధం బ్రాహ్మీరసే ఘృతమ్
పురాణం హంత్యపస్మారం మేధ్యమున్మాదనాశనమ్.

తా. శంఖపుష్పములు, వస, కోష్ఠు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి అందు నెయ్యి, సరస్వతిఆకు (వల్లారి) రసముబోసి రస మిగురువరకు కాచి యందలి నెయ్యినివడియగట్టి పూట కొకతులముచొప్పున సేవించిన చాలాకాలమునుంచి బాధింపుచుండెడి అపస్మారము, ఉన్మాదము ఇవి హరించు.

శ్లో. ఘృతసైంధవహింగుభ్యోకర్షైర్ద్వాత్రైశ్చతుర్గుణైః
మూత్రైస్సిద్ధమపస్మారం హృద్రోగగుల్మనాశనమ్.

తా. సైంధవలవణము ౧ తులము, ఇంగువ ౧ తులము, ఇత్తెటంగున వీటిని చూర్ణముజేసి అందు నెయ్యి ౧ తులము, ఆవుపంచితము ౧౨ తులములు, కలిపి పంచిత మిగురువరకు పక్వముగ కాచి యందలి నెయ్యిని పూటకొక తులముచొప్పున సేవించిన అపస్మారము, హృద్రోగము, ఇవి నశించు.

శ్లో. అరణ్యత్రపుసీమూలం నస్యేనాపస్మృతిం జయేత్.

తా. వెఱ్ఱిపుచ్చవేరును చూర్ణముజేసి నస్యముజేసిన అపస్మారము నివృత్తియగు.

ఇట్లు అపస్మారచికిత్స ముగిసెను.

## వాతవ్యాధిలక్షణము.

శ్లో. దేహే స్రోతాంసి రిక్తాని పూరయిత్వానిలో బలీ
కరోతి వివిధాన్వ్యాధీన్ సర్వాంగైకాంగసంశ్రయాన్.

తా. ప్రబలమగువాయువు శిరస్సుయందలి నరములు, బోలునరములు వీటియందు వ్యాపించి శరీరమునందలి యెల్ల అవయవములయందైనను, లేక యేదో నొకఅవయవమునందైనను, యనేకవిధములగు వాతరోగములను గలుగంజేయు.

శ్లో. సంకోచః పర్వణాం స్తంభో భంగోఽస్థ్నాం పర్వణామపి
రోమహర్షః ప్రలాపశ్చ పాణిపృష్ఠశిరోగ్రహః.
ఖాంజ్యపాంగుల్యకుబ్జత్వం శోషోఽంగానామనిద్రతా
గర్భశుక్రరజోనాశం స్పందనం గాత్రసుప్తతా.



శిరోనాసాక్షిజత్రూణాం గ్రీవాపార్శ్వాభికుంచలమ్
భేదస్తోదోర్తిరాక్షేపో మోహశ్చాయాస ఏవ చ.
ఏవం విధాని రూపాణి కరోతి కుపితోఽనిలః
హేతుస్థాన విశేషైశ్చ భవేద్రోగ విశేషకృత్.
సర్వాంగైకాంగరోగాంశ్చ కుర్యాత్స్నాయుగతోఽనిలః
ఊర్ధ్వవాత మధోవాతం కుంభకం నళమారుతమ్
సంధివాతం కటీవాతం శిరోవాతం వదన్త్యలమ్.

తా. కీళ్లు, గణుపులు, ఇవి బిగపట్టుట, ఎముకలసంధులయందును, సర్వసంధులయందును పటపటయని మెటికలు విరుగుట, శరీరము గగుర్పొడుచుట, వదురుట, చేతులు, వీపు, శిరస్సు, ఇవి బిగబట్టుట, కుంటితనము, పిచ్చుకుంటితనము, కుబ్జత్వము ఇవి కలుగుట, అంగములు శోషించియుండుట, శరీరము రూక్షగలిగియుండుట, నిదుర బట్టకయుండుట, గర్భము, వీర్యము, ఇవి నశించుట, ప్రతిమాసంబున స్త్రీలు బుతువు గాకుండుట, శిరస్సు, నాసికము, నేత్రములు, మెడకొంకులు, మెడ, ఇవి సంకోచములైయుండుట, కంపము, జడత్వము, మోహము, ఆయాసము, ఇవి గలుగుట, ప్రజ్ఞ లేకుండుట, గుహ్యస్థానంబులు పగిలి చురుకుగలిగియుండుట, ఇట్టిలక్షణంబులుగలిగిన వాతరోగంబని నెరుంగవలయు. మరియు వాయువు శిరోగతంబైన సర్వాంగవాయువు, ఏకాంగవాయువు, ఊర్ధ్వవాయువు, అధోవాయువు, కుంభకవాయువు, నళవాయువు, సంధివాయువు, కటివాయువు, శిరోవాయువు, ఈమొదలగు యనేక వాతరోగములను వాటివాటి హేతువిశేషములచేతను స్థానబలంబులచేతను, జనింపంజేయు.

శ్లో. అభ్యంగస్వేదనం వస్తి నస్యం స్నేహం విరేచనమ్
స్నిగ్ధామ్లలవణస్వాదు వృష్యం వాతానులోమనమ్.

తా. అభ్యంగనము, వస్తికర్మ, నస్యము, అంజనము, వీటినిగావించుట, చెమటపడియునటులచేసుట, తైలము మొదలగువాటిచే మర్దనజేయించికొనుట, రేచనమునకు బుచ్చుకొనుట, స్నిగ్ధపదార్థము, పుష్టిగలపదార్థము, పులుసు, కారము, మధురము, ఇవి గలపదార్థములను సేవించుట, వీటిచే వాతవ్యాధులు హరించు.

## వాతవ్యాధిచికిత్స.

శ్లో. వాజిగంధాబలాస్త్రిస్రో దశమూలీ మహౌషధమ్
గృధ్రనఖ్యాచ రాస్నాచ గణో మారుతనాశనః.

తా. పెన్నేరుగడ్డ, చిట్టాముట్టి, పేరాముట్టి, నాగచిట్టాముట్టి, దశమూలములు, శొంఠి, రేగుపండ్లు, అడవిరేగుపండ్లు, సన్నరాష్ట్రకము, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి పుచ్చుకొనిన వాతవ్యాధి శమించు.

శ్లో. నిర్గుండ్యాచోపనాహం చ కరంజైశ్చాపి పిత్తలైః
భేషజైస్సేకలేపాది హ్యాభిషేకాదికం చరేత్.

తా. వావిలాకునైనను, కానుగాకునైనను, కానుగచక్కనైనను, దంచి వెచ్చజేసి కట్టుటచేతను, పిత్తోద్రేకముగల యౌషధములచే లేపనములు, ఆవిరులు, స్నానములు, వీటిని గావించుటచేతను, వాతరోగము శమించు.

శ్లో. చిత్రకేంద్రయవాపాఠా కటుకాతివిషాభయా
మహావ్యాధిప్రశమనో యోగష్షట్చరణస్స్మృతః.

తా. చిత్రమూలము, కొడిశవిత్తులు, అగరుశొంఠి, కటుకరోహిణి, అతివస, కరక్కాయలు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి తేనెతో సేవించిన మహావాతవ్యాధులు నశించు. (ఇదిషట్చరణయోగము.)

శ్లో. చిత్రకత్రిఫలావ్యోషభల్లాతకగుడం సమమ్
సేవనీయం ప్రయత్నేన వాతదోషనివారణమ్.

తా. చిత్రమూలము, కరక్కాయలు, తానికాయలు, నెల్లివరుగు, శొంఠి, పిప్పలి, మిరియాలు, శుద్ధిజేసిన జీడిగింజలు, పాతబెల్లము, వీటినన్నిటిని సమముగ నేకముజేసి మర్దించి ప్రతిదినము నెల్లికాయంత భక్షించిన వాతరోగములు హరించు. (ఇది చిత్రకాద్యౌషధము.

శ్లో. ఏతద్యోగేన సంయుక్తం గుగ్గులుం మధుసర్పిషా
సంలేహ్య నాశయేత్తూర్ణం వాతరోగం విశేషతః.

తా. పైచిత్రకాద్యౌషధమునకు సమముగ శుద్ధిజేసిన గుగ్గిలపుచూర్ణమును జేర్చి అందు తేనె, నెయ్యి కలిపి పక్వముగ యుడికించిసేవించిన వాతరోగములు శీఘ్రముగ నశించు.

శ్లో. సురతరురామఠకుష్ఠం శతపుష్పాసైంధవం వచార్కపయః
అస్థిగతానపి వాతాన్నిహంత్యేకేన లేపేన.

తా. దేవదారుపట్ట, ఇంగువ, కోష్ఠు, పెద్దసోపు, సైంధవలవణము, వస, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి జిల్లేడుపాలతో ఖల్వమున నూరి శరీరమున లేపనము జేసిన అస్థిగతవాయువులు నశించు.

శ్లో. శతపుష్పసురదారుదినేశపయోగరరామఠసింధుభవం హారతి
అపిలేపనతోఽస్థిగతం మరుతం కటిసంధిగతం త్రిదినాత్సతతమ్.

తా. పెద్దసోపు, దేవదారుపట్ట, వసనాభి, ఇంగువ, సైంధవలవణము, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి అందు జిల్లేడుపాలుబోసి నూరి శరీరమునకు లేపనముజే



సిన అస్థిగతవాయువు, కటిగతవాయువు, సంధిగతవాయువు, ఈమొదలగువాయువులు మూడుదినములలో నశించు.

శ్లో. ప్రక్షయిత్వా క్షురేణాంగం కేవలానిలపీడితమ్
తత్ర ప్రలేపం దద్యాచ్చ పిష్ట్వా గుంజాఫలే కృతమ్.
తేనాప బాహుజాఃపీడా విశ్వాచి గృధ్రసీతథా
అన్యాశ్చ వాతజాః పీడా ప్రశమం యాతి వేగతః.

తా. వాతోపద్రవము గలిగియుండెడిస్థలమునందలి వెంట్రుకలం బోకడచి గురిగింజలమీదిపొట్టువొలిచి దానిని నుదకముచే నున్నగనూరి లేపనముజేసిన అపబాహువాయువు, విశ్వాచివాయువు, గృధ్రసివాయువు, ఈమొదలగు వాతరోగములన్నియు నివృత్తియగు.

శ్లో. రాస్నామృతా దేవదారు నాగరైరణ్డజం శృతమ్
సప్తధాతుగతే వాతే సామే సర్వాంగగే పిబేత్.

తా. సన్నరాష్టకము, తిప్పతీగ, దేవదారుపట్ట, శొంఠి, ఆముదపువేరు, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి పుచ్చుకొనిన సప్తధాతుగతవాయువు, ఆమవాయువు, సర్వాంగవాయువు, ఈమొదలగు వాయువులన్నియు నశించు.

శ్లో. రాస్నాత్రిగుణభాగాస్యా దేకభాగస్తతః పరః
ధన్వయాస బలైరండ దేవదారు శఠీవచా.
వాసకో నాగరం పథ్యా చవ్యముస్త పునర్నవా
గుడూచీ వృద్ధదారూ చ సతపుష్పా చ గోక్షురః.
అశ్వగంధా ప్రతివిషా కృతమూల శతావరీ
కృష్ణాసహాచరశ్చైవ ధాన్యకం బృహతీద్వయమ్.
ఏభిః కృతం పిబేత్క్వాథం శుంఠీచూర్ణేన సంయుతమ్
కృష్ణాచూర్ణేనవా యోగరాజగుగ్గులునాథవా.
అజమోదాదినా వాపి తైలే నైరణ్డజేనవా
సర్వాంగకంపే కుబ్జత్వే పక్షాఘాతేపబాహుకే.
గృధ్రిస్యామామవాతే చ శ్లీపదే చాపతానకే
అంత్రవృద్ధౌ తథాధ్మానే జంఘాజానుగతేర్దితే.
శుక్రామయే మేఢ్రరోగే వంధ్యాయోన్యామయేషు చ
మహారాస్నాది గదితో బ్రహ్మణా గర్భకారణమ్.

తా. సన్నరాష్టకము 3 భాగములు, దురదగొండివేరు, చిట్టాముట్టివేరు, ఆముదపువేరు, దేవదారుపట్ట, కచ్చూరములు, వస, అడ్డసరము, శొంఠి, కరక్కాయలు,

చవ్యము, తుంగగడ్డలు, తెల్లగలిజేరువేరు, తిప్పతీగె, పరంగిచెక్క, పెద్దసోపు, పల్లేరువేళ్లు, వెన్నేరుగడ్డ, నల్లఅతివస, రేలపట్ట, చల్లపిల్లిగడ్డలు, పిప్పళ్లు, గోరంటవేరు, ధనియాలు, చిన్నములక, పెద్దములక, ఇవియన్నియు ఒక్కొకభాగముచొప్పున వీటినన్నిటిని యేకముజేసి దంచి గషాయముబెట్టి అందు శొంఠిచూర్ణంబునైనను, పిప్పలిచూర్ణంబునైనను, యోగరాజగుగ్గిలమునైనను, ఓమచూర్ణమునైనను, ఆముదమునైనను, కలిపి ప్రాతస్సాయంకాలములయందు పుచ్చుకొనిన సర్వాంగకంపవాయువు, కుబ్జవాయువు, పక్షగతవాయువు, అపబాహువాయువు, గృధ్రసివాయువు, ఆమవాయువు, శ్లీపదము, అపతానకవాయువు, ఆంత్రవృద్ధి, ఆధ్మానవాయువు, పిక్కలు, మోకాళ్లు, వీటియందలి వాయువు, శుక్రగతదోషము, అండవాయువు, మేఢ్రవాయువు, యోనిరోగము, ఈ మొదలగు వాతరోగంబులను, స్త్రీలవంధ్యత్వమును పరిహరింపంజేయుటయగాక దీనిని సేవించుటచే స్త్రీలకుగర్భోత్పత్తి సగా గలుగునని సృష్టికర్తయగు విరించి వచించె. కావున నీమహారాస్నాదికషాయము మిగుల శ్రేష్ఠంబైనదిగ నున్నయది. (ఇది మహారాస్నాది పంచకకషాయము.)

శ్లో. ఏరండబిల్వౌ బృహతీద్వయం చ సౌవర్చలవ్యోషవిరామఠం చ
సన్మాతులుంగీ లవణోత్తమం చ క్వాథోధనుర్వాతహరః ప్రశస్తః.

తా. ఆముదపువేళ్లు, మారేడువేళ్లు, వాకుడు, ములక, పాదరలవణము, శొంఠి, పిప్పలి, మిరియాలు, ఇంగువ, మాధీఫలపుబెరడు, సైంధవలవణము, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి పుచ్చుకొనిన ధనుర్వాతము హరించు. (ఇది యేరండాది కషాయము.)

శ్లో. విశోధ్యైరండబీజాని పిష్ట్వా క్షీరే విపాచయేత్
తత్పాయసం కటీశూలే గృధ్రిస్యాం పరమౌషధమ్.

తా. ఆముదపుపప్పును చూర్ణముగావించి యందు దావుపాలుబోసి యుడికించి ౧ పలమునకు మించకుండునటుల దేహతత్త్వముకొలదిగ సేవించిన నడుమునొప్పులు, గృధ్రసివాయువు, ఇవియన్నియు నశించు.

## వాతరోగంబునకు రసచికిత్స.

శ్లో. అభ్రగంధవిషవ్యోష రసటంకాణ సమాంశకాణ
భావయేత్సప్తధా భృంగరసేన స్యాత్సమీరహా.
ఆర్ద్రద్రవేణ వల్లోవా ఖండవ్యోషేణ యోజితః
మహాన్వాతా న్జయత్యాశు నాసాధ్మాతస్సు సంజ్ఞకృత్.

తా. అభ్రకభస్మము, శుద్ధిజేసిన గంధకము, శుద్ధిజేసిన వసనాభి, శొంఠి, పిప్పలి, మిరియాలు, శుద్ధిజేసిన పాదరసము, శుద్ధిజేసిన వెలిగారము, వీటిని సమభాగములుగ నూరి యందు గుంటగలగరాకు రసముబోసి చక్కగ ఖల్వమున మర్దించి ౭ పర్యాయములు గుంటగలగరాకురసముచే భావనజేసి మూడుగురుగింజలంతేసి మాత్రలుజేసి నీడన యెండించి అం దొకమాత్రను అల్లపురసముచేనైనను, ఖండశర్కరతోనైనను, శొంఠి, పిప్పళ్ళు, మిరియాలు, వీటిచూర్ణముచేనైనను, సేవించిన ప్రబలమగు వాతరోగంబు నివృత్తియగు. మరియు నీయౌషధమును ముక్కులలోపిండిన యందలి కల్మషము హరించు. (ఇది సమీరపన్నగరసము.)

శ్లో. సూతం గంధకచిత్రకం త్రికటుకం ముస్తం విషం త్రైఫలం
తుల్యాంశం విదధాత్తుమార్కవరసే కృత్వా చ గుంజావటీ
కుష్ఠాష్టాదశకం ప్రమేహకఫజం వాతప్రకోపం క్షయం
రోగానేకకరీంద్రదర్పదళనః పంచాననో వైద్యరాట్.

తా. శుద్ధిజేసిన పాదరసము, శుద్ధిజేసిన గంధకము, చిత్రమూలము, శొంఠి, పిప్పలి, మిరియాలు, తుంగగడ్డలు, శుద్ధిజేసిన వసనాభి, కరక్కాయలు, తానికాయలు, నెల్లివరుగు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి అందు గుంటగలగరాకు రసముబోసి చక్కగ ఖల్వమున మర్దించి గురుగింజలంతేసి మాత్రలుజేపి నీడనయెండించి యందొక మాత్రను అనుపానవిశేషముచే బుచ్చుకొనిన పదునెనిమిది కుష్ఠురోగములు, ప్రమేహములు, శ్లేష్మరోగములు, వాతప్రకోపము, క్షయరోగము, ఈమొదలగు "గజముంబోలిన వాతరోగంబులను సింహంబుభంగి" నీఔషధము నశింపంజేయు, కావున నిది అమృతతుల్యంబైనదిగ నున్నయది. (ఇది వాతగజసింహరసము.)

శ్లో. అత్ర క్వాథం ఘృతం తైలం చూర్ణం పాకావలేహికమ్
వటికా గుటికా ప్రోక్తా రసాస్తం నాత్ర లేఖితమ్.

తా. ఈవాతవ్యాధి కనేకకషాయంబులు, ఘృతములు, తైలములు, చూర్ణములు, పాకములు, లేహములు, వడియములు, మాత్రలు, రసములు, ఈమొదలగు ననేకచికిత్సలు ఇతరగ్రంథములయం దుదహరింపంబడియుండినను గ్రంథవిస్తరభీతిచే నేనిందు గొన్ని క్రియలనుమాత్రము నుదహరించినాడ.

శ్లో. వాతరోగస్త్వసాధ్యోఽయం దైవయోగాత్తుసిధ్యతి
అనుమానేన కుర్వీత వైద్యకో న ప్రతిజ్ఞయా.

తా. వాతరోగంబులన్నియు నసాధ్యంబులుగాన వైద్యుండు నేనీరోగంబును కుదుర్చెదనని ప్రతిజ్ఞయొనర్చక చికిత్సలం జేయుచుండిన నది దైవయోగంబుచే సాధ్యంబు కాగలదు.

ఇట్లు వాతరోగచికిత్స ముగిసెను.

## వాతరక్తలక్షణము.

శ్లో. జానుజంఘోరుకట్యంసహస్తపాదాంగసంధిషు
నిస్తోదస్ఫురణం భేదో గురుత్వం సుప్తిరేవ చ

కండూస్సంధిషు రుగ్భూత్వా భూత్వా నశ్యతి వా సకృత్
వైవర్ణ్యం మండలోత్పత్తిర్వాతాసృక్పూర్వలక్షణమ్.

తా. మోకాళ్ళు, పిక్కలు, తొడలు, నడుము, హస్తములు, పాదములు, భుజములు, వీటిసందులలో పోట్లు గలిగియుండుట, స్ఫురించుట, పగిలినట్లుండుట, మొద్దవలెనుండుట, మందము, దురద, ఇవి గలిగియుండుట, సంధిస్థలములయం దొకానొక సమయంబున పోట్లు, నొప్పులుగలిగి మరియొకసమయంబున లేకయుండుట, శరీరము వివర్ణముగనుండుట, శరీరమున మండలములు కట్టియుండుట, ఇవి వాతరక్తరోగంబునకు పూర్వలక్షణంబులని యెఱుంగవలయు.

శ్లో. ఉత్తానమవగాఢం చ ద్వివిధం వాతశోణితమ్
త్వఙ్మాంసాశ్రయముత్తానం గంభీరం త్వంతరాశ్రయమ్.

తా. ఈవాతరక్తరోగము ఉత్తానము, గంభీరము, లన రెండువిధంబులుగనుండు. అందు చర్మము, మాంసము, వీటిని నాశ్రయించియుండునది ఉత్తానమనియు, మేదస్సు మొదలగుధాతువులనాశ్రయించియుండునది గంభీరంబనియు బఱంగు.

## వాతరక్తచికిత్స.

శ్లో. పిండతైలాదినాభ్యంగం పానం తిక్తాదిసర్పిషా
సేకలేపాహ్వ్యసృఙ్మక్తిశ్శోధనం చోభయోర్హితమ్.

తా. రక్తబోళంబును కషాయముబెట్టి యందు రెండింతలు నువ్వులనూనె బోసి పక్వముగ కాచి నభ్యంగనమున జేసికొనినను, కటుకరోహిణి మొదలగు వాతహరద్రవ్యములను కషాయము బెట్టి యందు రెండింతలు నెయ్యిబోసి ఘృతపక్వముగ కాచి యాఘృతమును పానంబొనర్చినను, వాతహరద్రవ్యములను కషాయముబెట్టి యొత్తడమువేసినను, దీనిచే లేపనంబులుజేసినను, జలగలు మొదలగువాటిచే దుష్టరక్తమును స్రవింపంజేసినను వమనవిరేచనములకు బుచ్చుకొనినను, వాతరక్తము శమించు.

శ్లో. సమధూచ్ఛిష్టమంజిష్ఠససర్జరససాధితమ్
పిండతైలాదినాభ్యంగో వాతరక్తరుజాపహః.

తా. తేనెమైనము, మంజిష్ఠి, గుగ్గిలము వీటితైలంబునైనను, రక్తబోళతైలంబునైనను, నభ్యంగనముజేసికొనిన వాతరక్తము నశించు.

శ్లో. వాసాగుడూచీచతురంగులానామేరండతైలేన పిబేత్కషాయమ్
క్రమేణ సర్వాంగజమప్యశేషం జయేదసృగ్వాతభవం వికారమ్.



తా. అడ్డరసము, తిప్పతీగ, రేలపట్ట, వీటిని సమభాగములుగ దంచి కషాయము బెట్టి అందు చిట్టాముదముబోసి పుచ్చుకొనిన వాతరక్తముచే జనించినవికారములు సర్వాంగములయందు వ్యాపించియుండినను నవి నశించు.

శ్లో. మంజిష్ఠా కుటజామృతా ఘనవచా కుంఠీ హరిద్రాద్వయం
వాసా పర్పటశారిబా ప్రతివిషానంతావిశాలాజలమ్
క్షుద్రారిష్టపటోలకోష్ఠకటుకా భార్ఙీవిడంగాగ్నికమ్
మూర్వాదారుకళింగభృంగమగదాత్రాయంతి పాఠావరీ.
గాయత్రీ త్రిఫలా కిరాతకమహానింబాసనారగ్వధమ్
శ్యామావల్గుజచందనం సవరుణం పూతీకశాకోటకం
మంజిష్ఠాదిమముం కషాయవిధినా నిత్యం పుమాన్యః పిబే
త్త్వగ్దోషాహ్యచిరేణ యాంతి విలయం కుష్ఠాని చాష్టాదశ.
వాతరక్తే ప్రసుప్తే చ విసర్పే విద్రధౌ తథా
సర్వేషు రక్తదోషేషు మంజిష్ఠాదిః ప్రశస్యతే.

తా. మంజిష్ఠి ౧ భాగము, కొడిశవిత్తులు ౨ భాగములు, తిప్పతీగె ౩ భాగములు, తుంగగడ్డలు ౪ భాగములు, వస ౫ భాగములు, శొంఠి ౬ భాగములు, పసపు ౭ భాగములు, మానిపసపు ౮ భాగములు, అడ్డసరము ౯ భాగములు, పర్పాటకము, ౧౦ భాగములు, సుగంధిపాలవేళ్ళు ౧౧ భాగములు, అతివస ౧౨ భాగములు, దురదగొండివేరు ౧౩ భాగములు, వెఱ్ఱిపుచ్చవేరు ౧౪ భాగములు, వట్టివేరు ౧౫ భాగములు, వాకుడు ౧౬ భాగములు, వేపపట్ట ౧౭ భాగములు, చేదుపొట్ల ౧౮ భాగములు, కోష్ఠు ౧౯ భాగములు, కటుకరోహిణి ౨౦ భాగములు, గంటుభారంగి ౨౧ భాగములు, వాయువిళంగములు ౨౨ భాగములు, చిత్రమూలము ౨౩ భాగములు, చాగపట్ట ౨౪ భాగములు, దేవదారు ౨౫ భాగములు, కొడిశపట్ట ౨౬ భాగములు, గుంటగలగర ౨౭ భాగములు, పిప్పళ్ళు ౨౮ భాగములు, గోరంట ౨౯ భాగములు, అగరుశొంఠి ౩౦ భాగములు, శతావరివేళ్ళు ౩౧ భాగములు, చంద్రచక్క ౩౨ భాగములు, కరక్కాయలు ౩౩ భాగములు, తాండ్రకాయలు ౩౪ భాగములు, నెల్లివరుగు ౩౫ భాగములు, శీమనేలవేము ౩౬ భాగములు, శుద్ధమ్రానుపట్ట ౩౭ భాగములు, వేగిసపట్ట ౩౮ భాగములు, రేలపట్ట ౩౯ భాగములు, నల్లతెగడ ౪౦ భాగములు, భావంచివిత్తులు ౪౧ భాగములు, శ్రీగంధము ౪౨ భాగములు, ఉలిమిడిపట్ట ౪౩ భాగములు, కానుగపట్ట ౪౪ భాగములు పెద్దటేకుమ్రానిపట్ట ౪౫ భాగములు, ఇత్తెఱంగున వీటినెల్ల దంచి కషాయముబెట్టి ప్రత్యహాము సేవించిన చర్మగతవాతదోషము, పదునెనిమిది కుష్ఠువులు, వాతరక్తము, అగ్నిజ్వాలచే బొబ్బలుగ జనించెడి

కుష్ఠువులు, విసర్పియనురోగము, కడుపులోనిబల్లలు, సమస్తరక్తదోషములు, ఇవియన్నియుం నశించు. (ఇది మంజిష్ఠాదికషాయము)

శ్లో. ప్రస్థమేకం గుడూచ్యాశ్చ సార్ధప్రస్థం తు గుగ్గులుః
ప్రత్యేకం త్రిఫలాయాశ్చ తత్ప్రమాణం వినిర్దిశేత్.
సర్వమేకత్ర సంక్షిప్య క్వాథయేదుల్బణేఽంభసి
పాదశేషం పరిశ్రావ్య కషాయం గ్రాహయేద్భిషక్.
పునః పచేత్కషాయం వా యావత్సాంద్రత్వమాప్నుయాత్
దంతివ్యోషవిడంగాని గుడూచీత్రిఫలాత్వచః.
తతశ్చార్ధపలం చూర్ణం గృహ్ణీయాత్తు ప్రతిప్రతి
చూర్ణం కర్షం త్రివృత్తాయాస్సర్వం తత్ర వినిక్షిపేత్.
తస్మిన్ సుసిద్ధం విజ్ఞాయ కోష్ణం పాత్రే వినిక్షిపేత్
తతశ్చాగ్నిబలం జ్ఞాత్వా తస్య మాత్రాం ప్రయోజయేత్
వాతరక్తం తథా కుష్ఠం గుదజానగ్నిసాదనమ్
దుష్టవ్రణం ప్రమేహం చ హ్యామవాతం భగందరమ్.
నాడ్యాఢ్యవాతాంశ్చ్వయథూన్ సర్వాన్వాతామయాన్జయేత్
అశ్విభ్యాం నిర్మితః పూర్వం మాహిషాఖ్యశ్చ గుగ్గులుః.

తా. తిప్పతీగ ౬౪ తులములు, గుగ్గిలము ౯౬ తులములు, కరక్కాయలు ౬౪ తులములు, తానికాయలు ౬౪ తులములు, నెల్లిపప్పు ౬౪ తులములు, ఈతీరున వీటినెల్ల దంచి మిగుల నుదకముబోసి కషాయముబెట్టి చతుర్థాంశముగ దించుకొని దానిని వడియగట్టి మరల జిగటగకాచి అందు దంతివేరుచూర్ణము, శొంఠిచూర్ణము, మిరియాలచూర్ణము, పిప్పలిచూర్ణము, వాయువిళంగములచూర్ణము, తిప్పసత్తు, కరక్కాయలచూర్ణము, తానికాయలచూర్ణము, నెల్లివరుగుచూర్ణము, లవంగపట్టచూర్ణము, ఇవి దినుసువకటింటికి ౨ తులములు. తెల్లతెగడచూర్ణము ౧ తులము వేసి చక్కగ కలిపి కించిదుష్ణముగ యుండికించి రేగుగింజప్రమాణమునకు మించకుండునటుల మాత్రలుచేసి రోగి దేహతత్త్వమును, అగ్నిబలంబును, నెఱింగి యం దొకమాత్రను సేవించిన వాతరక్తము, కుష్ఠువు, మూలవ్యాధి, అగ్నిమాంద్యము, దుష్టవ్రణములు, ప్రమేహము, ఆమవాతము, భగందరము, నాడీవాతము, సూతికావాతములు ఈమొదలగు వాతరోగంబులన్నియుం నశించు. (ఇది యశ్వినీదేవతలచే నిర్మింపబడిన మాహిషగుగ్గిలము.)

శ్లో. పటోలీ త్రిఫలా తిక్తా గుడూచీ చ శతావరీ
ఏష క్వాథో జయేత్పీతో వాతాస్రం దాహసంయుతమ్.



తా. చేదుపొట్ల, కరక్కాయలు, తానికాయలు, నెల్లివరుగు, కటుకరోహిణి, తిప్పతీగ, చల్లపిల్లిగడ్డలు, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి పుచ్చుకొనిన తాపయుక్తమగు రక్తవాతము నశించు. (ఇది పటోల్యాదికషాయము.)

శ్లో. క్వాథో వాసామృతా తిక్తా భవో వాతాస్రనోదనః.

తా. అడ్డసరము, తిప్పతీగ, కటుకరోహిణి, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి పుచ్చుకొనిన వాతరక్తము నశించు. (ఇది వాసాదికషాయము.)

శ్లో. నవమహిషలోచనోదరసన్నిభవర్ణస్య గుగ్గులోః ప్రస్థమ్
ప్రక్షిప్య తోయరాశౌ త్రిఫలామమృతాం యథోక్తపరిమాణామ్.
సంసాధయేత్ప్రయత్నాద్దర్వ్యా సంఘట్టయేచ్చ తద్యావత్
అర్ధక్షపితం జాతం తోయం జ్వలనస్య సంసర్గాత్
అవతార్య వస్త్రపూతం పునరపి సంసాధయేద్దాపః
సాంద్రీభూతే తస్మిన్నవతార్య హిమోపస్పర్శమ్.
పథ్యాచూర్ణం ద్విపలం త్రికటుకచూర్ణం షడక్షపరిమాణమ్
క్రిమిరిపుచూర్ణార్ధపలం కర్షం కర్షం త్రివృద్దంత్యోః.
పలమేకం ఛిన్నరుహాం దత్వా దత్వా సంచూర్ణ్య యత్నేన
సంస్థాపయేచ్చ గుప్తం స్నిగ్ధే భాండే ఘృతేన సురభీణామ్.
ఆదాయ తస్య మాత్రాం విహితాతిథిదేవతాప్రణతిః
ఖాదేద్యథాగ్ని మనుజో వ్యాధిబలాపేక్షయా సమ్యక్.
ఇచ్ఛాహారో క్షేమజకాలశ్చ సర్వఏవాత్ర
తనురోధివాతశోణిత మేకద్విత్ర్యాల్బణం చిరోత్థమపి.
భగ్నస్రుతిపరిశుష్కం స్ఫుటితమపి నిహంతి యత్నేన
వ్రణం కాసకుష్ఠగుల్మశ్వయథూదరం పాండురోగమేదాంసి.
మందాగ్నిత్వవిబంధం ప్రమేహదోషాంశ్చ నాశయతి
సతతం నిషేవ్యమాణః కాలేన నిహంతరోగగణమ్.
అభిభూయ జరాదోషం కరోతి కైశోరకం రూపమ్.

తా. మదించిన దున్నపోతువంటి మహిషాక్షిగుగ్గిలము ౬౪ తులములు, తిప్పతీగ ౬౪ తులములు, కరక్కాయలు ౬౪ తులములు, తానికాయలు ౬౪ తులములు, నెల్లివరుగు ౬౪ తులములు, ఈతీరున వీటినెల్ల దంచి మిగుల నుదకముబోసి గరిటచే కలియబెట్టుచు కషాయము కాచి దించుకొని వడియగట్టి మరల నాకషాయంబునే దట్టముగ కాచి చల్లారినపిదప యందు కరక్కాయలు ౮ తులములు, శొంఠి ౨ తులములు,

మిరియాలు ౨ తులములు, పిప్పళ్ళు ౨ తులములు, వాయువిళంగములు ౪ తులములు, తెల్లతెగడ ౧ తులము, దంతివేరు ౧ తులము, తిప్పసత్తు ౪ తులములు, ఇటుల వీటి నెల్ల చక్కగ చూర్ణముజేసివైచి చక్కగ కలియబెట్టి లేహపక్వముగ దించుకొని, ఆవునెయ్యిబోసి యెండినకుండయం దీయౌషధమును నునిచి, వాళనగట్టి పిదప దేవతాపూజ, అతిథిపూజ, వీటిని యొనర్చి ధూపదీపనైవేద్యతాంబూలాదు లొసంగి నమస్కారప్రదక్షిణాదుల గావించి యగ్నిబలంబును, వ్యాధిబలంబును నెఱింగి యీయౌషధమును రేగుగింజంత ఇచ్ఛాపథ్యముగ నుండి సర్వదా సేవింపుచుండిన వాతరక్తము, వాతపిత్తశ్లేష్మములచే బ్రత్యేకములుగనైనను, ద్వంద్వములుగనైనను, త్రిదోషములతో గూడియైనను, జనించి బహుకాలముగ బాధింపుచుండెడి రోగములు, అవయవములు పగిలియైనను, శుష్కించి పగిలియైనను, రక్తము స్రవింపుచుండెడిరోగములు, వ్రణములు, శ్వాసకాసలు, కుష్ఠరోగము, గుల్మరోగము, శోఫలు, ఉదరరోగము, పాండురోగము, మేదోరోగము, మందాగ్ని, కడుపుబ్బరములు, ప్రమేహములు, యీమొదలగు రోగంబులన్నియు నశించుటయగాక జరాదోషము సగా నివృత్తియై యౌవనము గలుగు. (ఇది కైశోరగుగ్గిలము.)

శ్లో. మంజిష్ఠా త్రిఫలా తిక్తా వచా దారునిశా మృతా
నింబ శ్చైషాం కృతః క్వాథో వాతరక్తవినాశనః.
పామాకపాలికాకుష్ఠ రక్తమండలజన్మతః

తా. మంజిష్ఠి, కరక్కాయలు, తానికాయలు, నెల్లివరుగు, కటుకరోహిణి, వస, పసపు, మ్రానివసపు, తిప్పతీగ, వేపపట్ట, వీటిని సమభాగములుగ దంచి కషాయము బెట్టి పుచ్చుకొనిన వాతరక్తము, గజ్జి, కపాలకుష్ఠు, రక్తమండలము, ఇవియన్నియు నశించు. (ఇది మంజిష్ఠాదికషాయము.)

శ్లో. పారదం చ క్రియాశుద్ధం తత్తుల్యం శుద్ధగంధకమ్
అభ్రికంతు ద్వయో స్తుల్యం త్రిభిస్తుల్యం తు గుగ్గులుమ్.
సర్వాంశ మమృతాసత్వం భావయే ద్దాషధైః పృథక్
నిర్గుండీగోక్షురచ్ఛిన్నాకోకిలాఖ్యాం ఘ్రిజై రసైః.
సప్తవారం తతో యుంజ్యాద్వాతరక్తే త్రివల్లకమ్
కోకిలాఖ్యస్య మూలానాం పానీయ మనుపాయయేత్.

తా. శుద్ధిచేసిన పాదరసము ౧ భాగము, శుద్ధిచేసిన గంధకము ౧ భాగము అభ్రకసిందూరము ౨ భాగములు, శుద్ధిచేసిన మహిషాక్షీగుగ్గిలము ౪ భాగములు, తిప్పసత్తు ౮ భాగములు, ఈతీరున వీటినెల్ల చూర్ణముచేసి పిదప వావిలి, పల్లేరు, తిప్పతీగ, నీటకోవిల, వీటివేళ్ళకషాయముచే పైచూర్ణమును ౭ పర్యాయములు భావనజేసి మూడువల్లములయెత్తు మాత్రలుజేసి నీడన యెండించి యందొకమాత్రను నీటకోవెల వేళ్ళకషాయముచే భక్షించిన వాతరక్తములు నశించు.



వాక్యమ్. మందమప్యసాధ్యం జ్ఞేయమ్.

తా. ఈ వాతరక్తరోగము అల్పంబుగనుండినను నసాధ్యంబని ఎఱుంగవలయు.

ఇట్లు వాతరక్తచికిత్స ముగిసెను.

---

## ఊరుస్తంభలక్షణము.

శ్లో. యదా కఫాన్వితేనోరూ స్తబ్ధౌ శీతావచేతనౌ
సంయుక్తౌ పాదసదనకృచ్ఛ్రోద్ధరణసుప్తిభిః.
తమూరుస్తంభ మిత్యాహు రాఢ్యవాత మథాపరే.

తా. దోషయుక్త మగువాయువు దుష్టకఫముతో గలిసెనేని నప్పుడు తొడలు స్తంభించి స్పర్శజ్ఞానము లేక రక్తహీనమై శుష్కించి వేదనతోగూడి చలించుటకు సగా నశక్యంబుగనుండు. ఇట్లుండెనేని ఊరుస్తంభమనియు, ఆఢ్యవాతమనియు, ఎఱుంగవలయు.

---

## ఊరుస్తంభచికిత్స.

శ్లో. భల్లాతకా మృతా శుంఠీ దారుపథ్యా పునర్నవా
పంచమూలీద్వయం మిశ్రమూరుస్తంభనిబర్హణమ్.

తా. శుద్ధిజేసిన జీడిగింజలు, తిప్పతీగ, శొంఠి, దేవదారుపట్ట, కరక్కాయలు, తెల్లగలిజేరువేరు, దశమూలములు, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి పుచ్చుకొనిన ఊరుస్తంభవాతము నశించు.

శ్లో. పిప్పలీ పిప్పలీమూలం భల్లాతకఫలాని చ
కల్కం మధుయుతం పీత్వా ఊరుస్తంభా త్ప్రముచ్యతే.

తా. పిప్పళ్ళు, మోడి, శుద్ధిచేసిన జీడిగింజలు, వీటిని సమభాగములుగ కల్కము జేసి యందు తేనెవైచి మాత్రపక్వముగ ఖల్వమున మర్దించి రేగుపండంత భక్షించిన ఊరుస్తంభవాయువు హరించు.

శ్లో. క్షౌద్రసర్షపవల్మీకమృత్తికాసంయుతం భిషక్
గాఢం మృత్స్నాదసం కుర్యా ద్దూరుస్తంభప్రలేపనమ్.

తా. ఆవాలు, పుట్టమన్ను, వీటిని సమభాగములుగ నుంచుకొని యందు తేనె బోసి నూరి దట్టముగ లేపనముజేసిన ఊరుస్తంభవాయువు హరించు. (ఇది మృత్సాదన లేపనము.)

శ్లో. యత్స్యాత్కఫప్రశమనం సచ మారుతకోపనమ్
తత్సర్వం సర్వదా కార్య మూరుస్తంభస్యభేషజమ్.

తా. శ్లేష్మమునుహరించెడి యౌషధంబులు వాతమును నగా హరించు. కావున నాయౌషధములను సేవించిన ఊరుస్తంభవాయువు నశించు.

శ్లో. పలమర్ధపలం వాపి లశునస్య సుకుట్టితమ్
హింగుజాజీరకసింధూత్థం సౌవర్చలకటుత్రికమ్.
ఏభిస్సంచూర్ణితైస్సర్వై స్తుల్యైర్లేన సంయుతమ్
యథాగ్ని భక్షయే త్ప్రాజ్ఞోరుబుక్వాథానుపానతః.
మాసమేకం ప్రయోగేణ సర్వాన్వాతామయాన్జయేత్
ఏకాంగసర్వాంగగతమూరుస్తంభం చ గృధ్రసీమ్.
కటి పృష్ఠాస్థిసంధిస్థమర్దితం చాపతంత్రకమ్
జ్వరం ధాతుగతం జీర్ణం నిత్యం శైత్యం కరాంఘ్రిజమ్.

తా. తెల్లగడ్డలు, ఇంగువ, జీలకఱ్ఱ, సైంధవలవణము, పాదరలవణము, శొంఠి, పిప్పలి, మిరియాలు, వీటిని సమభాగములుగ చూర్ణముచేసి దీనికి సమముగ చిట్టాము దము కలిపి అగ్నిబలంబునెరింగి ౪ తులములకు మించకుండునటుల యొకమాసము సేవిం చుటయగాక ప్రతిదినంబును ఆముదపువేరును కషాయముబెట్టి త్రాగుచుండిన ఏకాంగ వాతము, సర్వాంగవాతము, ఊరుస్తంభవాతము, గృధ్రసీవాతము, నడుము, వీపు, అస్థి సంధులు, వీటియందలి వాతములు, అర్దితవాతము, అపతంత్రకవాతము, ఈమొదలగు సమస్తవాతంబులును, ధాతుగతజ్వరము, జీర్ణజ్వరము, చేతులు, కాళ్ళు, శీతలముగ నుండుట, ఇవియును నశించు. (ఇది లశునాదిప్రయోగము.)

శ్లో. పునర్నవా నాగరదారుపథ్యా భల్లాతకచ్ఛిన్నరుహాం కషాయః
దశాంఘ్రిమిశ్రః పరిపేయ ఊరుస్తంభేఽథవా మూత్రపురః ప్ర[యోగః.

తా. తెల్లగలిజేరువేరు, శొంఠి, దేవదారుపట్ట, కరక్కాయలు, శుద్ధిచేసిన జీడి గింజలు, తిప్పతీగె, దశమూలములు, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి పుచ్చుకొనినను, లేక మహిషాక్షిగుగ్గిలమును గోమూత్రంబున కలిపి పుచ్చుకొనినను, ఊరుస్తంభవాయువులు నశించు. (ఇది పునర్నవాదికషాయము.)



శ్లో. శిలాజతుం గుగ్గులుం వా పిప్పలీ మథ నాగరమ్
ఊరుస్తంభే పిబే న్మూత్రై ర్దశమూలీజలేన వా.

తా. శిలాజిత్తు భస్మమునైనను, శుద్ధిచేసిన గుగ్గిలము, పిప్పలి, శొంఠి, వీటిలో దేనినైనను చూర్ణముజేసి గోమూత్రమునందైనను, దశమూలకషాయమునందైనను కలిపి పుచ్చుకొనిన ఊరుస్తంభవాయువు నశించు.

## ఊరుస్తంభవాతమునకు రసచికిత్స.

శ్లో. నిష్కత్రయం శుద్ధసూతం నిష్కద్వాదశగంధకమ్
గుంజాబీజం విషం నింబబీజం చ విజయా తథా
ప్రత్యేకం నిష్కమాత్రం తు మాషం జేపాలబీజకమ్
జాతీజంబీరధుత్తూరకాకమాచీద్రవైర్దినమ్.
మర్ద్యం సర్వం వటీం కుర్యా ద్గుళ్లైర్గుంజాద్వయం పిబేత్
గుంజాగర్భో రసో నామ హింగుసైంధవసంయుతః.
సమండం దాపయే త్పథ్యమూరుస్తంభప్రశాంతయే.

తా. శుద్ధిజేసిన పాదరసము ౧ తులము, శుద్ధిజేసిన గంధకము ౪ తులములు, గురిగింజలపప్పు, శుద్ధిజేసిన వసనాభి, వేపపప్పు, గంజాయివిత్తులు, ఇవి దినుసుకు వరహా యెత్తు, శుద్ధిచేసిన నేపాళములు ౫ గురిగింజలయెత్తు, ఇటుల నన్నిటిని చూర్ణముజేసి యీచూర్ణమును జాజియాకురసముచే నొకదినంబును, నిమ్మపండ్లరసముచే నొకదినంబును, ఉమ్మెత్తాకురసముచే నొకదినంబును, నల్లకాచీయాకురసముచే నొకదినంబును, చక్కగ మర్దించి రెండుగురిగింజలప్రమాణము మాత్రలుజేసి నీడన యెండించి యందు తగుమా త్రముగ ఇంగువ, నెయ్యి, సైంధవలవణము, కలిపి ప్రాతస్సాయంకాలములయందు సేవిం చిన ఊరుస్తంభవాయువు హరించు. ఇందుకుపథ్యము.—ఉలవకట్టుఅన్నమును భుజింప వలయు. (ఇది గుంజాగర్భరసము.)

ఇట్లు ఊరుస్తంభవాతచికిత్స ముగిసెను.

## ఆమవాతలక్షణము.

శ్లో. అంగమర్దో ఒరుచి స్తృష్ణా ఆలస్యం గౌరవం జ్వరః
అపాక స్తనుతాంగానా మామవాతస్య లక్షణమ్.

తా. శరీరము విరుచుట, అరుచి, దాహము, బడలిక, జడత్వము, జ్వరము, అజీ ర్ణము, ఇవిగలుగుట, దేహము కృశించుట, ఇట్టిలక్షణంబులు గలిగిన ఆమవాతంబని ఎరుంగవలయు.

శ్లో. హస్తపాదశిరోగుల్ఫత్రికజానూరుసంధిషు
కరోతి సరుజం శోఫం వ్యావిద్ధ ఇవ వృశ్చికైః.

తా. చేతులు, కాళ్ళు, శిరస్సు, మడిమలు, ముడ్డిపూస, తొడలు, పిక్కలు, మోకాళ్ళు, వీటిసంధులయందు ''తేలుకుట్టినట్టు'' పోట్లు, మంటలు, గలిగి వాపును గలిగియుండిన ఆమవాతంబని ఎరుంగవలయును.

శ్లో. జఠరం గర్జతే యస్య గుల్మవత్పరిపీడితమ్
కటీపృష్ఠజడత్వం చ హ్యామో గుల్మాభిశంకితః.

తా. గుల్మవ్యాధి పీడించెడుచందంబున కడుపుయందు వేదనగలిగి గుఱ్ఱుగుఱ్ఱు మనుశబ్దము జనించి నడుము, వీపు, ఇవి బిగబట్టి కఠినంబుగనుండిన గుల్మసహిత ఆమవాతంబని ఎఱుంగవలయును.

శ్లో. కటీ పృష్ఠ వక్షదేశే తోదనం వస్తిశూలతా
గుల్మవజ్జఠరం గచ్ఛేత్తథాంతే శోఫ ఏవచ.

తా. నడుము, వీపు, ఱొమ్ము, వీటియందు వ్యధకలుగుట, పొత్తికడుపుయందు శూలగలుగుట, జఠరంబున గుల్మమువలె గర్జించుట, వాపుగలిగియుండుట, ఇట్టిలక్షణంబులు గలిగిన ఆమగుల్మవాతంబని ఎఱుంగవలయును.

## ఆమవాతచికిత్స.

శ్లో. రాస్నామృతారగ్వధదేవదారుత్రికంటకైరండపునర్నవానామ్
క్వాథం పిబేన్నాగరచూర్ణమిశ్రం జంఘోరుపృష్ఠత్రికపార్శ్వ
[శూలీ.

తా. సన్నరాష్ట్రకము, తిప్పతీగ, రేలపట్ట, దేవదారుపట్ట, పల్లేరుకాయలు, ఆముదపువేరు, తెల్లగలిజేరు, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి అందు శొంఠిచూర్ణము కలిపి పుచ్చుకొనిన పిక్కలు, తొడలు, వీపు, ముడ్డిపూస, పార్శ్వములు, పొత్తికడుపు, వీటియందలిశూలలు నివృత్తియగు.

శ్లో. శుంఠీగోక్షురకక్వాథః ప్రాతః ప్రాతర్నిషేవితా
ఆమవాతం కటీశూలం పాచనో రుక్ప్రణాశనః.

తా. శొంఠి, పల్లేరుకాయలు, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి ప్రతిదినము ప్రాతఃకాలంబున సేవింపుచుండిన ఆమవాతము, నడుమునొప్పులు, అజీర్ణము, ఈ మొదలగురోగములు నశించుటయగాక అగ్నిదీపనము సగా గలుగు.

శ్లో. మణిమంథస్య భాగౌ ద్వౌ యవక్షారశ్చ తత్సమః
తథాజమోదభాగశ్చ నాగరాద్భాగపంచకమ్.
దశైవ హరీతక్యా సూక్ష్మం చూర్ణం కృతం శుభమ్.



మస్త్వారనాళమూత్రైశ్చ సురయోష్ణోదకేన వా.
పీతం జయే దామవాతం గుల్మహృద్వస్తిజాంగదాన్
ప్లీహానమథ శూలాదీనానాహం చార్శసాం హితమ్.
వాతానులోమనమిదం చూర్ణం వైశ్వానరం స్మృతమ్.

తా. సైంధవలవణము ౨ భాగములు, యవక్షారము ౨ భాగములు, ఓమము ౨ భాగములు, శొంఠి ౫ భాగములు, కరక్కాయలు ౧౦ భాగములు, ఇటుల వీటిని చక్కగ చూర్ణముజేసి యీచూర్ణమును పూటకు అరతులముచొప్పున పెరుగుమీదినీళ్ళు, కలి, గోమూత్రము, కల్లు, ఉష్ణోదకము, వీటిలో దేనిచేనయినను బుచ్చుకొనిన ఆమవాతము, గుల్మము, హృద్రోగము, కటివాతము, పొత్తికడుపుశూలలు, ప్లీహము, ఆనాహము, మూలవ్యాధులు, ఇవియన్నియు హరించు. మఱియును వాతంబులు సగా అనులోమంబగు. (ఇది వయిశ్వానరచూర్ణము.)

శ్లో. హింగుచవ్యం బిడం శుంఠీ కృష్ణా జాజీ సపుష్కరమ్
భాగోత్తరమిదం చూర్ణం పీతం వాతామజిద్భవేత్.

తా. ఇంగువ ౧ భాగము, చవ్యము ౨ భాగములు, బిడాలవణము ౩ భాగములు, శొంఠి ౪ భాగములు, పిప్పళ్ళు ౫ భాగములు, జీలకఱ్ఱ ౬ భాగములు, తామరగడ్డలు ౭ భాగములు ఇటుల వీటిని చూర్ణముజేసి యనుపానవిశేషముచే బుచ్చుకొనిన ఆమవాతము నివృత్తియగు.

శ్లో. శుంఠీకల్కం వినిక్షిప్య రసైరేరండమూలజైః
విపచేత్పుటపాకేన తద్రసః క్షౌద్రసంయుతః.
ఆమవాతసముద్భూతాం పీడాం జయతి దుస్తరామ్.

తా. శొంఠిచూర్ణములో ఆముదపువేళ్ళరసము బోసి ముద్దగనూరి బిళ్ళజేసి యాబిళ్ళను రావియాకులయం దునిచి పుటమువేసి రసముతీసికొని అందు తేనెకలిపి పూటకు ౧ తులము సేవించిన ప్రబలమగు ఆమవాతములు హరించు.

శ్లో. విలాసినీవిలాసేన విలాసీహృదయం యథా
తథా గుడూచీవిశ్వేన హరే దామసమీరణమ్.

తా. తిప్పతీగ, శొంఠి, వీటిని సమభాగములుగ కషాయముబెట్టి పుచ్చుకొనినను, లేక యీదినుసులను చూర్ణముగావించి సేవించినను, ''మిగుల సౌందర్యగర్వంబుచేత మదించిన మందయాన నిజవిలాసంబుచే విటపురుషుని హృదయంబును నాకర్షించు మాడ్కి'' ఆమవాయువు తత్క్షణంబున హరించు.

శ్లో. కర్షం నాగరచూర్ణస్య కాంజికేన పిబే త్సదా
ఆమవాతప్రశమనం కఫవాతవినాశనమ్.

తా. ఒకతులము శొంఠిచూర్ణమును పుల్లనికలిలో కలిపి ప్రాతస్సాయంకాలముల యందు పుచ్చుకొనిన ఆమవాతము, కఫవాతము, ఇవి హరించు.

శ్లో. పంచకోలకచూర్ణం చ పిబే దుష్ణేన వారిణా
మందాగ్నిశూలగుల్మామకఫారోచకనాశనమ్.

తా. పిప్పలి, శొంఠి, మోడి, చవ్యము, చిత్రమూలము, వీటిని సమభాగములుగ చూర్ణముచేసి యుష్ణోదకముతో బుచ్చుకొనిన మందాగ్ని, శూలలు, గుల్మము, ఆమము, కఫము, అరోచకము, ఇవియన్నియు నశించు.

శ్లో. త్రిఫలా నాగరం చైవ సూక్ష్మచూర్ణాని కారయేత్
మస్త్వారనాళతక్రేణ పేయా మాంసరసేన వా
ఆమవాతం నిహంత్యాశు శ్వయధుం సంధిసంస్థితమ్.

తా. కరక్కాయలు, తానికాయలు, నెల్లివరుగు, శొంఠి, వీటిని సమభాగములుగ చూర్ణముచేసి పెరుగుమీదినీళ్ళు, మజ్జిగ, పుల్లనికలి, పేయము, మాంసరసము, వీటిలో దేనిచేనయినను బుచ్చుకొనిన ఆమవాతము, సంధిగతవాతము, శోథలు, ఇవి నశించు.

---

## ఆమవాతమునకు రసచికిత్స.

శ్లో. ప్రక్షిప్య గంధం రసపాదభాగం
కలాప్రమాణం చ విషం సమస్తాత్
కృశానుతోయేన చ భావయిత్వా
వల్లం దదీతాప్య మరుత్ప్రశాంత్యై.
అపస్మారతథోన్మాదే సర్వాంగే వ్యధనేపిచ
ఏకాంగవాతేసామేవాదంష్ట్రాబంధే హిమే తథా.
దేయోఽయం వల్లమాత్రం తు సర్వవాతనివృత్తయే.

తా. శుద్ధిజేసిన పాదరసము ४ భాగములు, శుద్ధిజేసిన గంధకము ౧ భాగము, శుద్ధిజేసిన వసనాభి ౧౬ భాగములు, ఇటుల వీటిని చిత్రమూలకషాయముచే మూడు దినములు ఖల్వమున చక్కగ మర్దించి 3 గురిగింజలప్రమాణమునకు మించకుండునటుల మాత్రలుజేసి నీడన రొండించి యందొకమాత్రను అనుపానవిశేషముచే సేవించిన అపస్మారము, ఉన్మాదము, సర్వాంగవ్యథ, ఏకాంగవాతము, ఆమవాతము, హనుస్తంభవాతము, ఈ మొదలగువాతంబు లతిశీఘ్రంబుగ నశించుటయగాక శీతలము నగా హరించు. (ఇదియ వాతవిధ్వంసినీరసము.)

ఇట్లు ఆమవాతచికిత్స ముగిసెను.

---



## శూలలక్షణము.

శ్లో. వాయుః ప్రవృద్ధో జనయేద్ధి శూలం
హృత్పార్శ్వపృష్ఠత్రికవస్తిదేశే.

తా. హృదయము, పార్శ్వములు, ముడ్డిపూస, వీపు, పొత్తికడుపు, వీటియందు శూలజనించిన వాతప్రదోషముచే గలిగినదని ఎఱుంగవలయు.

శ్లో. వేదనా చ తృషా మూర్ఛా హ్యానాహో గౌరవారతిః
కాసశ్వాసౌ చ హిక్కా చ శూలస్యోపద్రవా స్మృతాః.

తా. ఇటుల శూల జనించినపిదప వేదన, దాహము, మూర్ఛ, మలమూత్రముల బంధము, కాసశ్వాసలు, వెక్కిళ్ళు, శరీరము బరువు, అరుచి, ఈ యుపద్రవంబులు గలుగు.

శ్లో. భుక్తే జీర్యతి యచ్ఛూలం తదేవ పరిణామజమ్.

తా. భుజించినయన్నము జీర్ణించుసమయంబున జనించెడిశూల, పరిణామ శూల యనబడు.

శ్లో. ఆధ్మానాటోపవిణ్మూత్ర విబంధారతివేదనైః
స్నిగ్ధోపశమనం ప్రాయః పైత్తికం లక్షయే ద్బుధః.

తా. ఉదరంబుబ్బి ప్రాణోపద్రవంబుగ నుండుట, మలమూత్రములు బంధించియుండుట, ఏవస్తువుయందును ప్రీతిలేకుండుట, శరీరంబున వేదన గలిగియుండుట, ఇట్టి లక్షణంబులుగలిగిన పిత్తశూలయని ఎఱుంగవలయు. ఇది స్నిగ్ధోపచారములచే శమించు.

శ్లో. ఆనాహగౌరవౌ ఛర్ది స్తృష్ణా జ్వరభ్రమో ఽరుచిః
కృశత్వం బలహానిశ్చ వేదనాతిప్రవర్తనమ్.
ఉపద్రవా దశైవైతే యస్య శూలస్య నాస్తిసః.

తా. మలమూత్రములు బంధించియుండుట, శరీరము బరువుగనుండుట, వాంతి దాహము, జ్వరము, భ్రమ, అరుచి, దౌర్బల్యము, అతివేదన, ఇవి గలుగుట, దినదినంబునకు కృశించుట, ఈ పదియుపద్రవంబులునుగల శూలరోగి నిశ్చయముగ మృత్యువు పాలగునని ఎఱుంగవలయు.

---

## శూలచికిత్స.

శ్లో. ఏరండబిల్వబృహతీద్వయమాతులుంగ
పాషాణభిత్త్రికటుమూలకృతః కషాయః

శతక్షారహింగులవణోరుబుతైలమిశ్ర
శ్శూలినిభ్యారుమేఢ్రహృదయ స్తనరుజాపేయః.

తా. ఆముదపువేరు, బిల్వవేరు, వాకుడువేరు, పెద్దములకవేరు, మాదీఫలపు వేరు, కొండపిండివేరు, శొంఠి, పిప్పలి, మిరియాలు, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి యందు యవక్షారము, నేతితోపొంగించిన ఇంగువ, సైంధవలవణము, వీటిని సమభాగములుగ చూర్ణముచేసి కలిపి యం దాముదముబోసి పుచ్చుకొనిన నడుమునొప్పులు, తొడలు, శిశ్నము, హృదయము, స్తనములు వీటియందలిశూలలు నివృత్తియగు.

శ్లో. త్రిఫలా క్వాథగోమూత్రక్షౌద్రక్షీరరసైః పృథక్
ఏరండతైలద్విగుణై ర్హిత శ్శూలనివారణే.

తా. కరక్కాయలు, తానికాయలు, నెల్లివరుగు, కొండపిండివేరు, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి యందు గోమూత్రంబునైనను, తేనెనైనను, పాలనైనను, వైచి దీనికి రెండింతలు ఆముదము కలిపిత్రాగిన శూలలు నశించు.

శ్లో. శంబూకమూషణం చైవ పంచైవ లవణాని చ
సమాంశై ర్ఘుటికా కృత్వా కలంబుకరసేన వా.
ప్రాతర్భోజనకాలే వా భక్షయేత్తు యథాబలమ్
శూలాద్విముచ్యతే జంతు స్సహసా పరిణామజాత్.

తా. నత్తగుల్లలభస్మము, మిరియాలు, ఉప్పు, కాచలవణము, సైంధవలవణము, బిడాలవణము, పాదరలవణము, వీటిని సమభాగములుగ చూర్ణముచేసి యందు కడిమిపట్టరసముబోసి ఖల్వమున మర్దించి మాత్రలుజేసి నీడన యెండించి యం దొకమాత్రను ప్రాతఃకాలంబుననైనను, భోజనకాలంబుననైనను, దేహతత్త్వము నెఱింగి భక్షించిన జంతుయుక్తమగు పరిణామశూల హరించు.

శ్లో. వమనం లంఘనం స్వేదః పాచనం ఫలవర్తయః
క్షారశ్చూర్ణాని ఘుటికా శ్శస్యంతే శూలనాశనాః.

తా. వమనంబునకు బుచ్చుకొనుట, లంఘనము నొనర్చుట, చమట వడియంనటులజేసుట, జీర్ణింపంజేసెడి యౌషధంబుల బుచ్చుకొనుట, మలమును శోధించుట, వీటిచేతను, క్షారములు, చూర్ణములు, మాత్రలు, వీటిని సేవించుటచేతను, శూలలు నివారణమగు.

శ్లో. శతావరీసయష్ట్యాహ్వవాట్యాలకుశగోక్షురైః
శృతశీతం పిబే త్తోయం సగుడక్షౌద్రశర్కరమ్.
పిత్తాసృగ్దాహశూలఘ్నం సద్యో దాహరుజాపహమ్.



తా. చల్లపిల్లిగడ్డలు, అతిమధురము, చిట్టాముట్టివేరు, దర్భవేళ్ళు, పల్లేరుకాయలు, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి చల్లారినపిదప యందు బెల్లము, చక్కెర, తేనె, వీటిలో దేనినైనను కలిపి త్రాగిన రక్తపిత్తము, దాహము, శూలలు, ఇవి యన్నియు తత్క్షణంబున నశించు.

శ్లో. మదనస్య ఫలం తిక్తాం పిష్ట్వా కల్కం చ వారిణా
కోష్ణం కుర్యాన్నాభిలేపం శూలశాన్తి ర్భవే త్తతః.

తా. మ్రంగకాయలు, కటుకరోహిణి, వీటిని సమభాగములుగ నుదకముచే నూరి కించిదుష్ణము జేసి నాభియందు లేపనముజేసిన శూలలు హరించు.

శ్లో. త్రిఫలారిష్టయష్ట్యాహ్వకటుకారగ్వధై శ్శృతమ్
పాయయే న్మధునా మిశ్రం దాహశూలోపశాంతయే.

తా. కరక్కాయలు, తానికాయలు, నెల్లివరుగు, వేపపట్ట, అతిమధురము, కటుకరోహిణి, రేలపట్ట, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి యందు తేనె కలిపి పుచ్చుకొనిన శూలలు, దాహము, ఇవి హరించు.

శ్లో. ఏకఏవ కుబేరాక్షో హంతి శూలసతత్రయమ్
కింపున ర్లశునోపేతస్సైంధవేన చ హింగునా.

తా. గచ్చపప్పును వెచ్చచేసి యుదకముచే నూరి పుచ్చుకొనినను, వెల్లుల్లి, సైంధవలవణము, ఇంగువ, గచ్చపప్పు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి సేవించినను, నిస్సంశయముగ మున్నూరుశూలలు హరించు.

శ్లో. నాగరైరండయోః క్వాథః క్వాథ ఇంద్రయవస్య వా
హింగుసౌవర్చలోపేతో వాతశూలనివారణః.

తా. శొంఠి, ఆముదపువేరు, వీటిని సమభాగములుగనైనను, లేక కొడిశవిత్తులనైనను, దంచి కషాయముబెట్టి యందు ఇంగువ, పాదరలవణము, వీటిని సమముగ చూర్ణముజేసి కలిపి త్రాగిన వాతశూలలు హరించు.

శ్లో. శతావర్యాశ్చ మధునా యుక్తశ్శూలహరో రసః.

తా. చల్లపిల్లిగడ్డలరసములో తేనెకలిపి పుచ్చుకొనిన శూలలు హరించు.

శ్లో. హింగుగ్రంథికధాన్యకాగ్నికవచాచవ్యాగ్నిపాఠాశఠీ
వృక్షామ్లం లవణత్రయం త్రికటుకం క్షారద్వయం దాడిమమ్
పథ్యాపుష్కరవేతసామ్లహపుషాజాజాడ్యగంధైః కృతమ్
చూర్ణం భావిత మేత దార్ద్రికరసే స్యాద్బీజపూరస్య వా
ఆధ్మానగ్రహణీవికారగుదజాన్గుల్మానుదావర్తకా

న్వాతాఖ్యానగరోదరాశ్మరిరుజస్తూనిద్వయారోచకాః
ఊరుస్తంభమతిభ్రమం చ మనసో బాధిర్య మష్ఠీలికం
ప్రత్యష్ఠీలికశ్వాసకాసమపహృత్తత్పీత ముష్ణాంబునా.
హృత్కుక్షివజ్క్షణకటీజఠరాంతరేషు
వస్తిస్తనాంసఫలకేషు చ పార్శ్వయోశ్చ
శూలాని నాశయతి వాతబలాసజాని
హింగ్వాద్యమాద్య మిదమశ్వినిసంహితాయామ్.

తా. ఇంగువ, మోడి, ధనియాలు, చిత్రమూలము, వస, చవ్యము, శుద్ధిజేసిన జీడిగింజలు, అగరుశొంఠి, కచ్చూరములు, సైంధవలవణము, బిడాలవణము, పాదరలవణము, శొంఠి, పిప్పలి, మిరియాలు, సర్జక్షారము, యవక్షారము, దాదిమపొలుపు, కరక్కాయలు, తామరగడ్డలు, పుల్లప్రబ్బలి, బోడతరము, జీలకఱ్ఱ, అడవితులసి, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి యందు చింతాకుపులుసు కలిపి అల్లపురసమునైనను, మాదీఫలరసమునైనను, బోసి భావనజేసి యెండించి యం దొకతులమును యుష్ణోదకముతో బుచ్చుకొనిన కడుపుబ్బరము, గ్రహణి, సంగ్రహణి, మూలవ్యాధి, గుల్మము, ఉదావర్తము, వాతముచేజనించిన కడుపుబ్బరము, విషములు, ఉదరరోగము, మూత్రకృచ్ఛ్రము, తూనివాతము, ప్రతూనివాతము, అరుచి, ఊరుస్తంభవాతము, చిత్తభ్రమ, బధిరత్వము, అష్ఠీలకము, ప్రత్యష్ఠీలకము, శ్వాసకాసలు, హృద్రోగము, కుక్షిరోగము, నడుమునొప్పులు, ఈరోగంబులును, గజ్జలు, పొత్తికడుపు, కడుపు, స్తనములు, భుజములు, డొక్క, వీటియందు వాతశ్లేష్మములచే జనించిన రోగంబులును, నివృత్తియగునని యశ్వినీదేవతల సంహితయం దుదహరింపంబడి యున్నయది. (ఇది హింగ్వాదిచూర్ణము.)

శ్లో. చించాక్షారం పంచపలం లవణాని పలంపలమ్
సంచూర్ణ్య నిక్షిపేత్ప్రస్థే ద్వయే జంబీరవారిణి.
శంఖం దశపలం తప్త్వా నిక్షిపే త్సప్తవారతః
తత్సమస్తం విశోష్యాథ హింగువ్యోషం చతుష్పలమ్
బలీసూతవిషాన్భాగైః పలార్ధాంశ్చ పృథక్పృథక్
ఏత త్సమస్తం సంమర్ద్య జంబీరామ్లే దినత్రయమ్.
బదరాస్థి ప్రమాణేన వటికాం కారయేద్బుధః
ఏకైకాం భక్షయే త్ప్రాతః కోష్ణతోయం పిబే దను.
సర్వశూలం హరే ద్గుల్మ మజీర్ణం పరిణామజమ్
అతీసారగదం హన్యా ద్గ్రహణీం చ విశేషతః.



తా. చింతబెరడుక్షారము ౫ పలములు, ఉప్పు, సైంధవలవణము, పాదరలవణము, బిడాలవణము, సౌవర్చలవణము, ఇవి దినుసు కొకపలము; ఇటుల వీటిని చూర్ణముజేసి అందు ౨ పళ్లు నిమ్మపండ్లరసము బోసియుంచుకొని పదిపలములశంఖమును ప్రక్కలుజేసి ఒక మట్టిపాత్రయం దునిచి కొలిమిన చక్కఁగయూది పై నిమ్మపండ్లరసములో నద్దవలయు; ఇటుల నేడుపర్యాయములు కొలిమిలోనుంచి యూది యద్దిపిదప నాశంఖమును చూర్ణముజేసి యందు నేతితో పక్వముగ పొంగించిన ఇంగువ, శొంఠి, పిప్పళ్ళు, మిరియాలు ఇవి దినుసు కొకపలము; శుద్ధిచేసిన గంధకము ౪ పలము, శుద్ధిజేసిన పాదరసము ౪ పలము, శుద్ధిజేసిన వసనాభి ౪ పలము కలిపి నిమ్మపండ్లరసములో మూడుదినములు చక్కఁగ ఖల్వమున మర్దించి రేగుగింజలంతేసి మాత్రలుజేసి నీడన యెండించి దేహతత్త్వము నెఱింగి యం దొకమాత్రను ప్రాతస్సాయంకాలముల యందు భక్షించి యుష్ణోదకము త్రాగిన సమస్తశూలలు, గుల్మములు, అజీర్ణములు, పరిణామశూలలు, అతిసారములు, సంగ్రహణులు ఇవియన్నియు నశించు.

శ్లో. గోమూత్రసిద్ధం మండూరం త్రిఫలాచూర్ణసంయుతమ్
విలిహ న్మధుసర్పిభ్యాం శూలం హంతి త్రిదోషజమ్.

తా. గోమూత్రముచే సిద్ధముచేయబడిన మండూరములో కరక్కాయలు, తానికాయలు, నెల్లివరుగు వీటిని సమముగ చూర్ణముజేసివైచి యందు తగుమాత్రము తేనెనైనను, నెయ్యినైనను కలిపి భక్షించిన త్రిదోషజనితశూలలు హరించు.

శ్లో. హింగ్వక్షార్ద్రకుబేరాక్షా వృద్ధా శ్శూలేంబునాసుఖాః
గుడాభయం వాసఘృతో రసోన శ్శూలను త్వరః.

తా. ఇంగువ ౧ భాగము, తానికాయలు ౨ భా, శొంఠి ౩ భా, గచ్చపప్పు ౪ భా, ఇటుల వీటినెల్ల చూర్ణముచేసి యుష్ణోదకముతో బుచ్చుకొనినను, కరక్కాయలచూర్ణంబున బెల్లము కలిపి భక్షించినను, వెల్లుల్లిపాయలను నేతితో భక్షించినను, శూలలు నశించు.

శ్లో. పక్తిశూలం జయత్యాశు గుడార్ద్రతిలమోదకః
హింగ్వాభయం వచో వేల్లం పీత ముష్ణాంబునా జయేత్
ఆనాహశూలహృద్రోగవిషూచీగుల్మమారుతాన్.

తా. బెల్లము, అల్లము, నువ్వులు వీటిని సమభాగములుగ నూరి ముద్దచేసి నెల్లికాయంత భక్షించిన పరిణామశూలలు హరించు. ఇంగువ, కరక్కాయలు, వస, వాయువిళంగములు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి యుష్ణోదకముతో బుచ్చుకొనిన ఆనాహశూల, హృద్రోగము, విషూచి, గుల్మము, వాతము, ఇవియన్నియు నశించు. ఇక ఆమశూలకు చికిత్సలం జెప్పెద.—

శ్లో. ఏరండతైలం షడ్భాగం లశునస్య తథాష్టకమ్
ఏకంహింగు త్రిసింధూత్థం సర్వమేకత్ర మర్దయేత్.
త్రినిష్కం భక్షయేత్పశ్చాదామశూలప్రశాంతయే.

తా. వెల్లుల్లి ౮ భా, ఇంగువ ౧ భా, సైంధవలవణము 3 భా, ఇటుల వీటిని చూర్ణముగావించి యందు చిట్టాముదము ౬ భా, బోసి చక్కగ మర్దించి ప్రాటకు ౧ తులము పుచ్చుకొనిన ఆమశూలలు శమించు.

శ్లో. శుద్ధసూతం ద్విభాగంధం యామైకం మర్దయే ద్దృఢమ్
ద్వయో స్తుల్యం శుద్ధతామ్రం సంపుటే తన్నిరోధయేత్.
అధోర్ధ్వం లవణం దత్వా మృద్భాండే ధారయే ద్భిషక్
రుద్ధ్వా గజపుటే పాచ్యం స్వాంగశీతం సముద్ధరేత్.
సంపుటం చూర్ణయే త్సమ్య క్పర్ణఖండై ర్ద్విగుంజకమ్
భక్షయే త్సర్వశూలార్తో హింగుశుంఠీసజీరకమ్
వచామరిచజం చూర్ణం కర్షంచోష్ణం జలైః పిబేత్
అసాధ్యం సాధయే చ్ఛూలం రసోఽయం శూలకేసరీ.

తా. శుద్ధిజేసిన పాదరసము ౧ భాగము, శుద్ధిజేసిన గంధకము ౨ భా, వీటిని ఖల్వంబునం దునిచి ౧ ఝామము చక్కగ మర్దించవలయును. ఇట్లు మర్దింపబడిన రసగంధకములు బట్టునట్లు, శుద్ధిచేయబడిన తామ్రపురేకులచే నొకడబ్బినిగావించి యందా రసగంధకముల నునిచి మూతవేసి చీలమన్ను లేపనముజేసి యెండించి యొకకుండయం దుప్పుబోసి యందీ డబ్బినునిచి అందుపై మఱల యుప్పుబోసి యాకుండమూతిని మూకుడుచే మూసి చీలమన్ను లేపనముజేసి గజపుటమువేసి స్వాంగశీతలమున నాడబ్బినిగ్రహించి ఖల్వమునం దునిచి చక్కగ మర్దించి చూర్ణము గావింపవలయును. ఈచూర్ణంబును రెండు గురిగింజలప్రమాణము తమలపాకులయం దునిచి భక్షించుటయుగాక ఇంగువ, శొంఠి, జీలకఱ్ఱ, వస, మిరియాలు, వీటిని చూర్ణముజేసి కర్షప్రమాణము ఉష్ణోదకముతో బుచ్చుకొనిన ప్రబలమగు ఆమశూలలు హరించు. (ఇది శూలకేసరీరసము.)

శ్లో. వ్యాయామం మైథునం మద్యం లవణం కటుకాని చ
వేగరోధం సుతక్రం చ వర్జయే చ్ఛూలవా న్నరః.

తా. వ్యాయామము, మైథునము, మద్యపానము, వీటినిగావించుట, కారము, ఉప్పు, గలపదార్థములను భుజించుట, పరిగెత్తుట, మలమూత్రములను బంధించుట, మజ్జిగత్రాగుట, వీటిని శూలరోగులు వర్జింపవలయును.

ఇట్లు శూలచికిత్స ముగిసెను.

---



## అనాహోదావర్తలక్షణము.

శ్లో. వస్తిమేహనయోశ్శూలం మూత్రకృచ్ఛ్రం శిరోరుజః
విషమోవంక్షణానాహస్స్యాల్లింగం మూత్రనిగ్రహాత్.

తా. పొత్తికడుపు, శిశ్నము, వీటియందు శూల, మూత్రకృచ్ఛ్రము, తలనొప్పి, ఇవిగలిగిన వంక్షణానాహరోగంబని యెఱుంగవలయు. ఈరోగము మూత్రనిగ్రహముచే జనించు.

శ్లో. మన్యాగళస్తంభశిరోవికారాః జృంభోపఘాతాత్పవనాత్మకాస్స్యుః
తథాక్షినాసా వదనామయాశ్చ భవంతి తీవ్రా స్సహకర్ణరోగైః.

తా. పెడతల, పెద్దనరము, కంఠము, ఇవి బిగబట్టుట, తలనొప్పిగలుగుట, ఒడలు విరుచుట, కండ్లు, ముక్కు, నోరు, చెవులు, వీటియందు తీవ్రమయిన వేదనగలుగుట, ఇట్టిలక్షణంబులుగలిగిన వాతానాహరోగంబని యెఱుంగవలయు.

శ్లో. వాయుః కోష్ఠానుగోరూక్షైః కషాయ కటుతిక్తకైః
భోజనైః కుపితస్సద్యః ఉదావర్తం కరోతిహి.
వాతమూత్రపురీషాంశ్చ కఫమేదోవహానిచ
స్రోతాంస్యుదావర్తయతి పురీషం చాపి వర్తతే.
శ్వాసకాసప్రతిశ్యాయదాహమోహతృషాజ్వరాః
వాతమూత్రపురీషాణి కృచ్ఛ్రేణ లభతే నరః.

తా. తీక్ష్ణము, కారము, వగరు, చేదు, గలపదార్థములను భుజించుటచే వాయువు ఉదరంబున కుపితమై ఉదావర్తరోగమును జనింపజేయును. ఇట్లు కుపితమైన వాయువు, మూత్రము, పురీషము, శ్లేష్మము, మేదస్సు, నాడులు, వీటిని ఊర్ధ్వముఖము గావించి పురీషంబును నోటినుండి వెడలజేయును. ఇటుల వెడలంజేసినపిదప శ్వాసకాసలు, పీనస, మోహము, దాహము, జ్వరము, ఇవి జనించుటయెగాక మూత్రపురీషాదు లతికష్టంబుగ విసర్జనంబగు.

---

## అనాహోదావర్తచికిత్స.

శ్లో. త్రివృద్ధరీతకీశ్యామాస్నుహిక్షీరేణ భావయేత్
వటికామాత్రపీతాస్తాశ్శ్రేష్ఠాస్త్వానాహనాశనాః.

తా. తెల్లతెగడ, కరక్కాయలు, పిప్పళ్ళు, వీడిని సమభాగములుగ చూర్ణముజేసి యందు బొంతజెముడుపాలుబోసి భావనజేసి రేగుగింజలంత మాత్రలుజేసి యందొకమాత్రను గోమూత్రంబులో బుచ్చుకొనిన అనాహకరోగము నశించు.

శ్లో. హింగుమాక్షికసింధూత్థైః పక్త్వా వర్తిం సువర్తితామ్
ఘృతాభ్యక్తాం గుదే దద్యా దుదావర్తవినాశిని.

తా. ఇంగువ, సైంధవలవణము, వీటిని చూర్ణముగావించి యందు తేనెవైచి నూరి యొకవస్త్రంబునకు పట్టించి వత్తిజేసి నిప్పుశెగయందు కాచి పిదప నేతిలో అద్ది యావత్తిని యూనసంబున నెక్కించిన ఉదావర్తరోగము నశించు.

శ్లో. విపాచ్యమూత్రామ్లరసేనదంతీపిండీతకృష్ణాబిడకుష్ఠధూమైః [త్.
వర్తీకరాంగుష్ఠనిభాంఘృతాక్తాంగుదేరుజానాహహరీంవిదధ్యా

తా. నేలదంతివేరు, మ్రంగకాయ, పిప్పలి, బిడాలవణము, కోష్ఠు, సన్నగోధుమలు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి యందు గోమూత్రము, నిమ్మపండ్లరసము బోసి యుడికించి వస్త్రమునకు పట్టించి యంగుష్ఠప్రమాణము వత్తిజేసి నిప్పుశెగయందు కాచి నేతిలోతడిపి యూసనమునం దెక్కించిన నొప్పి, పోట్లు, అనాహకరోగము, ఇవి యన్నియు హరించు.

శ్లో. హింగూగ్రగంధా బిడశుంఠ్యజాజీహరీతకీపుష్కరమూలకుష్ఠమ్
భాగోత్తరం చూర్ణిత మేతదిష్టం గుల్మోదరానాహ విషూచికాసు

తా. ఇంగువ ౧ భాగము, వస ౨ భా, బిడాలవణము ౩ భా, శొంఠి ౪ భా, జీలకఱ్ఱ ౫ భా, కరక్కాయలు ౬ భా, తామరగడ్డలు ౭ భా, కోష్ఠు ౮ భా, ఇటుల వీటిని చూర్ణంబొనర్చి పూటకు ౪ తులముసేవించిన గుల్మము, ఉదరరోగము, అనాహకము, విషూచి, ఇవి హరించు.

---

## అనాహోదావర్తములకు రసచికిత్స.

శ్లో. హింగూలం జయపాలటంకణవిషాణ్యంత్యార్ధభాగోత్తరం
సర్వం ఖల్వతలే విమర్ద్య మతిమాన్గుంజాద్వయం వై దదేత్
మార్తండోదయవా జ్జ్వరాదిసహిత శ్వాసోదరాధ్మానకే
పాండ్వాజీర్ణగదేనుపానవశతః పథ్యం చ తక్రోదనమ్.
వ్యోషేణార్ద్రరసేన తచ్చ సితయా యుక్తం జ్వరే దారుణే
మాంద్యే గుల్మకఫానిలే చ పవనే శూలే చ శోథోదరే
వాతాస్రే స్వరవర్ణకుష్ఠగుదజే రోగానశేషాం జయేత్.

తా. శుద్ధిజేసిన ఇంగిలీకము ౨ భాగములు, శుద్ధిజేసిన నేపాళములు ౧౪ భా, పేల్చిన వెలిగారము ౧ భా, శుద్ధిజేసిన వసనాభి ౪ భా, ఇటుల వీటిని చూర్ణముజేసి యందు నిమ్మపండ్లరసముబోసి యొకదినము ఖల్వమున చక్కగ మర్దించి గురిగింజలంతేసి



మాత్రలుజేసి నీడన యెండించి యం దొకమాత్రను బాలురును, రెండుమాత్రలను వృద్ధులును, భక్షించిన చక్కగ విరేచనంబగు. మఱియు దీనిని శొంఠి, పిప్పలి,మిరియాలు, అల్లపురసము, శర్కర వీటి యనుపానములచే బుచ్చుకొనిన జ్వరాదులతోగూడిన శ్వాసము, ఉదరరోగము, ఆధ్మానము, పాండువు, అజీర్ణము, తరుణజ్వరము, అగ్నిమాంద్యము, గుల్మము, కఫయుక్త మగువాతము, వాయువు, శూల, శోభోదరము, వాతరక్తము, స్వరభేదము, కుష్ఠువు, మూలవ్యాధి, ఇవి మొదలగు నెల్లరోగములు నశించు. ఇందుకు పథ్యము.—మజ్జిగన్నమును భక్షింపవలయును. (ఇది మార్తండభైరవరసము)

ఇట్లు అనాహోదావర్తచికిత్స ముగిసెను.

---

## గుల్మలక్షణము.

శ్లో. దుష్టా వాతాదయో ఒత్యర్థం మిథ్యాహారవిహారతః
కుర్వంతి పంచధా గుల్మం కోష్ఠాంతే గ్రంథిరూపిణమ్,

తా. మిథ్యాహారవిహారంబులచే వాతాదులు ప్రదుష్టంబులై ఉదరంబున నైదువిధంబులగు గ్రంథులంబోలిన గుల్మరోగంబులను జనింపంజేయును.

శ్లో. సర్వ్యస్తైర్జాయతే దోషై స్సమస్తైరపి చోత్థితైః
పురుషాణాం తథా స్త్రీణాం జ్ఞేయో రక్తేన చాపరః.

తా. వాతము, పిత్తము, శ్లేష్మము, సన్నిపాతము, వీటిదోషములచే స్త్రీలకును పురుషులకును గుల్మరోగము జనించు. మఱియు స్త్రీలకుమాత్రం బీగుల్మరోగము రక్తమువలన నుత్పత్తియగు.

శ్లో. ఉద్గారబాహుళ్యపురీషబంధతృష్ణాక్షమత్వాంత్రవికూజనాని
ఆటోపమాధ్మానమపక్తిశక్తిరాసన్నగుల్మస్య వదంతి చిహ్నమ్.

తా. అధికముగ తేనుపులువచ్చుట, మలము బంధించుట, దాహము గలుగుట, ఓర్పులేకుండుట, పేగులలో గుఱుగుఱుమను శబ్దముగలుగుట, ప్రాణసంకటము గలుగుట, కడుపుబ్బుట, అగ్నిదీపనము లేకుండుట, ఇట్టిలక్షణంబులు గలిగిన గుల్మరోగం బతిశీఘ్రంబుగ నుత్పత్తియగునని యెఱుంగవలయును.

శ్లో. నవప్రసూతాహితభోజనా యా
యా చామగర్భం విసృజేదృతౌ చ
వాయుర్హి తస్యాః పరిగృహ్య రక్తం
కరోతి గుల్మం సరుజం సదాహమ్.

తా. నూతనముగ ప్రసవించినవనిత, అపక్వమగు గర్భమును ప్రవించిన యువతి, ఋతుకాలముగల మానిని, వీర లపథ్యంబొనర్చుటచే ధాతువులకు వైషమ్యంబు గలుగు.

అందుచే వాతము రక్తమును గ్రహించి తాపము, కడుపునొప్పి, వీటియుక్తమగు రక్త గుల్మమును జనింపజేయు.

---

## గుల్మరోగచికిత్స.

శ్లో. వచాభయాబిడంశుంఠీహింగుకృష్ణాగ్నిదీప్యకాః
ద్విత్రిషట్చతురేకాష్టసప్తపంచాశకాన్క్రమాత్.
చూర్ణం మూత్రాదిభిః పీతగుల్మానాహోదరాపహమ్
శూలార్శశ్వాసకాసఘ్నం గ్రహణీదీపనం పరమ్.

తా. వస ౨ భాగములు, కరక్కాయలు ౩ భాగములు, బిడాలవణము ౬ భాగములు, శొంఠి ౪ భాగములు, ఇంగువ ౧ భాగము, పిప్పళ్లు ౮ భాగములు, చిత్రమూలము ౭ భాగములు, ఓమము ౫ భాగములు, ఇటుల వీటినెల్ల దంచి చూర్ణం బొనర్చి అం దొకతులమును గోమూత్రముచే ౨ పూటలును భక్షించిన గుల్మము, ఆనాహకము, ఉదరరోగము, శూల, మూలవ్యాధి, శ్వాసకాసలు, సంగ్రహణి, ఇవి యన్నియు నశించి యగ్నిదీపనము గలుగు.

శ్లో. చిత్రకం గ్రంథికైరండశుంఠీక్వాథః పరం హితః
శూలానాహవిబంధేషు సహింగుబిడసైంధవః.

తా. చిత్రమూలము, మోడి, ఆముదపువేరు, శొంఠి, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి అం దింగువ, బిడాలవణము, సైంధవలవణము, వీటిని సమముగ చూర్ణము జేసివైచి పుచ్చుకొనిన గుల్మము, శూల, ఆనాహకము, మూత్రపురీషముల బంధము, ఇవియన్నియు నివృత్తియగు.

శ్లో. పథ్యారోహితకక్వాథో యవక్షారకణాయుతః
పిబేత్ప్రాతర్యకృత్ప్లీహగుల్మోదరనివృత్తయే.

తా. కరక్కాయలు, రక్తబోళము, వీటిని సమభాగములుగ దంచి కషాయము బెట్టి అందు యవక్షారము, పిప్పలిచూర్ణము తగుమాత్రము కలిపి ప్రాతఃకాలములయందు పుచ్చుకొనిన యకృత్తు, ప్లీహము, గుల్మము, ఉదరరోగము, ఇవి హరించు.

శ్లో. శుద్ధసూతసమం గంధం జేపాలం త్రిఫలాసమమ్
త్రికటుం పేషయేత్క్షౌద్రమిశ్రం గుల్మం లిహన్ హరేత్.
ఉష్ణోదకం పిబేచ్చాను నారాచోఽయం రసోత్తమః.

తా. శుద్ధిజేసిన పాదరసము, శుద్ధిజేసిన గంధకము, శుద్ధిజేసిన నేపాళములు, కరక్కాయలు, తానికాయలు, నెల్లివరుగు, శొంఠి, పిప్పలి, మిరియాలు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి తేనెచే ఖల్వంబున చక్కగ మర్దించి రేగుగింజంత మాత్ర



లుజేసి యం దొకమాత్రను భక్షించి యుష్ణోదకము త్రాగిన గుల్మము నశించు. (ఇది నారాచరసము.)

వాక్యమ్. అథవా ఉదయమార్తాండో దేయః.

తా. మఱియు నుదయమార్తాండరసము సేవించిన గుల్మము నశించు.

శ్లో. శతాహ్వాచిరబిల్వత్వగ్దారుభార్గికణోద్భవః
కల్కః పీతో హరేద్గుల్మం తిలక్వాథేన రక్తజమ్.

తా. చల్లపిల్లిగడ్డలు, కానుగవేరుపట్ట, మానిపసుపు, గంటుభారంగి, పిప్పళ్లు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి యం దుదకముకలిపి పుచ్చుకొనిన గుల్మము హరించు. మఱియు నీచూర్ణంబును నువ్వులకషాయములో ఖుచ్చుకొనిన రక్తగుల్మము నశించు.

శ్లో. తిలక్వాథో గుడఘృతవ్యోషభార్గి రజోన్వితః
పీతో రక్తభవే గుల్మే నష్టే శుక్రే చ యోషితః.

తా. నువ్వులకషాయంబున శొంఠి, పిప్పలి, మిరియాలు, గంటుభారంగి, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి వైచి యందు తగుమాత్రముగ బెల్లము, నెయ్యి, కలిపి పుచ్చుకొనిన స్త్రీలరక్తగుల్మము, శుక్లనష్టము, ఇవి హరించు.

శ్లో. భార్గీకృష్ణాకరంజత్వగ్గ్రంథికామరదారుజమ్
చూర్ణం తిలానాం క్వాథేన రక్తగుల్మరుజాపహమ్.

తా. గంటుభారంగి, పిప్పళ్లు, కానుగపట్ట, మోడి, దేవదారుపట్ట, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి నువ్వులకషాయంబున వైచి పుచ్చుకొనిన రక్తగుల్మము నివృత్తియగు.

శ్లో. సాముద్రం సైంధవం కాచం యవక్షారం సువర్చలమ్
టంకణం సర్జికాక్షారం తుల్యం చూర్ణం ప్రకల్పయేత్.
అర్కక్షీరైః స్నుహిక్షీరైర్ద్రవితం చ విభావయేత్
అర్కపత్త్రం లిపేత్తేన రుద్ధ్వా భాండే పుటే పచేత్.
తత్క్షారం చూర్ణయిత్వాథ త్ర్యూషణం త్రిఫలారజః
జీరకం రజనీవహ్నిర్నవకస్య చ భాగతః.
క్షారార్ధం యోజయేత్సర్వమేకీకృత్య విచూర్ణయేత్
వజ్రక్షారమిమం పూర్వం స్వయం ప్రోక్తం పినాకినా.
సర్వోదరేషు గుల్మేషు శూలశోఫేషు వర్జయేత్
అగ్నిమాంద్యే త్వజీర్ణే చ భక్ష్యం నిష్కద్వయం తథా.

వాతాధికే జలే కోష్ణే ఘృతే పిత్తాధికే హితః
కఫే గోమూత్రసంయుక్తమారనాళే త్రిదోషనుత్.

తా. ఉప్పు, సైంధవలవణము, కాచలవణము, యవక్షారము, సౌవర్చలవణము, వెలిగారము, సర్జక్షారము, వీటిని సమముగ చూర్ణముజేసి యందు జిల్లేడుపాలు బొంతజెముడు పాలుబోసి వేర్వేరుగ మర్దించి జిల్లేడాకులకు లేపనముజేసి యాయాకులను తగుమాత్రపుకుండయం దునిచి దానిమూతిని మూకుడుచే గప్పి చీలమన్నులేపనము జేసి యెండించి సూక్ష్మాగ్నిచే పక్వముజేసి యాక్షారంబునుదీసి ఖల్వమునం దునిచి చక్కగ మర్దించవలయు. పిదప ఈక్షారమున కర్ధప్రమాణము శొంఠి, పిప్పలి, మిరియాలు, కరక్కాయలు, తానికాయలు, నెల్లివరుగు, జీలకఱ్ఱ, పసుపు, చిత్రమూలము, వీటిని చూర్ణముజేసి పై మర్దించియుంచిన క్షారంబునందు గలిపి మఱల చక్కగ మర్దించి యుక్తానుపానంబులలో ౨ వరహాలయెత్తు చూర్ణమును పుచ్చుకొనిన సమస్త ఉదరరోగములు, గుల్మములు, శూలలు, శోథ, అగ్నిమాంద్యము, అజీర్ణములు, ఇవి యన్నియు హరించునని సదాశివుండు వచించె. మఱియు నీక్షారంబును వాతాధిక్యంబున నుష్ణోదకముతోడను, పిత్తాధిక్యంబున నేతితోడను, శ్లేష్మాధిక్యంబున గోమూత్రముతోడను, త్రిదోషములయందు పుల్లనికలితోడను సేవింపవలయు. (ఇది వజ్రక్షారము.)

శ్లో. చించాక్షారం స్నుహిక్షార మర్కక్షారం పలం పలమ్
ద్విపలం శంఖభూతిం చ రామఠం చ పలార్ధకమ్.
లవణాని చ సర్వాణి పలమాత్రాణి యోజయేత్
క్షారద్వయం పలార్ధం చ సర్వమేకత్ర చూర్ణయేత్.
జంబీరకరసైర్మర్ద్యమనలస్య దినత్రయమ్
భృంగరాజస్య నిర్గుండీముండ్యోశ్చైవ పృథగ్ద్రవైః.
ఆర్ద్రికస్య రసేనైవ ప్రత్యేకం మర్దయే ద్దినమ్
బదరీబీజమాత్రాం తు వటికాం కారయే ద్భిషక్.
ఏకైకాం భక్షయే త్ప్రాతః పంచగుల్మా న్వ్యపోహతి
సర్వశూలం నిహంత్యాశు అజీర్ణం చ విషూచికామ్.
మందాగ్నిం నాశయే చ్ఛీఘ్రం పథ్యం తైలామ్లవర్జితమ్
చించాశంఖవటీనామ గ్రహణీరోగహృత్పరా.

తా. చింతపట్టలక్షారము, బొంతజెముడుక్షారము, జిల్లేడుక్షారము, ఇవి దినుసు ౧కపలము. శంఖభస్మము ౨ పలములు, ఇంగువ ౪ ప, సైంధవలవణము, పాదరలవణము, కాచలవణము, బిడాలవణము, సౌవర్చలవణము, ఉప్పు, వెదురుప్పు, చవుటిలవణము, పెట్లుప్పు, ఇవి దినుసుకు ౧ ప, సర్జక్షారము ౪ ప, యవక్షారము ౪ ప, ఇటుల



వీటినెల్ల చూర్ణముజేసి దానిని నిమ్మపండ్లరసముచే 3 దినంబులును, చిత్రమూలకషాయముచే 3 దినంబులును, గుంటగలగరాకురసముచే ౧ దినంబును, వావిలాకురసముచే ౧ దినంబును, బోడతరపాకురసముచే ౧ దినంబును, అల్లపురసముచే ౧ దినంబును, ఖల్వమున చక్కగ మర్దించి రేగుగింజలంతేసి మాత్రలుజేసి నీడన యెండించి యం దొకమాత్రను ప్రాతఃస్సాయంకాలములయందు భక్షించిన అయిదువిధంబులగు గుల్మములు, శూలలు, అజీర్ణములు, విషూచి, మందాగ్ని, సంగ్రహణులు, ఇవియన్నియు హరించు. ఇందుకు పథ్యము:—నువ్వులనూనె, పులుసు, వీటిని వర్జింపవలయు. (ఇది చించాశంఖవటికలు.)

శ్లో. సాముద్రలవణం గ్రాహ్య మష్టకర్షమితం బుధైః
పంచ సౌవర్చలం గ్రాహ్యం బిడం సైంధవధాన్యకమ్.
పిప్పలీపిప్పలీమూలం చిత్రకం కృష్ణజీరకమ్
నాగకేసరతాళీశా అమ్లవేతసకం తథా.
ద్వికర్షమాత్రా ణ్యేతాని ప్రత్యేకం హారయే ద్బుధః
మరీచం జీరకం విశ్వమేకైకం కర్షమాత్రకమ్.
దాడిమస్య చతుఃకర్షం త్వగేలా చార్ధకర్షికే
ఏతచ్చూర్ణీకృతం సూక్ష్మం లవణం భాస్కరాభిదమ్.
శాణప్రమాణం దేయం తు మస్తుతక్రసురాసవైః
వాతశ్లేష్మభవం గుల్మం ప్లీహానముదరం క్షయమ్.
అర్శాంసి గ్రహణీకుష్ఠం విబంధం చ భగందరమ్
శోఫం శూలం శ్వాసకాసం చామదోషం చ హృద్రుజమ్.
మందాగ్నిం నాశయే చ్ఛీఘ్రం దీపనం పాచనం పరమ్
సర్వలోకహితార్థాయ భాస్కరేణోదితం పురా.

తా. ఉప్పు ౮ తులములు, పాదరలవణము ౫ తు, బిడాలవణము, సైంధవలవణము, ధనియాలు, పిప్పళ్లు, మోడి, చిత్రమూలము, నల్లజీలకఱ్ఱ, నాగకేసరములు, తాళీశపత్రి, పుల్లప్రబ్బలి, ఇవి దినుసు యొకటింటికి ౨ తు, మిరియాలు, జీలకఱ్ఱ, శొంఠి, ఇవి దినుసు యొకటింటికి ౧ తు, దాడింబవోలుపు ౪ తు, లవంగపట్ట ౪ తు, ఏలక్కాయలు ౪ తు, ఇటుల వీటినన్నిటిని చూర్ణముజేసి పూటకు నాలుగుమాషముల యెత్తు పెరుగుమీది నీళ్లు, మజ్జిగ, కల్లు, చెఱుకుచే జేయబడిన మద్యము, ఉదకము, వీటిలో దేనిచేనైనను సేవించిన వాతశ్లేష్మయుక్తమగుగుల్మములు, ప్లీహము, ఉదరరోగము, క్షయము, మూలవ్యాధి, సంగ్రహణి, కుష్ఠువు, మలమూత్రబంధము, భగం

దరము, శోథ, శూల, శ్వాసకాసలు, ఆమదోషము, హృద్రోగము, మందాగ్ని, ఈ మొదలగురోగంబులన్నియు నశించుటయగాక దీపనపాచనములు సగా గలుగునని మార్తాండుండు లోకహితార్థమై వచించె. (ఇది భాస్కరోక్తలవణము.)

శ్లో. దంతిహింగుయవక్షారాలాబుబీజం కణాగుడః
స్నుహిక్షీరేణ ఘుటికా సర్వేషాం కర్షమాత్రికా.
భక్షితా రక్తగుల్మఘ్నీ రుధిరస్రావకారిణీ.

తా. నేలదంతివేరు, ఇంగువ, యవక్షారము, చేదుసొరవిత్తులు, పిప్పళ్లు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి యందు పాతబెల్లము, బొంతజెముడు పాలుబోసి నూరి కర్షప్రమాణము మాత్రలుజేసి యందొకమాత్రను భక్షించిన రక్తగుల్మము నశించి రక్తము స్రవించు.

శ్లో. పక్వం తైలేఽర్కజం పుష్పం రుధిరస్రావకారి చ.

తా. జిల్లేడుపువ్వులను నూనెలో వేయించి తగుమాత్రము భక్షించిన గుల్మము నశించుటయగాక రక్తంబును స్రవించు.

ఇట్లు గుల్మరోగచికిత్స ముగిసెను.

---

## హృద్రోగలక్షణము.

శ్లో. అత్యుష్ణగుర్వమ్లకషాయతిక్తశ్రమాభిఘాతాధ్యశనైః ప్రసంగైః
సంచింతనైర్వేగవిధారణైశ్చ హృదామయః పంచవిధః ప్రదిష్టః.

తా. ఉష్ణపదార్థములు, గురుద్రవ్యములు, పులుసు, కారము, వగరు, చేదుగల పదార్థములు వీటిని నధికముగ భుజించుట, మిగుల శ్రమము, అభిఘాతము వీటినిజెందుట, అధికముగ భుజించుట, అతిమైథునం బొనర్చుట, మిగుల చింతించుట, వేగముగ సంచరించుట, వీటిచే నైదువిధంబులగు హృద్రోగంబులు జనించు.

శ్లో. దూషయిత్వా రసం దోషా విగుణా హృదయం గతాః
హృది బాధాం ప్రకుర్వంతి హృద్రోగం తం ప్రచక్షతే.

తా. మఱియు వాతాదిదోషంబులచే దేహమందలి యన్నరసము చెడి యది హృదయంబున బ్రవేశించి బాధింపందొడంగు. ఇదియ హృద్రోగమనబడు.

శ్లో. నియమ్యతే మారుతజే హృదయం తు ద్యతే తథా
ఆధ్మానం కుక్షిహృత్కంఠవాతవిణ్మూత్రరోధతా.
తంద్రారోచకశూలాని తృష్ణాలింగాని నిర్దిశేత్.



తా. ఇటుల వాయువువలన జెడినయన్నరసము హృదయంబున స్తంభించిః బొమ్మునొప్పి, కడుపుబ్బరము, కుక్షి, పొత్తికడుపు, కంఠము, వీటియందు వాః మలమూత్రములబంధము, తంద్ర, అరుచి, శూల, దాహము, ఇవి గలుగు. ఇ ణంబులచే దీనిని వాతహృద్రోగంబని ఎఱుంగవలయు.

---

## హృద్రోగచికిత్స.

శ్లో. క్వాథః కృతఃపౌష్కరమాతులుంగపలాశభూతీకశఠీసురాహ్వైః
సనాగరాజాజివచాయవాహ్వాస్సక్షార ఉష్ణో లవణేన పేయః.

తా. తామరగడ్డలు, మాదీఫలము, మోదుగపట్టక్షారము, ఓమము, కచ్చూరములు, దేవదారు, శొంఠి, జీలకఱ్ఱ, వస వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి అందు యవక్షారము, సర్జక్షారము, సైంధవలవణము, సౌవర్చలవణము, వీటిని సమముగ చూర్ణముజేసి, కలిపి హితోష్ణముగ పుచ్చుకొనిన హృద్రోగము నివృత్తియగు.

శ్లో. చూర్ణం పుష్కరజం లిహ్యా న్మాక్షికేణ సమాయుతమ్
హృద్రోగశ్వాసకాసఘ్నం క్షిప్రం హిక్కానివారణమ్.

తా. తామరగడ్డలను చూర్ణముజేసి యందు తేనెకలిపి భక్షించిన హృద్రోగము, శ్వాసకాసలు, వెక్కిళ్లు, ఇవియన్నియు శీఘ్రంబుగ హరించు.

శ్లో. శరావసంపుటే దగ్ధ్వా శృంగం హారిణజం పిబేత్
గవ్యేన సర్పిషా పిష్టం హృచ్ఛూలం నాశయే ద్ధ్రువమ్.

తా. దుప్పికొమ్మును మిగుల చిన్నవిగ తునకలుజేసి తగుమైన మూకుడుయందునిచి దానిమూతిని బిగించి చీలమన్ను లేపనముజేసి యెండించి గజపుటమువేసి యా భస్మమును ౧ గురిగింజలయెత్తు ఆవునెయ్యితో సేవించిన బొమ్మశూలలు హరించు.

శ్లో. చతుర్వింశత్పలం క్షీరం గవా మథ పచేచ్ఛనైః
ద్విరష్టపలకం యావ త్తావ త్కుర్యాత్తు శీతలమ్.
సితాక్షౌద్రం ఘృతం తస్మిన్దద్గ్యాచ్చార్ధపలం క్షిపేత్
కర్షైకం పిప్పలీచూర్ణం క్షిప్త్వా పేయం హితం పరమ్.
సర్వదోషోత్థహృద్రోగం జ్వరం కాసం క్షయం జయేత్.

తా. ఇరువదినాలుగుపలముల యావుపాలను మందాగ్నిచే పదియారు పలంబులగువరకు కాచి చల్లార్చి యందు శర్కర ౪ ప, తేనె ౪ ప, నెయ్యి ౪ ప, పిప్పలిచూర్ణము ౧ ప, కలిసి పుచ్చుకొనిన సమస్తదోషంబులచే నుత్పన్నంబైన హృద్రోగము, జ్వరము, దగ్గు, క్షయము, ఇవియన్నియు నివృత్తియగు.

యష్టీనాగబలోదీచ్యార్జునైస్సర్పిస్సుసాధితమ్
హృద్రోగం క్షయపిత్తాస్రానిలాస్రశ్వాసకాసజిత్.

తా. అతిమధురము, చిట్టాముట్టివేరు, కురువేరు, మద్దిపట్ట, వీటిని సమభాగ దంచి కషాయముబెట్టి దీనికి సమముగ నెయ్యిబోసి యాకషాయము ఇగురు కాచి పిదప యందుండెడినెయ్యిని ౧ తులము పుచ్చుకొనిన హృద్రోగము, క్షయము, రక్తపైత్యము, రక్తవాతము, శ్వాసకాసలు, ఇవియన్నియుం నశించు.

శ్లో. మాతార్కగంధంక్వాథేనవరాయామర్దయేద్దినమ్
కాకమాచ్యావటీం కృత్వా చణమాత్రాం తు భక్షయేత్.
హృదయార్ణవనామాయం హృద్రోగదళనో రసః.

తా. శుద్ధిజేసిన పాదరసము, తామ్రభస్మము, శుద్ధిజేసిన గంధకము, వీటిని కరక్కాయలు, తానికాయలు, నెల్లివరుగు, వీటికషాయముచే యొకదినంబును, నల్లకాచి స్వమూలకషాయముచే యొకదినంబును, ఖల్వమున చక్కగ మర్దించి శనగగింజలంత మాత్రలుజేసి నీడనయెండించి యం దొకమాత్రను భక్షించిన హృద్రోగము నశించు. (ఇది హృదయార్ణవరసము.)

శ్లో. వమనం రేచనం దద్యా ద్యుక్త్యా హృద్రోగనాశనమ్
నారాచోదయమార్తండం దద్యా ద్ధృద్రోగహానయే.

తా. రోగతత్త్వమును, శరీరతత్త్వమును నెఱింగి వమనమునకు, విరేచనమునకు బుచ్చుకొనినను, నారాచరసము, ఉదయమార్తాండరసము, వీటిలో దేనినైనను సేవించినను, హృద్రోగము హరించు.

ఇట్లు హృద్రోగచికిత్స ముగిసెను.

## మూత్రకృచ్ఛ్రలక్షణము.

శ్లో. పృథఙ్మలాస్స్వైః కుపితా నిదానై
స్సర్వేథవా కోప ముపేత్య వస్తౌ
మూత్రస్య మార్గం పరిపీడయంతి
యదా తథా మూత్రయతీహ కృచ్ఛ్రమ్.

తా. స్వకారణంబులచే బ్రకోపించిన త్రిదోషములు ప్రత్యేకములుగనైనను, ద్వంద్వములుగనైనను, నిజమలంబులను పొత్తికడుపుయందు జేర్చి మూత్రద్వారమును నిరోధింపం జేయుచున్నయవి. ఇటుల నిరోధించుటచే మూత్రం బతికష్టంబుగ విసర్జనంబగు. ఇదియ మూత్రకృచ్ఛ్రంబని యెఱుంగు.



శ్లో. తీవ్రార్తిరుగ్వంక్షణవస్తిమేఢ్రే
స్వల్పం ముహుర్మూత్రయతీహ వాతాత్.

తా. గజ్జలు, పొత్తికడుపు, శిశ్నము, వీటియం దధికముగ నొప్పి, మంటలు, పోట్లు, వ్యథ, ఇవిగలుగుట ప్రతిక్షణమునను మూత్రము విసర్జనంబగుట, ఇట్టిలక్షణంబులుగలిగిన వాతముచేజనించిన మూత్రకృచ్ఛ్రమని యెఱుంగవలయు.

శ్లో. శుక్రే దోషైరుపహతే మూత్రమార్గే విధావితే
సశుక్రం మూత్రయే త్కృచ్ఛ్రాద్వస్తిమేహనశూలవాన్.

తా. వాతాదిదోషంబులచే శుక్లముజెడి యది మూత్రద్వారంబును భేదించు. మఱియుం మూత్రము శుక్రముతోడ గలిసి యతికష్టంబుతోడ బైలువెడలు. ఇటుల వెడలునపుడు పొత్తికడుపు, మేహనము, వీటియందు శూలగలుగు.

శ్లో. అశ్మరీ శర్కరా చైవ తుల్యసంభవలక్షణే.

తా. మూత్రాశ్మరి, మూత్రశర్కర, అను నీ రెండురోగంబులు నొక్కకారణంబు ననుసరించే జనించు. వీటికి లక్షణంబులును నొకటిగనే యుండు.

## మూత్రకృచ్ఛ్రచికిత్స.

శ్లో. పాషాణభేదస్త్రివృతాచిపథ్యాదురాలభాపుష్కరగోక్షురంచ
పలాశశృంగాటకకర్కటీనాం బీజం కషాయ స్సనిరుద్ధమూత్రే.

తా. కొండపిండివేళ్ళు, తెల్లతెగడ, కరక్కాయలు, దురదగొండివేళ్ళు, తామరగడ్డలు, పల్లేరుకాయలు, మోదుగవిత్తులు, పరికగడ్డలు, దోసవిత్తులు, వీటిని సమభాగములుగ కషాయముబెట్టి పుచ్చుకొనిన మూత్రకృచ్ఛ్రము నశించు.

శ్లో. హరీతకీగోక్షురరాజవృక్షపాషాణభిద్ధన్వయవాసకానామ్ [బంధే.
క్వాథం పిబేన్మాక్షికసంప్రయుక్తం కృచ్ఛ్రే సదాహే సరుజే వి

తా. కరక్కాయలు, పల్లేరుకాయలు, రేలపట్ట, కొండపిండివేళ్ళు, దురదగొండివేళ్ళు, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి యందు తేనెకలిపి సేవించిన తాపయుక్తమగు మూత్రకృచ్ఛ్రము నశించు.

శ్లో. మూలాని కుశకాశేక్షుశరాణాం చేక్షువాలుకా
మూత్రాఘాతాశ్మరీకృచ్ఛ్రం పంచమూలీ తృణాత్మికా.

తా. కుశదర్భవేళ్ళు, రెల్లువేళ్ళు, చెఱుకువేళ్ళు, ముంజిదర్భవేళ్ళు, తియ్యగూటురుబుడమవేళ్ళు, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి పుచ్చుకొనిన మూత్రాఘాతము, మూత్రాశ్మరీ, మూత్రకృచ్ఛ్రము, ఇవి నివృత్తియగు.

శ్లో. శిలాజత్వశ్మభిత్కృష్ణాత్రుటీతాం వా పిబేద్రజః.

తా. శిలాజిత్తు, కొండపిండివేళ్ళు, పిప్పళ్ళు, ఏలక్కాయలు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి యుష్ణోదకముతో నొకతులము పుచ్చుకొనిన మూత్రకృచ్ఛ్రము, మూత్రాఘాతము, మూత్రాశ్మరి, ఇవి హరించు.

శ్లో. హరిద్రామధుకం మూర్వా ముస్తకం దేవదారు చ
పిబే దక్షసమః కల్కం పయసా మూత్రపీడితః.

తా. పసుపు, అతిమధురము, చాగవేళ్ళు, తుంగగడ్డలు, దేవదారుపట్ట, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి యం దొకతులముచూర్ణమును పాలలో కలిపి సేవించిన మూత్రకృచ్ఛ్రము నశించు.

శ్లో. ఏలోపకుల్యామధుకాశ్మభేదకౌంతీశ్వదంష్ట్రావృషకోరుబూకే
క్వాథం పిబేదశ్మజతుప్రదానం సశర్కరం సాశ్మరిమూత్రకృచ్ఛ్రే.

తా. ఏలక్కాయలు, పిప్పళ్ళు, అతిమధురము, కొండపిండివేరు, రేణుకలు, పల్లేరుకాయలు, అడ్డసరము, ఆముదపువేరు, వీటిని సమభాగములుగ కషాయముబెట్టి యందు తగుమాత్రము శిలాజిత్తుభస్మము, శర్కర కలిపి పుచ్చుకొనిన మూత్రకృచ్ఛ్రము, మూత్రాశ్మరి, ఇవి నివృత్తియగు.

శ్లో. ఏలాశ్మభేదశిలాజతుపిప్పలీనాం
చూర్ణాని తండులజలైర్లులితాని పీత్వా
యద్వా గుడేన సహితాన్యవలేహ్య ధీమా
నాసన్నమృత్యురపి జీవతి మూత్రకృచ్ఛ్రీః.

తా. ఏలకులు, కొండపిండివేరు, శిలాజిత్తుభస్మము, పిప్పళ్ళు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి యం దొకపలమును బియ్యపుకడుగుతోనైనను, బెల్లపునీళ్లచేనైనను పుచ్చుకొనిన మృత్యువాసన్నంబుగనుండెడి మూత్రకృచ్ఛ్రము సగా హరించు.

శ్లో. సమూలగోక్షురః క్వాథ స్సితామాక్షికసంయుతః
నాశయేన్మూత్రకృచ్ఛ్రాణి తథా చోష్ణం సమీరణమ్.

తా. పల్లేరుచెట్టు సమూలమును దంచి కషాయముబెట్టి యందు తగుమాత్రము శర్కర, తేనె, కలిపి పానంబొనర్చిన మూత్రకృచ్ఛ్రము, ఉష్ణవాయువు, ఇవి నివృత్తియగు.

శ్లో. తక్రేణ యుక్తం శితిసారకస్య
బీజం పిబే త్కృచ్ఛ్రవిదాహహేతోః



పిబే త్తథా తండులధావనేన
ప్రవాళచూర్ణం కఫమూత్రకృచ్ఛ్రే.

తా. నల్లతుమికివిత్తులను చూర్ణముజేసి యందు మజ్జిగకలిపి పుచ్చుకొనిన తాపయుక్తమగు మూత్రకృచ్ఛ్రము నివృత్తియగు. మఱియు ప్రవాళభస్మమును బియ్యపుకడుగుతో పుచ్చుకొనిన శ్లేష్మయుక్తమగు మూత్రకృచ్ఛ్రము హరించు.

శ్లో. మంథం పిబేద్వా ససితం ససర్పి
శ్శ్రితం పయోవార్ధసితం ప్రదేయమ్
ధాత్రీరసేచేక్షురసం పిబేద్వా
కృచ్ఛ్రే సదాహే మధునా విమిశ్రమ్.

తా. వెన్నయెత్తబడిన పెరుగులో శర్కర కలిపి పుచ్చుకొనినను, లేక కాచిన పాలలో నెయ్యికలిపి యందు సగము శక్కరవేసి పుచ్చుకొనినను, లేక నెల్లికాయల రసంబున చెఱుకురసము కలిపి యందు తగుమాత్రము తేనెవైచి పుచ్చుకొనినను తాపయుక్తమగు మూత్రకృచ్ఛ్రము హరించు.

శ్లో. ఐర్వారుబీజయష్ట్యాహ్వదార్వివాతండులాంభసా
తోయేన కల్కం ద్రాక్షాయాః పిబేత్పర్యుషితేన వా.
పిబేన్మద్యేన సూక్ష్మైలాం ధాత్రీఫలరసేనవా.

తా. దోసవిత్తులు, అతిమధురము, మానిపసుపు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి యందు బియ్యపుకడుగు కలిపి పుచ్చుకొనినను, లేక ప్రాచీనసీళ్ళతో దీపద్రాక్షను దంచి దానిరసమును పుచ్చుకొనినను, లేక ఏలక్కాయలచూర్ణమును, మద్యముతోనైనను, నెల్లికాయల రసముతోనైనను పానంబొనర్చినను, మూత్రకృచ్ఛ్రము నశించు.

శ్లో. రసభస్మ చ భాగైకం చతుర్భాగం తు గంధకమ్
పిష్ట్వా వరాటకాన్పూర్యాద్రసపాదం చ టంకణమ్.
క్షీరేణ పిష్ట్వా రుద్ధ్వాస్యం భాండే రుద్ధ్వా పుటే పచేత్
స్వాంగశీతం విచూర్ణ్యాథ లఘులోకేశ్వరో రసః.
చతుర్గుంజో ఘృతైర్దేయో మరీచైకోనవింశతి.
జాతీమూలం ఫలైకం తు హ్యజాక్షీరేణ పాచయేత్
శర్కరాభావితం చాను పీతం కృచ్ఛ్రహరం పరమ్.

తా. పాదరసభస్మము ౧ భాగము, శుద్ధిజేసిన గంధకము ౪ భా, ఇటుల వీటిని ఖల్వమున యొకదినము చక్కగ మర్దించి బొంగుగవ్వలయం దునిచి పైపాదరసభస్మ

మునకు నాలవభాగము వెలిగారమును ఆవుపాలచే మెద్దగనూరి యా గవ్వలమూతు లకు పూదిగి తగుమాత్రపు పిడతయందు దునిచి ప్రమిదచే గప్పి చీలమన్ను లేపనము జేసి యెండించి గజపుటమువేసి సాంగశీతలమున నాగవ్వలను గ్రహించి ఖల్వమునందు దునిచి నున్నగనూరి ఆభస్మమును నాలుగుగురిగింజలయెత్తు నేతితో భక్షించి పిదప ౧౮ మిరియాలు ౧ పలము జాజివేరు, వీటిని చూర్ణముజేసి మేకపాలలో వైచి కాచి అందు శర్కర తగుమాత్రముగ కలిపి త్రాగిన మూత్రకృచ్ఛ్రము హరించు. (ఇది లఘులోకేశ్వరరసము.)

ఇట్లు మూత్రకృచ్ఛ్రచికిత్స ముగిసెను.

## మూత్రాఘాతలక్షణము.

శ్లో. మూత్రమల్పాల్పమథవా సరుజం సంప్రవర్తతే
స్థానాచ్చ్యుతం మూత్రయుతం ప్రాక్పశ్చాద్వా ప్రవర్తతే.
భస్మోదకప్రతీకాశం మూత్రాఘాతం తదుచ్యతే.

తా. వ్యథతోగూడి బొట్లుబొట్లుగ మూత్రోత్సర్జనంబగుట, మూత్రస్థానంబునుండి మూత్రము బైలువెడలునెడ యది దుష్టశుక్రముతోగలసి ముందుగనైనను, వెనకనైనను, "భస్మముతోగలసిన నీరుచందంబున" బైలువెడలుట, ఇట్టి లక్షణంబులు గలిగియుండిన మూత్రాఘాతంబని ఎఱుంగవలయు.

శ్లో. మూత్రం హారిద్రమథవా సరక్తం రక్తమేవ వా
కృచ్ఛ్రాత్సృజేత్పునః పునర్జంతోరుష్ణవాతం వదంతి తమ్.

తా. పచ్చగనైనను, ఎఱ్ఱగనైనను, రక్తముతో గూడియైనను, మూత్రోత్సర్జనంబతికష్టంబుగ యగుచుండిన నుష్ణవాతసహితమగు మూత్రాఘాతంబని ఎఱుంగవలయు.

## మూత్రాఘాతచికిత్స.

శ్లో. సదాభద్రాశ్మభిన్మూలం శతావర్యాశ్చ చిత్రకమ్
రోహిణీకోకిలాక్షౌచ క్రౌంచస్థూలత్రికంటకమ్.
శ్లక్ష్ణం పిష్ట్వా సురాపీతం మూత్రాఘాతనిషూదనమ్.

తా. తుంగగడ్డలు, కొండపిండివేళ్ళు, చల్లపిల్లిగడ్డలు, చిత్రమూలము, కటుకరోహిణి, నీరుగొబ్బివిత్తులు, తామరవిత్తులు, సన్నపల్లేరుకాయలు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి యందొకతులమును మద్యముతో బుచ్చుకొనిన మూత్రాఘాతము నశించు.



శ్లో. నిదిగ్ధికాయాస్స్వరసం పిబేద్వా తక్రమిశ్రితమ్
జలే కుంకుమకల్కం వా సక్షౌద్రముషితం నిశి.

తా. వాకుడు సమూలమును దంచి రసముదీసి యందు మజ్జిగకలిపి పుచ్చుకొనినను, కుంకుమపువ్వును రాత్రి యుదకంబున నానబెట్టి యుదయమున చక్కగనూరి యందు తగుమాత్రము తేనెకలిపి పుచ్చుకొనినను, మూత్రాఘాతము నివృత్తియగు

శ్లో. శృతశీతం పయోమాంసీ చందనం తండులాంబునా
పిబేత్సశర్కరం శ్రేష్ఠముష్ణవాతే సశోణితే.

తా. ఆవుపాలను చక్కగ కాచి చల్లార్చి యందు జటామాంసిచూర్ణము, శ్రీగంధపుచూర్ణము, బియ్యపుకడుగు, శర్కర, వీటిని తగుమాత్రముగ కలిపి పుచ్చుకొనిన నుష్ణవాతముచే జనించిన రక్తయుక్తమగు మూత్రాఘాతము హరించు.

శ్లో. దద్యాదుత్తరవస్తిం వా మూత్రాఘాతే సవేదనే.

తా. వేదనతోగూడిన మూత్రాఘాతరోగంబులకు ఉత్తరవస్తి జేయవలయు.

శ్లో. స్త్రీణామతిప్రసంగేన శోణితం యస్య సిచ్యతే
మైథునో పరమస్తస్య బృంహణీయో విధిర్హితః.

తా. పురుషుం డతిమైథునం బొనర్చుటచే శిశ్నద్వారంబున రక్తము స్రవించెనేని నతడు మైథునంబును వర్జించి పుష్టినిగలుగంజేసెడి యౌషధంబుల సేవింపవలయు.

శ్లో. దేయః పాషాణభేదోత్రానుపానైః కృచ్ఛ్రనాశనః
శీతోపచారం బహుళం కుర్యాల్లింగోద్భవే గదే.

తా. కొండపిండివేళ్ల చూర్ణమునైనను, దాని రసమునైనను, దాని కషాయమునైనను, యుక్తానుపానముతో సేవించిన మూత్రకృచ్ఛ్రము నశించు. మఱియు శిశ్నమునందుద్భవిల్లినరోగములు శీతోపచారములచే నివృత్తియగు.

శ్లో. పిబేచ్ఛిలాజతుక్వాథే గణే వీరతరాదికే
రసం దురాలభాయా వా కషాయం వాసకస్య వా.

తా. వీరతరువాదిగణమును కషాయముబెట్టి యందు కర్పూర శిలాజిత్తుభస్మమును వైచి పుచ్చుకొనినను, దురదగొండివేళ్ల రసమును త్రాగినను, అడ్డసరపాకును కషాయముబెట్టి పానంబొనర్చినను, మూత్రాఘాతము హరించు.

శ్లో. త్రికంటకైరండశతావరీభి
స్సిద్ధం పయో వాతమయే సశూలే
గుడప్రగాఢం సఘృతం పయోవా
రోగేషు కృచ్ఛ్రాదిషు శస్తమేతత్.

తా. సన్నపల్లేరుకాయలు, ఆముదపువేళ్లు, చెల్లపిల్లిగడ్డలు, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి పుచ్చుకొనిన వాతముచే జనించి పోట్లుగలిగియుండెడి మూత్రాఘాతము నశించు. మఱియు పాలలో బెల్లము, నెయ్యి, కలిపి పుచ్చుకొనిన మూత్రకృచ్ఛ్రములన్నియు నశించు.

ఇట్లు మూత్రాఘాతచికిత్స ముగిసెను.

## * మూత్రాశ్మరీలక్షణము.

శ్లో. వస్త్యాధ్మానం తదాసన్నదేశేషు పరితోఽతిరుక్
మూత్రేచ వస్తగంధిత్వం మూత్రకృచ్ఛ్రం శిరోరుజః.

తా. పొత్తికడుపువాచి యందంతట పోట్లుగలిగియుండుట, మూత్రము మేకపోతుమూత్రంబువలె దుర్గంధముగ నుండుట, తలనొప్పిగలుగుట, ఇట్టి లక్షణంబులు గలిగిన మూత్రాశ్మరి యని యెఱుంగవలయు.

శ్లో. భల్లాతకాస్థిసంస్థానారక్తాపీతాసితాశ్మరీ.

తా. జీడిగింజలలోని పప్పుభంగి యెఱుపుగను, పచ్చగను, తెల్లగను, అశ్మరి యుండు.

శ్లో. దౌర్బల్యం సదనం కార్శ్యం కుక్షిశూలమథారుచి
పాండుత్వముష్ణవాతం చ తృష్ణాహృత్పీడనం వమిః.

తా. దౌర్బల్యము, బడలిక, కుక్షిశూల, అరుచి, ఉష్ణవాయువు, దాహము, హృదయమునందు వేదన, వాంతులు, ఇవి గలిగియుండుట, దేహము కృశించుట, శరీరము తెలుపుబారియుండుట, ఇట్టి లక్షణంబులు గలిగిన మూత్రాశ్మరీరోగంబని యెఱుంగవలయు.

## మూత్రాశ్మరీచికిత్స.

శ్లో. శుంఠ్యగ్నిమంథాపామార్గశిగ్రువారుణగోక్షురైః
అభయారగ్వధఫలైః క్వాథం కుర్యాద్విచక్షణః.
రామఠక్షారలవణచూర్ణం దత్వా పిబేన్నరః
అశ్మరీమూత్రకృచ్ఛ్రఘ్నం దీపనం పాచనం పరమ్.

* శుక్లమూత్రాదికమేవ ఘనీభూతత్వేన అశ్మవదవస్థానా దశ్మేత్యుచ్యతే— అశ్మానం రాతి, దదాతీతి అశ్మరీ—అశ్మరియనగా మూత్రము, శుక్రము, ఇవి ఘనీభవించి ఱాయివలెనగు నీరోగమునం దిట్టిఱాయి మూత్రద్వారంబును నిరోధించి మూత్రమును నతికష్టముగ విడుచునటులంజేయునో అదియ యశ్మరీరోగమనంబడు.



తా. శొంఠి, తక్కిలివేరు, ఉత్తరేణివేరు, మునగపట్ట, ఉలిమిడిపట్ట, సన్నపల్లేరుకాయలు, కరక్కాయలు, రేలకాయలు, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి యందు ఇంగువ, యవక్షారము, సైంధవలవణము, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి కలిపి పుచ్చుకొనిన మూత్రకృచ్ఛ్రము, మూత్రాశ్మరి, ఇవి హరించుటయగాక దీపనపాచనములును గలుగు.

శ్లో. శృంగిబేరయవక్షారపథ్యాకాలీయకాంజనమ్
అజం దధి భినత్త్యుగ్రా మశ్మరీ మాశు పాతనమ్.

తా. అల్లము, యవక్షారము, కరక్కాయలు, మానిపసపు, నల్లతుమికివేరు, వీటిని సమభాగములుగ దంచి చూర్ణముజేసి మేకపెఱుగులో కలిపిపుచ్చుకొనిన భయంకరమగు అశ్మరి నశించు.

శ్లో. తిలాపామార్గకాండేచ కారవల్ల్యా యవస్య చ
పలాశకాష్ఠసంయుక్తం సర్వతుల్యం దహేత్తు వై.
తన్మిశ్రైకమజామూత్రే వటీ చానందభైరవీమ్
పాయయే దశ్మరీం హంతి సప్తవారా న్న సంశయః.

తా. నువ్వులకట్టెలు, ఉత్తరేణికట్టెలు, కాకరతీగెలు, యవలదంటు, మోదుగకట్టెలు, వీటిని సమభాగములుగ యొకకుండయందు దునిచి దానిమూతిని మూకుడుచే గప్పి చీలమన్ను లేపనముజేసి గజపుటమువేసిన భస్మంబగు. పిదప యాభస్మంబును గ్రహించి మేకమూత్రముతో ఖల్వంబున రెండుఝాములు చక్కగ మర్దించి నిమ్మప్రమాణము మాత్రలుజేసి ప్రాతఃస్సాయంకాలమున యం దొక్కొకమాత్ర చొప్పున నేడుదినంబులు భక్షించిన అశ్మరి నిస్సంశయముగ నివృత్తియగు. (ఇది ఆనందభైరవఘుటికలు.

శ్లో. ఆదౌ వ్యథా స్యాత్కటికుక్షిదేశే
తతో నిరోధా జ్జ్వలితం చ మూత్రమ్
ఇత్యశ్మరీలక్ష్మరసోత్ర యుక్తః
పాషాణభేదీ స నిరూపితోఽధః.

తా. అశ్మరీరోగము జనించుటకుముందు నడుము, పొత్తికడుపు, వీటియందు శూల గలుగుటయగాక మూత్రము ప్రతిబంధింపబడి యత్యుష్ణంబుగ వెడలు. కావున నీ అశ్మరీరోగంబునకు కొండపిండివేళ్లరసమును సేవించిన నది నశించునని ముందుదహరించినాడను.

శ్లో. త్రికంటకస్య బీజానాం చూర్ణం మాక్షికసంయుతమ్
అవిక్షీరేణ సప్తాహం పిబే దశ్మరిభేదనమ్.

తా. సన్నపల్లెరుకాయలచూర్ణములో తేనె, గొఱ్ఱెపాలు, కలిపి ౭ దినములు పుచ్చుకొనిన అశ్మరి హరించు.

శ్లో. క్షారో నిపీతస్తిలపుష్పరాజ
స్సమాక్షికః క్షీరయుతస్త్రిరాత్రమ్
హంత్యశ్మరీం సింధువిమిశ్రితం వా
నిపీయమానం రుచకప్రయత్నాత్.

తా. నువ్వులపువ్వులను క్షారముజేసి యందు తగుమాత్రము తేనె, పాలు, కలిపి మూడుదినములు సేవించినను, లేక సైంధవలవణమున మాదీఫలపు రసము కలిపి త్రాగినను, అశ్మరి నివృత్తియగు.

శ్లో. గోపాలకర్కటీమూలం పిష్టం పర్యుషితాంభసా
పీయమానం త్రిరాత్రేణ పాతయత్యశ్మరీం హరాత్.

తా. నూగుదోసవేళ్లను వడగండ్లనీరుచే దంచి యారసమును మూడుదినములు త్రాగిన అశ్మరి నశించు.

శ్లో. గవ్యేన పిష్ట్వా పయసార్కపుష్పీ నిపీయమానా త్రిదినం ప్రభాతే
విదార్య వీర్యేణ నిజేన తీవ్రామశ్మరీం యాకురుతే చ దాహమ్.

తా. జిల్లేడుపువ్వులను ఆవుపాలచే నూరి యం దావుపాలుకలిపి మూడుదినంబులు ఉదయమున పుచ్చుకొనిన దాహయుక్తమగు అశ్మరి శీఘ్రంబుగ హరించు.

శ్లో. యవక్షారగుడాభ్యాం చ పిబేత్పుష్పఫలోద్భవమ్
రసం మూత్రవిబంధఘ్నం శుక్రాశ్మరివినాశనమ్.

తా. యవక్షారమును చూర్ణముజేసి యందు తగుమాత్రము బెల్లముకలిపి ఖల్వమున మర్దించి రేగుగింజంత మాత్రలుజేసి యం దొకమాత్రను భక్షించినను, లేక అశ్మరీరోగములను నశింపజేసెడి ద్రాక్ష, టెంకాయ, పువ్వులు, తంగేడుపువ్వులు, ఇవి మొదలగు పుష్పఫలముల రసములను త్రాగినను, శుక్రాశ్మరీ నివృత్తియగు.

శ్లో. శతావరీమూలరసో గవ్యేన పయసా సమః
పీతో నిపాతయత్యాశు హ్యశ్మరీం చిరజామపి.

తా. చల్లపిల్లిగడ్డలరసమును సమముగ పాలుబోసి కలిపి పుచ్చుకొనిన చిరకాలోద్భవమగు అశ్మరి నశించు.

శ్లో. వరుణస్య త్వచం శ్రేష్ఠాం శుంఠీగోక్షురసంయుతామ్
యవక్షారగుడం దత్వా క్వాథం కృత్వా పిబేద్ధిమమ్
అశ్మరీశర్కరామూత్రకృచ్ఛ్రాఘాతరుజాపహామ్.

తా. ఉలిమిడిపట్ట, శొంఠి, పల్లేరుకాయలు, యవక్షారము, బెల్లము, వీటిని సమభాగములుగ కషాయముబెట్టి చల్లార్చి పుచ్చుకొనిన అశ్మరి శర్కరామేహము, మూత్రకృచ్ఛ్రము, మూత్రాఘాతము, ఇవి హరించు,



శ్లో. గంధర్వహస్తబృహతీవ్యాఘ్రీగోక్షురకేక్షురాత్
మూలం కల్కం పిబేద్దధ్నా మధురేణాశ్మభేదనమ్.

తా. తెల్లాముదపువేరు, చిన్నములక, పెద్దములక, పల్లేరుకాయలు, నీరుగొబ్బివేరు, వీటిని సమభాగములుగ తియ్యనిపెరుగుతో దంచి యందలిరసమును త్రాగిన అశ్మరి నివృత్తియగు.

శ్లో. తిలాపామార్గకదలీపలాశయవసంభవః
క్షారః పేయో విమూత్రేణ శర్కరాస్వశ్మరీషు చ.

తా. నువ్వులకట్టె, ఉత్తరేణిపట్ట, అరటిసమూలము, మోదుగపట్ట, యవగడ్డి, వీటిని సమభాగములుగ భస్మం బొనర్చి యందు గొఱ్ఱెమూత్రమును కలిపి త్రాగిన అశ్మరి, మూత్రకృచ్ఛ్రము, శర్కరామేహము, ఇవియన్నియు నశించు.

శ్లో. క్వాథశ్చ శిగ్రుమూలోత్థః కటూష్ణోశ్మరిపాతనః
క్షీరాన్నభుగ్బర్హిశిఖామూలం వా తండులాంబునా.

తా. మునగవేరుపట్టను కషాయముబెట్టి పుచ్చుకొనినను, లేక దర్భమూలమును కషాయముబెట్టి యందు తగుమాత్రము బియ్యపుకడుగు కలిపి త్రాగినను, చురుకు, ఉష్ణము, వీటితోగూడిన అశ్మరి నశించు. ఇందుకు పథ్యము:—పాలన్నము భుజింపవలయు.

శ్లో. అశ్మర్యాం చాశ్మరీకృచ్ఛ్రే శిలాజతుసమాక్షికమ్
యవక్షారం గోక్షురం చ ఖాదేద్వాచాశ్మరీహరమ్.

తా. శిలాజిత్తుభస్మమును తేనెతో సేవించినను, లేక యవక్షారము, పల్లేరుకాయలు, వీటిని చూర్ణముజేసి యుక్తానుపానముతో సేవించినను అశ్మరి, అశ్మరీ సహిత మూత్రకృచ్ఛ్రము, ఇవి హరించు.

శ్లో. హింగ్వేలాక్షీరసర్పిస్తు మూత్రశుక్రామయాపహామ్.

తా. ఇంగువ, ఏలక్కాయలు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి యందు తగుమాత్రము పాలు, నెయ్యి, కలిపి పుచ్చుకొనిన, మూత్రదోషము, శుక్రదోషము, ఇవి నశించు.

శ్లో. వరుణస్య తులాం క్షుణ్ణాం జలద్రోణే విపాచయేత్
పాదశేషం పరిస్రావ్య ఘృతప్రస్థం విపాచయేత్.
వారుణీకదలీం బిల్వం తృణజం పంచమూలకమ్
అమృతాత్వశ్మజం దేయం బీజం చ త్రపుసస్య చ.

శతపర్వాతిలక్షారః పలాశః క్షారఏవ చ
యూథికాయాశ్చ మూలాని కర్షైకాని సమర్పయేత్
అస్యమాత్రాం పిబేజ్జంతు ర్దేశకాలాద్యపేక్షయా
జీర్ణేచానుపిబేత్సర్వ్వమజీర్ణే మస్తుమేవ చ.
అశ్మరీం శర్కరాం చైవ మూత్రకృచ్ఛ్రం చ నాశయేత్.

తా. నవ్వూరుతులముల సోమిపట్టనైనను, ఉలిమిడిపట్టనైనను దంచి యందు ౧౦౨౪ తులముల నీరుబోసి చతుర్థాంశముగ కషాయము కాచి వడియగట్టి యందు దఱి పదినాలుగు తులముల నెయ్యికలిపి యాకషాయము చుండువరకు సూక్ష్మాగ్నిచే మఱల కాచి పిదప యాఘృతంబును గ్రహించి యందు చాగవేళ్లు, అరటిగడ్డ, మారేడువేళ్లు, కుశదర్భ, కాశదర్భ, చెఱుకు, శరదర్భ, ముంజిదర్భ, తిప్పతీగ, శుద్ధిజేసిన కర్పూరశిలాజత్తు, దోసవిత్తులు, గరికెగడ్డి, నువ్వులకట్టెలక్షారము, మోదుగపట్టక్షారము, అడవిమొల్లవేరు, వీటినెల్ల దినుసుకు యొక్కొక తులముచొప్పున చూర్ణముజేసి యందు కలిపి కాలము, దేశము, దేహతత్త్వము, ఈ మొదలగువాటిని నెఱింగి పైనెయ్యిని పూటకు రెండువరహాలయెత్తు సేవించిన, అశ్మరి, మూత్రకృచ్ఛ్రము, శర్కరామేహము, ఈ రోగంబులన్నియు హరించు. మఱియు నీఘృతము జీర్ణించినపిదప వలయు పదార్థముల భుజింపందగు. అయిన నాఘృతము జీర్ణంబు నొందకుండెనేని పెఱుగుమీది యుదకంబును పానం బొనర్చిన నది జీర్ణంబగు.

## మూత్రకృచ్ఛ్రాదులకు రసచికిత్స.

శ్లో. శుద్ధసూతం ద్విధా గంధం శ్వేతపౌనర్నవై ర్ద్రవైః
మర్దయిత్వా దినం ఖల్వే రుద్ధ్వాధో భూధరే పచేత్.
పాషాణభేదసంయుక్తం పిష్ట్వా చూర్ణం ప్రకల్పయేత్
భక్షయే దశ్మరీం హంతి రసః పాషాణభేదకః.

తా. శుద్ధిజేసిన పాదరసము ౧ భాగము, శుద్ధిజేసిన గంధకము ౨ భాగములు, ఇటుల వీటిని తెల్లగలిజేరు రసముచే నొకదినము ఖల్వమున చక్కగ మర్దించి బిళ్లజేసి నీడన నెండించి ప్రమిదెయం దునిచి దానిపై వేఱొకప్రమిదను గప్పి చీలమన్నులేపనముజేసి సూర్యపుటమునం దునిచి పిదప యొకకుండయం దిసుకబోసి యం దాప్రమిదెను బూడ్చి మఱల నిసుకబోసి యాకుండమూతిని మూకుడుచే గప్పి చీలమన్నులేపనముజేసి యెండించి తగుమాత్రముగ భూమియందు పల్లముద్రవ్వి దానిచుట్టు పిడకలు పరచి పైకుండను మధ్యనునిచి మఱల నాకుండను పిడకలచే గప్పి గజపుటమువేసి యందలి యౌషధమును సాంగశీతలమున దీసి దానికి సమముగ కొండపిండివేళ్ల చూర్ణమును కలిపి ఖల్వమున మర్దించి దేహతత్త్వము నెఱింగి పూటకు రెండు వరహాలయెత్తు



చూర్ణమును యుక్తమగు ననుపానంబుతో సేవించిన అశ్మరు లన్నియు నశించు. (ఇది పాషాణభేదీరసము.)

ఇట్లు అశ్మరీరోగచికిత్స ముగిసెను.

## ప్రమేహ, మధుమేహ, * పిటికా, లక్షణము.

శ్లో. సమక్రియత్వా ద్విషమక్రియత్వా
న్మహాక్రియత్వా చ్చ యథాక్రమం తే
మజ్జానమోజఃపిశితం ప్రదూష్య
శరీరిణాం వింశతిరేవ మేహాః.

తా. దోషయుక్తంబులగు వాతాదులచే మజ్జము, మాంసము, శుక్లము, ఇవి దుష్టంబులై ఉదమేహాది యిఱువది మేహంబులను జనింపంజేయు. మఱియు నీమేహంబులు సమక్రియ, విషమక్రియ, మహాక్రియ, లన మూడువిధంబులుగ నుండుటయగాక సాధ్యము, కష్టసాధ్యము, అసాధ్యములుగ నున్నయవి.

శ్లో. దంతాదీనాం మలాఢ్యత్వం ప్రాగ్రూపం పాణిపాదయోః
దాహశ్చిక్కణతా దేహే తృట్స్వాసశ్చోపజాయతే.
సామాన్యలక్షణం తేషాం ప్రభూతావిలమూత్రతా.

తా. దంతములు, జిహ్వ, నోరు, ఇవి దుర్గంధయుక్తమై మిగుల మలంబుతో గూడియుండుట, చేతులు, కాళ్లు మండుట, శరీరము చమటతోగూడి జిగటగనుండుట, దాహము, శ్వాసము, ఇవి గలుగుట, బురదవలెనుండెడి బహుమూత్రంబును విసర్జించుట, ఇట్టిలక్షణంబులు ప్రమేహము జనించుటకు ముందు గలుగు. ఇట్టిలక్షణంబులు ప్రమేహములయందు సామాన్యంబుగ గలిగియుండునని యెఱుంగవలయు.

శ్లో. ఉదమేహ స్తథాచేక్షు స్సాంద్రమేహ స్సురాభిదః
పిష్టప్రమేహ శ్శీతాఖ్య శ్శుక్రాఖ్య స్సికతా శనైః.
లాలామేహ స్తథా క్షారో నీలమేహోఽథ కాలకః
హారిద్రామేహమంజిష్ఠో రక్తమేహ స్తథాపరః.
షోడశోఽథ వసామేహో మజ్జామేహః ప్రకీర్తితః
క్షౌద్రమేహ స్తథా హస్తిమేహానాం వింశతిః క్రమాత్.

తా. ఉదమేహము, ఇక్షుమేహము, సాంద్రమేహము, సురామేహము, పిష్టమేహము, శీతమేహము, శుక్రమేహము, సికతామేహము, శనైర్మేహము, లాలామేహము, క్షారమేహము, నీలమేహము, కాలమేహము, హారిద్రామేహము, మంజిష్ఠా

* పిటిక యనగా దేహంబున గ్రంథులు కట్టుట.

మేహము, రక్తమేహము, వసామేహము, మజ్జామేహము, క్షౌద్రమేహము, హస్తిమేహము, లన మేహంబు లిఱువదివిధంబులుగ నుండు.

శ్లో. పూతిప్రమేహాశ్చ ఘృతప్రమేహ
స్తక్రః ప్రమేహో ఘటికాప్రమేహః
యథాభిధానం చ తథైవ లక్షణం
బలక్షయం యాతి నరస్య దేహః.

తా. పైన నుదహరింపబడిన ప్రమేహంబులు గాక పూతిప్రమేహము, ఘృతప్రమేహము, తక్రప్రమేహము, ఘటికాప్రమేహము లన నాలుగుప్రమేహములును, ఇంక ననేకప్రమేహంబులును గలవు. మఱియు వాటివాటి నామార్థములవలననే వాటివాటి లక్షణంబులం దెలిసికొనందగు. ఎట్టులనిన:—శిశ్నంబునుండి చెరుకురసమునలె నీరు స్రవింపుచుండిన నిక్షుమేహంబని ఎఱుంగుచందంబున సర్వమేహంబులను నిటులనే దెలిసికొనందగు.

శ్లో. సాధ్యాః కఫోత్థా దశ పిత్తజాశ్చ
యాప్యాసాధ్యాః పవనా చ్చతుష్కాః.

తా. కఫముచే జనించిన ౧౦. మేహంబులు సాధ్యంబులనియు, పిత్తముచే జనించిన ౬ మేహంబులు కష్టసాధ్యంబు లనియు, వాతముచే జనించిన ౪ మేహంబులు నసాధ్యంబు లనియు ఎఱుంగవలయు.

శ్లో. గుదేవ స్తిశిరస్యంసపృష్ఠమర్మసు చోత్థితాః
సోపద్రవా దుర్బలాగ్నేః పిటికాః పరివర్జయేత్.

తా. గుదము. పొత్తికడుపు, శిరస్సు, భుజములు, వీపు, మర్మస్థలములు, వీటియందు వేదనతోఁగూడి మేహపిటికలు జనించి అగ్నిమాంద్యంబును గలిగియుండిన నవి అసాధ్యంబులగుటచే నట్టిరోగికి చికిత్స చేయంజనదు.

## ప్రమేహ, మధుమేహ, పిటికా చికిత్స.

శ్లో. త్రిఫలా దారుదార్వ్యబ్దకాథః క్షౌద్రేణ మేహహాః
గుడూచ్యా స్స్వరసః పీతో మధునా సర్వమేహజిత్.

---

☞ కఫమువలన జనించెడు ఉద, ఇక్షు, సురా, సికత, శనైః, క్షార, పిష్ట, సాంద్ర, శుక్ర, లాలా, ఈ ౧౦ మేహంబులయందును దోషదూష్యంబులు సమక్రియలుగనుండుటచే నివి సాధ్యంబులు. పిత్తమువలన జనించెడు హారిద్రా, కాల, శీత, మంజిష్ఠా, నీల, రక్త, ఈ ౬ మేహంబులయందును దోషదూష్యంబులు విషమక్రియలుగ నుండుటచే నివి కష్టసాధ్యంబులు. వాతమువలన జనించెడు, మజ్జా, వసా, క్షౌద్ర, హస్తి, ఈనాలుగు మేహంబులయందును దోషదూష్యంబులు మహాక్రియలుగ నుండుటచే నివి అసాధ్యంబులు.



తా. కరక్కాయలు, తానికాయలు, నెల్లివరుగు, దేవదారుపట్ట, మానిపసుపు, తుంగగడ్డలు, వీటిని సమభాగములుగ కషాయముబెట్టి అందు తేనెకలిపి పుచ్చుకొనినను, తిప్పతీగస్వరసమును తేనెతో పుచ్చుకొనినను, సమస్తమేహములు నశించు.

శ్లో. ఫలత్రికం దారునిశావిశాలాముస్తాచ నిష్కాథ్యనిశాసమేతమ్
పిబేత్కషాయంమధునాప్రయుక్తంసర్వప్రమేహేషుసముత్థితేషు.

తా. కరక్కాయలు, తానికాయలు, నెల్లివరుగు, మానిపసుపు, పసుపు, వెట్టిపుచ్చవేరు, తుంగగడ్డలు, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి యందు తగుమాత్రము తేనెకలిపి పుచ్చుకొనిన సమస్తమేహములు నశించు.

శ్లో. లోధ్రాభయాకట్ఫలముస్తకానాం విడంగపాఠార్జునధన్వయానామ్
కదంబశాఖార్జునదీప్యకానాంబిడంగదార్వీఘునశాల్మలీనామ్.
చత్వార ఏతే మధునా కషాయాఃకఫప్రమేహేషునిషేవణీయాః.

తా. లొద్దుగపట్ట, కరక్కాయలు, కాయఫలపుపట్ట, తుంగగడ్డలు, వీటినైనను వాయువిళంగములు, అగరుశొంఠి, మద్దిపట్ట, దురదగొండివేరు, వీటినైనను, కడిమిపట్ట, మద్దిపట్ట, ఓమము, వీటినైనను, వాయువిళంగములు, తుంగగడ్డలు, బూరుగపట్ట, మానిపసుపు, వీటినైనను, సమభాగములుగ కషాయముబెట్టి యందు తేనెకలిపి పుచ్చుకొనిన కఫయుక్తనుగు ప్రమేహములు హరించు.

శ్లో. లోధ్రార్జునోశీరకుచందనానా
మరిష్టసేవ్యామలకాభయానామ్
ధాత్ర్యర్జునారిష్టకవత్సకానాం
నీలోత్పలాజాజినిశార్జునానామ్.
చత్వార ఏతే విహితాః కషాయాః
పిత్తప్రమేహేషు మధుప్రయుక్తః.

తా. లొద్దుగపట్ట, మద్దిపట్ట, వట్టివేళ్ళు, రక్తచందనము, వీటిని సమభాగములుగ కషాయముబెట్టి యందు తగుమాత్రము తేనెకలిపి పుచ్చుకొనినను, లేక వేపపట్ట, వట్టివేళ్లు, నెల్లివరుగు, కరక్కాయలు, వీటిని సమభాగములుగ కషాయముబెట్టి యందు తగుమాత్రము తేనెకలిపి పుచ్చుకొనినను, నెల్లివరుగు, మద్దిపట్ట, వేపపట్ట, కొడిశపట్ట, వీటిని సమభాగములుగ కషాయముబెట్టి యందు తేనెకలిపి పుచ్చుకొనినను, నల్లకలువగడ్డలు, జీలకఱ్ఱ, పసపు, మద్దిపట్ట, వీటిని సమభాగములుగ కషాయముబెట్టి అందు తేనెకలిపి త్రాగినను, పిత్తయుక్తమగు ప్రమేహములు హరించు.

శ్లో. ఏలాశిలాజతుకణాపాషాణభేదనిర్మితం చూర్ణమ్
తండులజలేన పీతం ప్రమేహరోగం హరత్యాశు.

**తా.** ఏలక్కాయలు, శిలాజిత్తుభస్మము, పిప్పళ్ళు, కొండపిండివేళ్ళు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి బియ్యపుకడుగుతో బుచ్చుకొనిన ప్రమేహములు శీఘ్రముగ నివృత్తియగు.

**శ్లో.** ఏలాసకర్పూరశిలాసధాత్రీ జాతీఫలం గోక్షురశాల్మలీ చ
సూతేంద్రవంగాయసభస్మసర్వమేతత్సమానం పరిభావయేచ్చ.
గుడూచికాశాల్మలికాకషాయైర్నిష్కార్ధమానాంమధునాతతశ్చ
బద్ధావటీచంద్రకళేతిసంజ్ఞాసర్వప్రమేహేషు నియోజయేత్తామ్.

**తా.** ఏలక్కాయలు, పచ్చకర్పూరము, శిలాజిత్తుభస్మము, నెల్లివరుగు, జాజికాయ, పల్లేరుకాయలు, బూరగబంక, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి యందు పాదరసభస్మము, వంగభస్మము, లోహభస్మము, వీటిని సమభాగములుగ కలిపి ఖల్వమున మర్దించి పిదప తిప్పతీగ, బూరుగపట్ట, వీటికషాయముచే వెవ్వేఱుగ భావనజేసి ఆరవరహాయెత్తు మాత్రలుజేసి నీడన యెండించి యందొకమాత్రను తేనెతో భక్షించిన సమస్తమేహంబులు నశించు. (ఇది చంద్రకళావతీ రసము.)

**శ్లో.** గుడూచీరసమధునావంగభస్మప్రమేహనుత్
నాగభస్మతథైవాపి సర్వమేహనివారణమ్.

**తా.** తిప్పతీగరసముగకు సమముగ తేనె కలిపి యందు తగుమాత్రము వంగభస్మమునైనను, సీసభస్మమునైనను, కలిపి పుచ్చుకొనిన సర్వమేహంబులు నివారణమగు.

**శ్లో.** వంగభస్మమృతం సూతం తుల్యం క్షౌద్రే విమర్దయేత్
ద్విగుంజం లేహయేన్నిత్యం హంతి మేహాంశ్చిరస్తనాన్.

**తా.** వంగభస్మము, పాదరసభస్మము, వీటిని సమభాగములుగ నుంచుకొని యందు తేనెకలిపి ౨ గురిగింజలప్రమాణము సేవించిన బహుకాలముగ శరీరమున నెలకొనియుండెడి ప్రమేహములు నశించు.

**శ్లో.** ద్వినిశాత్రిఫలాయుక్తం రాత్రౌ పర్యుషితం జలమ్
ప్రభాతే మధునా పీతం మేహమూలం నికృంతతి.

**తా.** మానిపసపు, పసపు, కరక్కాయ, తానికాయలు, నెల్లివరుగు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి రాత్రియుదకంబున నానబెట్టి ఉదయమున చక్కగ పిసికి వడియగట్టుకొని యందు తగుమాత్రము తేనె వైచి త్రాగిన సమస్తమేహములు నివృత్తియగు.



**శ్లో.** శ్యామాకకోద్రవోద్దాలగోధూమచణకాఢకీ
కుళుత్థాశ్చ హితా భోజ్యే పురాణాం మేహినాం సదా.

**తా.** మేహరోగులు పాతవిగనుండెడి చామబియ్యము, ఆఱికబియ్యము, జొన్నలు, గోధుమలు, శనగలు, కందులు, ఉలవలు, వీటిని భుజింపవలయు.

**శ్లో.** యథామృతారసః క్షౌద్రయుక్తస్సర్వప్రమేహనుత్
హరిద్రాచూర్ణయుక్తో వా రసో ధాత్ర్యాస్సమాక్షికః.

**తా.** తిప్పతీగరసములో తేనెకలిపి పుచ్చుకొనిన సమస్తప్రమేహములు హరించు. మఱియు పసపుచూర్ణమున నెల్లికాయలరసము, తేనె, వీటిని కలిపి భక్షించిన సమస్తమేహంబులు హరించు.

**శ్లో.** క్షీరమాదుంబరం యత్నాద్వాకుంచం వా ప్రయోజయేత్
పిటికాసు సమస్తాసు లేపనం సంప్రశాంతయే.

**తా.** అత్తిపాలనైనను, భావించివిత్తులను నుదకముచే నూరియైనను, సమస్తపిటికలకు లేపనముజేసిన నవి నివారణమగు.

**శ్లో.** న్యగ్రోధోదుంబరాశ్వత్థశోనాకారగ్వధాసనమ్
ఆమ్రం కపిత్థం జంబూం చ ప్రియాళుం కకుభం ధవమ్.
మధూకం మధుకం రోధ్రం వరుణం వారిభద్రకమ్
పటోలం మేషశృంగీం చ దంతిచిత్రక మాఢకీమ్.
కరంజత్రిఫలాశక్రభల్లాతకఫలాని చ
ఏతాని సమభాగాని శ్లక్ష్ణచూర్ణాని కారయేత్.
న్యగ్రోధాద్యమిదం చూర్ణం మధునా సహ యోజయేత్
ఫలత్రయరసం చాను పిబేన్మూత్రవిశుద్ధయే.
ఏతేన వింశతి ర్మేహా మూత్రకృచ్ఛ్రాణి యాని వా
ప్రశమం యాంతి వేగేన పిటికాసు చ యోజయేత్.

**తా.** మఱ్ఱిపట్ట, అత్తిపట్ట, రావిపట్ట, దుందిలపుపట్ట, రేలపట్ట, వేగిసపట్ట, మామిడిపట్ట, వెలగపట్ట, నేరేడుపట్ట, చారపట్ట, మద్దిపట్ట, దేవదారుపట్ట, ఇప్పపట్ట, అతిమధురము, లొద్దుగపట్ట, ఉలిమిడిపట్ట, వేపపట్ట, చేదుపొట్ల, ఒద్దిపట్ట, నేలదంతివేరు, చిత్రమూలము, కందివేరు, కానుగపట్ట, కరక్కాయలు, తానికాయలు, ఉశిరికవరుగు, కొడిశపట్ట, శుద్ధిజేసిన జీడిగింజలు, వీటిని సమభాగములుగ నున్నగ చూర్ణముజేసి యందొకతులమును తేనెతో సేవించి పిదప కరక్కాయలు, తానికాయలు, ఉశిరికవరుగు, వీటిని సమభాగములుగ కషాయముబెట్టి పుచ్చుకొనిన మూత్రదోషము, మూత్రకృచ్ఛ్రము, ఇరువది మేహంబులు, పిటికలు, ఇవియన్నియు శీఘ్రముగ నశించు.

శ్లో. సౌవీరకం సురాం సూక్తం తైలం క్షీరం ఘృతం గుడమ్
అమ్లేక్షురసపిష్టాన్నానూపమాంసాని వర్జయేత్.

తా. రేగుపండ్లు, కల్లు, కలి, నువ్వులనూనె, పాలు, నెయ్యి, బెల్లము, పులుసు, చెఱుకురసము, పిండివంటకములు, ఊటగల పల్లములయందలి యుదకము, మాంసము, వీటిని ప్రమేహరోగులు వర్జింపవలయు.

శ్లో. పలాశతరుపుష్పాణాం క్వాథశ్శర్కరయా యుతః
నిషేవితః ప్రమేహాణి హంతి నానావిధాన్యపి.

తా. మోదుగపువ్వులను కషాయముబెట్టి యందు తగుమాత్రము శర్కర కలిపి పుచ్చుకొనిన సమస్తమేహములు నివారణమగు.

శ్లో. సజలం త్రిఫలాకల్కమాతపే ధారయేత్త్ర్యహమ్
తద్భాండే డోలికాయంత్రే చణకాన్ముష్టిమాత్రకాన్.
అహోరాత్రోషితా న్ఖాదేద్వర్ధమానం దినే దినే
అసాధ్యం సాధయే న్మేహం సిద్ధయోగ ఉదాహృతః.

తా. కరక్కాయలు, తానికాయలు, ఉశిరికవరుగు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి యొకకుండయందు వైచి యం దుదకముబోసి మూడుదినములు సూర్యపుటమున నునిచి పిదప యాకుండమధ్యంబున డోలాయంత్రమును గట్టి యందు వ్రేలునటుల పిడికెడుశనగలను మూటగట్టి యొకయహోరాత్రము నా డోలాయంత్రంబుననే వండి యాశనగలను వర్ధమానముగ భక్షింపుచుండిన నసాధ్యంబు లగుమేహంబులు నశించు. (ఇది సిద్ధయోగము.)

శ్లో. కర్కటీబీజసింధూత్థత్రిఫలాసమభాగికమ్
పీతముష్ణాంభసా చూర్ణం మూత్రరోధం నివారయేత్.

తా. దోసవిత్తులు, సైంధవలవణము, కరక్కాయలు, తానికాయలు, ఉశిరికవరుగు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి యం దొకతులమును ఉష్ణోదకములో బుచ్చుకొనిన మూత్రబాధ నివృత్తియగు.

శ్లో. త్రికటుత్రిఫలాముస్తం గుగ్గులుం చ సమాంశకమ్
గోక్షురక్వాథసంయుక్తాం వటికాం కారయే ద్బుధః.
దేశకాలబలాపేక్షీ భక్షయేచ్చానులోమికామ్
నచాత్ర పరిహారోఽస్తి కర్మ కుర్యాద్యథేప్సితమ్.
ప్రమేహాన్వాతరోగాంశ్చ వాతశోణితమేవ చ
మూత్రాఘాతం మూత్రదోషం ప్రదరం చాపి నాశయేత్.



తా. శొంఠి, పిప్పలి, మిరియాలు, కరక్కాయలు, తానికాయలు, ఉశిరికవరుగు, తుంగగడ్డలు, శుద్ధిజేసిన గుగ్గిలము, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి యందు పల్లేరుకాయల కషాయము బోసి మాత్రపక్వమగువరకు ఖల్వమున చక్కగ మర్దంచి రేగుగింజంత మాత్రలుజేసి నీడన యెండంచి దేశము, కాలము, బలము, ఇవి మొదలగువాటిని నెఱింగి అనులోమముగ భక్షించిన ప్రమేహము, వాతరోగము, రక్తవాతము, మూత్రాఘాతము, మూత్రదోషము, ప్రదరరోగము, ఇవియన్నియు నివారణమగు. ఇందుకు పథ్యములేదు. కావున వలయుపదార్థముల భుజించుటయ గాక నెల్ల కార్యంబుల నొనర్పందగు.

## ప్రమేహాదులకు రసచికిత్స.

శ్లో. మృతం సూతం మృతం వంగం మృతం లోహాభ్రకం సమమ్
మర్దయే న్మధునా సార్ధం రసోఽయం తాళకేశ్వరః.
మాషైకం భక్షయే త్క్షౌద్రై బహుమూత్రాపనుత్తయే.

తా. రసభస్మము, వంగభస్మము, లోహభస్మము, అభ్రకభస్మము, వీటినన్నిటిని సమభాగములుగ నొకటిగ జేర్చి యందు తేనెవైచి ఖల్వమున మర్దించి మాషప్రమాణము తేనెతో సేవించిన బహుమూత్రము హరించు. (ఇది తాళకేశ్వర రసము.)

శ్లో. శుద్ధసూతం సమం గంధం వంగం చ ద్విగుణం భవేత్
ఏకత్ర మర్దయే త్సర్వం వల్లమేకం ప్రమేహిణామ్.
శర్కరామధుసంయుక్తం పథ్యం చ క్షారవర్జితమ్
ఏషవంగేశ్వరో నామ సర్వమేహనికృంతనః.

తా. శుద్ధిజేసిన రసము ౧ భాగము, శుద్ధిజేసిన గంధకము ౧ భాగము, వంగభస్మము ౨ భాగములు, ఇటుల వీటినెల్ల యేకముజేసి యందు శర్కర, తేనె వైచి చక్కగ ఖల్వమున మర్దించి వల్లప్రమాణము భక్షించిన సమస్తమేహములు నశించు. ఇందుకు పథ్యము:—కారమును వర్జింపవలయు. (ఇది వంగేశ్వర రసము.)

శ్లో. విషోషణకణాటంకహింగులై స్సమచూర్ణకః
ఆనందభైరవస్యాస్య గుంజాతీసారమేహనుత్.

తా. శుద్ధిజేసిన వసనాభి, మిరియాలు, పిప్పళ్ళు, శుద్ధిజేసిన వెలిగారము, శుద్ధిజేసిన ఇంగిలీకము, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి యందు నిమ్మపండ్లరసము బోసి మాత్రపక్వముగ మూడుదినములు ఖల్వమున చక్కగ మర్దించి గుంజాప్రమాణము మాత్రలుజేసి నీడన యెండించి యందొకమాత్రను భక్షించిన మేహము, అతిసారము ఇవి నివృత్తియగు. (ఇది ఆనందభైరవ రసము.)

ఇట్లు ప్రమేహ, మధుమేహ, పిటికా, చికిత్స ముగిసెను.

## మేదోరోగలక్షణము.

శ్లో. అవ్యాయామదివాస్వప్నశ్లేష్మలాహారసేవినః
మధురాన్నరసం ప్రాయస్స్నేహాన్మేదో వివర్ధతే.

తా. సంచారం బొనర్పకుండుట, పగలు నిద్రించుట, శీతలపదార్థములు, మధురపదార్థములు, స్నిగ్ధపదార్థములు, వీటిని భుజించుట, ఈ మొదలగుకార్యంబు లొనర్చుటచే శరీరంబున మేదస్సు వృద్ధియగు.

శ్లో. మేదసా వృతమార్గత్వా చ్చుష్యంత్యన్యే చ ధాతవః
మేదస్తు చీయతే తస్మాదశక్త స్సర్వకర్మసు.

తా. ఇటుల వృద్ధిజెందిన మేదస్సు యితర ధాతుమార్గంబులను నడ్డగించుట వలన నాధాతువులు శుష్కించు. ఇటుల శుష్కించుటచే మేదోరోగి యేకార్యం బొనర్చుటకును నశక్తుండుగ నుండు.

## మేదోరోగచికిత్స.

శ్లో. ఫలత్రయం త్రికటుకం సతైలం లవణాన్వితమ్
షణ్మాసముపభుక్తం చే త్కఫమేదోఽనిలాపహమ్.

తా. కరక్కాయలు, తానికాయలు, ఉశిరికవరుగు, శొంఠి, పిప్పలి, మిరియాలు, సైంధవలవణము, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి యందు తగుమాత్రము నువ్వులనూనె బోసి మాత్రపక్వముగ ఖల్వమున చక్కగ మర్దించి రేగుగింజంత మాత్రలుజేసి యాఱుమాసములు సేవించిన శ్లేష్మసంబంధమగు మేదస్సు, వాతము ఇవి నశించు.

శ్లో. అస్వప్నం చ వ్యవాయం చ వ్యాయామం చింతనాని చ
స్థౌల్యమిచ్ఛన్పరిత్యక్తుం క్రమేణాతిప్రవర్తయేత్.

తా. స్థౌల్యము నివృత్తించవలయునని ఇచ్ఛగల మేదోరోగి పగలు నిద్రింపక అతిమైథునము, వ్యాయామము, చింత, వీటిని నొనర్చుచుండవలయు.

శ్లో. వ్యోషాగ్నిముస్తత్రిఫలావిడంగం గుగ్గులుస్సమమ్
ఖాదన్ సర్వాన్ జయేద్వ్యాధీనామవాతభవాన్ గదాన్.
క్షౌద్రేణ త్రిఫలాక్వాథః పీతో మేదోహర స్స్మృతః.

తా. శొంఠి, పిప్పలి, మిరియాలు, చిత్రమూలము, తుంగగడ్డలు, కరక్కాయలు, తానికాయలు, ఉశిరికవరుగు, వాయువిళంగములు, శుద్ధిజేసిన గుగ్గిలము, వీటిని సమభా-



గములుగ చూర్ణముజేసి యందొకతులమును సేవించిన సమస్త మేదోరోగంబులు నివారణ మగుటయగాక ఆమమునుచేజనించిన రోగంబులు నగా నివృత్తియగు. మఱియు కరక్కాయలు, తానికాయలు, ఉశిరికవరుగు, వీనిని సమభాగములుగ దంచి కషాయము బెట్టి యందు తేనెవైచి పుచ్చుకొనిన మేదోరోగము నశించు.

శ్లో. శీతీభూతం తథోష్ణాంబు మేదోహృత్క్షౌద్రసంయుతమ్
ఉష్ణం భక్తస్య మండం వా పిబన్కృశతనుర్భవేత్.

తా. ఉదకంబును చక్కగ కాచి చల్లార్చి యందు తగుమాత్రము తేనెవైచి త్రాగిన మేదోరోగము హరించు. మఱియు మండమును హితోష్ణంబుగత్రాగిన మేదోరోగము నశించు.

శ్లో. వాసాదళరసైర్లేప శ్శంఖచూర్ణావచూర్ణితః
బిల్వపత్రరసో వాపి గాత్రదౌర్గంధ్యనాశనః.

తా. శంఖచూర్ణమున అడ్డసరపు రసంబైనను, మారేడాకుల రసంబైనను, బోసినూరి శరీరమునకు లేపనము జేసికొనిన చమటచేజనించిన దుర్గంధము నశించు.

శ్లో. బబ్బూలస్య దళై స్సమ్యగ్వారిణా పరిపేషితైః
గాత్ర ముద్వర్తయే త్పశ్చా ద్ధరీతక్యా సుపిష్టయా.
భూయ ఉద్వర్తనం కృత్వా పశ్చాత్స్నానం సమాచరేత్
ప్రస్వేదాన్ముచ్యతే క్షిప్రం తత స్త్వేవం సమాచరేత్.
జంబూదళార్జునతరుప్రసవై స్సుకుష్ఠై
రుద్వర్తనం ప్రకురుతే ప్రతివాసరం యః
ప్రస్వేదబిందుకణికానికరానిషంగో
దుర్గంధితా వపుషి తస్య పదం దధాతి.

తా. నల్లతుమ్మాకును ఉదకముచే చక్కగ నూరి ప్రతిదినంబును శరీరమునకు లేపనముజేసికొని కరక్కాలను నుదకముచే నూరి మరల శరీరంబునకు లేపనము జేసికొని స్నానం బొనర్చుచుండినను, లేక నేరేడుచిగుళ్లు, మద్దిచిగుళ్లు, కోష్ఠు, వీటిని సమభాగములుగ నుదకముచే నూరి ప్రత్యహము శరీరమునకు లేపనముజేసికొని స్నానం బొనర్చుచుండినను, మిగుల చమట స్రవింపుటచే జనించిన దుర్గంధము నశించుటయగాక బలంబును నగా గలుగు.

శ్లో. త్రిఫలాతివిషా మూర్వా త్రివృచ్చిత్రకవాసకైః
నింబారగ్వధషడ్గ్రంథాసప్తపర్ణనిశాహ్వయైః.

గుడూచీంద్రయవా కృష్ణా కుష్ఠసర్షపనాగరైః
తైలమేభిస్సమం పక్వం సురసాదిరసప్లుతమ్.
పానాభ్యంజనగండూషనస్యం వస్తిషు యోజితమ్
స్థూలతాలస్యకండ్వాని జయేత్కఫకృతాన్గదాన్.

తా. కరక్కాయలు, తానికాయలు, ఉశిరికవరుగు, అతివస, చాగవేళ్ళు, తెల్లతెగడ, చిత్రమూలము, అడ్డసరము, వేపపట్ట, శేలపట్ట, వస, ఏడాకులరటి, పసపు, తిప్పతీగ, కొడిశవిత్తులు, పిప్పళ్ళు, కోష్ఠు, ఆవాలు, శొంఠి, వీటిని దినుసుకు ౧ తులము చొప్పున చూర్ణముజేసి, యందు వావిలాకురసము ౧౬ తులములు, తులసియాకురసము ౧౬ తులములు, నువ్వులనూనె ౧౧౪ తులములు బోసి వీటినన్నిటిని యేకముజేసి సూక్ష్మాగ్నిచే వండి తైలపక్వముగ దించుకొని పూటకు ౪ పలముచొప్పున సేవించినను, అభ్యంజనము జేసికొనినను, గండూషముజేసినను, నస్యముజేసినను, వస్తికర్మ జేసినను, స్థూలత్వము, బద్ధకము, దురద, ఈమొదలగు కఫయుక్తమగు రోగంబులు నివారణమగు. (ఇది త్రిఫలాదితైలము.)

### మేదోరోగమునకు రసచికిత్స.

శ్లో. శుద్ధసూతం మృతం తామ్రం తాళం బోళం సమం సమమ్
అర్కక్షీరైర్దినం మర్ద్యం క్షౌద్రే ర్లేహ్యం ద్విగుంజకమ్.
బడబాగ్నిరసో నామ స్థౌల్యబృందం నియచ్ఛతి
పలం క్షౌద్రం పలం తోయ మనుపానం పిబేత్సదా.

తా. శుద్ధిజేసిన పాదరసము, శుద్ధిజేసిన గంధకము, తామ్రభస్మము, శుద్ధిజేసిన హరితాళకము, శుద్ధిజేసిన రక్తబోళము, వీటినన్నిటిని సమభాగములుగ నుంచుకొని యందు జిల్లేడుపాలు బోసి ఖల్వమున ౧ దినము చక్కగ మర్దించి ౨ గురిగింజల ప్రమాణము మాత్రలుజేసి నీడన యెండించి యం దొకమాత్రను తేనెతో బుచ్చుకొని పిదప ఒకపలము ఉదకంబునకు సమముగ తేనెకలిపి పానంబొనర్చిన మేదోరోగము నివృత్తియగు. (ఇది బడబాగ్నిరసము.)

ఇట్లు మేదోరోగచికిత్స ముగిసెను.

---

### ఉదరరోగలక్షణము.

శ్లో. రోగాస్సర్వేఽపి మందాగ్నౌ సుతరాముదరాణి చ
అజీర్ణాన్మలినైశ్చాన్నై ర్జాయంతే మలసంచయాత్.
వాతోదరం చైవ జలోదరం చ ప్లీహోదరం బద్ధగుదం తథైవ.

తా. విరుద్ధపదార్థములను భుజించుటచేతను, ఇంక ననేక కారణాంతరములచేతను, అగ్నిమాంద్యము కలుగు. ఇటుల యగ్నిమాంద్యము గలుగుటచే నానావిధరోగంబులు జనించుటయ గాక యజీర్ణము సగా జనించు. అందుచే నుదరంబున మలసంచయము కలిగి వాతోదరము, జలోదరము, ప్లీహోదరము, బద్ధగుదములను నుదరరోగంబులు జనించు.



శ్లో. కృశత్వమాంత్రోదరవృద్ధితంద్రారుచిర్మలాధ్మానబలాగ్నిహాని.

తా. శరీరము కృశించుట, పేగులు వృద్ధియగుటచే కడుపుబెరుగుట, తంద్ర, అరుచి, మలబద్ధకము, కడుపుబ్బరము, దౌర్బల్యము, అగ్నిమాంద్యము, ఇవి గలుగుట. ఇట్టి లక్షణంబులు ఉదరరోగంబున జనించు.

శ్లో. పీతం చోదకమేవం తు తస్మాజ్జాతం జలోదరమ్.

తా. పై మందాగ్న్యాదిలక్షణంబులుగలవారు నధికముగ నీరుద్రాగుటచే జలోదరము జనించు.

శ్లో. ఉదరం సజలం యస్య వర్ధతే శ్వయథుస్తథా
హస్తపాదౌ కృశౌ ధూమస్సాన్యజ్జలోదరలక్షణమ్.

తా. ఉదరము జలయుక్తముగ నుండుట, ఉదరము వాపుతోగూడి వృద్ధియగుచుండుట, చేతులు, కాళ్ళు, సన్నగించికొనుండుట, నోటినుండి ఆవిరి బైలువెడలుచుండుట, ఇట్టిలక్షణంబులు గలిగిన జలోదరమని ఎఱుంగవలయు.

శ్లో. రేచనం వమనం కుర్యా త్సర్వత్ర పాచనాని చ.

తా. సర్వ ఉదరరోగంబులకును, రేచన, పాచన, వమనముల కివ్వవలయు.

### ఉదరరోగచికిత్స.

శ్లో. విశాలా శంఖినీ దంతీ త్రివృన్నీలీ ఫలత్రయమ్
నిశావిడంగకంపిల్లమూత్రేణోదరనుత్పిబేత్.

తా. వెఱ్ఱిపుచ్చవేరు, గిలకచెట్టువేరు, నేలదంతివేరు, తెల్లతెగడ, నీలివేరు, కరక్కాయలు, తానికాయలు, ఉశిరికవరుగు, పసుపు, వాయువిళంగములు, *కంపిల్లము, వీటినెల్ల చూర్ణముగావించి యందొకతులమును గోమూత్రముతో బుచ్చుకొనిన ఉదరరోగము నివారణమగు.

శ్లో. పయసా శృంగబేరాంబుకషాయో దారువహ్నిజః
చవ్యముస్తాసముత్థో వా పేయో జఠరశాంతయే.

తా. అల్లపురసమున పాలుకలిపి కాచి త్రాగినను, లేక దేవదారు, చిత్రమూలము, వీటిని సమభాగములుగ కషాయముబెట్టి పుచ్చుకొనినను, లేక చవ్యము, తుంగ

---

* కంపిల్లదేశమున జనించి కఠినముగను, నెఱ్ఱగను, నుండెడి గ్రంథ్యము.

గడ్డలు, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి పుచ్చుకొనినను, ఉదరరోగము, అగ్నిమాంద్యము ఇవి నశించు.

శ్లో. ప్లీహినః పృష్ఠదేశే తు రక్తస్రావం తు కారయేత్.

తా. ప్లీహోదరరోగులకు వీపున రక్తమును స్రవింపంజేయవలయును.

శ్లో. వామభాగే భవేత్ప్లీహా గుల్మం వదనసన్ముఖమ్.

తా. శరీర వామపార్శ్వంబున ప్లీహోదరంబును, వదనాభిముఖంబున గుల్మంబును, జనించియుండు.

శ్లో. లవణం రజనీరాజీప్రత్యేకం పలపంచకమ్
చూర్ణితం నిక్షిపేద్భాండే తక్రం శతపలోన్మితమ్.
త్రిదినం ముద్రితం రక్షేత్పశ్చాత్పంచపలం సదా.
పీత్వా వినాశయేత్ప్లీహం త్రిస్సప్తాహం న సంశయః.

తా. సైంధవలవణము ౫ పలములు, పసపు ౫ పలములు, ఆవాలు, ౫ పలములు, ఇటుల వీటిని చూర్ణముజేసి యొకకుండయందు దునిచి ౧౦౦ పలముల మజ్జిగ బోసి యందు పైచూర్ణమును కలిపి యాకుండమూతికి మూడుదినములు నొకబట్టచే గట్టియుంచి నాలవదినము మొదలుకొని ప్రత్యహము ౫ పలములచొప్పున ౨౧ దినము సేవించిన ప్లీహోదరములు నిస్సంశయముగ నశించు.

శ్లో. సమూలపత్రమేరండం రుద్ధ్వా భాండే పుటే పచేత్
తత్కర్షం పలగోమూత్రం పీతం ప్లీహవినాశనమ్.

తా. ఆముదపుచెట్టు సమూలమును యొకకుండయందు దునిచి చీలమన్ను లేపనముజేసి యెండింట గాఢాగ్నియందు దునిచి భస్మము గావించి దానిని సాంగశీతలమున గ్రహించి ఖల్వమున చక్కగ నూరి ప్రత్యహము యొకకర్షప్రమాణమును గోమూత్రముతో త్రాగిన ప్లీహోదరము హరించు.

శ్లో. హరీతకీనాగరదేవదారుపునర్నవాఛిన్నరుహాకషాయః
సగుగ్గులుర్మూత్రయుతశ్చపేయశ్శోభోదరాణాంప్రవరః ప్రయోగః.

తా. కరక్కాయలు, శొంఠి, దేవదారుపట్ట, తెల్లగలిజేరువేరు, తిప్పతీగ, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి యందు తగుమాత్రము శుద్ధిజేసిన గుగ్గిల చూర్ణమును, గోమూత్రమును వైచి త్రాగిన శోఫోదరములు నశించు.

శ్లో. రక్తస్రావేఽర్కదుగ్ధం చ సైంధవం లేపయేత్తథా
అగ్నిదాహం చ కుర్యాద్వా ప్లీహోదరహరం పరమ్.



తా. సైంధవలవణమును జిల్లేడుపాలతో నూరి లేపనం బొనర్చినను, లేక రక్షలు వేసినను, రక్తముస్రవించెడి ప్లీహోదరము నివారణమగు.

శ్లో. అంబుపానం దివాస్వాపం గుర్వభిష్యందిభోజనమ్
వ్యాయామం చాశ్వయానం చ జఠరీ పరివర్జయేత్.

తా. మిగుల నుదకపానం బొనర్చుట, పగలు నిద్రించుట, గురుత్వము గలపదార్థములు, జిగటగ నుండుపదార్థములు, వీటిని భుజించుట, మిగుల సంచరించుట, అశ్వంబునెక్కుట, వీటిని ఉదరరోగపీడితులు నివర్తింపవలయును.

శ్లో. సాముద్రశుక్తికాక్షారో యవక్షార స్ససైంధవః
గోదధ్నా సంప్రయుజ్యేత సర్వోదరవినాశనః.

తా. సముద్రపు గవ్వచిప్పలభస్మము, యవక్షారము, సైంధవలవణము వీటిని సమభాగములుగ చూర్ణముజేసి ఆవుపెఱుగుతో బుచ్చుకొనిన సమస్త ఉదరరోగంబులు హరించు.

శ్లో. మూత్రాణ్యష్టావుదరిణాం పానే సేకే ప్రయోజయేత్
పిప్పలీవర్ధమానం వా పయసైవ ప్రయోజయేత్.

తా. ఆవు, మేక, నరుడు, గుఱ్ఱము, గాడిదె, మహిషము, ఒంటె, ఏనుగ వీటి మూత్రంబులను త్రాగుటయ గాక సేకము సగా చేసికొనినను, వర్ధమానపిప్పలిని పాలయుక్తముగ జేసి కాచి త్రాగినను, ఉదరరోగములు నశించు.

శ్లో. ఉష్ట్రీక్షీరం పిబే జ్జీర్ణే నిరన్నో జఠరామయీ
పక్షం మాసమృతుం వాపి నచ పానీయ మాచరేత్.

తా. ఉదరరోగపీడితు లొకమాసంబైనను, పక్షంబైనను, రెండుమాసంబులైనను, అన్నపానాదులను వర్జించి యొంటెపాలను త్రాగుచుండిన ఉదరరోగము నశించు.

శ్లో. స్నేహస్వేదవిరేకాదివిధేయం ప్లీహరోగిణామ్.

తా. విరేచనమునకు బుచ్చుకొనుట, స్నిగ్ధోపచారంబులం జేయించికొనుట, చమటపడియునటులంజేయుట, వీటిచే ప్లీహోదరము శాంతిజెందు.

శ్లో. వామబాహౌ చ మోక్తవ్యా కూర్పరాభ్యంతరే సిరా
విధ్యేత్ప్లీహవినాశాయ యకృన్నాశాయ దక్షిణే.

తా. ప్లీహోదరరోగముగలవారి యెడమచెయ్యియొక్క మోచేతియందలి సిరను యకృద్రోగముగలవారి కుడిచేతియొక్క మోచేతియందలి సిరను, శస్త్రముచే బొడిచి రక్తమును స్రవింపంజేసిన నవి నశించు.

శ్లో. అర్కపత్రం సలవణమంతర్ధూమం విపాచయేత్
మస్తునా తం పిబే త్క్షారం ప్లీహోదరహరం పరమ్.

తా. జిల్లేడాకులు, సైంధవలవణము, వీటిని సమభాగములుగ నొకకుండయందునిచి చీలమన్నులేపనము జేసి గాఢాగ్నిచే భస్మము గావించి యాభస్మంబును దేహతత్త్వము నెఱింగి పెరుగుమీది మీగడతో ఒకవరహాయెత్తునైనను, లేక ౧ వరహాల యెత్తునైనను, బుచ్చుకొనిన ప్లీహోదరము నశించు.

శ్లో. లవణం రాజికాచూర్ణం సమం గోమూత్రమిశ్రితమ్
త్రిశాణం హంతి పీతం చేద్యకృత్ప్లీహోదరాణ్యపి.

తా. సైంధవలవణము, ఆవాలు, వీటిని సమభాగములుగ చూర్ణముచేసి మూడు శాణములయెత్తు గోమూత్రముతో బుచ్చుకొనిన యకృత్ప్లీహోదరములు హరించు.

శ్లో. పాతవ్యో యుక్తితః క్షారః క్షీరేణోదధిశుక్తిజః
పయసా వా ప్రయోక్తవ్యాః పిప్పల్యః ప్లీహనాశనః.

తా. సముద్రపుగవ్వచిప్పలను కాల్చి చక్కగ భస్మము గావించి దీనినిజేసి ౪ గురిగింజలప్రమాణమునకు మించకుండునటుల పాలలో కలిపి త్రాగినను, లేక పిప్పలి చూర్ణమును పాలలో గలిపి త్రాగినను, ప్లీహోదరము నివారణమగు.

శ్లో. భల్లాతకాభయా జాజీ గుడైశ్చ కృతమోదకః
సప్తరాత్రాం నిహంత్యేషః ప్లీహాన మతిదారుణమ్.

తా. పాతబెల్లమును పాకముబెట్టి అందు శుద్ధిజేసిన జీడిగింజలు, కరక్కాయలు, జీలకఱ్ఱ, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి వైచి నెల్లికాయంత లడ్డుకములు ౭ దినంబులు భక్షించిన మిగుల భయంకరమగు ప్లీహోదరము నివృత్తియగు.

శ్లో. లశునం పిప్పలీమూల మభయాం చైవ భక్షయేత్
పిబే ద్గోమూత్రగండూషం ప్లీహరోగవిముక్తయే.

తా. తెల్లగడ్డలు, మోడి, కరక్కాయలు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి యందొకతులమును భక్షించి పిదప గుటికెడు గోమూత్రమును త్రాగిన ప్లీహోదరము నశించు.

శ్లో. య స్సప్తరాత్రం విలిహే త్సుధాయాః
క్షీరేణ చూర్ణం మృదితం కణాయాః
లిహ్యాత్పిపాసం మధురం చ భుక్త్వా
తస్యోదరవ్యాధిరుపైతి శాంతిమ్.



తా. పిప్పళ్ళను చూర్ణముగావించి యందు తగుమాత్రముగ బొంతజెముడుపాలు బోసి నూరి ౭ దినములు ప్లీహోదరములకు లేపనము జేయుటయగాక పిప్పళ్ళను బొంతజెముడుపాలచే ఖల్వమున మాత్రపక్వముగ మర్దించి శనగలంత మాత్రలుజేసి నీడన యెండించి యం దొకమాత్రను ప్రత్యహము భక్షింపుచుండిన, ఉదరరోగములు నివారణమగు. ఇందుకు పథ్యము:—పులుసు, కారము, వీటిని వర్జించి మధురపదార్థములను భుజింపవలయును.

శ్లో. ఏరండతైలం దశమూలమిశ్రం
గోమూత్రయుక్తం త్రిఫలారజో వా
నిహంతి వాతోదరశోఫశూలం
క్వాథ స్సమూత్రో దశమూలజ శ్చ.

తా. దశమూలములను చూర్ణముజేసి యం దాముదము కలిపి చక్కగ కాచి ప్రతిదినము నొకతులము సేవించినను, లేక కరక్కాయలు, తానికాయలు, ఉశిరికవరుగు వీటిని సమభాగములుగ చూర్ణముజేసి యం దొకతులమును గోమూత్రంబున కలిపి పుచ్చుకొనినను, దశమూలములకషాయంబున గోమూత్రమును కలిపి పుచ్చుకొనినను, వాతోదరము, వాపు, శూల, ఇవి హరించు.

శ్లో. ద్వే పంచమూల్యౌ త్రివృతానికుంభే
ససప్తలం చిత్రకశిగ్రుమూలమ్
కురంటబీజం త్రిఫలాం గుడూచీ
మేరండమూలం మదయంతికాం చ.
పాఠాంసభార్గీంసుషవీంసునీలాంసరోహిషాయాస్యకుచేలికాంచ
పృథక్సమాహృత్య పలంజలస్య ద్రోణే పచే త్తచ్చరణాంశశేషమ్.
ఘృతం హి పక్వం సకషాయయుక్తం నిహంతి పీతం సకలోదరాణి.

తా. దశమూలములు, తెల్లతెగడ, నేలదంతివేరు, సంబరేణు, చిత్రమూలము, మునగవేరుపట్ట, తెల్లగోరంటవిత్తులు, కరక్కాయలు, తానికాయలు, ఉశిరికవరుగు, తిప్పతీగ, ఆముదపువేరు, మల్లెవేరు, అగరుశొంఠి, గంటుభారంగి, పిప్పళ్లు, నల్లగుంటగలగరాకు, కామంచిగడ్డి, దురదగొండివేరు, ఇవి దినుసొకటింటికి, ఒకపలము చొప్పున దంచి యందు ద్రోణప్రమాణము ఉదకము బోసి చతుర్థాంశముగ కషాయము కాచి వడియగట్టుకొని యందు ౨౫ పలముల నెయ్యిబోసి కషాయ మిగురువరకు సూక్ష్మాగ్నిచే వండి యాఘృతమును ప్రతిదిన మొకతులము సేవించిన ఉదరరోగంబులన్నియును నశించు. (ఇది సర్వోదర దశమూలఘృతము.)

శ్లో. వాతోదరీ పిబే త్తక్రం పిప్పలీలవణాన్వితమ్
శర్కరామరిచోపేతం స్వాదుపిత్తోదరీ పిబేత్.

యవాని సైంధవాజాజీవ్యోషయుక్తం కఫోదరీ
సన్నిపాతోదరీ తక్రం త్రికటుక్షారసైంధవైః.

తా. వాతోదరముగలవారు పిప్పళ్లు, సైంధవలవణము, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి యందు పుల్లని మజ్జిగకలిపి త్రాగవలయు. పిత్తోదరముగలవారు మిరియాలను చూర్ణముజేసి అందు శర్కర, తియ్యనిమజ్జిగ కలిపి త్రాగవలయు. శ్లేష్మముచేజనించిన యుదరరోగముగలవారు ఓమము, సైంధవలవణము, జీలకఱ్ఱ, శొంఠి, పిప్పలి, మిరియాలు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి తియ్యనిమజ్జిగలో కలిపి పానముసేయనలయు. సన్నిపాతోదరముగలవారు శొంఠి, పిప్పలి, మిరియాలు, యవక్షారము, సైంధవలవణము, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి యందు తియ్యని మజ్జిగకలిపి త్రాగవలయు. ఇట్లొనర్చిన నాయుదరరోగములు నశించు.

శ్లో. పునర్నవానింబపటోలశుంఠీ
తిక్తామృతా దార్వ్యభయా కషాయః
సర్వాంగశోఫోదరకాసశూల
శ్వాసాన్వితం పాండుగదం నిహంతి.

/ తా. తెల్లగలిజేరువేరు, వేపపట్ట, చేదుపొట్ల, శొంఠి, నేలవేము, తిప్పతీగ, మానిపసుపు, కరక్కాయలు, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి పుచ్చుకొనిన సర్వాంగశోఫ, ఉదరరోగములు, కాసశ్వాసలు, శూల పాండువు, ఇవియన్నియు హరించు. (ఇది పునర్నవాదికషాయము.)

ఉదరరోగమునకు రసచికిత్స.

శ్లో. సూతభస్మం వంగభస్మం పలైకైకం ప్రయోజయేత్
మృతం తామ్రం గంధకం చ ప్రత్యేకం చ పలం పలమ్.
అర్కక్షీరైర్దినం మర్ద్యం సర్వం తద్గోలకీకృతమ్.
రుద్ధ్వా తద్భూధరే పక్త్వా పుటైకేన సముద్ధరేత్.
ఏష వంగేశ్వరో నామ ప్లీహగుల్మోదరం జయేత్
ఘృతై ర్గుంజాద్వయో లేహ్యో నిష్క శ్వేతపునర్నవైః

తా. పాదరసభస్మము, వంగభస్మము, తామ్రభస్మము, శుద్ధిజేసిన గంధకము, ఇవి దినుసొకటింటికి ఒక్కొకపలముచొప్పున ఖల్వమునం దునిచి జిల్లేడుపాలచే నొకదినము చక్కగ మర్దించి బిళ్లజేసి మూకుడుయం దునిచి దానిని మఱియొకమూకుడుచే మూసి చీలమన్ను లేపనముజేసి యెండించి భూదరయంత్రంబున పుటమువేసి దానిని సాంగశీతలమున గ్రహించి రెండుగురిగింజలయెత్తు ఔషధమును ౧ వరహాయెత్తు తెల్లగలిజేరువేళ్ళ చూర్ణముతోడను, తగుమాత్రము నెయ్యితోడను, కలిపి సేవించిన ప్లీహము, గుల్మము, ఉదరరోగము, ఇవి నివారణమగు. (ఇది వంగేశ్వరరసము.)



శ్లో. రసగంధకతామ్రాణి లోహమభ్రం వషం తథా
టంకణం సర్జికాక్షారం దరదం చ కపర్దికమ్.
అర్కక్షీరేణ ఖల్వేచ వజ్రక్షీరేణ భావయేత్
నిర్గుండీభృంగరాజేన చార్ద్రిద్రావేణ భావయేత్.
గుల్మో జలోదరే రోగే శోఫే పాండుక్షయే తథా
శూలే విషూచికాయాం చ అనుపానైః ప్రయోజయేత్.
త్రైలోక్యాడంబరో నామ కథితో రోగశాంతయే
వల్లమాత్రప్రమాణేన త్రిసప్తాహం ప్రదాపయేత్.

తా. శుద్ధిజేసిన పాదరసము, శుద్ధిజేసిన గంధకము, తామ్రభస్మము, లోహభస్మము, అభ్రకభస్మము, శుద్ధిజేసిన వసనాభి, శుద్ధిజేసిన వెలిగారము, సర్జక్షారము, శుద్ధిజేసిన ఇంగిలీకము, గవ్వలభస్మము, వీటిని సమభాగములుగ నుంచుకొని, జిల్లేడుపాలచే నొకదినంబును, బొంతజెముడుపాలచే నొకదినంబును, వావిలియాకురసముచే నొకదినంబును, గుంటగలగరాకురసముచే నొకదినంబును, అల్లపురసముచే నొకదినంబును, ఖల్వమున క్రమముగ మర్దించి బానసజేసి [illegible] ప్రమాణము మాత్రలు గావించి నీడన యెండించి యుక్తానుప [illegible] పూటకు రెండుమాత్రలుచొప్పున * ఇరువదియొక దినము పుచ్చుకొనిన గుల్మము, జలోదరము, వాపులు, పాండువులు, క్షయము, శూల, విషూచి, ఇవియన్నియు నివృత్తియగు. (ఇది త్రైలోక్యాడంబరరసము.)

వాక్యమ్. అత్రోదయమార్తాండో దేయః.

తా. మఱియు నీరోగంబునకు ఉదయమార్తాండరసమును సగా ప్రయోగింపందగు.

ఇట్లు ఉదరరోగ చికిత్స ముగిసెను.

## † శోఫలక్షణము.

శ్లో. సగౌరవం స్యాదనవస్థితత్వం సోత్సేధమూష్మా చ సిరాతనుత్వమ్
సరోమహర్షాంగవివర్ణతాచసామాన్యలింగంశ్వయథోః ప్రదిష్టమ్.

తా. దేహము జడత్వముగలిగియుండుట, స్వస్థచిత్తము లేకుండుట, శరీరమాన్నత్యము గలిగియుండుట, ఉష్ణముగనుండుట, నరములు సన్నగించి శరీరమునం దగు

* ౨౧ దినంబులలో జాడ్యము కుదరకుండెనేని రోగము నివృత్తియగువరకు పుచ్చుకొనవలయు. † వాపు.

బడుచుండుట, గగుర్పాటు కలిగియుండుట, వివర్ణముగనుండుట, ఇవి శోఫోదరమునకు సామాన్యలక్షణంబులని ఎఱుంగవలయును.

శ్లో. యో మధ్యదేశే శ్వయథు స్సకష్ట స్సర్వగశ్చ యః
అథోంగేరిష్టభూతస్యాద్యశ్చోర్ధ్వం ప్రతిసర్పతి.

తా. శరీర మధ్యభాగంబుననైనను, సర్వాంగములయందైనను శోఫగలిగియుండిన నది కష్టసాధ్యంబనియు, శరీరాధోభాగంబున శోఫ జనించి ఊర్ధ్వముఖంబుగ వ్యాపించియుండిన నసాధ్యంబనియు, ఎఱుంగవలయును.

శ్లో. శ్వాసో పిపాసాఛర్దిశ్చ దౌర్బల్యం జ్వరఏవ చ
యస్య చాన్నేరుచి ర్నాస్తి శ్వయథుం తం విసర్జయేత్.

తా. శ్వాసము, దాహము, వాంతి, దౌర్బల్యము, జ్వరము, అన్నద్వేషము, ఇట్టి లక్షణంబులలో గూడిన శోఫరోగి జీవించుట దుర్లభంబుగాన నట్టిరోగికి చికిత్స జేయంజనదు.

శ్లో. అనన్యోపద్రవకృత శ్శోఫః పాదసముత్థితః
పురుషం హంతి నారీం తు ముఖజో గుహ్యజ స్తథా.

తా. పురుషునికి జ్వరాద్యుపద్రవంబులు లేక నిర్హేతుకంబుగ వాపు పాదములయం దారంభించి ఊర్ధ్వశరీరంబున వ్యాపించినను, స్త్రీలకు నిర్హేతుకంబుగ వాపు ముఖమునం దారంభించి అధోభాగంబున వ్యాపించినను, వీరిరువురికిని గుహ్యస్థానంబునందు వాపు నిర్హేతుకంబుగ నారంభించి సర్వాంగములయందు వ్యాపించినను, మరణము సిద్ధించునని ఎఱుంగవలయును.

శ్లో. (అన్యచ్చ)స్త్రీణాం తు ముఖజ శ్శోఫః పుంసాం పాదగత స్తథా
అసాధ్యా తౌ విజానీయా చ్ఛోఫినౌ పరివర్జయేత్.

తా. స్త్రీలకు ముఖమునందును, పురుషులకు పాదములయందును, శోఫకలిగియుండిన నారోగము కుదురుట దుర్లభము గాన నట్టివారిని వర్జింపవలయును.

---

## శోఫ చికిత్స.

శ్లో. దారుగుగ్గులుశుంఠీనాం కల్కో మూత్రేణ శోఫజిత్
గోమూత్రస్య ప్రయోగో వా క్షిప్రం శ్వయథునాశనః.

తా. దేవదారుపట్ట, గుగ్గిలము, శొంఠి, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి యందు తగుమాత్రముగ గోమూత్రము కలిపి త్రాగినను, లేక గోమూత్రమునుమాత్రము త్రాగినను, లేక ఉదరరోగమునకు జెప్పంబడియుండెడు పునర్నవాది కషాయంబును బుచ్చుకొనినను, శోఫలు నశించు.



శ్లో. కృష్ణాగ్నివిశ్వఘునజీరకకంటకారి
పాఠానిశాకరికణామగధాజటానామ్
చూర్ణం కవోష్ణసలిలై రవలోడ్య పీతం
నాతః పరం శ్వయథురోగహారం నరాణామ్.

తా. వావిలివిత్తులు, చిత్రమూలము, శొంఠి, తుంగగడ్డలు, జీలకఱ్ఱ, వాకుడువేరు, అగరుశొంఠి, పసపు, గజపిప్పలి, పిప్పళ్లు, జటామాంసి వీటిని సమభాగములుగ చూర్ణముగావించి యందొకతులమును కించిదుష్ణంబగునుదకముతో బుచ్చుకొనిన శోఫలు నివారణమగు. ఈ శోఫరోగములను నివృత్తిజేయుటకిది శ్రేష్ఠంబైనక్రియగనున్నయది.

శ్లో. త్రిఫలాక్వాథపానం హి మహిషీసర్పిషా సహ
హంతి శోఫం ప్రమేహం చ నాడీవ్రణభగందరమ్.

తా. కరక్కాయలు, తానికాయలు, ఉశిరికవరుగు, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి యందు బఱ్ఱెనెయ్యి కలిపిత్రాగిన శోఫలు, ప్రమేహములు, నాడీవ్రణములు, భగందరములు, ఇవియన్నియు నివారణమగు.

శ్లో. న్యగ్రోధోదుంబరాశ్వత్థప్లక్షవేదసవల్కలైః
ససర్పిష్కైః ప్రలేపస్స్యాచ్ఛోఫనిర్వారణఃపరః.

తా. మఱ్ఱి, అత్తి, రావి, జువ్వి, ప్రబ్బలి, వీటిపట్టలను సమభాగములుగ నూరి యందు నెయ్యికలిపి శరీరమునకు లేపనముజేసికొనిన శోఫరోగము నివృత్తియగు.

శ్లో. గోధూమకణికాయుక్తం నిర్గుండీపత్రచూర్ణకమ్
హోలికాతిలతైలేన యుక్తా శోఫవినాశినీ.

తా. గోధుమపిండిలో వావిలాకుచూర్ణమును గలిపి యందు తగుమాత్రముగ నుదకంబు వైచి నువ్వులనూనెచే రొట్టెలుగాల్చి భక్షించిన శోఫలు హరించు.

శ్లో. పునర్నవాదారుశుంఠీ సిద్ధార్థశిగ్రుమేవ చ
పిష్ట్వా చైవారనాళేన ప్రలేప స్సర్వశోఫజిత్.

తా. తెల్లగలిజేరువేరు, దేవదారుపట్ట, శొంఠి, తెల్లావాలు, మునగపట్ట, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి కలిలో కలిపి శరీరమునకు లేపనముజేసికొనిన సమస్తశోఫలు హరించు.

శ్లో. పునర్నవాగ్నినిర్గుండీవల్లితైరండజైర్ద్రుమైః
సహచరై ర్జలం తప్తం తత్స్వేద శ్శోఫహా మతః.

తా. తెల్లగలిజేరువేరు, చిత్రమూలము, వావిలాకు, గుగ్గిలము, ఆముదపాకు, గోరింటవిత్తులు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి యుష్ణోదకంబున వైచి కాచి

శరీరమునకు యొత్తడము వేసినను, చమటపడియుండునటుల ఆవిరిపట్టినను, సమస్తశోఫలు నశించు.

శ్లో. కుటజార్కశిరీషాణాం విదళై రండనింబజైః
పత్రైర్యుక్తం జలం తప్తం తత్స్వేదో దుష్టశోఫహృత్.

తా. కొడిశపాకులు, జిల్లేడాకులు, దిరిశనపాకులు, నల్లతెగడాకులు, ఆముదపాకులు, వేపాకు, వీటిని సమభాగములుగ నుదకంబున వైచి కాచి కించిదుష్ణముగ కాపడము వేసినను, లేక ఆవిరిపట్టినను, దుష్టశోఫలు హరించు.

శ్లో. ఆర్ద్రికస్స్వరసః పీతః పురాణగుడమిశ్రితః
అజాక్షీరాశినాం శీఘ్రం సర్వశోఫహరో భవేత్.

తా. అల్లపుస్వరసమున పాతబెల్లము కలిపిత్రాగినను, మేకపాలు పానంబొనర్చినను, సమస్తశోఫలు హరించు.

శ్లో. సింహాస్యామృతభంటాకీ క్వాథం కృత్వా సమాక్షికమ్
కృచ్ఛ్రశోఫం జయే జ్జంతుం కాసం శ్వాసం జ్వరం వమీమ్.

తా. అడ్డసరము, తిప్పతీగ, వాకుడువేరు, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి యందు తగుమాత్రము తేనె కలిపి త్రాగిన మూత్రకృచ్ఛ్రము, శోఫ, జంతురోగము, శ్వాసకాసలు, జ్వరము, వాంతి, ఇవి నశించు.

శ్లో. శేకస్తథార్కవర్షాభూనింబక్వాథేన శోఫజిత్
గోమూత్రేణాథ కుర్వీత సుఖోష్ణేనావసేచనమ్.

తా. జిల్లేడువేరు, తెల్లగలిజేరువేరు, వేపపట్ట, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి శరీరమునకు యొత్తడము వేసినను, లేక గోమూత్రమును కించిదుష్ణము జేసి కాపడము వేసినను, శోఫలు నివారణమగు.

శ్లో. కృష్ణాపురాణపిణ్యాకం శిగ్రుత్వసిగతాతసీ
ప్రలేపోన్మర్దనేయుంజాత్సుఖోష్ణామూత్రకల్కితాః.

తా. మిరియాలు, పాతగానుగపిండి, మునగపట్ట, నల్లఅగసిపట్ట, వీటిని సమభాగములుగ గోమూత్రముచే నూరి యుండికించి కించిదుష్ణముగ శరీరమునకు లేపనము జేసిన శోఫలు నివృత్తియగు.

శ్లో. బిల్వపత్రరసః పీతశ్శోషణశ్శ్వయథౌ రుజీ
విట్సంగే చైవదుర్నామ్ని విషూచ్యాం కామిలాస్వపి.

తా. మారేడాకులను దంచి రసముదీసి యారసమును ౨ తులములు త్రాగిన శోఫలు, మలబద్ధకము, మూలవ్యాధి, విషూచి, కామిలలు, హరించు.



శ్లో. బీజపూరజటాహింస్రా దేవదారుమహౌషధమ్
రాస్నాగ్నిమంథలేపోఽయం వాతశోఫవినాశనః.

తా. మాదీఫలపుపట్ట, జటామాంసి, నల్లయుప్పివేరు, దేవదారుపట్ట, శొంఠి, సన్నరాష్టకము, తక్కలిపట్ట, వీటిని సమభాగములుగ నుదకముచే నూరి వాతశోఫలకు లేపనము జేసిన నవి నశించు.

శ్లో. హింగూలం జయపాలం చ మరీచం టంకణం కణా
సమ్మర్ద్య వల్లస్సఘృత స్సర్వశోఫహరః పరః.

తా. శుద్ధిజేసిన ఇంగిలీకము, శుద్ధిజేసిన నేపాళములు, మిరియాలు, శుద్ధిజేసిన వెలిగారము, పిప్పళ్ళు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి ఖల్వమున చక్కగ మర్దించి వల్లప్రమాణము నేతితో సేవించిన శోఫలు నశించు. (ఇది శోఫారిరసము.)

శ్లో. దేయో హ్యుదయమార్తండ స్త్రైలోక్యాడంబరోఽథవా
అగ్నికుమారకోవాత్ర దేయ శ్శోఫవినాశనః.

తా. నేనిం దుదహరించియుండెడి ఉదయమార్తాండరసము, త్రైలోక్యాడంబరరసము, అగ్నికుమారకరసము, వీటిలో దేనినైనను సేవించిన శోఫలు నివృత్తియగు.

శ్లో. భల్లాతకభవే శోఫే సతిలా కృష్ణమృత్తికా
నవనీతతిలై ర్లేపోఽథవా దుగ్ధం తిలాన్వితమ్.

తా. నువ్వులు, నల్లమన్ను, వీటిని నుదకముచే నూరి లేపనము జేసినను, లేక వెన్న, నువ్వులు, వీటిని నూరి లేపనము జేసినను, లేక పాలు, నువ్వులు, వీటిని నూరి లేపనము జేసినను, జీడిగింజలచే జనించినశోఫ హరించు.

శ్లో. విభీతకానాం ఫలమధ్యలేప స్స ర్వేషు దాహార్తిహరః ప్రశస్తః
యష్ట్యాహ్వయముస్తైస్సకపిత్థపత్రైస్సచందనైస్తత్పటికాసు లేపః.

తా. తానికాయలలోనిపప్పును నుదకముచే నూరి లేపనము జేసిన జీడిగింజలచే జనించి తాపముతోగూడిన శోఫలు హరించు. మఱియు అతిమధురము, తుంగగడ్డలు, వెలగాకు, శ్రీగంధము, వీటిని నుదకముచే నూరి లేపనము జేసిన జీడిగింజల దోషముచే జనించిన శోఫయుక్తమగు బొబ్బలు నశించు.

శ్లో. పిష్టాన్నముష్ణం లవణాని మద్యం
మృదం దివాస్వప్నమజాంగలం చ
పయోగుడం తైలమథో గురూణి
శోఫం జిఘాంసుః పరివర్జయేత.

తా. పిండితోజేయబడిన పదార్థములు, ఉష్ణపదార్థములు, కారము, ఉప్పు, మృత్తిక, గ్రామ్యమాంసములు, గురుద్రవ్యములు, బెల్లము, వీటిని భక్షించుట, కల్లు,

పాలు, నూనె, మద్యము, వీటిని పానంబొనర్చుట, పగలు నిద్రించుట, ఈ మొదలగు వాటిని శోథరోగపీడితులు వర్జింపవలయు.

ఇట్లు శోఫరోగచికిత్స ముగిసెను.

## అండవృద్ధిలక్షణము.

శ్లో. క్రుద్ధోఽనూర్ధ్వగతిర్వాయుశ్శోథశూలకరశ్చరన్
ముష్కౌవంక్షణతః ప్రాప్య ఫలకోశాభివాహినీమ్.
ప్రపీడ్య ధమనీం వృద్ధిం కరోతి ఫలకోశయోః.

తా. అన్నపానాదివైషమ్యములచే నధోముఖంబుగ సంచరించెడివాయువు దుష్టంబై పొత్తికడుపునందు వ్యాపించి యందు శూలను, వాపును జనింపంజేసి పిదప గజ్జలమూలముగ వృషణకోశములయందు వ్యాపించి యందలినాడులకు వ్యథను గలుగంజేసి వృషణములయందలి విత్తులలో నొకటినైనను, రెంటినైనను వృద్ధి జేయుచున్నయది.

శ్లో. మూత్రాంత్రజావప్యనిలాద్ధేతుభేదస్తు కేవలః.

తా. మూత్రదోషముచేతను, ఆంత్రవృద్ధిచేతను, గలిగెడి అండవృద్ధికి వాతము ప్రధానంబుగనుండినను, వేరే మఱికొన్నికారణంబులును గలవు.

శ్లో. ఆంత్రవృద్ధిరసాధ్యోఽయం వాతవృద్ధిసమాకృతిః.

తా. మఱియు ఆంత్రవృద్ధిచే గలిగిన అండవృద్ధియు, వాతదోషముచే జనించిన అండవృద్ధియు, అసాధ్యములని యెఱుంగవలయు.

## అండవృద్ధిచికిత్స.

శ్లో. రాస్నాయష్ట్యమృతైరండపటోలం రేణుకా బలా
వృషస్యాత్కథితో వృద్ధిం హన్యాచ్చిత్రకతైలవాన్.

తా. సన్నరాష్ట్రకము, అతిమధురము, తిప్పతీగ, ఆముదపువేరు, చేదుపొట్ల, గోరింట, చిట్టాముట్టి, అడ్డసరము, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి యందు చిత్రమూలచూర్ణము, చిట్టాముదము, తగుమాత్రముగ కలిపి త్రాగిన ఆంత్రవృద్ధి నశించు.

శ్లో. తైలమేరండజం పీత్వా బలాసిద్ధపయోన్వితమ్
ఆధ్మానశూలోపచితామంత్రవృద్ధిం జయేన్నరః.

తా. చిట్టాముట్టివేళ్ళ కషాయంబున ఆముదము, పాలు, కలిపిత్రాగిన ఆధ్మానశూల, ఆంత్రవృద్ధి, ఇవి నశించు.



శ్లో. శంఖోపరిచ కర్ణాంతే త్యక్త్వా సేవనిమాదరాత్
వ్యత్యాసాద్వా సిరాం విధ్యేదంత్రవృద్ధినివృత్తయే.

తా. ఎడమప్రక్కయండము వృద్ధియయ్యెనేని కుడిప్రక్కయందును, కుడిప్రక్కయండము వృద్ధియయ్యెనేని నెడమప్రక్కయందును, కర్ణమూలములయందలి నాడిని పొడిచి రక్తమును స్రవింపంజేయవలయు.

శ్లో. కర్ణకోశస్య మధ్యే తు రక్తాం నిర్ధారయేచ్ఛిరామ్
ఉభాభ్యాం ద్వే సిరే వేధ్యే తేన వా తత్సుఖం భవేత్.

తా. ఇరుపార్శ్వములయందును అండములు వృద్ధియై యుండిన రెండు కర్ణమూలములయందలి నాడులను పొడిచి రక్తమును స్రవింపంజేయవలయు.

శ్లో. అజాజీహపుషా కుష్ఠం గోమయం బదరాన్వితమ్
కాంజికేన తు సంపిష్టం కుర్యాద్వర్ధ్మప్రలేపనమ్.

తా. జీలకఱ్ఱ, పెద్దసోపు, కోష్ఠు, ఆవుపేడ, రేగుపండు, వీటిని సమభాగములుగ కలితో నూరి అండములకు లేపనముజేసిన వర్ధ్మయను అండవృద్ధి నశించు.

శ్లో. లాక్షా కరంజబీజం చ శుంఠీదారుసగైరికమ్
కుందరం చ సమం కృత్వా చూర్ణయేన్మతిమాన్భిషక్.
కాంజికేన తు సంపేష్య స్తథా శ్వయథునాశనః.

తా. లక్క, కానుగవిత్తులు, శొంఠి, దేవదారుపట్ట, కావిరాయి, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి దీనికి సమముగ కుందురుగడ్డివేళ్లను చూర్ణముజేసి కలిపి కలితో నుడికించి కించిదుష్ణముగ లేపనముజేసిన ఆంత్రవృద్ధి, వాపు, ఇవి నివారణమగు.

శ్లో. ఆర్ద్రకస్య రసః క్షౌద్రయుక్తో వృషణవాతజిత్.

తా. అల్లపురసమునకు సమముగ తేనె కలిపి త్రాగిన అండవాయువు నశించు.

శ్లో. ఫలత్రికోద్భవం క్వాథం గోమూత్రేణైవ పాచయేత్
వాతశ్లేష్మకృతం హంతి శోఫం వృషణసంభవమ్.

తా. కరక్కాయలు, తానికాయలు, సౌల్లివరుగు, వీటిని సమభాగములుగ దంచి గోమూత్రముచే కషాయముబెట్టి త్రాగిన శ్లేష్మముచే జనించిన వృషణశోఫలు హరించు.

శ్లో. రాస్నామృతా బలాయష్టీ గోకంటైరండజశ్శృతః
ఏరండతైలసంయుక్తో వృద్ధిమంత్రభవాం జయేత్.

తా. సన్నరాష్ట్రకము, తిప్పతీగ, చిట్టాముట్టివేరు, అతిమధురము, పల్లేరుకాయలు, ఆముదపువేరు, వీటిని సమభాగములుగ కషాయముబెట్టి అం దాముదము కలిపి త్రాగిన అంత్రవృద్ధి హరించు.

శ్లో. గుగ్గులుంరుబుతైలం వా గోమూత్రేణ పిబే న్నరః
అంత్రవృద్ధిం నిహంత్యాశు చిరకాలానుబంధినీమ్.

తా. శుద్ధిజేసిన గుగ్గిలచూర్ణంబునైనను, ఆముదమునైనను, గోమూత్రమున కలిపి త్రాగిన దీర్ఘకాలముగ బాధింపుచుండెడి అండవృద్ధి నశించు.

శ్లో. సక్షీరం వా పిబే త్తైలం మాంసమేరండసంభవమ్
తైలం నారాయణం యోజ్యం పానాభ్యంజనవస్తిషు.

తా. ఆవుపాలయం దాముదము కలిపి పుచ్చుకొనినను, లేక ఆముదపుపప్పును నూరి ఆవుపాలలో కలిపి పుచ్చుకొనినను, లేక నారాయణతైలమును పానము, అభ్యంజనము, సేయుటయే గాక దానిచే వస్తికర్మ జేసినను, అండవాయువులు నివారణమగు.

శ్లో. పంచవల్కలకల్కేన సఘృతేన ప్రలేపనమ్.

తా. పంచవల్కంబులు (అనగా మఱ్ఱి, రావి, అత్తి, జువ్వి, మామిడి, లేక వేప) వీటిపట్టలను దంచి రసముదీసి యందు నెయ్యికలిపి సుఖోష్ణముగ అండములకు లేపనముజేసిన అండవృద్ధి నివారణమగు.

శ్లో. పునర్నవామృతాదారుసక్షౌరలవణత్రయమ్
కుష్ఠం శఠీవచాముస్తారాస్నాకట్ఫలపుష్కరమ్.
యవానిహపుషాహింగుసతాహ్వాచాజమోదకః
విడంగాతివిషాయష్టీ పంచకోలకసంయుతైః.
ఏతైః కల్కసమై రక్తై స్తైలప్రస్థే విపాచయేత్
గోమూత్రం ద్విగుణం దేయం కాంజికం చ తథైవ చ
పునర్నవాద్యమేతత్తు వస్తౌపాదే తథోత్తమమ్
కట్యూరుపృష్టమేఢ్రేషు కుక్షౌ చ వృషణాశ్రితమ్.
కఫవాతోద్భవం శూలమంత్రవృద్ధివినాశనమ్.

తా. తెల్లగలిజేరువేరు, తిప్పతీగ, దేవదారుపట్ట, యవక్షారము, సర్జక్షారము, వెలిగారక్షారము, ఉప్పు, బిడాలవణము, నల్లఉప్పు, సైంధవలవణము, కాచలవణము, కోష్ఠు, కచ్చూరములు, వస, తుంగగడ్డలు, సన్నరాష్ట్రకము, కాయఫలపుపట్ట, తామరగడ్డలు, ఓమము, పెద్దసోపు, ఇంగువ, పిల్లపీచరవేళ్ళు, అజామోదము, వాయువిళంగములు, అతివస, అతిమధురము, శొంఠి, పిప్పలి, మిరియాలు, చవ్యము, చిత్రమూలము,



వీటిని సమభాగములుగ చూర్ణంబొనర్చి దీనికిసమముగ తానికాయలబెరడు చూర్ణమును కలిపి యం దుదకముబోసి కల్కముజేసి పిదప యందు నువ్వులనూనె ఒకపడి వైచి వీటికన్నిటికి రెండింతలు గోమూత్రము, కలి, బోసి మైనపక్వముగ తైలముకాచి ప్రాతస్సాయంకాలములయం దొక్కొక పలముచొప్పున సేవించుటయే గాక వస్తికర్మ సగాజేసిన అండవాయువులు, నడుమునొప్పులు, తొడలు, వీపు, శిశ్నము, కడుపు, వృషణములు, వీటిని నాశ్రయించి వాతకఫములచే జనించిన శూలలు, అంత్రవృద్ధి, ఇవియన్నియు నశించు.

శ్లో. అంగుష్ఠమధ్యత్వక్ఛిత్వా దహేదంగవిపర్యయమ్.

తా. పాదముల బొటనవ్రేలి అధోభాగంబునందలి చర్మము దగ్ధమై నరములయందు వ్యాపించునటుల రక్షలు వేయవలయు. ఎడమప్రక్క అండము వృద్ధిజెందియుండెనేని కుడికాలియందలి బొటనవ్రేలి యధోభాగంబునను, కుడిప్రక్క అండము వృద్ధిజెందియుండెనేని నెడమకాలియందలి బొటనవ్రేలి యధోభాగంబునను, రక్షలు వేయవలయు. ఇటులజేసిన అండవృద్ధి నశించు.

శ్లో. వచాసర్షపకల్కేన ప్రలేప శ్శోఫనాశనః.

తా. వస, ఆవాలు, వీటిని నుదకముచే నూరి అండములకు లేపనముజేసిన అండవాపులు హరించు.

శ్లో. పిప్పలీజీరకం కుష్ఠం బదరం శుష్కగోమయమ్
కాంజికేన ప్రలేపోఽయ మంత్రవృద్ధివినాశనః.

తా. పిప్పళ్ళు, జీలకఱ్ఱ, కోష్ఠు, రేగుపండ్లు, ఎండిన ఆవుపేడ, వీటిని సమభాగములుగ కలితో నూరి అండవృద్ధికి లేపనముజేసిన నది నివృత్తియగు.

శ్లో. దేవదారుమిసీవాసాటాంకలీమూలసైంధవైః
క్షౌద్రయుక్తైశ్చ తై ర్లేపో వృద్ధిమంత్రభవాం జయేత్.

తా. దేవదారుపట్ట, పెద్దసోపు, అడ్డసరము, వెఱ్ఱిపుచ్చవేరు, సైంధవలవణము, వీటిని సమముగ తేనెతో నూరి అంత్రవృద్ధికి లేపనముజేసిన నది నశించు.

శ్లో. దార్వీచూర్ణం గవాం మూత్రై ర్నిపీతం ముష్కవృద్ధిజిత్.

తా. మ్రానిపసుపుచూర్ణమును గోమూత్రమున కలిపి త్రాగిన అండవృద్ధి నివారణమగు.

శ్లో. వేగహతం పృష్ఠయానం వ్యాయామం మైథునం తథా
అత్యాశన మథాధ్వాన ముపవాసం పరిత్యజేత్.

తా. కాష్ఠంబులు మొదలగువాటిని గొడ్డలిచే భేదించుట, అండముల కభిఘాతము జనించెడికార్యంబు లొనర్చుట, అశ్వాదుల నెక్కి సంచరించుట, శ్రమగలుగు నటుల పనిసేయుట, అతిమైథునం బొనర్చుట, ప్రొవనడుచుట, వాతపదార్థముల నధికముగ భుజించుట, ఉపవాసము గావించుట, ఈ మొదలగు కార్యంబులను అండవృద్ధి గలవారు వర్జింపవలయును.

ఇట్లు అండవృద్ధిచికిత్స ముగిసెను.

## కురండలక్షణము.

శ్లో. అత్యభిష్యందిగుర్వమ్లసేవనాన్నిచయం గతః
కరోతి గ్రంథివచ్ఛోఫం దోషోవంక్షణసంధిషు.

తా. మిగుల జిగటగలపదార్థములు, రోగాస్పదంబులగు శాకపాకంబులు, పులుసు, వీటిని నధికముగ సేవించుటచే వాతము దుష్టంబై గజ్జలయందు గ్రంథులం బోలినవాపును జనింపం జేయుచున్నయది. ఇదియ కురండరోగము.

శ్లో. వాతకోపిభి రాహారై శ్శీతతోయావగాహనైః.
ధారణే రణభాషాధ్వవిషమాంగప్రవర్తనైః.
క్షోభణైః క్షుభితశ్చాన్యై క్షుద్రాంత్రావయవం యదా
పవనో విగుణీకృత్య స్వనివేశాదధో నయేత్.
కుర్యాద్వంక్షణసంధిస్థో గ్రంథ్యాభం శ్వయథుం స్తదా
జ్వరశూలాంగసాదాఢ్యం తం వర్ధ్మమితి నిర్దిశేత్.

తా. వాతమును ప్రకోపింపంజేసెడి పదార్థముల భుజించుట; శీతోదకంబున గ్రుంకుట, భారమును, మోయుట, గదలు మొదలగునాయుధముల ద్రిప్పుట, గట్టిగ మాటలాడుట, దూరము నడుచుట, రతికాలంబున వికారంబులగు బంధనంబు లొనర్చుట, ఈ మొదలగు క్షోభకరంబులైన కార్యంబు లొనర్చుటచే వాతము దుష్టంబై సూక్ష్మరూపకమైన పేగులు, నరములు, వీటియందు వ్యాపించి నాడులకు వైకల్యమును గలుగంజేసి వాటివాటిస్థానంబులను వదులునటులం జేయుటయ గాక యానరంబులను నధోముఖము గావించి గజ్జలయందు గ్రంథులవంటిశోఫను జనింపంజేయు. ఇటుల శోఫను జనింపంజేసినపిదప జ్వరము, శూల, కృశత్వము, వీటిని సగా గలుగంజేయు. ఇదియ వర్ధరోగము.

## కురండచికిత్స.

శ్లో. ఇంద్రవారుణికామూలం తైలం పుష్కరజం తథా
సంమర్ద్యం చ సగోదుగ్ధం పిబే జ్జంతుః కురండకే.



తా. పెద్దపాపరవేళ్ళయం దధికముగ నువ్వులనూనె బోసి మర్దించి ఆవుపాలతో కలిపి ప్రతిదినంబును సేవించిన కురండరోగము నివారణమగు.

శ్లో. గవాం ఘృతేన సంయుక్తం కృత్వా సైంధవచూర్ణకమ్
పిబేత్స ప్తదినే యావ త్తావ ల్లేపః కురండకే.

తా. ఆవునేతిలో తగుమాత్రముగ సైంధవలవణము కలిపి యొకతులముచొప్పున నేడుదినములు సేవించుటయ గాక ౭ దినంబులును కురండములకు లేపనము జేయుచుండిన నవి నివృత్తియగు.

శ్లో. సంచూర్ణితం సైంధవ మాజ్యయుక్తం
సంమర్ద్య తోయస్థితమేవ సోష్ణమ్
ముహుర్ముహు ర్యం కురుతే ప్రలేపం
విలీయతే తస్య కురండరోగః.

తా. సైంధవలవణమును నేతితో నూరి యం దుదకము కలిపి కించిదుష్ణముగజేసి కురండములకు లేపనముజేసిన నవి నివారణమగు.

శ్లో. ఏరండతైలం సమ్మిశ్రం కాసీసం సైంధవం పిబేత్
వస్త్రేణ వృషణం బద్ధ్వా కురండజ్వరనాశనమ్.

తా. సైంధవలవణము, అన్నభేది, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి యందు తగుమాత్రము ఆముదము కలిపి సేవించుటయ గాక వస్త్రముచే వృషణములను బంధించిన కురండములు, కురండజ్వరములు, ఇవి నివృత్తియగు.

శ్లో. తండులవారిమిశ్రం ఘనపూరం సంజ్ఞముచ్యతే లోకే
తన్మూలపిష్టలేపం కురండగళగండయోః కుర్యాత్.

తా. కానుగవేరును బియ్యపుకడుగుతో చక్కగ నూరి కురండములకు లేపనము జేసిన నవి నివృత్తియగు. మఱియు దీనిని గండమాలలకు సగా లేపనము జేయందగు.

శ్లో. ఈశ్వరీమూలమేరండమూలం మూషకచర్మ చ
ప్రలేపస్స్యా త్కురంటాఖ్యరోగవిచ్ఛేదకారకః.

తా. ఈశ్వరివేళ్ళు, ఆముదపువేళ్ళు, ఎలుకతోలు, వీటిని బియ్యపుకడుగుతో చక్కగ మర్దించి కురండములకు లేపనముజేసిన నవి నివృత్తియగు.

శ్లో. సుపేషితం బ్రాహ్మణయష్టికాయా మూలం సమంతండులధావనేన
నిహంతిలేపాద్గళగండమాలాం కురండముఖ్యానఖిలాన్వికారాన్.

తా. గంటుభారంగివేళ్ళను బియ్యపుకుడితితో నూరి కురండములు, గండమాలలు, వీటికి లేపనముజేసిన నవి నివారణమగు.

శ్లో. వాతారితైలమృదితం సురవారుణీజం
మూలం నరః పిబతి యో మసృణం విచూర్ణ్య
గవ్యే నిధాయ పయసి త్రిదినావసానే
తస్య ప్రణశ్యతి కురండకృతో వికారః.

తా. పిన్నపాపరవేళ్ళను ఆముదముచే చక్కగ నూరి ఆవుపాలలో కలిపి మూడుదినములు త్రాగిన కురండములు నివర్తియగు.

శ్లో. తనుమూషికచర్మణా నిబద్ధః ప్రవిలేపాదథ చేశ్వరీజటాయాః
ఉపశాంతి ముపైతి మానవానా మచిరేణైవ కురండసంజ్ఞరోగః.

తా. పచ్చియెలుకతోలును కురండములకు కట్టుకట్టినను, లేక ఈశ్వరివేళ్ళను, బియ్యపుకుడితితో నూరి కురండములకు లేపనముజేసినను నవి నివర్తియగు.

శ్లో. యః పిత్తదోషేణ కురండరోగో భవేచ్ఛిశోర్దక్షిణముష్కభాగే
తస్యోర్ధ్వభాగం శ్రవణస్య విద్ధ్యేద్వామస్య వామే ప్రభవేపరస్య.

తా. పిత్తప్రకోపముచే బాలురకు కుడిప్రక్కయందలి యండములయందు కురండరోగము జనించిన నెడమచెవ్వి మధ్యంబునను, ఎడమప్రక్కయందు కురండరోగముజనించిన కుడిచెవ్వి మధ్యంబునను వేధింపవలయు.

ఇట్లు కురండరోగచికిత్స ముగిసెను.

## గండమాలాపచీగ్రంథ్యర్బుదలక్షణము.

శ్లో. వివృద్ధ శ్శ్వయధుర్యస్య ముష్కవల్లంబతే గళే
మహాన్వా యదివా హ్రస్వో గళగండం త మాదిశేత్.

తా. వాతాదిదోషములచే కంఠస్థానంబున శోఫగలిగి నది క్రమంబుగ అండమువలె పెద్దదిగనైనను, చిన్నదిగనైనను, వృద్ధిజెంది గళస్థానంబున వ్రేలుచుండిన నదియ గళగండ మనబడు.

శ్లో. కర్కంధుకోలామలకప్రమాణైః కక్షాంసమన్యాగళవఙ్క్షణేషు
మేదఃకఫాభ్యాం చిరమందపాకైస్స్యద్గండమాలా బహుభిశ్చ
[గండైః.

తా. మేదస్సు, కఫము, ఇవి మిళితంబులై చంకలు, మెడ, పెడతలనరము, పెడకొంకులు, వీటియందు "రేగుపండు, మిరియాలు, ఉశిరికాయ" వీటింబోలి చిరకాలమునకు మందముగ పాకంబయ్యెడిగ్రంథులను జనింపంజేయు. ఇదియ గండమాల యనబడు.



శ్లో. తే గ్రంథయః కేగిదవాప్తపాకాస్స్రవంతి నశ్యంతి భవన్తిచాన్యే
కాలానుబంధం చిరమాదధాతి సైవాపచీతి ప్రవదంతి కేచిత్.

తా. మఱియు నీగ్రంథులలో కొన్ని కాలక్రమముగ పక్వంబులై చీముస్రవించి తమంతటనే నశించుచున్నయవి. మఱికొన్ని నప్పుడప్పుడు నూతనంబులుగ నుత్పన్నంబులై దీర్ఘకాలమువరకు నెలకొనియుండు. ఇదియ అపచి యనంబడు.

శ్లో. వాతాదయో మాంస మసృక్ప్రదూష్య
సందూష్య మేదశ్చ తథా సిరాశ్చ
వృత్తోన్నతం విగ్రథితం చ శోఫ
కుర్వంత్యతో గ్రంథిరితి ప్రదిష్టః.

తా. వాతాదిదోషంబులు, మాంసము, రక్తము, మేదస్సు, నాడులు, వీటినిజెరిపి "వల్మీకము దినదినంబునకు వృద్ధియగుచాడ్పున" వృత్తములుగను, ఉన్నతములుగను, శోథతో గూడినవిగను, నుండెడిగ్రంథులను జనింపంజేసి దినదినంబునకు వృద్ధియగునటుల జేయుచున్నయవి. ఇదియ గ్రంథిరోగ మనంబడు.

శ్లో. గాత్రప్రదేశే క్వచిదేవ దోషా
స్సందూషితా మాంస మసృక్ప్రదూష్య
వృత్తం స్థిరం మందరుజం మహాంత
మనంతమూలం చిరవృద్ధిపాకమ్.
కుర్వంతి గాఢోచ్ఛ్రియమాంసగాఢం
తమర్బుధం శాస్త్రవిదో వదన్తి.

తా. శరీరమునం దేదైన నొకస్థలంబున వాతాదులు ప్రకోపించి మాంసము, రక్తము, మేదస్సు, నాడులు, వీటిని జెరిపి గుండ్రముగను, బహుకాలము స్థిరముగనుండునదిగను, స్పృశించిన కొంచము వ్యథతోగూడినదిగను, మిగుల పోట్లుగలదిగను, చిరకాలము గతించినపిదప వృద్ధియై పక్వమగునదిగను, కఠినంబుగ నుండునదిగను, ఉన్నతంబుగ నుండునదిగను, మిగుల మాంసముతోగూడినదిగను, గొప్పవిగను, నుండెడుగ్రంథులను జనింపంజేయుచున్నయవి. దీనినే అర్బుదరోగంబని ఆయుర్వేదవేత్తలు వక్కాణించెదరు.

## గండమాలాదిచికిత్స.

శ్లో. తుంబీరసేన కటుకేన చతుర్గుణేన
కల్కీకృతైర్మగదజాధిగణౌషధైశ్చ

తైలం శ్రుతం హరతి దేహిషు గండమాలా
మత్యుల్బణామపి గళే గళగండరోగాన్.

తా. పిప్పల్యాదిగణము, అనగా పిప్పలి, మోడి, చవ్యము, చిత్రమూలము, శొంఠి, వస, అతివస, జాజికాయ, అగరుశొంఠి, కొడిశపట్ట, రేణుకలు, నేలవేము, చాగవేళ్ళు, ఆవాలు, మిరియాలు, కటుకరోహిణి, తామరగడ్డలు, గంటుభారంగి, వాయువిళంగములు, కరకపువ్వు, జిల్లేడువేళ్ళు, చిన్నములక, పెద్దములక, సన్నరాష్టకము, దురదగొండివేరు, ఓమము, అజామోదము, దుందిలపువేళ్ళు, ఇంగువ, ఇవి దినుసుయొకటింటికి ౧ భాగము చొప్పున నుంచుకొని అందు చేదుసొరకాయలరసము ౧౧౬ భాగములు బోసి నూరి దీనికి సమముగ నువ్వులనూనె కలిపి సూక్ష్మాగ్నిచే వండి మైనపక్వముగ దించుకొని, గండమాలలు, గళగండములు, వీటికి లేపనముజేసిన నవి నశించు.

శ్లో. సర్షపాశిగ్రుబీజాని షణబీజాతసీయవా
మూలకస్య చ బీజాని తక్రేణామ్లేన పేషయేత్.
గండానిగ్రంథయశ్చైవ గండమాలాస్తథైవ చ
ఆలేపాత్తేన శామ్యంతి విలయం యాంతి వాచిరాత్.

తా. ఆవాలు, మునగవిత్తులు, నల్లఆగసివిత్తులు, జనపవిత్తులు, యవగోధుమపిండి, ముల్లంగివిత్తులు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి అందు పుల్లనిమజ్జిగ కలిపి గళగండములు, గ్రంథులు, గండమాలలు, వీటికి లేపనముజేసిన నవియన్నియు నశించు.

శ్లో. సర్షపారిష్టపత్రాణి దంతిభల్లాతకై స్సహ
ఛాగమూత్రేణ సంపిష్ట మపచిఘ్నం ప్రలేపనమ్.

తా. ఆవాలు, వేపాకు, నేలదంతివేరు, జీడిగింజలు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి యందు మేకమూత్రము బోసి నూరి అపచి గండమాలలకు లేపనము జేసిన నవి హరించు.

శ్లో. జలకుంభీకజం భస్మ పక్త్వా గోమూత్రగాలితమ్
పిబే త్కోద్రవతక్రాశీగళగండనివృత్తయే.

తా. ముండ్లచామంతిచెట్టును గాల్చి భస్మముజేసి అందు గోమూత్రము బోసి యుండికించి త్రాగిన గళగండములు నశించు. ఇందుకు పథ్యము:—ఆరికయన్నము, మజ్జిగ, వీటిని భుజింపవలయు.

శ్లో. వ్యోషం విడంగం మధుకం సైంధవం దేవదారు చ
తైలమేభిశ్శృతం న స్యా త్కృచ్ఛ్రామప్యపచిం జయేత్.

తా. శొంఠి, పిప్పలి మిరియాలు, వాయువిళంగములు, అతిమధురము, సైంధవలవణము, దేవదారుపట్ట, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి యందు నువ్వులనూనె బోసి తైలపక్వముగ కాచి నస్యముజేసిన కఠినములగు అపచి, గండమాలలు, హరించు,



శ్లో. పశ్చాత్క్షారేణ సంశోధ్య వ్రణవత్సముపాచరేత్
క్షారాగ్నిభ్యాం దహేచ్చాపి స్వేదైశ్చ వివిధై ర్జయేత్.

తా. ఇట్లు నస్యము జేసినపిదప అపచీగండమాలలకు క్షారమును పట్టించి కడుగుటయేగాక వ్రణములకు చికిత్సలు జేసెడిరీతిన నా గండమాలలను క్షారంబులచేనైనను, అగ్నికర్మలచేనైనను, చమటపడియుండునటుల జేయుటచేనైనను, మఱియు నితర ఉపచారంబులచేనైనను, శాంతి యగునటుల జేయవలయు.

శ్లో. ఇభాండసదృశం మేదో హృత్వాచాగ్నిం ప్రయోజయేత్
జయేద్విద్రధివత్పూర్వ మర్బుదం దహనాదిభిః.

తా. ఏనుగుల అండములయందలి మేదస్సును దీయు తెఱంగున నీ గండమాలలయందును మేదస్సును దీసి అందు రక్షలువేయవలయు. మఱియు విద్రధిరోగంబునకు రక్షలు మొదలగువాటిచే జికిత్సలం జేయుచందంబున అర్బుదగండమాలలకును చికిత్సలం జేయవలయు.

శ్లో. చుచుందరీవిపక్వంతుకటునా తైలం వరం ఘృతమ్
నింబాశ్వమార నిర్గుండ్యాచాభ్యంగాన్నాశయేన్నృణామ్.

తా. గుగ్గిలమున తైలముదీసి యందు చుంచెలుకను ఖండించివైచి తైలపక్వముగ కాచి ప్రాతస్సాయంకాలములయందు గండమాలలకు లేపనముజేసినను, లేక వేపపట్ట, తెల్లగన్నేరువేళ్ళు, వావిలియాకు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి యందు నెయ్యి బోసి ఘృతపక్వముగ కాచి గండమాలలకు లేపనముజేసినను, నవి నివారణమగు.

శ్లో. కుళుత్థం మరిచం హింగు సజలం గండపాచనమ్.

తా. ఉలవలు, మిరియాలు, ఇంగువ, వీటిని సమభాగములుగ నుదకముచే నూరి యుండికించి హితోష్ణముగ గండమాలలకు లేపనముజేసిన నవి నశించు.

శ్లో. విష్ణుక్రాంతాచ పేటారీకాంజికేన సుపేషితా
కాలస్ఫోటం హరేల్లేపా దన్యగ్రంథిషు కాకథా.

తా. విష్ణుక్రాంతము, చిట్టాముట్టివేరు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి పుల్లనికలిలో కలిపి కించిదుష్ణముజేసి లేపనముజేసిన కాలస్ఫోటాదులు, గండమాలలు, ఇవి నివర్తియగు.

శ్లో. పుత్రజీవస్యమజ్జాంతుజలేపిష్ట్వా ప్రలేపయేత్
కాలస్ఫోటం విషస్ఫోటం సద్యోహన్యాత్సవేదనమ్.
కక్షాగ్రంథిం గళగ్రంథిం కర్ణగ్రంథించ నాశయేత్,

తా. పుత్రజీవిచెట్టుపట్టను నుదకముచే నూరి వేదనయుక్తమగు కాలస్ఫోటము, విషస్ఫోటము, వీటికిని కర్ణము, గళము, చంకలు, వీటియందలి గ్రంథులకును, లేపనము జేసిన నవియన్నియు శమించు.

శ్లో. సర్వేషామేవ గ్రంథీనాం రక్తస్రావః ప్రశస్యతే.

తా. సమస్త గ్రంథులయందును రక్తమును స్రవింపం జేయవలయు.

శ్లో. గదార్కదుగ్ధ తాళేన జేపాలేన వినాశయేత్.

తా. కోష్ఠు, హరితాళకము, నేపాళముల పప్పు, వీటిని సమభాగములుగ చూర్ణము జేసి యందు జిల్లేడుపాలుబోసి నూరి సర్వగ్రంథులకు లేపనము జేసిన నవియన్నియు నివారణమగు.

శ్లో. గంధకం సూతకంతుల్య మర్కక్షీరం సైంధవమ్
పిష్ట్వాచ కాంచనీమూలం లేపోయం గండమాలికే.

తా. గంధకము, పాదరసము, సైంధవలవణము, వీటిని జిల్లేడుపాలు, ఉమ్మెత్త వేళ్ళరసము, వీటిచే చక్కగ మర్దించి సర్వగ్రంథులకు లేపనము జేసిన నవియన్నియు నివారణమగు.

శ్లో. పిష్ట్వా జేపాలత్రాణి స్వరసేనకృతావటీ
ఛాయాశుష్కాం తతో లేపాద్గండ మాలావినశ్యతి.

తా. నేపాళపుయాకులను దంచి రసముదీసి నీడన యెండించిన నది గట్టియగు. పిదప దానిని గంధముదీసి గండమాలలకు లేపనము జేసిన నవి నివర్తియగు.

శ్లో. రాజికాలశునం పేష్య లేపోహృద్గళగ్రంథికః.

తా. ఆవాలు, తెల్లగడ్డలు, వీటిని నుదకముచే చక్కగ నూరి హృదయము, గళస్థానము, వీటియందైనను, ఇతర స్థలంబులయందైనను జనించిన గ్రంథులకు లేపనము జేసిన నవి నివారణమగు.

శ్లో. భల్లాతకాసీసహుతాశదంతీ మూలైర్గుడస్నుగ్రవిదుగ్ధదిగ్ధైః
లేపేకృతేగచ్ఛతి గండమాలా సమీరవేగాదివ మేఘమాలా.

తా. జీడిగింజలు, అన్నభేది, చిత్రమూలము, నేలదంతివేరు, బెల్లము, వీటిని సమభాగములుగ నుంచుకొని యందు బొంతజెముడుపాలు, జిల్లేడుపాలు బోసి చక్కగ మర్దించి గండమాలలకు లేపనము జేసిన "ప్రబలమగువాయువుచే మేఘంబులు పలాయనం బగుచందంబున" నవి నివర్తియగు.

శ్లో. అలంబుసాయాస్స్వరసః పీతో ద్విపలమాత్రయా
అపచ్యాగండమాలానాం కామిలాయాశ్చ నాశనః.



తా. అంతరతామరను కించిదుష్ణము జేసి యందు రసముదీసి రెండుపలములు త్రాగిన గండమాలలు, అపచి, కామిలలు, ఇవియన్నియు నశించు.

శ్లో. కాంచనారత్వచః క్వాథశ్శుంఠీ చూర్ణేన నాశయేత్
గండమాలాం తథా క్వాథః క్షౌద్రేణవరుణత్వచః.

తా. దేవకాంచనపువేరుపట్టను దంచి కషాయము బెట్టి యం దొకింత శొంఠి చూర్ణమును కలిపి పుచ్చుకొనినను, లేక ఉలిమిడిపట్టరసములో తేనెకలిపి పుచ్చుకొనినను, గండమాలలు నశించు.

శ్లో. జలేనపేషయేత్తుల్యం కాంచనం చిత్రకం వృషమ్
సప్తాహం లేపయేత్తేన సర్వజా గండమాలికాః.
స్ఫుటంతినాత్రసందేహాస్స్వతే లేపమిమంకురు.

తా. దేవకాంచనపువేరు, చిత్రమూలము, అడ్డసరము, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి యం దుదకముబోసి కలిపి ౭ దినములు గండమాలలకు లేపనము జేసిన నవి సర్వదోషంబులచే నుత్పన్నంబులై యుండినను, నిస్సంశయముగ స్ఫుటితంబులగు. ఇటుల పగిలినపిదప దీనినే లేపనము జేయవలయు. మఱియు నీక్రియను వ్రణములు, గడ్డలు, వీటికిని లేపనము జేయందగు.

శ్లో. వత్సనాభం నింబునీరం లేపాద్గండంవినశ్యతి.

తా. వసనాభిని నిమ్మపండ్లరసముచే నూరి గండమాలలకు లేపనము జేసిన నవి నివర్తియగు.

శ్లో. నిజద్రవేణసంపిష్టం ముండీమూలం ప్రలేపయేత్
గండమాలాక్షయంయాతి తద్ద్రవం చ పిబేత్పలమ్.

తా. బోడతరరసముచే దానివేరును నున్నగ నూరి గండమాలలకు లేపనము జేయుటయే గాక యా బోడతరరసంబున ౪ తులములు త్రాగిన నవి నశించు.

శ్లో. బ్రహ్మదండీయమూలం తు పిబేత్తండులవారిణా
స్ఫుటితాం హంతి లేపన గండమాలాం న సంశయః.

తా. బ్రహ్మదండివేరును బియ్యపుకడుగుతో నూరి త్రాగుటయే గాక భిన్నంబైన గండమాలలకు లేపనము సగా జేసిన నవి శీఘ్రంబుగ నశించు.

శ్లో. షట్పలంవ్యోషచూర్ణం చ త్రిఫలా చ పలత్రయమ్
కాంచనారత్వచాచూర్ణం యోజయేద్ద్వాదశం పలమ్.
గుగ్గులుస్సర్వతుల్యస్స్యాత్సర్వమేకత్ర కుట్టయేత్
క్షౌద్రం పలశతం దేయం గుటికాం కర్షసమ్మితామ్.

భక్షయేద్గండమాలార్తో గళగ్రంథీంశ్చ నాశయేత్.

తా, శొంఠి, పిప్పలి, మిరియాలు, ఇవి ౬ పలములు, కరక్కాయలు, తానికాయలు, ఉశిరికవరుగు, ఇవి 3 పలములు, దేవకాంచనపుపట్ట ౧౨ పలములు, గుగ్గిలము ౨౧ పలము, ఇటుల వీటిని చూర్ణముజేసి యందు ౧౦౦ పలముల తేనెబోసి లేహపక్వముగ వండి ప్రాతస్సాయంకాలములయందు కర్షప్రమాణము సేవించిన గళగ్రంథులు, గండమాలలు, ఇవి నశించు.

శ్లో. అజమోదా చ సిందూరం హరితాళం నిశాద్వయమ్
క్షారద్వయం ఫేనయుతం సాధకం సరళోద్భవమ్
ఇంద్రవారుణ్యపామార్గకదళీకందకైస్సమైః
ఏభిస్సార్ధపకం తైలమజామూత్రప్రయోజితమ్.
మృద్వగ్నౌ పాచయేదేతత్స్నుహ్యర్కక్షీరమిశ్రితమ్
అజమోదాదికం తైలం గండమాలాం వ్యపోహతి.
ఆమాం విదగ్ధాం తు పచేత్పక్వాం చైవ విశోధయేత్
రోపణం మృదుభావం చ తైలేనానేన కారయేత్.

తా. ఓమము, గంగసిందూరము, హరితాళకము, మానిపసుపు, పసపు, యవక్షారము, సర్జక్షారము, సముద్రఫేనము, గుగ్గిలము, పాపరవేరు, ఉత్తరేణివేరు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి యందు అరటిగడ్డరసము, ఆవనూనె, మేకమూత్రము, బొంతజెముడుపాలు, జిల్లేడుపాలు బోసి, మందాగ్నిచే తైలపక్వముగ కాచి సాంగశీతలమున వడియగట్టుకొని గండమాలలకు లేపనముజేసినను, లేక పక్వముగాని గండమాలలకు బియ్యపుపిండిచే కట్టుగట్టి పక్వముగావించి యందలిచీమును స్రవింపంజేసి పైతైలమును లేపనముజేసినను, గండమాలలు నివారణ మగుటయే గాక మాంసపూరితములై స్వస్థంబగు. (ఇది అజమోదాదితైలము.)

శ్లో. గంధకం టంకణం సింధుకాంచనీనవసారకమ్
సౌవర్చలం యవక్షారం కాచం రక్తం సువర్చలమ్.
శీతం రక్తం చ పాషాణం మూషకోత్థం నియోజయేత్
జేపాలబీజమజ్జా చ సమం జంబీరపీడితమ్
శస్త్రైశ్ఛిత్వా ప్రదాతవ్యం వేష్ట్యమేరండపత్రకైః
ఏవం త్ర్యహాత్స్ఫుటంత్యేవ దధ్యన్నం దాపయేత్తతః.
గండమాలాపచీగ్రంథిర్బహిర్నిర్యాతి నాన్యథా.

తా. గండమాలలకు శస్త్రమును బ్రయోగించి పిదప గంధకము, వెలిగారము, సైంధవలవణము, పసపు, నవాసాగరము, సౌవర్చలవణము, యవక్షారము, కాచలవణము,



గంగసిందూరము, సర్జక్షారము, హరితి కర్పూరము, చంద్రచావ, శంఖపాషాణము, ఎలుకచర్మము, నేపాళముల పప్పు, వీటిని సమభాగములుగ నుంచుకొని యందు నిమ్మపండ్లరసముబోసి చెక్కగ నూరి వస్త్రమునకు లేపనముజేసి యీగండమాలలపై వైచి ఆముదపాకులచే కట్టుకట్టవలయు. ఇటుల మూడుదినంబులు గావించిన గండమాలలు, అపచి, గ్రంథులు, ఇవియన్నియు నిశ్శంశయముగ నివారణమగు. ఇందుకుపథ్యము:— పెరుగన్నమును భుజింపవలయు.

శ్లో. అభిమంత్ర్య శనౌ సాయం రవౌ ప్రాతస్సమాహరేత్
పేటారీమూలకం ధూపైర్ధూపయిత్వాథ ఖండయేత్.
చతుర్దశగుణైస్సూత్రై ర్బధ్వా గ్రంథిం గళేస్థితమ్.

తా. శనివారము సాయంత్రంబున చిట్టాముట్టిచెట్టును నభిమంత్రించి మరుదినముదయమగు నాదిత్యవారంబున ప్రాతఃకాలంబున లేచి పరిశుద్ధుడై యాచిట్టాముట్టిచెట్టువద్ది కేతెంచి దానికి ధూపమువేసి వేరు తెగకుండునటుల బెరికి తెచ్చి ౧౪ పోగులుగలదారంబును పసుపుయందు తడిపి పైచిట్టాముట్టివేరునకు గట్టి దానిని షోడశోపచారంబులచే బూజించి ధూపదీపనైవేద్యతాంబూలాదు లొసంగి యీక్రింద నుదహరింపంబోయెడి మంత్రముచే నభిమంత్రించి యాచిట్టాముట్టివేరును గండమాలలు, గళగండములు, ఇవిగలవారికి కంఠమునగట్టిన నవి నశించు.

గండమాలాది హరమంత్రము.

వాక్యమ్. గూఢం ప్రసహితిరితిరీచిత్రపుటకభూకనాగతే పాపటగాలాపరందశ మూలవాసుకాలదేహాల రేవంగురుప్రసాదాత్.

తా. ఈమంత్రంబును నభిమంత్రించవలయు.

శ్లో. నిర్గుండీస్వరసేనాథ లాంగలీమూలకల్కితమ్
తైలం నస్యేతహంత్యాశుగండమాలాం సుదుస్తరామ్.

తా. చన్నచర్లగడ్డను వావిలియాకురసముచే నూరి యందు నువ్వులనూనె బోసి పక్వముగ కాచి యానూనెను నస్యముజేసిన గండమాలాదులు నివారణమగు.

ఇట్లు గండమాలాదిచికిత్స ముగిసెను.

## *శ్లీపదలక్షణము.

శ్లో. మేదోమాంసాశ్రితంశోఫం పాదే శ్లీపదముచ్యతే.

* శ్లీపదమనగా—ఏనుగకాలు.

తా. వాతాదిదోషములచే మేదస్సు దూషింపబడి పాదములయందు మాంసాశ్రితమయినశోఫను జనింపఁజేయును. ఇదియు శ్లీపదమనబడు.

శ్లో. యస్సజ్వరోవంక్షణజోభృశార్తి
శ్శోఫోనృణాం పాదగతశ్చ యస్స్యాత్
తచ్ఛ్లీపదం స్యాత్కరకర్ణనేత్ర
శ్శిగోష్ఠనాసాస్వపి కేచిదాహుః.

తా. జ్వరము, వ్యథ, వీటితోఁగూడిన శోఫ గజ్జలమూలంబుగ పాదములయందు వ్యాపించి శ్లీపదరోగమును జనింపఁజేయును. మఱియును నీశ్లీపదరోగము హస్తము, చెవి, నేత్రములు, శిరుదులయందున్నతమైనప్రదేశము, నాసికము, పెదిమలు, వీటియందును జనించునని ఆయుర్వేదవేత్తలు వక్కాణించెదరు.

శ్లో. లంఘనాలేపనై స్స్వేదై రేచనైశ్చ ప్రసేచనైః
ప్రాయశ్శ్లేష్మహరైరూష్ణై శ్శ్లీపదం సముపాచరేత్.

తా. లంఘనములు సేయుట, ఔషధంబుల లేపనం బొనర్చుట, చమట, రక్తము ఇవి స్రవించునటులం జేయుట, విరేచనమునకు బుచ్చుకొనుట, కషాయములచే యొత్తడము వేయుట, ఈ మొదలగు కార్యంబు నొనర్చుటచేతను, శ్లేష్మహరౌషధంబుల సేవించుటచేతను ఉష్ణోపచారంబులచేతను, శ్లీపదము నివారణమగు.

---

శ్లీపదచికిత్స.

శ్లో. సిద్ధార్థశోభాంజనదేవదారు
విశ్వౌషధైర్మూత్రయుతైః ప్రలింపేత్
పునర్నవా నాగరసర్షపానాం
కల్కేన వా కాంజికమిశ్రితేన.

తా. తెల్లావాలు, మునగపట్ట, దేవదారుపట్ట, శొంఠి, వీటిని సమభాగములుగ గోమూత్రముచే నూరి పాదములకు లేపనముజేసినను, లేక తెల్లగలిజేరువేరు, శొంఠి, తెల్లావాలు, వీటిని సమభాగములుగ కలితో నూరి పాదములకు లేపనముజేసినను, శ్లీపదము నశించు.

శ్లో. దుత్తూరైరండనిర్గుండీ వర్షాభూశిగ్రుసర్షపైః
ప్రలేపశ్శ్లీపదంహంతి చిరోత్థమపిదారుణమ్.

తా. నల్లఉమ్మెత్త చెట్టుసమూలము, ఆముదపువేరుపట్ట, తెల్లగలిజేరువేరు, మునగపట్ట, తెల్లావాలు, వీటిని సమభాగములుగ వావిలిమాకురసముచే నూరి పాదములకు లేపనముజేసిన ఘోరంబై బహుకాలంబుగ బాధింపుచుండెడి శ్లీపదము హరించు.



శ్లో. పలాశమూలస్వరసం పిబేద్వా తైలేన తుల్యం సితసర్షపానామ్
మూత్రేణపక్త్వామరదారువిశ్వం శ్రీగుగ్గులుంశ్లీపదిభిర్నిషేవ్యమ్.

తా. తెల్లావాలనూనెకు సమంబుగ మోదుగవేరురసమును కలిపి సేవించినను, లేక దేవదారుపట్ట, శొంఠి, మారేడుకాయలు, శుద్ధిజేసిన గుగ్గిలము, వీటిని సమభాగములుగ గోమూత్రముచే నూరి పక్వముజేసి సేవించినను, శ్లీపదము నివారణమగు.

శ్లో. గుడూచీకటుకీశుంఠీదేవదారువిడంగకమ్
పిష్ట్వా గోమూత్రసంయుక్తం లేపం శ్లీపదనాశనమ్.

తా. తిప్పతీగ, కటుకరోహిణి, శొంఠి, దేవదారుపట్ట, వాయువిళంగములు, వీటిని సమభాగములుగ గోమూత్రముచే నూరి పాదములకు లేపనముజేసిన శ్లీపదము నివారణమగు.

శ్లో. పాదకండూహరం కుర్యాన్నవనీతేన మాక్షికమ్
పాదదాహాహరం ఖాదేత్తిలాద్విగుణవాకుచీమ్.
చూర్ణితా మధుసర్పిర్భ్యాం కర్షమాత్రిప్రశాంతయే.

తా. ఆవువెన్నతో తేనెను జేర్చి మర్దించి పాదములకు లేపనముజేసికొనిన పాదములయందలి దురద నశించు. మఱియును నువ్వులు ౧ భాగము, భావంచివిత్తులు ౨ భాగములు, ఇటుల వీటిని చూర్ణముజేసి యందు తేనె, నెయ్యి, కలిపి కర్షప్రమాణము సేవించిన, కాళ్లమంటలు నివర్తియగు.

శ్లో. మదనం చ తథా సిక్థం సాముద్రలవణం తథా
మహిషీనవనీతేన సంతప్తే లేపనం హితమ్.
సప్తాహాత్స్ఫుటితౌ పాదౌ జాయతే కమలోపమౌ.

తా. మ్రంగకాయలు, ఉప్పు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి యందు తగుమాత్రముగ తేనెమైనము, బఱ్ఱెవెన్నకలిసి చక్కగ నూరి ఏడుదినంబులు పాదములకు లేపనముజేసికొనిన కాళ్లమంటలు హరించుటయగాక పగిలినపాదములు సగాస్వస్థంబై కమలములవలె ప్రకాశించు.

ఇట్లు శ్లీపదచికిత్స ముగిసెను.

---

*విద్రధిలక్షణము.

శ్లో. త్వగ్రక్తమాంసమేదాంసి ప్రదూష్యాస్థిసమాశ్రితాః
దోషాశ్శోఫం శనైర్ఘోరం జనయన్త్యుచ్ఛ్రితాభృశమ్.

---

* విద్రధియనగా—గర్భములోఁబుట్టి నాభిలో గడ్డరూపముగ బైలువెడలెడు రోగము.

మహాశూలమ్రుజావన్తం వృత్తం వాప్యథవాయతమ్
సవిద్రధిరితి ఖ్యాతో బుధై ర్జ్ఞేయ స్స షడ్విధః.
రక్తవిద్రధి లింగం తు పిత్తవిద్రధివత్స్మృతమ్.

తా. వాతపిత్తశ్లేష్మంబులు ప్రదుష్టంబులై చర్మము, రక్తము, మాంసము, మేదస్సు, వీటికి వైకల్యమును గలుగంజేసి ఎముకలనాశ్రయించుకొని శూల, వ్యథ, వీటితోగూడి గుండ్రముగనైనను, దీర్ఘముగనైనను, నుండెడి ఘోరంబగుశోఫను జనింపంజేయు. ఇదియ విద్రధిరోగ మనంబడు. మఱియు నీవిద్రధి ౬ విధంబులుగనుండు. ఇయ్యారు విధంబులలో పిత్తవిద్రధికిగల లక్షణంబులే రక్తవిద్రధికిని గలిగియుండునని యెఱుంగవలయు.

శ్లో. విద్రధి స్త్వసృజోఽంతస్థస్సోఽభ్యంతర ఇతి స్మృతః.

తా. మఱియు నీవిద్రధి రక్తాంతర్గంబైయుండెనేని నది యంతర్విద్రధి యనంబడు.

శ్లో. తత్కాలేస్రావయేద్రక్తమగ్నికర్మాథ వా గదమ్.

తా. ఇట్లుఅంతర్విద్రధిరోగము జనించియుండునపుడు రక్తమును స్రవింపజేయవలయు. లేక రక్షులనైనను వేయవలయు. మఱియు విద్రధిరోగంబులను హరించెడి యౌషధంబులను సగా సేవింపవలయు.

---

విద్రధి చికిత్స.

శ్లో. కాసీససైంధవశిలాజతుహింగుచూర్ణై
ర్మిశ్రీకృతోవరుణవల్కలజః కషాయః
అభ్యంతరేస్థితమపక్వమతిప్రమాణం
న్వాంణామయం హరతి విద్రధిముగ్రశోఫమ్.

తా. అన్నభేది, సైంధవలవణము, శిలాజిత్తు, ఇంగువ, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి దీనిని ఉలిమిడివేళ్ల కషాయముతో సేవించిన ఉదరంబున నపక్వమై గడ్డకట్టి భయంకరమగు శోఫయుక్తమై యుండెడి అంతర్విద్రధి నివారణమగు.

శ్లో. పక్వేషు విద్రధిషు ప్రాయమతిస్రవత్సు
నాడీషు చ వ్రణగదేషు భగందరేషు
స్యాద్గండమాలిషు ఫలత్రిక గుగ్గులుస్స్యా
త్పథ్యం ఫలత్రికఘృతం లఘుభోజనం చ.

తా. కరక్కాయలు, తానికాయలు, ఉశిరికవరుగు, శుద్ధిజేసిన గుగ్గిలము, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి సేవించినను, లేక త్రిఫలఘృతమును సేవించినను, పక్వమై చీము స్రవింపుచుండెడి విద్రధులు, నాడీవ్రణములు, వ్రణములు, భగందరములు,



గండమాలలు, ఇవియన్నియు నశించు. ఇందుకుపథ్యము:—లఘువుగ భోజనంబు గావింపవలయు.

శ్లో. త్రీణి పలాని ఫలత్రితయస్య ద్వేతు పలేభవతో మగధాయాః
పంచ పలాని భవంతి పురస్య స్యాత్ఫలత్రిక గుగ్గులు యోగః.

తా. కరక్కాయలు, తానికాయలు, ఉశిరికవరుగు, ఇవి దినుసుకు ౧ పలము, పిప్పళ్ళు ౨ పలములు, శుద్ధిజేసిన గుగ్గిలము ౫ ప, ఇటుల వీటిని చూర్ణముజేసి సేవించిన పక్వమై నధికముగ చీము స్రవింపుచుండెడి విద్రధి, నాడీవ్రణములు, వ్రణములు, భగందరములు, గండమాలలు, ఇవియన్నియు నివృత్తియగు. (ఇది త్రిఫలగుగ్గిలము.)

శ్లో. జలౌకా పాతనం శస్తం సర్వస్మి న్నేవ విద్రధౌ
మృదు ర్విరేకో లఘ్వన్నం తుంబశృంగాగ్నికర్మ చ.

తా. సమస్త విద్రధిరోగంబులయందును జలగలు, సొరకాయబుఱ్ఱలు, కొమ్ములు, వీటిచే రక్తమును స్రవింపంజేయవలయు. లేక రక్షులనైనను, వేయవలయు. ఇట్లొనర్చినపిదప సుఖవిరేచనంబునకు పుచ్చుకొని లఘువుగ భుజింపవలయు.

శ్లో. దశమూల చ్ఛిన్న రుహా పథ్యా దారు పునర్నవా
జ్వరవిద్రధిశోఫేషు శిగ్రు విశ్వయుతా హితా.

తా. దశమూలములు, తిప్పతీగ, కరక్కాయలు, దేవదారుపట్ట, తెల్లగలిజేరువేరుపట్ట, మునగవేరు, శొంఠి, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి పుచ్చుకొనిన జ్వరసహిత మగువిద్రధి, వాపులు, ఇవి నశించు. (ఇది దశమూలాదికషాయము.)

శ్లో. శోభాంజనస్య నిర్యాసో హింగుసైంధవసంయుతః
అచిరా ద్విద్రధిం హంతి ప్రాతఃప్రాత ర్నిషేవితః.

తా. మునగబంక, ఇంగువ, సైంధవలవణము, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి ప్రాతఃకాలములయందు సేవింపుచుండిన నతిశీఘ్రంబుగ విద్రధిరోగము నివారణమగు.

శ్లో. శిగ్రుమూలం జలే ధౌతం దారపిష్టం ప్రలేపయేత్
తద్రసం మధునా పీత్వా హంత్యంతర్విద్రధింనరః.

తా. మునగవేరుపట్టరసములో నరతులము వసనాభిచూర్ణము కలిపి ఉదరంబునకు లేపనము జేసినను, లేక మునగవేరుపట్టను నుదకముచే నూరి రసముదీసి యందు తేనె కలిపి పుచ్చుకొనినను, అంతర్విద్రధులు నశించు.

శ్లో. శిగ్రుదీప్య వరుణ ద్వియామినీ కుంజరాశనకృతః కషాయకః
బోలచూర్ణ సహితోంతరస్థితం విద్రధిం ప్రశమయే దసంశయమ్.

తా. మునగవేరుపట్ట, ఓమము, ఉలిమిడిపట్ట, మానిపసుపు, పసుపు, రావిపట్ట, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి యందు రక్తబోళచూర్ణమును కలిపి త్రాగిన నిస్సంశయముగ నంతర్విద్రధులు హరించు.

శ్లో. వర్షాభూ వరుణాంఘ్రిభ్యాం క్వాథో విద్రధినాశనః.

తా. తెల్లగలిజేరువేరు, ఉలిమిడివేరు, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి పానంబొనర్చిన విద్రధులు నివారణమగు.

ఇట్లు విద్రధిచికిత్స ముగిసెను.



## వ్రణలక్షణము.

శ్లో. ఏకదోషోత్థిత స్సాధ్యోవ్రణానాం పూర్వలక్షణమ్
షడ్విధస్స్యా త్పృథ క్సర్వరక్తాగంతునిమిత్తజః.

తా. వాతదోషము, పిత్తదోషము, శ్లేష్మదోషము, సన్నిపాతము, రక్తదోషము, ఆగంతుకము, లన నాఱుదోషంబులచే వ్రణంబులు జనించు. ఇం దొకదోషము, ఆగంతుకము, లన నాఱుదోషంబులచే వ్రణంబులు జనించు. ఇం దొకదోషము నాశ్రయించి జనించినవ్రణములు సాధ్యంబులనియు, యనేకదోషములచే జనించిన వ్రణములసాధ్యంబులనియు నెఱుంగవలయు.

శ్లో. మందోష్మతా ల్పశోఫత్వం కాఠిన్యం త్వక్సవర్ణతా
మందవేదనతా చైవ వ్రణశోఫస్య లక్షణమ్.

తా. కించిదుష్ణము, కించిచ్ఛోఫ, కఠినత్వము, చర్మమునకు సమానమగువర్ణము, స్వల్పవేదన, ఇవి గలిగియుండిన వ్రణశోఫయని యెఱుంగవలయు.

శ్లో. ద్విధా వ్రణస్సవిజ్ఞేయ శ్శారీరా గంతుభేదతః
దోషైరేక స్తయోరన్య శ్శస్త్రాదిక్షతసంభవః.

తా. మఱియు వ్రణంబులు శారీరంబులనియు, ఆగంతుకంబులనియు రెండువిధంబులుగ నుండు. అందు వాతాదిదోషంబులచే జనించినవ్రణంబులు శారీరంబులనియు. ఆయుధతాడనములచే జనించిన వ్రణములు ఆగంతుకములనియు, యెఱుంగవలయు.

శ్లో. స్తబ్ధః కఠినసంస్పర్శో మహాస్రావో మహారుజః
తుద్యతే స్ఫురతి శ్శ్యావో వ్రణో మారుతసంభవః.

తా. వ్రణంబులు స్తబ్ధముగను, కఠినముగను, మిగుల చీము, రక్తము, ఇవి స్రవింపుచుండుట, పోట్లు, చుఱుకు, ఇవి గలిగియుండుట, స్ఫురింపుచుండుట, ధూమ్ర



వర్ణము గలిగియుండుట, ఇట్టి లక్షణంబులు గలిగియుండిన వాతవ్రణంబులని యెఱుంగవలయు.

శ్లో. పూతి పూయా తిదుష్టాసృ క్స్రావ్యుత్సంగీ చిరస్థితః
దుష్టవ్రణో తిగంధాది శ్శుద్ధలింగవిపర్యయః.

తా. దుర్గంధముగల చీము, చెడినరక్తము, ఇవి స్రవింపుచుండుట, వ్రణము బిగబట్టియుండుట, వ్రణము తొఱ్ఱబారి దీర్ఘకాలము నెలకొనియుండుట, ఇట్టిలక్షణంబులు గలిగియుండిన నది దుష్టవ్రణంబని యెఱుంగవలయు.

శ్లో. కపోతవర్ణప్రతిమో యస్యాంతః క్లేదవర్జితః
స్థిరశ్చ పిటికావాంశ్చ రోహతీతి తమాదిశేత్.

తా. పావురాయిపిట్టవర్ణము గలిగియుండుట, వ్రణమధ్యంబున శుష్కించి కఠినంబై చిరకాలము స్థిరముగనుండుట, వ్రణంబుపై చిదుములు జనించియుండుట, ఇట్టి లక్షణంబులుగల వ్రణమును రోహతియను వ్రణమని యెఱుంగవలయు.

శ్లో. ప్రవృత్తపూయరుధిరా వ్రణాయేషాం చ మర్మసు
క్రియాభి స్సమ్యగారబ్ధా నసిధ్యంతిచయేవ్రణాః.
ఏతా న్వివర్జయేద్వైద్య స్సంరక్షేదాత్మనోయశః.

మర్మస్థలములయందు వ్రణముజనించి యందు దౌర్గంధ్యముతో గూడిన చీము, రక్తము, స్రవింపుచుండిన నావ్రణము కుదురుట దుర్లభంబుగాన నట్టిరోగికి యశస్సు నపేక్షించెడి వైద్యుండు చికిత్స జేయంజనదు.



## వ్రణచికిత్స.

శ్లో. శిరీషోన్మత్తవాకూచీ హింస్రా కాలాసుదర్శనః
తండులీయక మూలం చ ప్రలేప శ్శోఫనాశనః.

తా. దిరిశనపువిత్తులు, ఉమ్మెత్తాకు, భావంచివిత్తులు, జటామాంసి, నీలియాకు, నేరేడుపట్ట, చిఱ్ఱివేళ్లు, వీటిని సమభాగములుగ నుదకముచే నూరి వ్రణములకు లేపనముజేసిన నవి నివారణమగు.

శ్లో. తిలకల్క స్సలవణో ద్వేహరిద్రే త్రివృద్ఘృతమ్
మధుకం నింబపత్రాణి లేపస్స్యా ద్వ్రణశోధనః.

తా. గానుగపిండి, సైంధవలవణము, మానిపసుపు, పసుపు, తెల్లతెగడ, అతిమధురము, వేపాకు, వీటిని సమభాగములుగ దంచి యందు తగుమాత్రముగ నెయ్యివైచి నూరి వ్రణములకు లేపనముజేసిన నవి నశించు.

శ్లో. తిలసైంధవ యష్ట్యాహ్వా నింబపత్ర నిశాయుతైః
త్రివృన్మధుయుతైః పిష్టైః ప్రలేపో వ్రణశోధనః.

తా. నువ్వులు, సైంధవలవణము, అతిమధురము, వేపాకు, మానిపసుపు, పసపు, తెల్లతెగడ, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి యందు తేనెవైచి మర్దించి వ్రణములకు లేపనముజేసిన నవి నివర్తియగు.

శ్లో. న్యగ్రోధోదుంబరాశ్వత్థ కదంబ ప్లక్ష వేతసః
కరవీరార్క కటుకా కషాయోరోపణే హితః.

తా. మఱ్ఱిపట్ట, అత్తిపట్ట, రావిపట్ట, కడపపట్ట, జువ్విపట్ట, ప్రబ్బలిపట్ట, తెల్లగన్నేరువేరుపట్ట, జిల్లేడువేరు, కటుకరోహిణి, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి వ్రణములకు లేపనముజేసినను, యొత్తడమువేసినను, నవి శీఘ్రంబుగ నివర్తియగుటయగాక మాంసభరితంబులై స్వస్థంబగు.

శ్లో. శోఫే మహతిసంవృద్ధే శాంతి శ్శోణితమోక్షణాత్
ఏకతశ్చక్రియా స్సర్వా రక్తమోక్షణమేకతః.

తా. వ్రణములయం దధికముగ వాపుగలిగియుండిన రక్తమును స్రవింపంజేయవలయు. మఱియు చికిత్సలు జేయుటకన్నను సర్వవ్రణములయందును రక్తమును స్రవింపంజేయుటయే శ్రేష్ఠంబైనక్రియగ నున్నయది.

శ్లో. హరత్యష్టాంగులం తుంబీ శృంగంచ ద్వాదశాంగులమ్
సిరా సర్వాంగజం రక్తం జలౌకా చతురంగుళమ్.

తా. నాడులు, సర్వాంగము, వీటియందలి దుష్టరక్తమును ఎనిమిదంగుళముల ప్రమాణముగల సొరకాయ బుఱ్ఱలచేతను. పండ్రెండంగుళముల ప్రమాణముగల కొమ్ములచేతచేతను, నాలుగంగుళముల ప్రమాణముగల జలగలచేతను, స్రవింపంజేయవలయు.

శ్లో. యేక్లేదపాకేసతి గంధవంతో వ్రణా మహాంతస్సరుజ స్సశోఫాః
వ్రయాంతితే గుగ్గులుమిశ్రితేన పీతేన శాంతిత్రిఫలాజలేన.

తా. కరక్కాయలు, తానికాయలు, ఉశిరికవరుగు, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి యందు తగుమాత్రముగ శుద్ధిజేసిన గుగ్గిలచూర్ణమును కలిపి త్రాగిన చీముపట్టి పక్వమై దుర్గంధము, పోట్లు, వాపు, వీటితో గూడియుండెడి వ్రణములు నశించు.

శ్లో. నింబపత్ర తిలా దంతీ త్రివృత్సైంధవ మాక్షికమ్
దుష్టవ్రణప్రశమనో లేప శ్శోధనకేసరీ.



తా, వేపాకు, నువ్వులు, నేలదంతివేరు, తెల్లతెగడ, సైంధవలవణము, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి యందు తగుమాత్రముగ తేనెగలిపి నూరి దుష్టవ్రణములు, వాపుగలవ్రణములు, వీటికి లేపనముజేసిన నవి హరించు. (సింహమువంటి యీనింబపత్రాదిలేపనము యేనుగంబోలిన వ్రణములను హతంబుగావించు.)

శ్లో. అభయా త్రివృతా దంతీ లాంగలీ మధు సైంధవైః
సుషవీపత్రదుత్తూరకర్ణమోటకుఠారికా.
పృథగేతే ప్రలేపేన గంభీరవ్రణశోషణాః.

తా. కరక్కాయలు, తెల్లతెగడ, నేలదంతివేరు, చన్నచర్లగడ్డ, సైంధవలవణము, నల్లజీలకఱ్ఱ, లేక పిప్పళ్ళు, తాళిశపత్రి, ఉమ్మెత్తసమూలము, నల్లతుమ్మపట్ట, గగ్గరవేరు, వీటిలో దేనినైనను తేనెచే ఖల్వమున చక్కగ మర్దించి వ్రణములకు లేపనముజేసిన నవి నివారణమగు.

శ్లో. అగ్నిదగ్ధే వ్రణే సమ్యక్ప్రియుఞ్జీతచికిత్సకః.

తా. మఱియు నగ్నిచే దగ్ధంబులై వ్రణంబులకు పైజౌషధంబులను లేపనముజేసిన నవి నివర్తియగు.

శ్లో. సద్యఃక్షతం వ్రణంవైద్య స్సశూలంపరివర్జయేత్.

తా. వ్రణములు పక్వంబులై భిన్నంబులైనపిదప యందు శూల గలిగియుండిన నావ్రణంబులు కుదురుట దుర్లభంబుగాన వాటికి చికిత్స జేయంజనదు.

శ్లో. యష్టీమధుకయుక్తేన కించిదుష్ణేనసర్పిషా
మత్వాగంతువ్రణంవైద్యో ఘృతక్షౌద్రసమన్వితమ్.
శక్తిక్రియాప్రయోక్తవ్యా పిత్తరక్తోష్మణా నిశి.

తా. అతిమధురమును చూర్ణంబొనర్చి యందు కొంచముగ నెయ్యికలిపి కించిదుష్ణముజేసి వ్రణములకు లేపనముజేయుటయ గాక పిత్తోద్రేకము, రక్తశోధకము, వీటిని గావించెడిపదార్థములు, ఉష్ణకరము లగుపదార్థములు, వీటిలో నెయ్యి, తేనె కలిపి రాత్రులయందు సేవించిన ఆగంతుక వ్రణములు నశించు.

శ్లో. ఆదాభగ్నంవిదిత్వాతు సేచయే చ్ఛీతవారిణా
పంకేనాలేపనం కార్యం బంధనంచకుశాన్వితమ్.
ఆలేపనార్థంమంజిష్ఠా మధుకంచామ్లపేషితమ్
శతధౌతఘృతోన్మిశ్రం శాలిపిష్టంచలేపనమ్.
నాడీనాంగతిమన్వీక్ష్య శస్త్రేణోత్పాట్యకర్మవిత్.

తా. అభిఘాతముచే నెముకలు భిన్నంబులయ్యెనేని వాటిని ప్రథమంబున శీతోదకంబుచే సేచనముజేసి పిదప నాడులకు వేధగలుగకుండునటుల శస్త్రముచే

భిన్నంబులైన నెముకలను బైలువెడలునటులం జేయుటయగాక యాయెముకలను క్రమంబుగ సంధారణం బొనర్చి యందుపై మృదువుగనుండెడి యెఱ్ఱమన్ను లేపనము జేసి మంజిష్ఠ, అతిమధురము, వీటిని నిమ్మపండ్లరసముచే నూరి దర్భాకులయందు వైచి వ్రణములకు కట్టుగట్టుటయేగాక నేతిలో ౧౦౦ మార్లు నుదకముబోసి చక్కగ మర్దించియందు మృదువుగనుండెడి వరిపిండిని మిశ్రమముజేసి లేపనంబొనర్చిన అభిఘాతాదులచే జనించిన వ్రణములు నివర్తియగు.

శ్లో. ఘృతంసదుగ్ధం వ్రణతర్పణేనహన్యాద్గతింకోష్ఠగతాపియాస్యాత్.

తా. పాలు, నెయ్యి, వీటిని కలిపిపుచ్చుకొని ఉదరంబున జనించియుండెడి సర్వవ్రణములు నివారణమగు.

శ్లో. జాత్యర్క శమ్యాక కరంజ దంతీ
సింధూత్థ సౌవర్చల యావశూకైః
వర్తిఃకృతా హంత్యచిరేణనాడీం
స్నుక్ క్షీరపిష్టా సహసైంధవేన.

తా. జాజియాకు, జిల్లేడుపట్ట, రేలపట్ట, కానుగపట్ట, నేలదంతివేరుపట్ట, సైంధవలవణము, సౌవర్చలవణము, యవక్షారము, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి యందు బొంతజెముదుపాలుబోసి నూరి వస్త్రమునకు పట్టించి నాడీవ్రణములకు వేయుటయగాక వర్తిజేసి యావ్రణంబులలో చెక్కించినను, లేక సైంధవలవణమును బొంతజెముదుపాలచే నూరి వస్త్రమునకు పట్టించి వర్తిజేసి వ్రణంబులలో నెక్కించినను, * నాడీవ్రణములు నశించు.

శ్లో. కృశదుర్బలభీరూణాం నాడీ మర్మాశ్రితా యుతా
క్షారమాత్రేణ సంఛిద్యా న్నశస్త్రేణకదాచన.

తా. కృశించియుండెడివారు, దుర్బలులు, భయపడువారు, వీరలకు మర్మస్థానములయందు నాడీవ్రణములు జనించెనేని వాటిని క్షారముచేతను, గోవు మొదలగు వాటిమూత్రములచేతను, నివర్తిజేయవలయునే గాని శస్త్రమునుమాత్రము ప్రయోగింపంజనదు.

శ్లో. సమూలపత్రాంనిర్గుండీం పీడయిత్వా రసేనతు
తేనసిద్ధంసమంతైలం నాడీదుష్టవ్రణాపహమ్.

తా. వావిలిసమూలమును దంచి రసముదీసి సమముగ నువ్వులనూనె కలిపి మయినపక్వముగ కాచి యాతైలమును నాడీసంబంధమగు దుష్టవ్రణములకు లేపనము జేయుచుండిన నవి నివారణమగు.

* నాడీవ్రణమనగా—నారపుండ్లు.



శ్లో. నరాస్థితైలలేపేన స్ఫుటితశ్శుష్యతి వ్రణః.

తా. నరునియస్థులను కుండయం దునిచి పాతాళయంత్రముచే తైలముదీసి యా తైలమును భిన్నంబైన వ్రణములకు లేపనము జేయుచుండిన నవి యతిశీఘ్రంబుగ నివర్తియగు.

శ్లో. విడంగత్రిఫలావ్యోష చూర్ణంగుగ్గులునా సమమ్
సర్పిషావటికాంకుర్యా ఖ్ఖాదేద్వా హితభోజనైః.
దుష్టవ్రణాపచీమేహ కుష్ఠనాడీవిశోధనః.

తా. వాయువిళంగములు, కరక్కాయలు, తానికాయలు, ఉశిరికవరుగు, శొంఠి, పిప్పలి, మిరియాలు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి దీనికి సమముగ శుద్ధిజేసిన గుగ్గిలపుచూర్ణమును కలిపి యందు నెయ్యిబోసి ఖల్వమున చక్కగ మర్దించి రేగుగింజంతమాత్రలు జేసి యం దొకమాత్రను దేహతత్త్వము నెఱింగి భక్షించిన దుష్టవ్రణములు, అపచియను గండమాలలు, మేహము, కుష్ఠువులు, నాడీవ్రణములు, ఇవియన్నియుం నశించు. ఇందుకు పథ్యము:—హితకరము లగువస్తువులను భుజింపందగు.

శ్లో. మనశ్శిలాసమంజిష్ఠా కారాచరజనీద్వయమ్
ప్రలేపస్సఘృతక్షౌద్ర స్త్వగ్విశుద్ధికర స్స్మృతః.

తా. మణిశిల, మంజిష్ఠ, యవక్షారము, మానిపసపు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి యందు నెయ్యి, తేనె, కలిపి ఖల్వమున చక్కగ మర్దించి చర్మగతవ్రణములకు లేపనముజేయుచుండిన నవి నశించు.

శ్లో. కరంజారిష్టనిర్గుండీరసో హన్యా ద్వ్రణక్రిమీన్.

తా. కానుగాకు, వేపాకు, వావిలియాకు, వీటిని దంచి రసముదీసి కించిదుష్ణముజేసి పుచ్చుకొనుటయగాక యారసమును లేపనము సగా జేయుచుండిన వ్రణసంబంధములగు క్రిములు నశించుటయ గాక వ్రణంబులును నివర్తియగు.

శ్లో. నింబశమ్యాకజాత్యర్క స్తప్తపర్ణాశ్వమారకాః
క్రిమిఘ్నా మూత్రసంయుక్తా సేకలేపనధావనైః.

తా. వేపపట్ట, రేలపట్ట, జాజిఆకు, జిల్లేడు, ఏడాకులఅరటి, తెల్లగన్నేరువేరు, వీటిని సమభాగములుగ దంచి యందు గోమూత్రముబోసి కషాయముబెట్టి సుఖోష్ణముగ వ్రణములకు లేపనము, కాపడము, కడగడము, వీటిని గావించిన యందలి క్రిములు నశించు.

శ్లో. జాతీనింబపటోలపత్రకటుకా దార్వీనిశాసారిబా
మంజిష్ఠాభయసింధుతుత్థమధుకై ర్నక్తాహ్వబీజైస్సమైః

సర్పిస్సిద్ధమనేనసూక్ష్మవదనా మాంసాశ్రితా స్స్రావిణో
గంభీరాస్సరుజో వ్రణాస్సుగతికా శ్శుద్ధ్యంతి రోహంతి చ.

తా. జాజి ఆకు, వేపాకు, చేదుపొట్లాకు, కటుకరోహిణి, మానిపసపు, పసపు, తెల్లసుగంధిపాలవేరు, మంజిష్టి, కరక్కాయలు, లేక నల్లవట్టివేరు, సైంధవలవణము, మైలతుత్తము, అతిమధురము, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి దీనికి సమముగ కానుగవిత్తుల చూర్ణమునుకలిపి యందు దావునెయ్యి బోసి ఘృతపక్వముగ కాచి యానెయ్యిని సాంగశీతలమున గ్రహించి సన్నముగ రంధ్రములుబడి మాంసమును నాశ్రయించుకొని చీము, రక్తము, వీటిని స్రవింపంజేయుచు అంతర్గతమై వేదనతో గూడియుండెడి వ్రణములకు లేపనముజేయుటయ గాక వత్తినిజేసి యందు దెక్కించిన నావ్రణములు నశించు.

శ్లో. పటోలీనింబపత్రాణాం క్వాథ స్సంశోధనే హితః
కల్కస్సంరోపణేశస్త స్తిలానాంమధుకాన్వితః.

తా. చేదుపొట్లాకు, వేపాకు, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి దీనిచే వ్రణములను కడుగవలయు. ఇట్లొనర్చిన సర్వవ్రణములు నివర్తియగు. మఱియు నువ్వులు అతిమధురము, వీటిని సమభాగములుగ చూర్ణంబొనర్చి కల్కముజేసి వ్రణములకు లేపనముజేయుచుండిన నవి మాంసభరితంబులై స్వస్థంబులగు.

ఇట్లు వ్రణచికిత్స ముగిసెను.

---

## * భగందరలక్షణము.

శ్లో. గుదస్యద్వ్యగుంళేదేశే పార్శ్వతఃపిటికా భవేత్
భిన్నోభగందరోజ్ఞేయ స్సచ పంచవిధస్స్మృతః.

తా. గుదస్థానంబునకు రెండంగుళములకు పైన పార్శ్వమునందు నొక గ్రంధి జనించి యది కాలక్రమంబుగ భిన్నంబగు. ఇదియ భగందరోగము. మఱియు నీభగందరము లైదువిధంబులుగ నుండు.

శ్లో. క్షతోద్గతిః పాయుగతావివర్ధతే
హ్యుపేక్షణాత్సాక్రిమిభిర్విదార్యతే
ప్రకుర్వతేమార్గమనేకథాముఖై
ర్వ్రణై స్తదున్మార్గిభగందరంభవేత్.

* భగందర మనగా—ఆసనపవిత్రము.



తా. ఇట్లుత్పన్నంబయిన భగందరమున కంటకాకారంబులగు చిదుము లుత్పన్నంబులై నవి మలద్వారమువరకు వ్యాపించి వృద్ధిజెందు. కావున దీనికి చికిత్సలం జేయవలయు. ఇట్లు చికిత్సలంజేయక నుపేక్షించిన నది భిన్నంబై యందు క్రిములు జనించు. ఇటుల జనించిన క్రిములు, రక్తము, మాంసము, వీటిని భుజింపందొడంగుటచే వ్రణము విస్తీర్ణమయి యం దనేకతూట్లు గలుగు. ఇటుల జనించినతూట్లన్నియు నేకంబై ఒక ద్వారంబగు. ఇదియ ఉన్మార్గి భగందరము.

---

## భగందరచికిత్స.

శ్లో. కుష్ఠం త్రివృత్తిలా దంతీ మాగధీ సైంధవం మధు
రజనీత్రిఫలాతుత్థం హితం స్యాద్వ్రణలేపనమ్.

తా. కోష్ఠు, తెల్లతెగడ, నువ్వులు, నేలదంతివేరు, పిప్పళ్ళు, సైంధవలవణము, పసపు, కరక్కాయలు, తానికాయలు, ఉశిరికవరుగు, మయిలతుత్తము, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి యందు తేనెకలిపి చక్కగ మర్దించి భగందరములకు లేపనముజేసిన నవి నశించు.

శ్లో. రసాంజనం హరిద్రే ద్వే మంజిష్ఠానింబపల్లవాః
త్రివృత్తేజోవతీ దంతీ కల్కో నాడీవ్రణాపహః.

తా. రసాంజనము, మానిపసపు, పసపు, మంజిష్ఠ, వేపచిగుళ్ళు, తెల్లతెగడ, మాల్కంగణివిత్తులు, నేలదంతివేరు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి యందు దుదకముబోసి నూరి భగందరములకు లేపనముజేసిన నవి నివారణమగు.

శ్లో. నిశార్కక్షీరసింధ్వగ్ని పుంఖిలాంగలివత్సకైః
ఏభిః ప్రసాధితం తైలం భగందరవినాశనమ్.

తా. పసుపు, సైంధవలవణము, చిత్రమూలము, తెల్లవెంపలివేరు, మంజిష్ఠ, కొడిశవిత్తులు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి యందు జిల్లేడుపాలు, నువ్వులనూనె బోసి తైలపక్వముగ కాచి భగందరములకు లేపనముచేసినను, లేక పైతైలమునందు వత్తిని దడిపి యందు దెక్కించినను, నవి నివారణమగు.

శ్లో. త్రిఫలారససంయుక్తం బిడాలాస్థిప్రలేపనమ్
దుష్టవ్రణం నిహంత్యాశు భగందరహరం పరమ్.

తా. కరక్కాయలు, తానికాయలు, సెల్లివరుగు, వీటికషాయముచే పిల్లిఎముకను గంధముదీసి భగందరములు, దుష్టవ్రణములు వీటికి లేపనముజేసిన నవి నివారణమగు.

శ్లో. చిత్రకార్కత్రివృత్పాఠామలయూహమమారకౌ
సుధావచాలాంగలికీః హరితాళం సువర్చికామ్.
జ్యోతిష్మతీం చ సంహృత్య తైలం ధీరో విపాచయేత్
ఏతద్ధి స్యందనం నామ తైలం దద్యాద్భగందరే.
శోధనం రోపణం చైవ సవర్ణకరణం తథా.

తా. చిత్రమూలము, తెల్ల తెగడ, అగరుశొంఠి, భావంచివిత్తులు, గన్నేరువేరు, వస, చన్నచర్లగడ్డ, హరితాళకము, సౌవర్చలవణము, మాల్కంగణివిత్తులు, వీటిని సమ భాగములుగ చూర్ణముజేసి యందు జిల్లేడుపాలు, బొంతజెముడుపాలు కలిపి దీనికి రెండింతలు నువ్వులనూనె బోసి తైలపక్వముగ కాచి భగందరములకు లేపనముజేసిన నని నశించు. మరియు నీతైలము, భగందరములను శోధించుటకును, వాటిని నివారణముజేయుటకును, యందలిచీమును వెడలింపంజేయుటకును, వాపు, నొప్పి, వీటిని నివృత్తిజేయుటకును, వ్రణంబులను హరింపంజేసి యవి మాంసపూరితం బగునటుల జేయుటకును, నుపయోగింపందగు. (ఇది స్యందనతైలము.)

వాక్యమ్. పూర్వోక్తత్రిఫలాగుగ్గులుం భక్షయేత్.

తా. మఱియు ముం దుదహరింపబడిన త్రిఫలగుగ్గిలమును సేవించిన భగందరములు నివారణమగు.

శ్లో. ఖదిరత్రిఫలాక్వాథో మహిషీఘృతసంయుతః
విడంగచూర్ణసంయుక్తో భగందరవినాశనః.

తా. చంద్రచావ, కరక్కాయలు, తానికాయలు, ఉశిరికపరుగు, వీటిని సమ భాగములుగ దంచి కషాయముబెట్టి అందు బఱ్ఱెనెయ్యి, వాయువిళంగముల చూర్ణము కలిపి సేవింపుచుండిన భగందరము నివారణమగు.

శ్లో. శునోస్థిభూలతాతక్రపేషితా ఖరరక్తయుక్
లేపో భగందరం హన్యాన్నరాస్థ్నాం తైలమేవ చ.

తా. కుక్కయెముకలు, భూలతలు, వీటిని సమభాగములుగ మజ్జిగచే నూరి యందు గాడిదెరక్తంబును కలిపి భగందరములకు లేపనముచేసినను, నరునియెముకలలో తైలమును దీసి లేపనముజేసినను నవి నివృత్తియగు.

ఇట్లు భగందరరోగచికిత్స ముగిసెను.

---



## * ఉపదంశలక్షణము.

శ్లో. హస్తాభిఘాతాన్నఖదంతఘాతాదధావనాదత్యుపసేవనాద్వా
యోనిప్రదోషాచ్చభవంతిశిశ్నే పంచోపదంశా వివిధప్రకారాః.

తా. చేతులు, గోళ్ళు, దంతములు, వీటి యభిఘాతముచేతను, సురతానంతరము శిశ్నమును గడుగక నుపేక్షించుటచేతను అతిమైథునం బొనర్చుటచేతను, యోని దోషముచేతను, మేఢ్రంబున నయిదువిధంబులగు ఉపదంశరోగములు జనించు. ఇటుల జనించిన ఉపదంశరోగము లనేకవిధంబులుగ నుండు.

శ్లో. సతోదభేదస్ఫురణైస్సకృష్ణైస్స్ఫోటైర్వ్యవస్యేత్పవనోపదంశమ్.

తా. వేదన, పగుళ్ళు, స్ఫురణము, కృష్ణవర్ణము, వీటితోగూడి బొబ్బలును గలిగియుండెనేని వాతోపదంశరోగంబని యెఱుంగవలయు.

శ్లో. కాలేన శోఫక్రిమిదాహపాకైర్విశీర్ణశిశ్నో మ్రియతేస తేన.

తా. మరియు శిశ్నంబున కాలక్రమముగ శోథయును గలిగి పురుగులుజనించి తాపసహితమయి శిశ్నము బగిలి బొంగుపారి సళ్ళినట్లుండెనేని నట్టి యుపదంశరోగి యమునిసదనంబునకుం జను.

## ఉపదంశచికిత్స.

శ్లో. పటోలనింబత్రిఫలాకిరాతైః క్వాథం పిబేద్వాఖదిరాసనాభ్యామ్
సగుగ్గులుంవా త్రిఫలాయుతంవాసర్వోపదంశాపహరః ప్రయోగః.

తా. చేదుపొట్ల, వేపపట్ట, కరక్కాయలు, తానికాయలు, ఉశిరికపరుగు, సీమనేలవేము, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి త్రాగినను,. లేక చంద్రచావ, వేగిసపట్ట, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి యందు కరకతాండ్ర ఉశిరికల చూర్ణమునయినను, శుద్ధిజేసిన గుగ్గిలచూర్ణమునయినను కలిపిత్రాగినను, ఉపదంశములన్నియు నశించు.

శ్లో. వటప్రరోహార్జునజంబుపథ్యాలోధ్రం హరిద్రాసహితః ప్రలేపః
సర్వోపదంశేష్వవరోపణార్థం చూర్ణం చ తజ్జం విమలాజలేన.

తా. మఱ్ఱిచిగుళ్ళు, మద్దిపట్ట, నేరేడుపట్ట, కరక్కాయలు, లొద్దుగపట్ట, పసపు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి యందు బొంతజెముడుపాలు కలిపి చక్కగ నూరి శిశ్నమునకు లేపనముజేసిన సమస్తోపదంశములు నివృత్తియగుటయగాక మాంసభరితంబులయి స్వస్థంబులగు.

---

* ఉపదంశంబనగా:—సుఖసంకటరోగము.

శ్లో. దహేత్కటాహే త్రిఫలాంతామ్మషీం మధుసంయుతామ్
కృత్వోపదంశే లేపో౽యం సద్యో రోపయతి వ్రణమ్.

తా. కరకతాండ్రఉశిరికలను సమభాగములుగ ఇనుపబాణలిలో వైచి మశిజేసి యామశిని తేనెచే నూరి శిశ్నమునకు లేపనముచేసిన ఉపదంశరోగము మాంసభరితం బయి శీఘ్రంబుగ స్వస్థంబగు.

శ్లో. సర్జికాతుత్థకాసీసం శైలేయకరసాంజనమ్
మనశ్శిలాసమైశ్చూర్ణం విసర్పివ్రణనాశనమ్.

తా. సర్జక్షారము, మయిలతుత్తము, అన్నభేది, శిలాజిత్తు, రసాంజనము, మణిశిల వీటిని సమభాగములుగ చూర్ణముజేసి తేనెచే మర్దించి శిశ్నమునకు లేపనముజేసిన ఉపదంశములు, విసర్పి యనువ్రణము, ఇవి నివారణమగు.

శ్లో. అశ్వత్థోదుంబరప్లక్షువటవేతసజశ్శ్రితః
వ్రణశోథోపదంశానాం నాశకః క్షాళనైస్సమ్మృతః.

తా. రావి, అత్తి, జువ్వి, మఱ్ఱి, ప్రబ్బలి, వీటిపట్టలను సమభాగములుగ దంచి కషాయముబెట్టి శిశ్నమును హితోష్ణముగగడిగిన వ్రణములు, వాపుసహితమగు ఉపదంశములు ఇవి నివృత్తియగు.

శ్లో. శుద్ధసూతం చ భల్లాతం పిప్పలీమూలపిప్పలీ.
ఆకల్లుకం జాతిపత్రీ ఖురకం దేవపుష్పకమ్.
మర్దయేత్సమభాగేన పురాణగుడమిశ్రితమ్
ఉపదంశేషు సర్వేషు ప్రమాణం రక్తికా వటీ.

తా. శుద్ధిజేసిన పాదరసము, శుద్ధిజేసిన జీడిగింజలు, పిప్పళ్లు, మోడి, అక్కలకఱ్ఱ, జాజిపత్రి, వంగభస్మము, లవంగములు, వీటిని సమభాగములుగ మర్దించి యందు పాతబెల్లమువైచి ఖల్వమున చక్కగ మర్దించి గురిగింజలంత మాత్రలుజేసి పూటకొక మాత్రచొప్పున ప్రాతస్సాయంకాలములయందు భక్షించిన ఉపదంశంబులన్నియు శీఘ్రంబుగ నివారణమగు.

ఇట్లు ఉపదంశచికిత్స ముగిసెను.

## శుక్రదోషలక్షణము.

శ్లో. తైస్తైర్భావైరహృద్యైస్తు రిరంసోర్మనసి క్షతే
ద్వేష్యస్త్రీసంప్రయోగాచ్చ క్లైబ్యం తన్మానసం స్మృతమ్.
కటుకామ్లోష్ణలవణైరతిమాత్రోపసేవితైః
సౌమ్యధాతుక్షయో దృష్టః క్లైబ్యం తదపరం స్మృతమ్.



అతివ్యవాయశీలో యో న చ వాజిక్రియారతః
ధ్వజభంగమవాప్నోతి సశుక్రక్షయహేతుజమ్.
మహతా మేఢ్రరోగేణ మర్మచ్ఛేదేన వా పునః
క్లైబ్యమేతచ్చతుర్థం స్యాన్నరాణాం పుంస్త్వఘాతజమ్.
జన్మప్రభృతి యః క్లీబః క్లైబ్యం తత్సహజం స్మృతమ్
బలినః క్షుబ్ధమనసో నిరోధాద్బ్రహ్మచర్యతః.
షష్ఠం క్లైబ్యం మతం తత్తు స్థిరశుక్రనిమిత్తజమ్
అసాధ్యం సహజం క్లైబ్యం మర్మచ్ఛేదాచ్చ యద్భవేత్.
సాధ్యానామితరేషాం తు కార్యో హేతువిపర్యయః.

తా. స్త్రీసంభోగేచ్ఛగలపురుషునికి మనోహరంబులుగాని ఆయాభావములచే మనస్సునకు వ్యథగలుగుటచేతను, ద్వేషయుక్తురాలగు వనితాసంభోగముచేతను, కారము, పులుసు, ఉప్పు, ఉష్ణముగలపదార్థములు, వీటిని మిగుల భుజించుటవలన సౌమ్యంబనుధాతువు క్షయించుటచేతను, సదా మైథునం బొనర్చుటవలన శిశ్నమునకు భంగము గలుగుటచేతను, క్షుఖసంకటము మొదలగు మేఢ్రరోగములచేతను, మర్మచ్ఛేదనముచేతను, బలవంతునికి మనస్సంతాపము గలుగుటచేతను, బ్రహ్మచర్యవ్రతము బూని వీర్యమును నిరోధించుటచేతను శుక్రదోషముగలుగు. మరియు జన్మప్రభృతి నపుంసకుడుగనుండిన నది సహజంబయిన వీర్యనష్టంబేను. అయినను మర్మచ్ఛేదముచే గలిగెడి వీర్యనష్టంబును, జన్మప్రభృతి నపుంసకత్వంబునకు హేతువుగనుండెడి వీర్యనష్టంబును, చికిత్సంజేయుట కసాధ్యంబులనియు, తక్కినవన్నియు సాధ్యంబులనియు, ఎఱుంగవలయు.

## శుక్రదోషచికిత్స.

శ్లో. ఘృతభృష్టో దుగ్ధమాషపాయసో వృష్య ఉత్తమః
దధ్నస్సమం శరచ్చంద్రసన్నిభం దోషవర్జితమ్.

తా. నేతిలోవేయించిన మినుపపప్పును ఆవుపాలలోవైచి శర్కరకలిపి పాయసముజేసి పానంబొనర్చిన "శరత్కాలచంద్రునింబోలి" దోషవర్జితుం డగుటయగాక మిగుల వీర్యవృద్ధియు కలుగు.

శ్లో. శతావర్యుచ్చటాచూర్ణం పేయమేవం సుఖార్థినా.

తా. చల్లపిల్లిగడ్డలు, తెల్లగురిగింజలు, వీటిని చూర్ణముజేసి ఆవుపాలలో వైచి త్రాగిన నత్యంతముగ వీర్యవృద్ధి గలుగు.

శ్లో. విదారీకందకల్కం తు ఘృతేన పయసా నరః
ఉదుంబరసమం ఖాదన్వృద్ధోఽపి తరుణాయతే.

తా. నేలగుమ్ముడుగడ్డను దంచి కల్కముజేసి యందు నెయ్యి, పాలు, కలిపి లేహపక్వముగ వండి అత్తిపండంత భక్షింపుచుండిన వృద్ధునికయినను వీర్యవృద్ధి గలుగు.

శ్లో. బస్తాండసిద్ధే పయసి సాధితా నసకృత్తిలాన్
యః ఖాదేత్స నరో గచ్ఛేత్స్త్రీణాం శతమపూర్వవత్.

తా. మేకపోతువృషణములను చక్కగ మర్దించి ఆవుపాలలోవైచి యుడికించి యందు నువ్వులపిండి కలిపి పక్వముగవండి పలుమారు భక్షింపుచుండిన సంఖ్యాతీతం బగుస్త్రీలతో రతికేళిం దేలదగిన వీర్యవృద్ధి గలుగు.

శ్లో. శతావరీరజః ప్రస్థం ప్రస్థం గోక్షురకస్య చ
వారాహ్యాంవింశతిపలం గుడూచ్యాః పంచవింశతిః.
భల్లాతకానాం ద్వాత్రింశచ్చిత్రకస్య దశైవతు
తిలానాం శోధితానాం చ ప్రస్థం దద్యాత్సుచూర్ణితమ్
త్ర్యూషణస్యపలాన్యష్టౌశర్కరాయాశ్చ సప్తతిః
మాక్షికం శర్కరార్ధేన మాక్షికార్ధేన వై ఘృతమ్.
శతావరీసమం దేయం విదారీకందజం రజః
ఏతదేకీకృతం చూర్ణం స్నిగ్ధే భాండే నిధాపయేత్.
పలార్ధముపయుంజీత యథేష్టం చాపి భోజనమ్
మాసైకనుపయోగేన జరాం హంతి రుజామపి.
వలీపలితఖాలిత్య మేహపాండ్వాద్యపీనసాన్
హంత్యష్టాదశకుష్ఠాని తథాష్టావుదరాణి చ.
భగందరం మూత్రకృచ్ఛ్రం గృధ్రసీం సహలీమకామ్
క్షయం చైవ మహాశ్వాసాన్పంచకాసాన్ సుదారుణాన్.
అశీతిం వాతజాన్ రోగాం శ్చత్వారింశచ్చ పైత్తికాన్
వింశతింశ్లైష్మికాం శ్చైవ సంసృష్టాన్ సాన్నిపాతికాన్.
సర్వానరోగ్గదాన్ హంతి వృక్షమింద్రాశనిర్యథా.
సకాంచనాభోమృగరాజవిక్రమస్తురంగమంచాప్యనుయాతివేగతః
స్త్రీణాంశతంగచ్ఛతిసోఽతిరేకం ప్రకృష్టదృష్టిశ్చయథావిహంగః.



పుత్రాన్ సంజనయేద్వీరాన్ నరసింహనిభాం స్తథా
నారసింహమిదం చూర్ణం సర్వరోగహరం నృణామ్.

తా. చల్లపిల్లిగడ్డలచూర్ణము ౧ ప్రస్థము, పెద్దపల్లేరుకాయలచూర్ణము ౧ ప్రస్థము, నేలతాటిగడ్డలచూర్ణము ౨౦ పలములు, తిప్పసత్తు ౨౫ ప, శుద్ధిజేసిన జీడిగింజలు ౩౨ ప, చిత్రమూలచూర్ణము ౧౦ ప, తెల్లనువ్వులపిండి ౧ ప్రస్థము, శొంఠి, పిప్పళి, మిరియాలు ౮ ప, శర్కర ౭౦ ప, తేనె ౩౫ ప, ఆవునెయ్యి ౧౭½ ప, నేలగుమ్ముడుగడ్డచూర్ణము ౧ ప్రస్థము, ఇట్టుల వీటినెల్ల యేకంబొనర్చి ప్రాతస్సాయంకాలములయందు దరపలముచొప్పున నిచ్ఛాపథ్యంబుగనుండి నొకమాసము సేవింపుచుండిన ముదిమి, మేహములు, పాండువు, పీనస, పదునెనిమిది కుష్ఠువులు, ఎనిమిది ఉదరరోగములు, భగందరము, మూత్రకృచ్ఛ్రము, గృధ్రసివాయువు, హలీమక మనుకామిల, క్షయము, మహాశ్వాసలు, దారుణములైన నైదువిధంబులగు కాసలు, ఎనుబది వాతరోగములు, నలువది పైత్యరోగములు, ఇరువది శ్లేష్మరోగంబులు, ద్వంద్వరోగములు, సన్నిపాతము, మూలరోగములు నివిమొదలగు సర్వరోగంబులు, ''పిడుగుచే వృక్షము నశించుభంగి'' నశించు. మరియు నీచూర్ణంబును సేవించిన స్వర్ణముంబోలిన కాంతియును, సింహమువంటి పరాక్రమంబును, అశ్వమువంటి వేగంబును, విహంగంబులవంటి దృష్టియును, గలిగి నూఱుగురుస్త్రీలతో సురతం బొనర్పందగిన వీర్యవృద్ధియు గలుగుటయగాక నృసింహుని సమానంబగు పుత్రులను జనింపంజేసెదరు. (ఇదియ నారసింహచూర్ణము.)

శ్లో. శర్కరాక్షౌద్రమరిచైస్తుగాక్షీర్యాచ బుద్ధిమాన్
యుక్త్వాయుక్తం ససూక్ష్మైలం నవే కుంభే శుచౌ పుటే.
భార్జితే ప్రక్షిపేచ్ఛీతే ఘృతాఢ్యం షష్టికౌదనమ్.
తం దద్యాద్వ్యుపరిష్టాచ్చ రసానం మాత్రయా పిబేత్.
వర్ణస్వరబలోపేతః పుమాం స్తేన వృషాయతే.

తా. మిరియాలు, వెదురుప్పు, సన్నయేలక్కాయలు, వీటిని సమభాగములుగ చూర్ణము జేసియుంచుకొని యొకమృణ్మయభాండంబును నెఱ్ఱగనగునటుల కాల్చి కించి దుష్ణముగ నుండునపు డందు తగుమాత్రముగ శర్కర, తేనె, ఆవునెయ్యి, అరువదిదినంబులకు ఫలించెడి ధాన్యపుఅన్నమును, వైచి పైచూర్ణంబును కలిపి యన్నిటిని యేకం బొనర్చి ప్రత్యహము భక్షింపుచుండిన వీర్యవృద్ధి గలుగు.

శ్లో. గోక్షురకః క్షురకశ్శతమూలీవానరినాగబలాతిబలా చ [మస్తి.
చూర్ణమిదం పయసా నిశి పేయం యస్య గృహే ప్రమదాశత

తా. పెద్దపల్లేరుకాయలు, నీరుగొబ్బివిత్తులు, చల్లపిల్లిగడ్డలు, పీటకోవెలవిత్తులు, చిట్టాముట్టివేళ్ళు, పేరాముట్టివేళ్ళు, వీటిని సమభాగములుగ చూర్ణము జేసి ఆవుపాలలో

కలిపి రాత్రులయందు సేవింపుచుండిన నూఱ్గురు సుందరాంగనలతో మన్మథకేళిని సలుపందగిన వీర్యవృద్ధి గలుగు.

శ్లో. ఏవమామలకం చూర్ణం స్వరసేనైవ భావితమ్
శర్కరామధుసర్పిర్భిర్యుక్తం లీఢ్వా పయః పిబేత్.
ఏతేనాశీతివర్షోపి యువేవ పరిహృష్యతి.

తా. ఉశిరికవరుగును చూర్ణంబొనర్చి దాని రసముచేతనే భావనయును చేసి యందు శర్కర, తేనె, నెయ్యి కలిపి పుచ్చుకొని పాలుత్రాగుటయగాక మధురాహారంబులను నొనర్చుచుండిన నెనుబదివత్సరంబుల వృద్ధునికయినను వీర్యవృద్ధి గలుగు.

శ్లో. పిప్పలీలవణోపేతౌ బస్తాండౌ క్షీరసర్పిషా
సాధితౌ భక్షయేద్యస్తు సగచ్ఛేత్ప్రమదాశతమ్.

తా. పిప్పళ్ళు, సైంధవలవణము. మేకపోతువృషణములు వీటిని చక్కగ మర్దించి యం దావుపాలు, నెయ్యి, కలిపి లేహపక్వముగ వండి యందొకపలమును భక్షింపుచుండిన నూఱ్గురుస్త్రీలతో రమించదగిన వీర్యవృద్ధి గలుగు.

శ్లో. కర్షం మధుకచూర్ణస్య ఘృతక్షౌద్రసమన్వితమ్
పయోఽనుపానం యో లిహ్యాన్నిత్యవేగస్స వా భవేత్.

తా. ఒకతులము అతిమధురచూర్ణంబున నెయ్యి, తేనె కలిపి భక్షించి పిదప ఆవుపాలను త్రాగిన సదా కొఱవడని వీర్యవద్ధి గలుగు.

శ్లో. చూర్ణం విదార్యాస్సుకృతం స్వరసేనైవ భావితమ్
సర్పిఃక్షీరయుతం లీఢ్వా శతం గచ్ఛేద్వరాంగనాః.

తా. నేలగుమ్మడుగడ్డను చూర్ణంబొనర్చి దాని రసముచేతనే భావనయును జేసి యం దావుపాలు, నెయ్యి, కలిపి త్రాగిన నూఱ్గురు వరాంగనలతో సురతంబొనర్పందగిన వీర్యవృద్ధి గలుగు.

శ్లో. స్వయంగుప్తేక్షురకయోర్బీజచూర్ణం సశర్కరమ్
ధారోష్ణేన నరః పీత్వా పయసా న క్షయం వ్రజేత్.

తా. దూలగొండివిత్తులు, నీరుగొబ్బివిత్తులు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి దీనికి సమముగ, శర్కర కలిపి యొకతులము చూర్ణమును అప్పుడుపితికి నురుగుతో గూడియుండెడి పాలలో వైచిత్రాగిన నెన్నటికిని కొఱవడని వీర్యవృద్ధిగలుగు.

శ్లో. గోధూమానాం పలశతం నిష్క్వాథ్యసలిలాఢకే
పాదావశేషే పూతే చ ద్రవ్యాణీమాని దాపయేత్.



గోధూమం గుంజాతఫలం మాషద్రాక్షాపరూషకమ్
కాకోలీ క్షీరకాకోలీ జీవంతీ స శతావరీ.
అశ్వగంధాసఖర్జూరా మధుకంత్ర్యూషణం సితా
భల్లాతకచాత్మగుప్తాసమభాగాని కారయేత్.
ఘృతప్రస్థం పచేదేకం క్షీరం దత్వా చతుర్గుణమ్
మృద్వగ్నినా చ సిద్ధే చ ద్రవ్యాణ్యేతాని నిక్షిపేత్.
త్వగేలాపిప్పలీధాన్యకర్పూరం నాగకేసరమ్
యథాభాగం వినిక్షిప్య సితా క్షౌద్రపలాష్టకమ్.
దత్వేక్షుదండేనాలోడ్య విధివద్వినియోజయేత్
శాల్యోదనేన భుంజీత పిబేన్మాంసరసేన వా.
కేవలస్య పిబేదస్య పలమాత్రాం ప్రమాణతః
న తస్య లింగశైథిల్యం న చ శుక్రక్షయో భవేత్.
బల్యం పరం వాతహరం శుక్రసంజననం పరమ్
మూత్రకృచ్ఛ్రప్రశమనం వృద్ధానాం చాపి శస్యతే.
పలద్వయం తదశ్నీయాద్దశరాత్రమతంద్రితః
స్త్రీణాం శతం చ భజతే పీత్వా చానుపిబేత్పయః.
అశ్విభ్యాం నిర్మితం చైత ద్గోధూమాద్యం రసాయనమ్.

తా. నూఱుపలముల గోధుమలను నొక్కకుండయందు వైచి యందు ఆఢకప్రమాణము నుదకముబోసి కషాయముబెట్టి చతుర్థాంశముగ దించుకొని యందు గోధుమరవ, తెల్లగురిగింజలు, మినపప్పు, ద్రాక్ష, చిట్టీతపండ్లు, కాకోలి, క్షీరకాకోలి, తిప్పసత్తు, పిల్లపీచర, పెన్నేరుగడ్డ, ఖర్జూరము, అతిమధురము, శొంఠి, పిప్పలి, మిరియాలు, శుద్ధిజేసిన జీడిగింజలు, దూలగొండివిత్తులు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి కలిపి యందొకపడి ఆవునెయ్యి, పైకషాయమునకు నాలుగింతలు ఆవుపాలు వైచి చెరుకుతుంటలతో కలియబెట్టుచు సూక్ష్మాగ్నిచే వండి యందు లవంగపట్ట, ఏలకులు, పిప్పళ్ళు, మిరియాలు, పచ్చకర్పూరము, నాగకేసరములు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి వస్త్రగాలితమొనర్చి వైచి, చెరుకుతుంటలతో కలియబెట్టి లేహపక్వముగ దించుకొని ప్రత్యహము యొక్కొకపలముచొప్పున భక్షింపుచుండిన రతికాలమునందు లింగశైథిల్యంబును, శుక్రనష్టంబును, గలుగకుండుటయ గాక, శరీరంబునకు బలము, వీర్యవృద్ధి, వీటిని గలుగంజేసి వాతరోగంబును మూత్రకృచ్ఛ్రంబును, బోకడుచు. మరియు దీనిని ప్రత్యహము ౨ పలములచొప్పున ౧౦ దినములు భక్షించి పాలుత్రాగిన నూఱ్గురు మందయానలతో బొందదగిన వీర్యవృద్ధియు గలుగు. ఇందుకు పథ్యము.—శాల్యోద

నంబుసైనను, మాంసరసంబునైనను భక్షింపందగు. (ఇది అశ్వినీదేవతలచే నిర్మింపంబడిన గోధూమాదిరసాయనము.)

శ్లో. ఘృతం శతావరీగర్భం క్షీరే దశగుణే పచేత్
శర్కరాపిప్పలీక్షౌద్రయుక్తం తద్వృష్యముచ్యతే.

తా. పొట్టుతీసిదంచిన చల్లపిల్లిగడ్డలు ౨౦ పలములు, ఆవునెయ్యి ౨౦ ప, ఆవుపాలు ౪౦౦ ప, ఇటుల వీటినెల్ల యొకభాండంబునం దునిచి సూక్ష్మాగ్నిచే పాలిగురువరకు కాచి వడియగట్టుకొని యాఘృతంబును గ్రహించి యందు శర్కర, పిప్పలిచూర్ణము, తేనె, వీటిని సమముగ కలిపి ప్రత్యహము సేవింపుచుండిన మిగుల వీర్యవృద్ధి గలుగు.

శ్లో. కూశ్మాండకాత్పలశతం సుస్విన్నం నిష్కులీకృతమ్
ప్రస్థం ఘృతస్య తైలస్య తస్మింస్తప్తే ప్రదాపయేత్.
త్వక్పత్రధాన్యాకవ్యోషజీరకైలాద్వయానలమ్
గ్రంధికం చవ్యమానంగపిప్పలీ విశ్వభేషజమ్.
శృంగాటకం కశేరుం చ ప్రలంబంతాళమస్తకమ్
చూర్ణీకృతం పలాంశం చ గుడస్య చ తులాం పచేత్.
శీతీభూతే పలాన్యష్టౌ మధునస్సంప్రదాపయేత్
కఫపిత్తానిలహరం మందాగ్నీనాం చ శస్యతే.
కృశానాం బృంహణం శ్రేష్ఠం వాజీకరణముత్తమమ్
ప్రమదాసు ప్రసక్తానాం యేచ స్యుః క్షీణరేతసః.
క్షయేన చ గృహీతానాం పరమేతద్భిషగ్జితమ్
కాసం శ్వాసం జ్వరం హిక్కాం హంతి ఛర్దిమరోచకమ్.
గుడకూశ్మాండకం ఖ్యాతమశ్విభ్యాం సముదాహృతమ్.

తా. ఒకపడి నువ్వులనూనె, ఒకపడి నెయ్యి, వీటిని చక్కగ కాచి యందు నూరుపలములు పైబెరడుదీసిన బూడిదగుమ్మడుపండు బద్దలనువైచి యుండికించి పిదప యందు లవంగపట్ట, లవంగపత్రి, ధనియాలు, శొంఠి, పిప్పలి, మిరియాలు, జీలకఱ్ఱ, చిన్నయేలకులు, పెద్దయేలకులు, చిత్రమూలము, మోడి, చవ్యము, తీటకోవెలవిత్తులు, పిప్పలి, శొంఠి, పరికగడ్డలు, తుంగగడ్డలు, చిట్టాముట్టి, నేలతాటిగడ్డలు, వీటిని దినుసు కొక్కొకతులముచొప్పున చూర్ణముజేసి వైచి యందు నూరుపలముల పాతబెల్లంబును కలిపి లేహపక్వముగ వండి చల్లార్చి యం దెనిమిదిపలముల తేనె కలిపి తగుమాత్రముగ భక్షించిన వాత, పిత్త, శ్లేష్మ, దోషములు, మందాగ్ని, క్షయము, కాసశ్వాసలు, జ్వరము, ఎక్కిళ్ళు, వాంతి, అరుచి, ఇవి నశించుటయ గాక కృశించెడివారలకు బలంబును,



మిగుల స్త్రీసంగమం బొనర్చుటచే క్షీణరేతస్సు గలవారలకు వీర్యవృద్ధియుం గలుగు. (ఇది అశ్వినీదేవతలచే నిర్మింపబడిన గుడకూశ్మాండక లేహము.)

శ్లో. యత్కించిన్మధురం స్నిగ్ధం జీవనం బృంహణం గురు
హర్షణం మనసశ్చైవ సర్వం తద్వృష్యముచ్యతే.

తా. ఒకింత మధురముగల పదార్థములు, స్నిగ్ధపదార్థములు, ప్రాణధారణకర పదార్థములు, పుష్టిని గలుగంజేసెడిపదార్థములు, గురుపదార్థములు, సంతోషకరములగుపదార్థములు, మనస్సున కింపుగలపదార్థములు, వీటిని సేవించిన వీర్యవృద్ధి గలుగు.

శ్లో. భల్లాతకబృహతీఫలదాడిమఫలకల్కసాధితం కురుతే
లింగం మర్దనవిధినా కటుతైలం వాజిలింగాభమ్.

తా. శుద్ధిజేసిన జీడిగింజలు, వాకుడుపండ్లు, దాడింబపండ్లు, వీటిరసములను కల్కముజేసి సేవించుటయ గాక ఆవనూనెను శిశ్నంబునకు లేపనముజేసికొని సురతం బొనర్చిన శిశ్నము అశ్వమేహనమువలె బలిమిగ నుండుటయ గాక రేతస్ఖలనము సగా గాకయుండు.

శ్లో. కనకరసమసృణవర్తితహయగంధామూలవిశ్వపర్యుషితమ్
మాహిషమివ నవనీతం గతబీజే కనకఫలమధ్యే.
గోమయగాఢోద్వర్తితం పూర్వం పశ్చాదనేన సంలిప్తమ్
భవతి హయలింగసదృశం లింగం కఠినాంగనాదయితమ్.

తా. పెన్నేరుగడ్డను నల్లయుమ్మెత్తాకురసముచే చక్కగ మర్దించి యందు బత్రకొన్న కలిపి ముద్దజేసి నల్లయుమ్మెత్తకాయ బొంగులలో నునిచి ఆవుపేడపాదిగి లఘుపుటమువేసి దానిని సాంగశీతలమున గ్రహించి నల్లయుమ్మెత్తకాయల రసముచే ఖల్వమున మర్దించి శిశ్నమునకు లేపనముజేసికొనిన నశ్వమేఢ్రముంబోలి బలిమిగనుండుటచే మదించినస్త్రీలతో రమించిన నాయువతులకు హితంబుగనుండు.

శ్లో. అశ్వగంధావరీకుష్ఠమాంసీ సింహీఫలాన్వితమ్
చతుర్గుణేన దుగ్ధేన తిలతైలం విపాచయేత్.
స్తనలింగకర్ణపాలివర్ధనం మ్రక్షణాదిదమ్.

తా. పెన్నేరుగడ్డ, చల్లపిల్లిగడ్డ, కోష్ఠు, జటామాంసి, పెద్దములకపండ్లు, వీటిని సమభాగములుగ దంచి యొకభాండమునం దునిచి దీనికి నాలుగింతలు ఆవుపాలువైచి వీటికన్నిటికి సమముగ నువ్వులనూనె బోసి సూక్ష్మాగ్నిచే తైలపక్వముగ వండి దించుకొని శిశ్నము, స్తనములు, వీటికి లేపనముజేసిన నవి మిగుల కఠినంబులగు. ఇది అశ్వగంధతైలము.

శ్లో. మూలేన హయగంధాయా మాహిషీసలిలమర్దితపూర్వం
అథలిప్తంభవతి లఘుకృతరాసభలింగం ధ్రువం పుంసామ్.

తా. పెన్నేరుగడ్డను గంధము దీసి బర్రెమూత్రంబున కలిపి మేహానమునకు లేపనముజేసికొనిన గార్దభశిశ్నమువలె బలిమిగ నుండు.

శ్లో. నీలోత్పలసితపంకజకేసర మధుశర్కరావలిప్తేన
సురతే సుచిరం రమతే దృఢలింగో భవతి నాభివివరేణ.

తా. నల్లకలువగడ్డలు, తెల్లతామరకుసుమములు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి యందు తగుమాత్రము చక్కెర, తేనె, కలిపి మర్దించి లింగమునకు లేపనము జేసికొని సురతంబొనర్చిన నత్యంతసుఖముగ నుండుటయ గాక మేఢ్రంబును దృఢంబుగ నుండు.

శ్లో. సిద్ధం కుసుంభతైలం భూమిలతాచూర్ణమిశ్రితం కురుతే
చరణాభ్యంగేన రతేర్బీజస్తంభాద్దృఢం లింగమ్.

తా. భూమిలతను చూర్ణంబొనర్చి కుసుంభతైలంబున వైచి పాదములకు మర్దించుకొని సురతంబొనర్చిన వీర్యము స్తబ్ధంబుగ నుండుటయ గాక శిశ్నంబును దృఢంబుగ నుండు.

శ్లో. సప్తాహం ఛాగభవసలిలసంస్థం కరభవారుణీమూలమ్
గాఢోద్వర్తనవిధినా లింగస్తంభం కురుతే.

తా. దుష్టుపువేరు, చాగవేరు, వీటిని ఏడుదినములు మేకమూత్రములో నానబెట్టి లింగమునకు దట్టముగ లేపనముజేసికొని రతియొనర్చిన వీర్యస్తంభనము గలుగు.

శ్లో. గోరేకోన్నతశృంగత్వగ్భవచూర్ణేన ధూపితం వస్త్రమ్
పరిధాయ చ భజ లలనాం సాకన్యావతి హర్షార్తాః.

తా. మిక్కిలి పొడవుగల ఆవుకొమ్ములపై బెరడును చూర్ణముజేసి యగ్నియందు వైచి యొకవస్త్రంబునకు ధూపముజేసి యావస్త్రంబును ధరించి తనకిష్టంబయిన స్త్రీతో సంగమం బొనర్చిన నా కన్యాలలామ వశ్యంబగు.

శ్లో. సమతిలగోక్షురచూర్ణం ఛాగీక్షీరేణ సాధితం సమధు
భుక్తం క్షపయతి షాండ్యం యజ్జనితం కుప్రయోగేణ.



తా. తెల్లనువ్వులు, పల్లేరుకాయలు, వీటిని చూర్ణంబొనర్చి యందు మేకపాలు, తేనె, వైచి చక్కగ మర్దించి భక్షించిన కుప్రయోగముచే జనించిన షండత్వము వదిలి వీర్యవృద్ధి గలుగు.

ఇట్లు శుక్రదోషచికిత్స ముగిసెను.



## కుష్ఠరోగలక్షణము.

శ్లో. కపాలమౌదుంబరమండలాఖ్యజిహ్వాఖ్యకుష్ఠాన్యథ పుండరీకమ్
సిధ్మాభిధం కాకణనామధేయం చర్మాఖ్యమన్యత్కిటిభం తథైవ.
వైపాదికం చైవకిలాససంజ్ఞం దద్రుస్తథా చర్మదళం చ ఖండః
పామా చ విస్ఫోటశతారుషీ చ విచర్చికా చేతి దశాష్టకుష్ఠాః.

తా. కపాలము, ఔదుంబరము, మండలము, జిహ్వాము, పుండరీకము, సిధ్మము, కాకణము, చర్మము, కటిభము, వైపాదికము, కిలాసము, దద్రువు, చర్మదళము, ఖండము, పామము, విస్ఫోటకము, శతారుషము, విచర్చికము, లను పదునెనిమిది కుష్ఠువులు గలవు.

శ్లో. ప్రభూతైర్వా జలౌకాభిశ్శృంగాలాబుసిరావ్యధైః
స్నిగ్ధస్య మోక్షయేద్రక్తం దుష్టం కుష్ఠే పునఃపునః.

తా. జలగచేనయినను, సొరకాయ బుర్రలచేనయినను, కొమ్ములచేనైనను, శస్త్రములచే నాడీలను వ్యధచేసినయినను కుష్ఠువులయందలి దుష్టరక్తమును పలుమారు స్రవింపం జేయవలయును.

శ్లో. వమనం చ యథా దోషం కర్తవ్యం చ విరేచనమ్.

తా. వాతాదిదోషములచే జనించిన కుష్ఠువులకు వాటివాటి దోషానుసారములుగ వమనవిరేచనములకు బుచ్చుకొనవలయును.



## కుష్ఠరోగచికిత్స.

శ్లో. గుడూచీ త్రిఫలా దార్వీ క్వాథో హ్యుష్ణైశ్చ వారిభిః
త్వగ్దోషవ్రణశోఫఘ్నః పీతో మాసం చ గుగ్గులుః.

తా. తిప్పతీగ, కరక్కాయలు, తానికాయలు, నెల్లివరుగు, మానిపసపు, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి పుచ్చుకొనినను, లేక గుగ్గిలచూర్ణమును

ఉష్ణోదకముతో నొకమాసము పుచ్చుకొనినను, కుష్ఠము, చర్మదోషము, వ్రణశోఫలు, ఇవి నశించు.

శ్లో. ఖదిరత్రిఫలానింబపటోలామృతవాసకైః
అష్టకోయం జయేత్కుష్ఠాన్కండూవిస్ఫోటకాదికాన్.

తా. చంద్రచావ, కరక్కాయలు, తానికాయలు, నెల్లివరుగు, వేపపట్ట, చేదుపొట్ల, తిప్పతీగ, అడ్డసరము వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి పానం బొనర్చిన దురద, బొబ్బలు, వీటితో గూడియుండెడి కుష్ఠువులు నివారణమగు.

శ్లో. బీజాని వా మూలకసర్షపానాం లాక్షారజన్యౌ ప్రపునాటబీజమ్
శ్రీవేష్టకవ్యోషవిడంగతుల్యం పిష్ట్వాజమూత్రేణవిలేపనంస్యాత్.
దద్రూణి సిధ్మాన్కిటిభాని పామాం కపాలకుష్ఠం విషమం చ [హన్యాత్.

తా. ముల్లంగివిత్తులు, ఆవాలు, లక్క, మానిపసుపు, పసపు, తగిరిశవిత్తులు, దిరిశనపుబంక, శొంఠి, పిప్పలి, మిరియాలు, వాయువిళంగములు, వీటిని సమభాగములుగ దంచి చూర్ణముజేసి మేకపోతుమూత్రంబున కలిపి లేపనము జేసికొనిన దద్రుకుష్ఠము, సిధ్మకుష్ఠము, కటిభకుష్ఠము, పామకుష్ఠము, కపాలకుష్ఠము, విషమకుష్ఠము, ఇవి నివారణమగు.

శ్లో. ఆరగ్వధదళైః పిష్టైర్లేపః కాంజికయుక్కృతః
కరిత్వగ్దద్రుకుష్ఠాని హంతి పామాం విచర్చికామ్.

తా. రేలచిగుళ్ళను కలిచే చక్కగ నూరి లేపనముజేసికొనిన మహాకుష్ఠువులు. దద్రుకుష్ఠువు, పామకుష్ఠువు, విచర్చికకుష్ఠువు, ఇవి నశించు.

శ్లో. వేల్లవ్యోషవరాబ్ధాగ్నివిషోగ్రాగుడతుల్యకః
లేపాత్కుష్ఠాదికాన్హంతి త్రివారం సకపాలికాన్.

తా. వాయువిళంగములు, శొంఠి, పిప్పలి, మిరియాలు, కరక్కాయలు, తానికాయలు, నెల్లివరుగు, తుంగగడ్డలు, చిత్రమూలము, వసనాభి, వస, బెల్లము, వీటిని సమభాగములుగ ఖల్వంబున చక్కగ మర్దించి యందు పుల్లని కలి కలిపి మూడుపూటలును లేపనముజేసికొనిన కపాలికాదికుష్ఠువులు నివృత్తియగు.

శ్లో. బలివేల్లాగ్నిభల్లాతదంతిశమ్యాకనింబజైః
కాంజికే పేషితైర్లేపశ్శ్వేతకుష్ఠవినాశకృత్.

తా. గంధకము, వాయువిళంగములు, చిత్రమూలము, శుద్ధిజేసిన జీడిగింజలు, నేలదంతివేరు, రేలపట్ట, వేపపట్ట, వీటిని సమభాగములుగ కలితో నూరి లేపనముజేసికొనిన శ్వేతాదికుష్ఠువులు నశించు.



శ్లో. గంధకస్సయవక్షారస్సిధ్మహృత్తోయలేపతః
అహిత్వక్పయసా పిష్ట్వా లేపస్త్వక్కిల్బిషాపహః.

తా. గంధకము, యవక్షారము, వీటిని సమభాగములుగ నుదకముచే నూరి లేపనముజేసికొనిన సిధ్మకుష్ఠువు నశించు, మఱియు పాముకుబుసమును నీళ్ళచే నూరి లేపనము జేసికొనిన కుష్ఠువులన్నియు నివృత్తియగు.

శ్లో. తాళకాద్ద్విగుణం గంధం వాకుచ్యా గోజలార్దితమ్
సిధ్మం ప్రలేపనాదాశు హంతి మాసప్రయోగతః.

తా. తాళకము ౧ భాగము, గంధకము ౨ భాగములు, భావంచివిత్తులు 3 భాగములు, వీటిని చూర్ణముజేసి యందు గోమూత్రము కలిపి యొకమాసము లేపనము జేసిన సిధ్మమనుకుష్ఠువు నశించు.

శ్లో. శుక్లస్య కరవీరస్య రసో వేల్లం చ చిత్రకమ్
ఏభిస్సుపాచితం తైలమభ్యంగాత్కుష్ఠజాతినుత్.

తా. తెల్లగన్నేరు సమూలమును దంచి రసముదీసి యందు వాయువిళంగముల చూర్ణము, చిత్రమూలచూర్ణము, నువ్వులనూనె, కలిపి తైలపక్వముగ వండి యాతైలమును లేపనము, అభ్యంగనము, గావించిన కపాలాదికుష్ఠువులు నివారణమగు.

శ్లో. వరావేల్లకణాచూర్ణం లీఢం సన్మాక్షికైస్సదా
హంతి కుష్ఠాన్క్రిమీన్మేహాన్నాడీవ్రణభగందరాన్.

తా. కరక్కాయలు, తానికాయలు, నెల్లివరుగు, వాయువిళంగములు, పిప్పళ్లు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి యందు తగుమాత్రము తేనె కలిపి పుచ్చుకొనిన కుష్ఠువులు, జంతురోగము, మేహములు, అస్థివ్రణములు, భగందరములు, ఇవియన్నియు నివృత్తియగు.

శ్లో. రసగంధకయోః పిష్టం కటుతైలేన భృంగజైః
ద్రవైస్సమ్మర్ద్య తల్లేపాత్సర్వకుష్ఠం వినశ్యతి.

తా. పాదరసము, గంధకము, వీటిని ఖల్వమున కలియనూరి పిదప యందావాలతైలము, గుంటగలగరాకురసము, బోసి ఖల్వమున వెవ్వేరుగ చక్కగ మర్దించి లేపనముజేసికొనిన కుష్ఠువులు నివారణమగు.

శ్లో. రసోషణం సైంధవం చ విడంగం చామృతారసః
కాంజికేన విమర్ద్యాథ లేపస్సిధ్మవినాశనః.

తా. పాదరసము, మిరియాలు, సైంధవలవణము, వాయువిళంగములు, తిప్పతీగరసము, వీటిని సమభాగములుగ పుల్లనికలితో నూరి లేపనముగావించిన సిధ్మకుష్ఠువు నివృత్తియగు.

శ్లో. రసగంధకహేమం చ సాభ్రకం కటుతైలతః
మర్దితం మర్దనాత్తస్య కుష్ఠజాతం వినశ్యతి.

తా. పాదరసము, గంధకము, తంగేడుపట్ట, లేక నాగకేసరములు, అభ్రకము, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి యం దావాలతైలము కలిపి చక్కగ ఖల్వమున నూరి సర్వకుష్ఠువులకు మర్దనము జేసిన నవి నివారణమగు.

శ్లో. శ్వేతశ్విత్రాది కుష్ఠాని హ్యసాధ్యాని ప్రయత్నతః
తస్మాత్తేషాముపాయశ్చ నాత్రైవ లిఖితో మయా.

తా. శ్వేతకుష్ఠు వసాధ్యంబగుటచే దానికి విశేషంబులగు చికిత్సల నిచట యుంద పరించుటకు విరమించినాడ.

శ్లో. తాళకశ్శాణమాత్రస్స్యాచ్చతుశ్శాణా చ వాకుచీ
గోమూత్రయుక్తం తచ్చూర్ణం లేపనాచ్ఛ్విత్రనాశనమ్.

తా. తాళకము ౧ శాణము, భావంచివిత్తులు ౪ శాణములు, ఇటుల వీటిని గోమూత్రముచే చక్కగ నూరి లేపనముజేసిన శ్విత్రకుష్ఠువు నివృత్తియగు.

శ్లో. గుంజాఫలాగ్నిచూర్ణస్య లేపనం శ్వేతకుష్ఠనుత్
శిలాపామార్గభస్మాపి లేపాచ్ఛ్విత్రవినాశనమ్.

తా. తెల్లగురిగింజలు, చిత్రమూలము, వీనిని సమభాగములుగ, కలితో నూరి లేపనముజేసినను, లేక మణిశిల, ఉత్తరేణిభస్మము, వీటిని నుదకముచే నూరి లేపనము జేసినను, శ్వేతకుష్ఠువులు నివారణమగు. మరియు వాతరక్తప్రకరణమునం దుదహరింపంబడియుండెడి మంజిష్ఠకషాయంబును, కొడిశపట్టకషాయంబును, సేవించిన కుష్ఠువులు నివృత్తియగు.

శ్లో. అన్నపానం హితం కుష్ఠేనత్వమ్లలవణోషణమ్
దధిదుగ్ధగుడాంశ్చాపి తిలమాషాన్త్యజేన్నరః.

తా. శుద్ధాన్నపానంబును కుష్ఠరోగులు సేవించుటచే హితంబులగు. అయినను పులుసు, ఉప్పు, కారము, పెరుగు, పాలు, బెల్లము, నువ్వులు, మినుములు, ఈ మొదలగువాటిని కుష్ఠరోగులు వర్జింపవలయు.



శ్లో. లలాటే హస్తపాదేషు సిరాశ్చాస్య విమోక్షయేత్.

తా. నుదురు, చేతులు, పాదములు, వీటియందు కుష్ఠరోగులకు రక్తమును స్రవింపంజేయవలయు.

శ్లో. ప్రచ్ఛన్నమమ్లకే కుష్ఠే శృంగాద్యైశ్చ యథాయథమ్.

తా. రక్తముచే నాచ్ఛాదింపబడిన నమ్లకాదికుష్ఠువుల యథోచితముగ కొమ్ములు మొదలగువాటిచే రక్తమును స్రవింపంజేయవలయు.

శ్లో. మనశ్శిలాలంమరిచాని తైల మార్కంపయః కుష్ఠహరః ప్రదేహః
కరంజబీజైడగజంసకుష్ఠం గోమూత్రపిష్టం చ వరప్రదేహః.

తా. మణిశిల, హరితాళకము, మిరియాలు, వీటిని సమభాగములుగ నువ్వుల నూనె, జిల్లేడుపాలు, వీటిచే నూరి లేపనముజేసినను, లేక కానుగవిత్తులు, తగిరిశవిత్తులు, కోష్ఠు, వీటిని సమభాగములుగ గోమూత్రముచే నూరి లేపనముజేసినను కుష్ఠువులు నశించు.

శ్లో. హయవేల్లాగ్నిభల్లాతదంతీశమ్యాకనింబజైః
కాంజికైః పేషితైర్లేప శ్శ్వేతకుష్ఠవినాశకృత్.

తా. పెన్నేరుగడ్డ, వాయువిళంగములు, చిత్రమూలము, జీడిగింజలు, నేలదంతివేరు, రేలపట్ట, వేపవిత్తులు, వీటిని సమభాగములుగ దంచి కలితో నూరి లేపనము జేసిన శ్వేతకుష్ఠువు నశించు.

శ్లో. గుంజాకుష్ఠవచానింబైర్వారిపిష్టైః ప్రలేపనాత్
శ్వేతావరాజితామూలం హంతి శ్విత్రమసంశయమ్.

తా. తెల్లగురిగింజలు, కోష్ఠు, వస, వేపవిత్తులు, వీటిని సమభాగములుగ నుదకముచే నూరి లేపనముజేసిన శ్వేతకుష్ఠువు, నశించు. మరియు గంటెనవేరు, తెల్లవావిలివేరు, వీటిని సమభాగములుగ నుదకముచే నూరి శ్వేతకుష్ఠువునకు లేపనముజేసిన నది నివారణమగు.

శ్లో. మండలానిచ ఘృష్ట్వాథ చిత్రకేన ప్రలేపయేత్
తతో వాతారిబీజైశ్చ లేపో మండలకుష్ఠనుత్.

తా. మంటలు గలుగునటుల మండలకుష్ఠువుమీద చక్కగ రుద్ది చిత్రమూలముసైనను వావిలివిత్తులసైనను, నుదకముచే నూరి లేపనముజేసిన, మండలకుష్ఠువు నివృత్తియగు.

---

## కుష్ఠువులకు రసచికిత్స.

శ్లో. శుద్ధతాళం మృతంసూతం తుల్యం తాభ్యాం చతుర్గుణమ్
భర్జిత్వా విజయా యోజ్యా సర్వతుల్యం గుడం క్షిపేత్,

శ్వేతకుష్ఠహరం నిష్కం రసోఽయం విజయేశ్వరః
దార్వీఖదిరనింబానాం క్వాథం తమనుపాయయేత్.

తా. శుద్ధిజేసిన హరితాళకము ౧ భాగము, పాదరసభస్మము ౧ భా, వేయించిన భంగికల్లీలు ౮ భా, బెల్లము ౧౦ భా, ఇటుల వీటినన్నిటిని నేకంబొనర్చి ఖల్వంబున చక్కగ మర్దించి నిష్కప్రమాణము మాత్రలుజేసి యం దొకమాత్రను ప్రాతస్సాయంకాలములయందు భక్షించి తోడనే మ్రానిపసపు, చండ్రచావ, వేపపట్ట, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి పానంబొనర్చిన శ్వేతకుష్ఠువు నివారణమగు, (ఇది విజయేశ్వరరసము.)

శ్లో. శుద్ధసూతం మృతం చాభ్రం మృతంతామ్రం సమంసమమ్
మర్దయే ద్వాకుచీతైలే యామైకం కృతగోళకమ్.
ద్విగుణే పాచయేద్గంధే సతైలే లోహపాత్రకే
గంధతైలే విజీర్ణేతు తద్గోళాంశం మృతాయసమ్.
పంచాంగనింబసంయుక్తం మధునా గోళకీకృతమ్
నిష్కైకం కిటిభం హంతి వజ్రపాణిమహారసః.

తా. శుద్ధిజేసిన పాదరసము, అభ్రకభస్మము, తామ్రభస్మము, వీటిని సమభాగములుగ ఖల్వమునం దునిచి యందు భావంచివిత్తుల తైలముబోసి ఒకఝాము చక్కగ మర్దించి ముద్దజేసి దీనికిరెండింతలు శుద్ధిజేసినగంధకమును కలిపి పిదప వాటిని నొక ఇనుపపాత్రయందు వైచి ఆవి మణుగునటుల యందు భావంచివిత్తుల తైలముబోసి తైల మిగురువరకు సూక్ష్మాగ్నిచే కాచి సాంగశీతలమున గ్రహించి పై పాదరసాదిముద్దకు సమముగ లోహభస్మము. వేపపట్ట, వేపాకులు, వేపపువ్వులు, వేపవిత్తులు, వేపవేరు, వీటిచూర్ణమును, తేనెను వైచి ఖల్వమున చక్కగ మర్దించి నిష్కప్రమాణము మాత్రలుజేసి నీడన యెండించి యం దొకమాత్రను భక్షించిన కిటిభాదికుష్ఠువులు నివృత్తియగు. (ఇది మహావజ్రపాణిరసము.)

శ్లో. భృంగరాజహరీతక్యో ర్మూల మన్తఃపుటే దహేత్
ఆరనాళేన తల్లేపా చ్ఛ్వేతకుష్ఠవినాశనమ్.

తా. గుంటగలగరాకు, కరక్కాయలు, వీటివేళ్ళను పుటపాకము జేసి యందు పుల్లనికలిబోసి చక్కగ నూరి శ్వేతకుష్ఠువులకు లేపనముగావించిన నవి నశించు.

ఇట్లు కుష్ఠరోగచికిత్స ముగిసెను.



శీతపిత్తలక్షణము.

శ్లో. వరటీదంశసంస్థాన శ్శోథ స్సంజాయతే బహిః
సకండూతోద బహుళశ్ఛర్దిజ్వరవిదాహవాన్.
ఉదర్దమితి తం విద్యా చ్ఛీతపిత్తమథాపరే.

తా. కందిరీగ కరచిన దేహంబునందు దద్దు లుత్పన్నంబు లగుచుందంబున దురద పోట్లు, అధికవాంతి, జ్వరము, తాపము, వీటితోగూడిన శోఫగలిగెనేని ఉదర్దరోగంబని ఎఱుంగవలయు. మఱియుం గొందఱు దీనినే శీతపిత్తం బనియెదరు.

శీతపిత్తచికిత్స.

శ్లో. సిద్ధార్థరజనీకుష్ఠై ప్రపున్నాటతిలై స్సహ
కటుతైలేన సమ్మిశ్ర మేతదుద్వర్తనం హితమ్.

తా. తెల్లావాలు, పసపు, కోష్ఠు, తగిరిశవిత్తులు, నువ్వులు, వీటిని సమభాగములుగ దంచి ఆం దావాలతైలము బోసి నూరి లేపనము జేసిన ఉదర్దరోగము నివారణమగు.

శ్లో. కుష్ఠంహరిద్రే సురసంపటోలం
నింబాశ్వగంధే సురదారుశిగ్రు
ససర్షపం తుంబురుధాన్యకం త్వ
క్కండ్వావచూర్ణాని సమాని కుర్యాత్.
తైస్తక్రపిష్టైః ప్రథమం శరీరం.
తైలాక్త ముద్వర్తయితుం యతేత
తథాస్య కండూపిటికాసకోఠా
కుష్ఠాని శోఫశ్చ శమం వ్రజంతి.

తా. ఉదర్దరోగి ప్రథమంబున శరీరమునకు ఆవాలతైలమును లేపనము జేసికొని పిదప కోష్ఠు, పసపు, మానిపసపు, తులసియాకు, చేదుపొట్ల, వేపపట్ట, పెన్నేరుగడ్డ, దేవదారు, మునగపట్ట, ఆవాలు, తుంబురనెడు గ్రంథ్యము, ధనియాలు, లవంగపట్ట, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి యందు మజ్జిగబోసి నూరి లేపనముజేసికొనిన దురద, పిటికలు, మండలకుష్ఠువు, శోఫలు, ఉదర్దరోగము, ఇవియన్నియుం నశించు.

శ్లో. నింబస్య పత్రాణి సదాఘృతేన
ధాత్రీవిమిశ్రాణ్యథవా ప్రయుంజాత్
విస్ఫోటకోటక్షతశీతపిత్తం
కండ్వస్రపిత్తం సకలాని హన్యాత్,

తా. వేపాకును దంచి చక్కగ చూర్ణముజేసి దీనికిసమముగ నెయ్యినైనను ఊశిరికవరుగు చూర్ణమునైనను, కలిపి సేవించిన విస్ఫోటకము, ఉదర్దము, కుష్ఠము, గాయములు, శీతపిత్తము, దురద, రక్తపిత్తము, ఇవియన్నియు నివారణమగు.

శ్లో. యష్టీమధూకపుష్పంచ సరాస్నం చందనద్వయమ్
నిర్గుండీసకణాక్వాథం శీతపిత్తహరం పిబేత్.

తా. అతిమధురము, ఇప్పపువ్వులు, సన్నరాష్టకము, శ్రీగంధము, రక్తచందనము, వావిలివేరు, పిప్పళ్ళు, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి పుచ్చుకొనిన శీతపిత్తము నశించు.

శ్లో. యత్రానేకానిలగదా శ్శీతవాతాదయ స్స్మృతాః
హిమయంతీహ గాత్రాణి రోమాంచస్ఫురితాని చ.
శిరోఽక్షి వేదనాలస్యం శీతవాతస్య లక్షణమ్.

తా. శరీరము చల్లగనుండుట, గగుర్పొడుచుట, ఉలికిపడుట, శిరస్సు, నేత్రములు, వీటియందు వేదనగలుగుట, ఆలస్యముగ నుండుట, ఇట్టిలక్షణంబులు గలిగిన శీతవాతాద్యనేకవిధ వాతరోగంబులని ఎఱుంగవలయు.

## శీతపిత్తమునకు రసచికిత్స.

శ్లో. రసేన గంధం ద్విగుణం ప్రగృహ్య పునర్నవావహ్నిరసైర్విమర్ద్య
పక్వార్కపత్రోత్థరసేన తస్మాద్విపాచయేదష్టగుణేన పశ్చాత్.
రసార్ధభాగేనవిషంచదద్యా ద్విపాచయేద్వహ్నిజలైః క్షణంతత్
శీతారిసంజ్ఞో హి రసోఽయమస్య వల్లంతదర్ధం యదివార్ద్రకేన.
మరీచచూర్ణేన ఘృతప్లుతేన సేవేత మాసం సఘృతం సపథ్యమ్.

తా. శుద్ధిచేసిన పాదరసము ౧ భాగము, శుద్ధిజేసిన గంధకము ౨ భాగములు, ఇటుల వీటిని తెల్లగలిజేరువేరు, చిత్రమూలము వీటిరసములచే ఖల్వమున చక్కగ మర్దించి యం దెనిమిదిభాగములు పండుజిల్లేడాకుల రసముబోసి సూక్ష్మాగ్నిచే పక్వముగ నుడికించి యందుపై పాదరసమున కర్ధభాగము శుద్ధిజేసిన వసనాభిని చూర్ణముచేసి కలిపి చిత్రమూలకషాయముచే మరల యొకింతసేపు ఉడికించి ఖల్వమున మర్దించి వల్లప్రమాణంబైనను, వల్లార్ధప్రమాణంబైనను, మాత్రలుజేసి నీడన యెండించి యందొకమాత్రను అల్లపురసముతోనైనను, ఘృతసహితమగు మిరియాలచూర్ణములోనైనను, నొకనూసము సేవించిన శీతపిత్తాదులు నశించు. ఇందుకు పథ్యము.—ఘృతాన్నమును భుజింపవలయు. ఇది శీతారిరసము.

ఇట్లు శీతపిత్తచికిత్స ముగిసెను.



## స్పర్శవాతలక్షణము.

శ్లో. అంగేషు తోదనప్రాయో దేహస్స్పర్శం న విందతి
మండలానిచ దృశ్యంతే స్పర్శవాతస్య లక్షణమ్.

తా. అంగములయందు పోట్లు పొడిచినటుల వ్యథగలుగుట, స్పర్శజ్ఞానములేకుండుట, శరీరంబున దద్దులుగలుగుట, ఇట్టిలక్షణంబులుగలిగిన స్పర్శవాతంబనిఎఱుంగవలయు.

## స్పర్శవాత రసచికిత్స.

శ్లో. తాళం రసేనాష్టగుణం జయాంచ
విమర్ద్య యత్నాద్గుటికా గుడేన
నిబద్ధతాం సేవయ మాసయుగ్మం
దినోదయే స్పర్శవికారనుత్త్యై.

తా. శుద్ధిజేసిన పాదరసము ౧ భాగము, శుద్ధిజేసిన హరితాళకము ౮ భా, యెండిన భంగియాకు ౮ భా, బెల్లము ౧౩ భా, ఇటుల వీటిని ఖల్వంబున నునిచి చక్కగ మర్దించి రెండుమాషముల ప్రమాణను మాత్రలుచేసి ప్రాతస్సాయంకాలములయం దొక్కొకమాత్రచొప్పున రెండుమాసములు సేవించిన స్పర్శవాతము నివారణమగు. (ఇది తాళకేశ్వర రసము.)

శ్లో. అష్టభాగో రసశ్శుద్ధో విషతిందో ర్దశైవతు
గంధకస్య దశద్వౌ త్రికటుత్రిఫలయో స్త్రయః.
వహ్నిచిత్రకముస్తానాం వచాశ్వగంధయో రపి
రేణుకావిషకుష్ఠానాం పిప్పలీమూలనాగయోః.
ఏకైకస్తు భవేద్భాగ ఇవి గ్రాహ్యాః క్రమేణచ
గుడ శ్చతుర్వింశతిస్స్యా ద్వటికా బదరాకృతిః.
క్రమేణ వానుసేవేత స్పర్శవాతాపనుత్తయే.

తా. శుద్ధిజేసిన పాదరసము ౮ భాగములు, శుద్ధిజేసిన విషముష్టిగింజలు ౧౦ భా, శుద్ధిజేసిన గంధకము ౧౨ భా, శొంఠి, పిప్పళ్ళు, మిరియాలు, కరక్కాయలు, తానికాయలు, ఉశిరికవరుగు, శుద్ధిజేసిన జీడిగింజలు, తుంగగడ్డలు, పెన్నేరుగడ్డ, రేణుకలు, శుద్ధిజేసిన వసనాభి, కోష్ఠు, మోడి, నాగకేసరములు ఇవి దినుసుయొకటింటికి యొక్కొకభాగము, ఇటుల వీటిని చూర్ణముజేసి అందు ౨౪ భాగములు పాతబెల్లము కలిపి మాత్రపక్వముగ ఖల్వమున మర్దించి రేగుబండంత మాత్రలుజేసి క్రమముగ ౧-౨-౩ మాత్రలచొప్పున దేహతత్త్వము నెరింగి భక్షించిన స్పర్శవాతము నశించు.

ఇట్లు స్పర్శవాతచికిత్స ముగిసెను.

## అమ్లపిత్తలక్షణము.

శ్లో. అవిపాక క్లమక్లేద తిక్తామ్లోద్గారగౌరవైః
హృత్కంఠదాహారుచిభిశ్చామ్లపిత్తం వదేద్భిషక్.

తా. అజీర్ణము, బడలిక, ఇవి గలిగియుండుట, నోట నీరు స్రవింపుచుండుట, పులుసుగనైనను, కారముగనైనను, తేనుపులు వచ్చుట, కంఠము, రొమ్ము వీటియందు మంటగలుగుట, అరుచిగనుండుట, ఇట్టిలక్షణంబులు గలిగిన, ఆమ్లపిత్తంబని ఎరుంగవలయు.

శ్లో. భుక్తేవిదగ్ధే స్యథవాప్యభుక్తే కరోతి తిక్తామ్లవమిం కదాచిత్
ఉద్గార మేవం విధమేతి కంఠం హృత్కుక్షిదాహశ్శిరసోరుజశ్చ.

తా. భోజనానంతరముననైనను, అన్నము జీర్ణింపకయుండునపుడైనను, భోజనం బొనర్పకయుండునపుడైనను, కారము, పులుసు, వీటితోఁగూడిన తేనుపులు వచ్చుటయగాక వాంతియగుట, హృదయము, కుక్షి, వీటియందు మంటగలుగుట, తలనొచ్చుట, ఇట్టిలక్షణంబులు గలిగిన ఆమ్లపిత్తంబని ఎరుంగవలయు.

---

## అమ్లపిత్తచికిత్స.

శ్లో. అమ్లపిత్తేతు వమనం పటోలారిష్టవారిణా
విరేచనం త్రివృచ్చూర్ణం మధుధాత్రీఫలద్రవైః.

తా. చేఁదుపొట్ల, వేపపట్ట, వీటిని దంచి కషాయముబెట్టి యందు వమనమును గలుగంజేసెడి యౌషధమును కలిపి త్రాగవలయు. మరియు ఉశిరికవరుగును కషాయము బెట్టి యందు తెల్లతెగడచూర్ణము, తేనె, కలిపి విరేచనమునకు బుచ్చుకొనవలయు. ఇట్లొనర్చిన ఆమ్లపిత్తము నివృత్తియగు.

శ్లో. త్రికటు త్రిఫలా ముస్తంబీజంచైవ విడంగజమ్
ఏలాపత్రంచ సర్వాణి సమభాగాని కారయేత్
యావంత్యేతాని సర్వాణి లవంగం తత్సమం భవేత్
సర్వచూర్ణా ద్ద్విగుణితం త్రివృచ్చూర్ణం తు కారయేత్.
యావంత్యేతాని సర్వాణి తావతీ శర్కరా భవేత్
సర్వమేకీకృతం పాత్రే స్నిగ్ధే చైవ నిధాపయేత్.
భోజనాదౌ తతో భక్షేన్మాషాష్టకమిదంశుభమ్
శీతతోయానుపానం చ నారికేళోదకం తథా.



తతో యథేష్టమాహారం కుర్యాత్క్షీరోదనం చవై
అమ్లపిత్తం హరత్యాశు శూలదుర్నామనాశనమ్.
ప్రమేహావింశతిం చైవ మూత్రాఘాతాం స్తథాశ్మరీమ్
అవిపత్యకరం చూర్ణ మగస్త్యమునిభాషితమ్.

తా. శొంఠి, పిప్పలి, మిరియాలు, కరక్కాయలు, తానికాయలు, నెల్లివరుగు, తుంగగడ్డలు, వాయువిళంగములు, ఏలక్కాయలు, తాళిసపత్రి, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి దీనికిసమముగ లవంగముల చూర్ణము, వీటికన్నిటికి రెండింతలు తెల్లతెగడచూర్ణము, అన్నిటికి సమముగ చక్కెర కలిపి యేకంబొనర్చి స్నిగ్ధభాండమునం దునిచి భోజనము గావించుటకు పూర్వంబున ౘ మాషములయెత్తు చూర్ణమును భక్షించి శీతోదకంబునయినను, టెంకాయనీరునయినను, పానంబొనర్చి పాలన్నమును యథేచ్ఛంబుగ భుజింపవలయు. ఇటులొనర్చిన ఆమ్లపిత్తము, శూల, మూలవ్యాధి, ఇరువది ప్రమేహములు, మూత్రాఘాతము, రాళ్ళుపడెడి మూత్రాశ్మరి, ఈమొదలగు రోగంబు లన్నియు నివారణం బగునని నగస్త్యమహాముని వచించె. (ఇది అవిపత్యకరచూర్ణము.)

శ్లో. పాఠానింబపటోలత్రిఫలాసనయాసయోజితో జయతి
అధికకఫ మమ్లపిత్తం సహితో గుగ్గులునా క్రమశః.

తా. అగరుశొంఠి, వేపపట్ట, చేదుపొట్ల, కరక్కాయలు, తానికాయలు, ఉశిరికవరుగు, వేగిసపట్ట, దురదగొండివేరు, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి యందు శుద్ధిజేసిన గుగ్గిలచూర్ణమును కలిపి పుచ్చుకొనిన నధికముగ కఫముబడుట, ఆమ్లపిత్తము, ఇవి హరించు.

శ్లో. సహింస్రా మృతభాండాకీ క్వాథంకృత్వా సమాక్షికమ్
అమ్లపిత్తం హరేద్దుష్టం శ్వాసం కాసం జ్వరం వమిమ్.

తా. జటామాంసి, తిప్పతీగ, పెద్దములక, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి యందు తేనె కలిపి త్రాగిన దారుణమగు ఆమ్లపిత్తము, శ్వాసకాసలు, జ్వరములు, వాంతి, ఇవియన్నియు నశించు.

శ్లో. పిప్పలీమధుసంయుక్తా అమ్లపిత్తవినాశినీ
జంబీరస్వరసః పీతస్సాయం హంత్యమ్లపిత్తకమ్.

తా. పిప్పలిచూర్ణంబున తేనెవైచి పుచ్చుకొనిన ఆమ్లపిత్తము నశించు, మఱియు పిప్పలిచూర్ణంబున నిమ్మపండ్లరసము బోసి ప్రాతఃకాలంబున సేవించిన సూర్యుం డస్తగిరి జెందుటకుపూర్వమే ఆమ్లపిత్తము నశించు.

శ్లో. అమ్లపిత్తే ప్రయోక్తవ్యః కఫపిత్తహరోవిధిః
గుడకూశ్మాండకం చైవ తథా ఖండామలక్యపి.

తా. ఆమ్లపిత్తరోగి కఫపిత్తంబునకు నుదహరింపఁ బడియుండెడి యౌషధంబుల సేవింపవలయు. మరియు గుడకూశ్మాండ లేహంబునయినను, ఖండామలకంబునయినను సేవించిన నమ్లపిత్తము నశించు.

శ్లో. జ్వలంతమివ చాత్మానం మన్యతే యోమ్లపిత్తవాన్
తస్యైవ శోధనం పథ్యం నశాంతి శ్శోధనం వినా.

తా. ఆమ్లపిత్తరోగికి శరీరంబంతట తాపము గలిగియుండు. కావున నత్తాపము శాంతిఁజెందుటకయి విరేచనంబునకు బుచ్చుకొనవలయు. ఇతరక్రియలచే శాంతిని జెంద నేరదు.

శ్లో. గుడపిప్పలిపథ్యాభి స్తుల్యాభిర్మోదకః కృతః
పిత్తశ్లేష్మాపహః ప్రోక్తో మందాగ్నించాపి దీపయేత్.

తా. పిప్పళ్ళు, కరక్కాయలు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి అందు పాతబెల్లము కలిపి లడ్డుకములుజేసి భక్షించిన ఆమ్లపిత్తము, కఫము, మందాగ్ని, ఇవి నశించుటయ గాక దీపనంబును గలుగు.

శ్లో. యవగోధూమవికృతి స్తీక్ష్ణసంస్కారవర్జితా
యథాస్వంలాజసక్తూన్వా సితామధుయుతా న్పిబేత్.

తా. ఆమ్లపిత్తరోగి కారము, పులుసు, ఇవి మొదలగువాటిని వర్జించి వరిపేల పిండి, గోధుమలసత్తు, వీటిలో దేనినయినను భక్షించినను, లేక వరిపేలపిండి సత్తులో తేనె, నెయ్యి, శర్కర, వీటిలో దేనినయినను, కలిపి భక్షించినను ఆమ్లపిత్తము నశించు.

శ్లో. నిస్తుష యవవృష ధాత్రీ క్వాథం త్రిసుగంధమధుయుతం పీత్వా
అపహరతి చామ్లపిత్తం యది భుంక్తే ముద్గయూషేణ.

తా. యవలసత్తు, ఆడ్డసరము, ఉశిరికవరుగు, లవంగపట్ట, తాళిశపత్రి, ఏలక్కాయలు, వీటిని సమభాగములుగ కషాయముబెట్టి యందు తేనె కలిపి పుచ్చుకొనిన అమ్లపిత్తము హరించు. ఇందుకు పథ్యము.—పెసరకట్టుయన్నమును భుజింపవలయు.

శ్లో. యవకృష్ణా పటోలానాం క్వాథం క్షౌద్రయుతం పిబేత్
నాశయే దమ్లపిత్తం చ హ్యరుచిం చ వమిం తథా.



తా. యవలసత్తు, పిప్పళ్ళు, చేదుపొట్ల, వీటిని సమభాగములుగ కషాయము బెట్టి యందు తేనె కలిపి భక్షించిన ఆమ్లపిత్తము, అరుచి, వాంతి, ఇవియన్నియు నివృత్తియగు.

శ్లో. భూనింబనింబత్రిఫలాపటోలీ
వాసామృతాపర్పటమార్కవాణామ్
క్వాథో హరేత్క్షౌద్రయుతోఽమ్లపిత్తం
చిత్తం యథా వారవధూకటాక్షః.

తా. సీమనేలవేము, వేపపట్ట, కరక్కాయలు, తానికాయలు, ఉశిరికవరుగు, చేదుపొట్ల, ఆడ్డసరము, తిప్పతీగ, పర్పాటకము, గుంటగలగర, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి అందు తేనె కలిపి పుచ్చుకొనిన ''వారవిలాసిని పురుషుని చిత్తమును నిజకటాక్షవీక్షణముచే నపహరించుచందంబున'' ఆమ్లపిత్తము నతిశీఘ్రంబుగ హరించు.

శ్లో. కూశ్మాండస్వరసో గ్రాహ్యః పలానాం శతమాత్రకమ్
రసతుల్యం గవాక్షీరం ధాత్రీచూర్ణం పలాష్టకమ్
లఘ్వగ్నినా పచేత్తావద్యావద్భవతి పిండితమ్
ధాత్రీతుల్యా సితా యోజ్యా పలార్ధం లేహయేదను.
ఖండకూశ్మాండకం ఖ్యాతమమ్లపిత్తం నియచ్ఛతి.

తా. బూడిదెగుమ్మడురసము ౧౦౦ పలములు, ఆవుపాలు ౧౦౦ ప, ఉశిరిక వరుగుచూర్ణము ౮ ప, శర్కర ౮ ప, వీటినన్నిటిని నేకముజేసి మందాగ్నిచే లేహపక్వముగ వండి పూటకు అరపలముచొప్పున సేవించిన ఆమ్లపిత్తము నశించు. (ఇది ఖండకూశ్మాండకలేహము.

ఇట్లు ఆమ్లపిత్తచికిత్స ముగిసెను.

## విసర్పి, విస్ఫోటక, లక్షణము.

శ్లో. రక్తం లసీకాత్వఙ్మాంసం దూష్యంతే తత్త్రయో మలాః
విసర్పాణాం సముత్పత్తౌ సర్వత్ర పరిసర్పణాత్.

తా. వాతాదిదోషములచే రక్తము, మేదస్సు, త్వక్కు, మాంసము, ఇవి దూషింపబడి సప్తధాతువులయందు వ్యాపించి విసర్పి యనురోగమును జనింపఁ జేయుచున్నయది.

శ్లో. జ్వరోఽతిసారో వమథు స్తృణ్మాంసదరణం క్లమః
అరోచకావిపాకౌ చ విసర్పాణాముపద్రవాః.

తా. ఇటులజనించిన విసర్పిరోగంబునందు జ్వరము, అతిసారము, వాంతి, దాహము, బడలిక, అరుచి, మందాగ్ని, ఇవి జనించి మాంసంబును క్షీణించు.

శ్లో. త్వచమాశ్రిత్య తే రక్తం మాంసాదీని ప్రదూష్య చ
ఘోరాన్కుర్వంతి విస్ఫోటాన్సర్వాన్జ్వరపురస్సరాన్.

తా. మఱియు నావాతాదిదోషములు చర్మమునాశ్రయించి రక్తము, మాంసము, ఇవి మొదలగు సప్తధాతువులను దూషింపంజేసి జ్వరపూర్వకమైన ఘోరంబగు విస్ఫోటకములను జనింపంజేయు.

శ్లో. అగ్నిదగ్ధనిభాస్స్ఫోటాస్సరుజా రక్తపిత్తతః
క్వచిత్సర్వత్ర వా దేహే విస్ఫోటా ఇతి సంస్మృతాః.

తా. ఇటులజనించిన స్ఫోటకంబులు "అగ్నిదగ్ధంబులైన బొబ్బలంబోలి" వ్యథ, రక్తపిత్తము, వీటితోగూడి, దేహమునం దొకస్థలంబుననైనను, లేక సర్వత్రయైనను, విస్ఫోటకంబుల జనింపంజేయు.

## విసర్పి, విస్ఫోటక, చికిత్స.

శ్లో. భూనింబవాసాకటుకా పటోలం ఫలత్రికం చందననింబసిద్ధః
విసర్పదాహజ్వరశోఫకండూ విస్ఫోటతృష్ణావమినుత్కషాయః.

తా. నేలవేము, అడ్డసరము, కటుకరోహిణి, చేదుపొట్ల, కరక్కాయలు, తానికాయలు, ఉశిరికవరుగు, శ్రీగంధము, వేపపట్ట, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి పానంబొనర్చిన విసర్పి, తాపము, జ్వరము, శోష, దురద, విస్ఫోటకము, దాహము, వాంతులు, ఇవియన్నియు నివారణమగు.

శ్లో. కనకభుజగవల్లీ మాలతీపత్రమూర్వా
రసగదకునటీభిర్ఘర్షితస్తైలయోగాత్
అపహరతి రసేంద్రః కుష్ఠకండూవిసర్పం
స్ఫుటితచరణరంధ్రం శ్యామలత్వం త్వచాయాః.

తా. నల్లఉమ్మెత్తవేరు, నాగమల్లివేరు, జాజియాకు, చాగవేళ్లు, రేణుకలు, కోష్ఠు, మణిశిల వీటిని సమభాగములుగ చూర్ణముజేసి దీనికిసమముగ నువ్వులనూనె కలిపి యందు పాదరసము వైచి చక్కగ ఖల్వమున మర్దించి శరీరమునకు లేపనముజేసికొనిన కుష్ఠువు, దురద, విసర్పి, కాళ్ళపగుళ్ళు, చర్మదోషము, ఇవి నశించు.

శ్లో. ఏరండతుంబీకటునింబచక్రమర్దోత్థబీజాని చ సోమరాజి [మ్.
అంకోలబీజాని సమాని కృత్వా పాతాళయంత్రేణ సతైలమేషా
ప్రగృహ్య తేనాథ విమర్దయేత విసర్పకాదీన్వికృతిం ప్రయాంతి.



తా. ఆముదపువిత్తులు, చేదుసొరవిత్తులు, వేపవిత్తులు, తగిరిశవిత్తులు, భావంచివిత్తులు, ఊడుగవిత్తులు, వీటిని సమభాగములుగ తగుమైన కుండయందునిచి పాతాళయంత్రముచే నందు తైలముదీసి శరీరమునకు లేపనముజేసికొనిన విసర్పి, విస్ఫోటకము, ఇవి నశించు.

శ్లో. పటోలామృతభూనింబవాసారిష్టకపర్పటైః
ఖదిరాష్టయుతైః క్వాథో విస్ఫోటజ్వరశాంతయే.

తా. చేదుపొట్ల, తిప్పతీగె, సీమనేలవేము, అడ్డసరపాకు, వేపపట్ట, పర్పాటకము, ఖదిరాష్టకము, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి పుచ్చుకొనిన విస్ఫోటకజ్వరము నివృత్తియగు.

శ్లో. దూర్వావచోదుంబరజంబుశాలసప్తచ్ఛదాశ్వత్థకషాయకల్కైః
సిద్ధం హి సర్వజ్వరదాహపాకవిస్ఫోటశోఫాన్వినిహంతి సర్పిః.

తా. గరికెవేళ్లు, వస, అత్తిపట్ట, నేరేడుపట్ట, మద్దిపట్ట, ఏడాకుల అరటిగడ్డ, రావిపట్ట, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి దీనికి సమముగ నెయ్యి కలిపి ఘృతపక్వముగ కాచి యందొకతులము సేవించిన జ్వరములు, నోటిపుండ్లు, విస్ఫోటకములు, శోఫలు, ఇవియన్నియు నశించు.

ఇట్లు విసర్పి, విస్ఫోటకచికిత్స ముగిసెను.

## మసూరికా లక్షణము.

శ్లో. స్ఫోటాః కృష్ణారుణా దాహాస్తీవ్రవేదనయాన్వితాః
మసూరాకృతిసంస్థానాః పిటికాస్స్యుర్మసూరికాః.

తా. కృష్ణవర్ణము, రక్తవర్ణము, వేడిమి, తీవ్రమైన వేదన, వీటితోగూడి "చిరిశనగలాకృతింబోలిన" పిటికలు జనించు. (ఇదియ మసూరికారోగ మనబడు.)

శ్లో. తాసాం పూర్వజ్వరః కండూ గాత్రభంగోఽరుచిర్భ్రమః
త్వచి శోఫశ్చ వైవర్ణ్యం నేత్రరోగశ్చ జాయతే.

తా. మరియు మసూరికారోగము జనించుటకుముందుగ జ్వరము, దురద, ఒడలువిరుపు, అరుచి, భ్రమ, శోఫ, వైవర్ణ్యము, నేత్రములకు బాధ, ఇవి గలుగు.

## మసూరికా చికిత్స.

శ్లో. నిశాద్వయోశీరశిరీషముస్తకై
స్సలోధ్రభద్రశ్రియనాగకేసరైః
పటోలమాలారుణతండులీయకైః
పిబేద్దరిద్రామలకల్కసంయుతమ్.

మసూరీవిస్ఫోటవిసర్పి శాంతయే
తథా సరోమాంచవమిజ్వరాపహః.

తా. మ్రానిపసపు, పసపు, వట్టివేళ్లు, దిరిశనపువిత్తులు, తుంగగడ్డలు, లొద్దుగ పట్ట, శ్రీగంధము, నాగకేసరములు, చేదుపొట్ల, తామరగడ్డలు, వాయువిళంగములు, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి యందు కొంచముగ పలువుచూర్ణము, ఉశీరికవరుగుచూర్ణము, కలిపి త్రాగిన మసూరిక, విస్ఫోటకము, విసర్పి, గగుర్పాటు, వాంతి, జ్వరము, ఇవియన్నియు నశించు.

శ్లో. పంచవల్కలచూర్ణేన క్లేదనీమవచూర్ణయేత్
భస్మనా కేచిదిచ్ఛంతి తిలచూర్ణైస్తథాపరే.

తా. పంచవల్కల చూర్ణకల్కము, పంచవల్కల క్షారము, నువ్వులచూర్ణము, వీటిని సేవించుటచే మసూరికాదిరోగంబులు హరించు.

ఇట్లు మసూరికాచికిత్స ముగిసెను.

## స్నాయుకలక్షణము.

శ్లో. కుర్యాత్తంతునిభం సూత్రం శ్వయధుం జనయత్యపి
శనైశ్శనైః క్షతాద్యాతి పునస్థ్సానాంతరం భజేత్.
సస్నాయుక ఇతి ఖ్యాతః క్రియోక్తాత్ర విసర్పివత్.

తా. దేహంబున "సూత్రతంతువులభంగి శోఫగలిగి" అందు మెల్లమెల్లగ క్షతంబు లుత్పన్నంబులై దేహంబంతయు క్రమముగ వ్యాపించు. ఇదియ స్నాయుకంబన బరంగు. ఈ స్నాయుకరోగంబునకు విసర్పికివలె చికిత్సలం జేయవలయు.

## స్నాయుకచికిత్స.

శ్లో. గవ్యం సర్పిస్త్ర్యహం పీత్వా నిర్గుండీస్వరసం త్ర్యహమ్
పీత్వా స్నాయుకమత్యుగ్రం హంత్యవశ్యం న సంశయః.

తా. మూడుదినములు ఆవునెయ్యి త్రాగి పిదప మూడుదినంబులు వావిలిసమూలమును నుదకముచే దంచి రసముదీసి కించిదుష్ణముజేసి పానంబొనర్చిన నత్యుగ్రంబులగు స్నాయుకరోగములు నిస్సంశయముగ నశించు.

శ్లో. కుష్ఠరామఠశుంఠీభిః కల్కశ్శిగ్రుసమన్వితః
పానలేపనయోగేన జంతుపీడావినాశనః.



తా. కోష్ఠు, ఇంగువ, శొంఠి, మునగపట్ట, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి యం దుదకముకలిపి కల్కముజేసి పుచ్చుకొనుటయ గాక శరీరంబునకు లేపనము జేసి కొనిన స్నాయుకజనితజంతుజాడ్యములు నశించు.

శ్లో. శిగ్రుమూలఫలైః పిష్టైః కాంజికేన ససైంధవైః
లేపనం లశునం చాగ్నిరాజికాపిండికాదికే.

తా. మునగవేరుపట్ట, మునగవిత్తులు, సైంధవలవణము, వీటిని సమభాగములుగ పుల్లనికలితో నూరి శరీరమునకు లేపనముజేసినను, లేక వెల్లుల్లి, చిత్రమూలము, ఆవాలు, వీటిని సమభాగములుగ నుదకముచే నూరి శరీరమునకు లేపనముజేసినను, స్నాయుకము, పిండికము, (అనగా బొబ్బలు) ఇవి నివృత్తియగు.

వాక్యమ్. గుడూచీరసేన టంకణక్షారః పేయః. అథవా శణబీజం భాగమేకం గోధూమపిష్టం భాగమేకం ద్వయమేకీకృత్య ఘృతేన పక్తవ్యమ్. గుడేన త్రిదినం భక్షయిత్వా స్నాయుకో నశ్యతి.

తా. తిప్పతీగరసముతో వెలిగారభస్మము కలిపి సేవించినను లేక జనపవిత్తులొకభాగము, గోధుమపిండి యొకభాగము, తగుమాత్రముగ నెయ్యి కలిపి కించిదుష్ణము జేసి బెల్లముతో మూడుదినములు భక్షించిన స్నాయుకరోగము నశించు.

ఇట్లు స్నాయుకరోగచికిత్స ముగిసెను.

## క్షుద్రరోగలక్షణము.

శ్లో. స్నిగ్ధాస్సవర్ణా గ్రథితాస్సరుజాముద్గసన్నిభాః
గ్రంథయోష్టాంగదేశేషు క్షుద్రాస్తేత్ర క్వచిత్క్వచిత్.
దారుణశ్చేంద్రలుప్తాదిపలితం క్షుద్రసంజ్ఞితమ్
సర్వేషాం పంచకం చైవ కుర్యాదాదౌ యథాక్రమమ్.

తా. దట్టమై, సవర్ణము, నొప్పి, వీటితోగూడి "పెసలంబోలిన" గ్రంథులు శరీరంబునందలి యెనిమిదియంగములయం దొక్కొకచో జనింపుచున్నయవి. మఱియు దారుణము, ఇంద్రలుప్తము, పలితము, ఇవి మొదలగు నలువదినాలుగు క్షుద్రరోగంబులు గలవు. వాటికి నయిదువిధంబులగు నుపచారములను క్రమముగ నొనర్పవలయు.

## క్షుద్రరోగచికిత్స.

శ్లో. త్రిఫలాగుగ్గులుస్సేవ్యః పశ్చాద్బాహ్యప్రలేపనమ్
శస్త్రేణోత్కృత్య వల్మీకం క్షారాగ్నిభ్యాం ప్రసాధయేత్.

తా. త్రిఫలగుగ్గిలమును సేవించుటయ గాక దానిసే శరీరమునకు లేపనముజేసి కొనినను, లేక శస్త్రములచే దుర్మాంసములను భేదించి క్షారములు, అగ్నికర్మలు, వీటిని గావించినను, వల్మీక మను వ్రణము స్వస్థంబగు.

శ్లో. మనశ్శిలాలంభల్లాతసూక్ష్మైలాగరుచందనైః
జాతిపల్లవకల్కైశ్చ నింబతైలం విపాచయేత్.
వల్మీకం నాశయేత్తైలం బహుచ్ఛిద్రం బహూభృతమ్.

తా. మణిశిల, హరితాళకము, జీడిగింజలు, చేదుజీలకర్ర, సన్నఏలకులు, అగరుచెక్క, శ్రీగంధము, జాజిచిగురు, వీటిని సమభాగములుగ నుదకముచే నూరి కల్కము జేసి దీనికిసమముగ వేపవిత్తుల నూనెకలిపి తైలపక్వముగ కాచి వడియగట్టుకొని * వల్మీకమునకు లేపనముజేసిన నది నశించు.

శ్లో. ప్రియంగూచందనం లోధ్రం కుష్ఠం పాండువటచ్ఛదమ్
కాలీయకాన్వితం తైలం కుర్యాచ్చంద్రనిభం ముఖే.

(తా. ప్రేంకణపుపువ్వులు, శ్రీగంధము, లొద్దుగపట్ట, కోష్ఠు, పండిన మఱ్ఱియాకులు, మానిపసుపు, వీటిని సమభాగములుగ నుదకముచే నూరి కల్కముజేసి యందు నువ్వుల నూనెబోసి తైలపక్వముగ కాచి ముఖమునకు లేపనముజేసికొనిన మంగు, ముఖమునలుపు, ఇవి హరించు. ముఖము చంద్రుని సమానంబగు.)

శ్లో. లోధ్రధాన్యవచాలేపస్తారుణ్యపిటికాపహః
తద్వద్గోరోచనాయుక్తైర్మరిచైశ్చ ప్రలేపనమ్.
సిద్ధార్థకవచాలోధ్రసైంధవైశ్చ ప్రలేపనమ్
గవ్యేన చార్జునం త్వగ్వా మంజిష్ఠావాసమాక్షికా.
కంటకైశ్శాల్మలేర్యైశ్చ క్షీరపిష్టైర్విలేపయేత్
ముఖే తారుణ్యపిటికాస్సంక్షయం యాంత్యశేషతః.

తా. లొద్దుగపట్ట, ధనియాలు, వస, వీటినైనను, లేక గోరోచనము, మిరియాలు, వీటినైనను, లేక తెల్లావాలు, వస, లొద్దుగపట్ట, సైంధవలవణము, వీటినైనను నుదకముచే నూరి లేపనము జేసికొనినను లేక మద్దిపట్ట, మంజిష్ఠ, అడ్డసరము, వీటిని ఆవుపాలచేతను, తేనెచేతను, నూరి లేపనము జేసికొనినను, లేక బూరుగముండ్లను ఆవుపాలచే నూరి లేపనము జేసికొనినను, ముఖమునందు యౌవనంబున జనించెడి మొటిమలు, మంగు, ఇవి నివృత్తియగు.

---

* వల్మీకంబనగా.—పాముపుట్టవలె గ్రంథులు జనించి దుర్మాంసపూరితమైయందనేకఛిద్రములుగలిగి చీముస్రవింపుచు మిగులబాధతో గూడియుండెడి వ్రణము,



శ్లో. పురాణమథ పిణ్యాకం పురీషం కుక్కుటస్య చ
మూత్రే పిష్ట్వా ప్రలేపోఽయం శీఘ్రం హన్యాదరుంషికామ్.

తా. పాతగానుగపిండి, కోడిమలము, వీటిని గోమూత్రముచే నూరి లేపనము జేసికొనిన కపాలంబున జనించి యనేక ఛిద్రంబులతోగూడి చీము స్రవింపుచుండెడి అరుంషిక యనువ్రణము నశించు.

ఖదిరారిష్టజంబూనాం త్వగ్భిర్వా మూత్రసంయుతైః
కుటజత్వక్సైంధవైర్వా లేపాద్ధన్యాదరుంషికామ్.

తా. చంద్రపట్ట, వేపపట్ట, నేరేడుపట్ట, వీటిని గోమూత్రముచే దంచి రసము దీసి శిరస్సుకు లేపనము చేసికొనినను, లేక కొడిశపట్ట, సైంధవలవణము, వీటిని గోమూత్రముచే నూరి లేపనము జేసికొనినను, అరుంషిక యనుశిరోవ్రణము నశించు.

శ్లో. అరుంషికాం జలౌకాభిర్బహుశో గ్రాహయేద్భిషక్
ప్రక్షాళయేన్ముఖం తక్రసైంధవక్వాథవారిభిః.
ముహుర్ముహుస్తతో లింపేత్పటోలారిష్టవాసకైః
నింబోదకేన లవణైస్తతో హన్యాదరుంషికా.

తా. అరుంషిక యనుశిరోవ్రణమునకు ప్రతిదినంబును జలగలనంటించి రక్తమును స్రవింపంజేసి పిదప మజ్జిగలో సైంధవలవణమును వైచి గాచి దీనిచే యావ్రణమును కడుగుటయ గాక చేదుపొట్ల, వేపపట్ట, అడ్డసరము, సైంధవలవణము వీటిని సమభాగములుగ నిమ్మపండ్లరసముచే నూరి లేపనము జేసికొనిన నది నశించు. ఇక శిరస్సునందలి రోమసమూహంబున జనించెడి దారుణంబులకు చికిత్సల వచించెద.—

శ్లో. ఆమ్రబీజస్య చూర్ణంతు శివాచూర్ణం సమం ద్వయమ్
దుగ్ధే పిష్ట్వా ప్రలేపోయం దారుణం హంతి దారుణమ్.

తా. మామిడిపప్పు చూర్ణమునకు సమముగ ఉశిరికవరుగుచూర్ణమును కలిపి ఆవుపాలచే చక్కగ నూరి లేపనము జేసికొనిన దారుణం బనుపుండ్లు నశించు.

శ్లో. భృంగరాజరసేనైవ లోహకిట్టం పలత్రికమ్
సారిబాం చ పచేత్కల్కైస్తైలం దారుణనాశనమ్.
అకాలపలితం కండూమింద్రలుప్తం చ నాశయేత్.

తా. మూడుపలముల లోహకిట్టమును గుంటగలగరాకు రసముచేతను, సుగంధిపాలవేళ్ళ రసముచేతను, చక్కగ మర్దించి దీనికిసమముగ నువ్వులనూనె కలిపి తైలపక్వముగ కాచి యా తైలమును ప్రత్యహము నభ్యంజనము గావించికొనిన దారుణము నశించుటయ గాక నకాలంబున నరసినవెంట్రుకలు సగా నల్లనగు. మఱియు దురద, ఇంద్రలుప్తము, ఇవి నశించు. (ఇది భృంగరాజతైలము.)

శ్లో. కంటకారీఫలరసైస్తుల్యం తైలం విపాచయేత్
జపాపుష్పద్రవైర్వాథ తల్లేపో దారుణప్రణుత్.

తా. వాకుడుపండ్ల రసంబుననైనను, దాసానిపువ్వుల రసంబుననైనను, సమముగ నువ్వులనూనె బోసి తైలపక్వముగ కాచి లేపనము జేసికొనిన దారుణములు నివృత్తియగు.

శ్లో. పారదం మర్దయేన్నిష్కం కృష్ణదుత్తూరకద్రవైః
నాగవల్లీద్రవైర్వాథ వస్త్రఖండంప్రలేపయేత్.
తద్వస్త్రం మస్తకే వేష్ట్య ధార్యేయామత్రయం తతః
యూకాః పతంతి నిశ్చేష్టాః పరీక్షా నాత్రసంశయః.

తా. నిష్కప్రమాణము పాదరసమును నల్లఉమ్మెత్తాకు రసముచేనైనను, కమ్మగితమలపాకు రసముచేనైనను, చక్కగ మర్దించి యొకవస్త్రంబునకు లేపనముజేసి దానిని మూడుఝాములు శిరస్సున కట్టియుంచిన నిస్సంశయంబుగ యందలిపేలు మలమల మాడి భస్మంబగు. (ఇది శ్రేష్ఠంబైన క్రియ.)

శ్లో. కోద్రవాణాం తృణక్షారపానీయం పరిధావనే
కుర్యాద్దారుణికే మూర్ధ్ని లేపోవా మధుసంయుతః.

తా. ఆరికగడ్డిని కాల్చి క్షారముజేసి యం దుదకముకలిపి దీనిచే దారుణంబులుగు పుండ్లుగల శిరస్సును ప్రక్షాళనముజేసినను, లేక పైక్షారంబున తేనె కలిపి లేపనముజేసినను, దారుణములు నశించు.

ఇట్లు క్షుద్రరోగంబున దారుణాదిచికిత్స ముగిసెను.

## * ఇంద్రలుప్తచికిత్స.

శ్లో. ఇంద్రలుప్తే మహాలేపో మధునా బృహతీరసః
గుంజామూలఫలం వాపి భల్లాతకరసేఽపి వా.

తా. వాకుడుపండ్లరసమున తేనె కలిపి లేపనముజేసినను, జీడిగింజల నూనెతో గురిగింజవేరునైనను, గురిగింజలనైనను, గంధముదీసి లేపనముజేసినను, ఇంద్రలుప్తము నశించు.

శ్లో. ప్రియాళుబీజమధుకకుష్ఠమాషైస్ససైంధవైః
గుంజాఫలైశ్చిరం లింపేత్కేశభూమిం సమంతతః.

తా. సారపప్పు, అతిమధురము, కోష్ఠు, ఉద్దిపప్పు, సైంధవలవణము, తెల్లగురిగింజలు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి యందు టెంకాయపాలు కలిపి శిరస్సుకు

* ఇంద్రలుప్తంబనగా,—పేలు కొరకుజాడ్యము.



లేపనముజేసిన బహుకాలంబుగ వెంట్రుకలు లేకయుండెడి బట్టశిరస్సున సగానధికంబుగ వెంట్రుక లుత్పన్నంబులగు.

శ్లో. గుంజాపత్రవిషం తైలం లాక్షామధుకకాంజికమ్
పతంత్యనేన నో కేశా లేపా ద్రోహంతి చ ద్రుతమ్.

తా. గురిగింజాకు, వసనాభి, లక్క, అతిమధురము, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి పుల్లనికలితో నూరి యం దధికముగ నువ్వులనూనె బోసి తైలపక్వముగ కాచి వెంట్రుకలు రాలిపోయిన బట్టశిరస్సుకు లేపనముజేసిన నవీనముగ వెంట్రుక లుద్భవిల్లు.

ఇట్లు క్షుద్రరోగంబున ఇంద్రలుప్తచికిత్స ముగిసెను.

## * కేశకృష్ణీకరణచికిత్స.

శ్లో. త్రిఫలా నీలినీపత్రం లోహం భృంగరసైస్సమమ్
అవిమూత్రేణ సమ్మిశ్రం కృష్ణీకరణ ముత్తమమ్.

తా. కరక్కాయలు, తానికాయలు, ఉశిరికవరుగు, నీలియాకు, లోహచూర్ణము, వీటిని సమభాగములుగ గుంటగలగరరసము, గొర్రెమూత్రము, వీటిచే జక్కగ మర్దించి వెంట్రుకలకు లేపనముజేసిన నకాలంబున నరసినవెంట్రుకలు నల్లనగు.

శ్లో. అయోరజోభృంగరాజత్రిఫలాకృష్ణమృత్తికా
సితమిక్షురసే మాసం లేపనాత్పలితం జయేత్.

తా. లోహచూర్ణము, గుంటగలగరాకు, కరక్కాయలు, తానికాయలు, ఉశిరికవరుగు, రేగటిమన్ను, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి చెరకురసంబున ముప్పది దినములు నానబెట్టి అకాలంబున నరసినవెంట్రుకలకు లేపనముజేసిన నవి నల్లనగు.

శ్లో. ధాత్రీ పలద్వయం పథ్యే ద్వే తథైకం విభీతకమ్
పంచామ్రమజ్జాలోహస్య కర్షైకంచ ప్రదీయతే.
పిష్ట్వా లోహమయే భాండే స్థాపయేదుషితం నిశి
లేపోయం హంతి నచిరాదకాలపలితం మహత్.

తా. ఉశిరికవరుగు ౨ పలములు, కరక్కాయలు ౨ ప, తానికాయ ౧ ప, మామిడిపప్పు ౫ ప, లోహచూర్ణము ౧ తులము, ఇటుల వీటినెల్ల చూర్ణముజేసి ఇనుప

* కేశకృష్ణీకరణంబనగా—తెల్లవెంట్రుకలు నల్లగనగుట.

పాత్రయందు వైచి యందు నువ్వులనూనె బోసి మర్దించి యొకరాత్రి నానబెట్టి మరు దినమున వెంట్రుకలకు లేపనముజేసిన నకాలంబున నరసిన వెంట్రుకలు నల్లనగు.

ఇట్లు క్షుద్రరోగంబున కేశకృష్ణీకరణచికిత్స ముగిసెను.

---

## పామాచికిత్స.

శ్లో. ప్రపున్నాటస్య బీజాని వాకుచీసర్షపాస్తిలాః
కుష్ఠం నిశాద్వయం ముస్తం పిష్ట్వా తక్రేణ చైకతః.
ప్రలేపాదస్య నశ్యన్తి కండూపామావిచర్చికాః.

తా. తగిరిశవిత్తులు, భావంచివిత్తులు, ఆవాలు, నువ్వులు, కోష్ఠు, మానిపసుపు, పసుపు, తుంగగడ్డలు, వీటిని సమభాగములుగ మజ్జిగతో నూరి లేపనముజేసిన దురద, తీటపుండ్లు, విచర్చిక యనుకుష్ఠువు, ఇవి నశించు. (పామ అనగా గజ్జి.)

శ్లో. రసద్విజీరద్వినిశామరీ చ గ్రైత్యేంద్రసిందూరమనశ్శిలానామ్.
చూర్ణీకృతానాం ఘృతమిశ్రితానాం త్రిభిః ప్రలేపై రపయాతి [పామా.

తా. పాదరసము, నల్లజీలకఱ్ఱ, చేదుజీలకఱ్ఱ, మానిపసుపు, పసుపు, మిరియాలు, గంధకము, గంగసిందూరము, మణిశిల, వీటిని సమభాగములుగ నేతితో నూరి మూడు దినంబులు లేపనముచేసిన దురద, గజ్జి, ఇవి నశించు.

శ్లో. అర్కపత్రరసే పక్వం హరిద్రాకల్కసంయుతమ్
నాశయేత్సార్షపం తైలం పామా కండూవిచర్చికా.

తా. జిల్లేడాకురసంబున పసుపుచూర్ణంబును, ఆవాలతైలమును కలిపి కించిదుష్ణముజేసి లేపనముజేసిన తీట, దురద, విచర్చిక, ఇవి నశించు.

శ్లో. అశ్వత్థస్య త్వచో భస్మచూర్ణేన సహ మిశ్రితమ్
నవనీతం ద్వయో స్తుల్యం మర్ద్యం తేన ప్రలేపయేత్.
ఆసనే గుదపార్శ్వే చ కటిస్థాం పిటికాం జయేత్.

తా. రావిపట్టక్షారంబునకు సమముగ క్రొత్తరాతిసున్నమును కలిపి యీ రెంటికి సమముగ వెన్నకలిపి మర్దించి లేపనముజేసిన ఆసనము, గుదపార్శ్వములు, కటిస్థానము, గజ్జలు, వీటియందలి తీటలు నశించు.

ఇట్లు క్షుద్రరోగంబున పామాచికిత్స ముగిసెను.

---



## అగ్నిదగ్ధమునకుచికిత్స.

శ్లో. యవా న్దగ్ధ్వా మషీ కార్యా తైలేన యుతయా తయా
దద్యా త్సర్వాభిదగ్ధేషు ప్రలేపం వ్రణరోపణమ్.

తా. యవలను కాల్చి మసిజేసి యందు టెంకాయనూనె కలిపి అగ్నిదగ్ధంబులైన బొబ్బలు మొదలగు వ్రణములకు లేపనముజేసిన నవి నివృత్తియగుటయ గాక మాంసపూరితంబులై స్వస్థంబులగు.

శ్లో. సిక్థం సర్జరసో జీరం ఘృతపక్వం త్ర్యహం హరేత్
లేపతో వహ్నిదగ్ధస్య దుఃఖం మృత్యుంజయో యథా.

తా. రాళము, సర్జరసము, జీలకఱ్ఱ, వీటిని చూర్ణముజేసి నేతిలో కలిపి యందు తేనెమైనము వైచి యామయినము కరుగువరకు కాచి సాంగశీతలమున గ్రహించి అగ్నిచే దగ్ధంబులైన వ్రణాదులకు లేపనముజేసిన "ప్రపంచపరిపాలకుడగు ఫాలాక్షునిచే నార్తులదుఃఖంబులు నివృత్తియగుమాడ్కి" నవి నివారణమగు.

శ్లో. మధూచ్ఛిష్టం సమధుకం లోధ్రం సర్జరసం తథా
మంజిష్ఠాచందనం మూర్వా పిష్ట్వా సర్పిర్విపాచయేత్.
సర్వేషా మగ్నిదగ్ధానా మేతద్రోపణ ముత్తమమ్.

తా. అతిమధురము, లొద్దుగపట్ట, రాళము, మంజిష్ఠి, శ్రీగంధము, చాగవేళ్ళు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి యందు నెయ్యి, తేనెమైనము, వైచి చక్కగ కాచి సాంగశీతలమున గ్రహించి యగ్నిచే దగ్ధంబులైన బొబ్బలు మొదలగువ్రణంబులకు లేపనముజేసిన నవి నశించు.

ఇట్లు క్షుద్రరోగంబున అగ్నిదగ్ధచికిత్స ముగిసెను.

---

## అంగసుగంధకరణచికిత్స.

శ్లో. తాంబూలాపత్రచూర్ణం తు చూర్ణం కుష్ఠశివాభవమ్
వారిణా లేపనం కుర్యా ద్గాత్రదౌర్గంధ్యనాశనమ్.

తా. తమలపాకులు, కోష్ఠు, ఉశిరికవరుగు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి యం దుదకముబోసి నూరి శరీరమునకు లేపనముజేసిన శరీరమందలి దౌర్గంధ్యము నశించు.

శ్లో. ఇత్యాదిబహవో యోగాః క్షుద్రరోగా స్త్వనేకధా
తేనాత్ర కథితా ముఖ్యా యుక్త్యా కరుణయా మయా.

తా. ఇట్టియోగంబులును, క్షుద్రరోగంబులును ననేకంబులు గలవు. కావున గ్రంథవిస్తరభీతిచే నిందు ముఖ్యంబులగు కొన్ని చికిత్సలనుమాత్రము నుదహరించినాడను.

ఇట్లు క్షుద్రరోగంబున అంగసుగంధకరణచికిత్స ముగిసెను.

### ముఖరోగలక్షణము.

శ్లో. ముఖే హ్యష్టగదాదంతే వేష్టగా దంతగా స్తథా
అనుజిహ్వాగతా స్తాలుగతా గళగతా స్తథా.
ముఖరోగాః పంచషష్టిస్సప్తస్వాయతనేషు చ
పృథగ్లక్షణమేతేషాం విస్తరా న్నాత్ర లేఖితమ్.

తా. ముఖము, పెదిమలు, ఇగుళ్ళు, దంతములు, నాలుక, తాలు, కంఠము, వీటియందు దఱువదియైదు విధంబులగు రోగంబులు జనింపుచున్నయవి గాన వాటిలక్షణంబులనెల్ల వివరించుటవలన గ్రంథవిస్తరం బగునని భీతిచే విరమించినాడను.

### ముఖరోగచికిత్స.

శ్లో. శ్రీవేష్టకం సర్జరసం సురదారుం సగుగ్గులుమ్
యష్టీమధుకసంచూర్ణ మోష్ఠజే ప్రతిసారిణమ్.

తా. దేవదారుబంకచే జేయబడిన ధూపద్రవ్యము, సర్జరసము, దేవదారుపట్ట, గుగ్గిలము, అతిమధురము, వీటిని సమభాగములుగ నుదకముచే నూరి లేపనము జేసిన పెదిమలయందు జనించెడి ప్రతిసారిణి యనురోగము నశించు.

శ్లో. శీతాదే స్స్రావ్యరక్తం చ తోయే నాగరసర్షపామ్
నిష్క్వాథ్య త్రిఫలాముస్తాం గండూష స్సరసాంజనః.
ప్రియంగవశ్చ ముస్తా చ త్రిఫలా చ ప్రలేపనమ్.

తా. శీతగాలిచే పెదిమలుపగిలి రక్తము స్రవింపుచుండిన శొంఠి, ఆవాలు, కరక్కాయలు, తానికాయలు, ఉశిరికవరుగు, తుంగగడ్డలు, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి యందు రసాంజనము కలిపి పుక్కిలించి యుమ్మివేయుటయ గాక కొఱ్ఱబియ్యము, తుంగగడ్డలు, కరక్కాయలు, తానికాయలు, ఉశిరికవరుగు, వీటిని సమభాగములుగ నుదకముచే నూరి పెదిమలకు లేపనము జేసిన నది నివృత్తియగు.

శ్లో. జాతీపత్రామృతాద్రాక్షాయాసదార్వీఫలత్రికైః
క్వాథః క్షౌద్రయుత శ్శీతో గండూషై ర్ముఖపాకజిత్.



తా. జాపత్రి, తిప్పతీగ, దీపద్రాక్ష, దురదగొండివేరు, మానిపసుపు, కరక్కాయలు, తానికాయలు, ఉశిరికవరుగు, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి యందు తేనె కలిపి పుక్కిలించి యుమ్మివేసిన నోటిపుండ్లు హరించు.

శ్లో. పటోలశుంఠీత్రిఫలా విశాలాత్రాయంతితిక్తాద్వినిశామృతానామ్
పీతః కషాయో మధునా నిహంతి చిరస్థితానాస్యగదా నశేషాన్.

తా. చేదుపొట్ల శొంఠి, కరక్కాయలు, తానికాయలు, నెల్లివరుగు, వెట్టిపుచ్చవేరు, కలుక్రానుగవేరు, కటుకరోహిణి, మానిపసుపు, పసుపు, తిప్పతీగ, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి యందు తేనె కలిపి పుచ్చుకొనిన బహుకాలంబుగ బాధింపుచుండెడి నోటిపుండ్లు, గుల్లలు, ఇవియన్నియుం నివారణమగు.

శ్లో. కటుకాతివిషాదారుపాఠాముస్తకలింగకైః
గోమూత్రక్వథితః పేయః కంఠరోగవినాశనః.

తా. కటుకరోహిణి, అతివస, దేవదారు, అగరుశొంఠి, తుంగగడ్డలు, కొడిశపట్ట, వీటిని సమభాగములుగ దంచి గోమూత్రముచే కషాయముబెట్టి త్రాగిన కంఠరోగము నశించు.

శ్లో. గృహధూమో యవక్షారః పాఠా వ్యోషం రసాంజనమ్
తేజోహ్వా త్రిఫలా లోధ్రం చిత్రకశ్చేతి చూర్ణితమ్.
సక్షౌద్రం ధారయేదేతద్గళరోగవినాశనమ్.

తా. కరుధూపము, యవక్షారము, అగరుశొంఠి, పిప్పలి, మిరియాలు, రసాంజనము, తేజోవతివిత్తులు, కరక్కాయలు, తానికాయలు, ఉశిరికవరుగు, లొద్దుగపట్ట, చిత్రమూలము, వీటిని సమభాగములుగ చూర్ణముచేసి యందు తేనె కలిపి ఖల్వమున చక్కగ మర్దించి రేగుబండంత మాత్రలుచేసి యం దొకమాత్రను పుక్కిట నునిచికొని దానిరసమును మ్రింగుచుండిన కంఠరోగము నశించు.

శ్లో. యష్టీశుంఠీతిలక్వాథో గండూషం తేన కారయేత్
భోజనం ముద్గమిశ్రం చ ముఖపాకప్రశాంతయే.

తా. అతిమధురము, శొంఠి, నువ్వులు, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి పుక్కిలించి యుమ్మివేసి, పెసరపప్పుచే చేయబడిన పులగమును భక్షించిన ఆస్యపాకము నశించు.

శ్లో. క్వాథో దార్వ్యాయుతః క్షౌద్రై ర్గండూషై ర్ముఖపాకజిత్
ఆస్యరోగహరం ఖాదే న్మధునా పార్పటం రసమ్.

తా. మానిపసుపును కషాయముబెట్టి యందు తేనె కలిపి పుక్కిలించి యుమ్మి వేసినను, లేక పర్పాటకమును కషాయముబెట్టి యందు తేనె కలిపి పానం బొనర్చినను, ముఖరోగము నశించు.

శ్లో. స్వరసో మాతులుంగస్య సంయుతో మధుసర్పిషా
తాలుదేశే ప్రలేపోఽయం మూర్ధ్ని దేయ స్ససైంధవః.

తా. మాదీఫలపుస్వరసములో తేనె, నెయ్యి, సైంధవలవణము, వీటిని కలిపి దవడలు, కపాలము, వీటికి లేపనముజేసిన. ముఖరోగము నివారణమగు.

శ్లో. లాజాజాజీఫలంపూగంతుల్యం భక్ష్యం పిబేదను
శీతతోయం పలార్ధం చ హ్యాస్యవైరస్యశాంతయే.

తా. వరిపేలాలు, జాజికాయలు, వక్కలు, వీటిని సమభాగములుగ చూర్ణము చేసి అరపలము శీతోదకంబున వయిచి త్రాగిన ముఖరోగములు నివారణంబగుటయ గాక జిహ్వకును రుచిగలుగు.

శ్లో. కటుతిక్తకషాయేణ దంతకాష్ఠేన నిత్యశః
దుర్గంధం హంతి నోచిత్రం క్షౌద్రైర్వా కుష్ఠచూర్ణకమ్.

తా. చేదు, కారము, వగరు, గల కాష్ఠంబులచే దంతధావనం బొనర్చినను లేక కోష్ఠువును చూర్ణముజేసి యందు తేనెబోసి నూరి దంతధావనము జేసినను, నోటి దుర్గంధము నిస్సంశయముగ హరించు.

శ్లో. జాతీనింబపటోలం చ మాలతీనవపల్లవాః
పంచపల్లవకశ్శ్రేష్ఠః కషాయో ముఖధావనే.

తా. జాజికాయ, వేపచిగుళ్ళు, చేదుపొట్ల, జాజియాకులు, మామిడి, మల్లె, అత్తి, రావి, జువ్వి, వీటిచిగుళ్ళను సమభాగములుగ దంచి కషాయముబెట్టి పుక్కిలించి యుమ్మివేసిన దంతములనొప్పి, నోటిఅరుచి, ఇవి నివృత్తియగు.

శ్లో. ముఖదంతగళజా రోగాః ప్రాయః కఫేన భూయిష్ఠాః
తస్మాత్తేషా మసకృద్రుధిరం స్రావేద్దుష్టమ్.

తా. ముఖము, దంతములు, కంఠము, వీటియం దనేకరోగంబులు కఫోద్రేకముచే జనించు గాన వాటియందలి దుష్టరక్తంబును స్రవింపంజేసిన నవి నివృత్తియగు.

శ్లో. జాతిప్రవాళత్రిఫలాయవాసదారుత్రియామామృతగోస్తనీనామ్
కషాయకంక్షౌద్రయుతో నిహంతి నరస్య పాకం ముఖపంకజస్థమ్.



తా. జాజిచిగుళ్ళు, కరక్కాయ, తానికాయ, ఉశిరికవరుగు, దురదగొండివేరు, మానిపసుపు, పసుపు, తిప్పతీగ, నల్లద్రాక్ష, వీటిని సమభాగములుగ దంచి కషాయము బెట్టి యందు తేనె కలిపి త్రాగిన ముఖరోగము నివృత్తియగు.

శ్లో. ఖదిరస్య తులాం సమ్యగ్జలద్రోణే విపాచయేత్
శేషాష్టభాగే క్వాథేస్మిన్నేతాని ప్రతివాపయేత్.
జాతికర్పూరపూగాని కంకోలకఫలానిచ
ఏతేషాం గుటికా కార్యా ముఖసౌభాగ్యవర్ధినీ.
దంతోష్ఠముఖరోగేషు జిహ్వాతాల్వామయేషు చ.

తా. ౧౦౦ తులముల చండ్రచావను దంచి యందు ద్రోణప్రమాణము ఉదకము బోసి అష్టాంశముగ కషాయము కాచి యాకషాయముచే జాపత్రి, పచ్చకర్పూరము, వక్కలు, కంకోళములు, వీటిని ఖల్వమున మాత్రపక్వమగువరకు మర్దించి రేగుబండంత మాత్రలుచేసి నీడన యెండించి ప్రాతస్సాయంకాలములయందు రెండుమాత్రలచొప్పున భక్షించిన ముఖము, దంతము, తాలు, జిహ్వ, వీటియందలి రోగంబులన్నియుం నివృత్తియగు. (ఇది ఖదిరగుటికలు.)

శ్లో. ఉపజిహ్వాం తు సంలిఖ్య క్షారేణ ప్రతిసారయేత్
వ్యోషక్షారాభయావహ్నిచూర్ణ మేతత్ప్రఘర్షణమ్.

తా. చిన్ననాలుక పడినవారికి శుద్ధిజేసిన వెలిగారభస్మమును జిహ్వకు లేపనము జేయుటయ గాక శొంఠి, పిప్పళి, మిరియాలు, యవక్షారము, కరక్కాయలు, చిత్రమూలము, వీటిని సమభాగములుగ చూర్ణముచేసి జిహ్వయం దొత్తిన, యాచిన్ననాలుక యథాస్థానంబున జేరు.

శ్లో. గృహధూమారనాళేన క్వాథం సమధుసైంధవమ్
పాణినా మర్దయేచ్చాస్యముపజిహ్వాప్రశాంతయే.

తా. కరధూపమును కలిలో వైచి కషాయము కాచి యందు తేనె, సైంధవలవణమువైచి కలిపి చిన్ననాలుకకు లేపనముజేసిన నది యథాస్థానంబున జేరి శాంతిజెందు.

శ్లో. నిర్గుండీముత్పలం కందం చర్వయేదుపజిహ్వాజిత్.

తా. వావిలియాకు, నల్లకలువగడ్డలు, వీటిని నూరి రేగుపండంత భక్షించిన చిరునాలుకబాధ శాంతియగు.

శ్లో. వకుళస్యఫలం లోధ్రం వజ్రవల్లీకురంటకమ్
చతురంగుళబబ్బూల మిదం సర్వం సమం స్మృతమ్.
ఏషాం కల్కైః కషాయై ర్వాతైలపక్వం ముఖే ధృతమ్
స్థైర్యం కరోతి చలితదంతానాం ధావనేన చ.

తా. పొగడపండు, లొద్దుగపట్ట, నల్లేరు, నల్లగంటెనవేరు, గోరింటపట్ట, రేలపట్ట, నల్లతుమ్మపట్ట, వీటిని సమభాగముగ దంచి కల్కము జేసియైనను, కషాయముబెట్టియైనను నందు సమముగ నువ్వులనూనె కలిపి తైలపక్వముగ కాచి దానిని నోటియందుంచుకొనుటయ గాక దంతధావనం బొనర్చిన, చలింపుచుండెడి దంతములు గట్టియగు.

శ్లో. తుత్థలోధ్రకణాపథ్యావటువిశ్వావఘర్షణాత్
అపి ప్రచలితా దంతా జాయంతే వజ్రసన్నిభాః.

తా. శుద్ధిజేసిన మైలతుత్తము, లొద్దుగపట్ట, పిప్పళ్ళు, కరక్కాయలు, ఉప్పు, శొంఠి, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి దీనిచె చక్కగ దంతధావనము గావింపుచుండిన చలించెడి దంతములు వజ్రతుల్యంబులగు.

శ్లో. కుష్ఠం దార్వీ లోధ్రపాఠాసమంగా
ముస్తా తిక్తా తేజినీ పీతికా చ
చూర్ణం శస్తం ఘర్షణం తద్ద్విజానాం
రక్తస్రావం హంతి కండూరుజం చ.

తా. కోష్ఠు, మానిపసుపు, లొద్దుగపట్ట, అగరుశొంఠి, మంజిష్ఠి, తుంగగడ్డలు, కటుకరోహిణి, చాగవేళ్ళు, పసుపు, గాజుప్పు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి ప్రత్యహము దంతధావనం బొనర్చుచుండిన దంతములయందు స్రవించెడి రక్తము, దంతముల దురద, పండ్లనొప్పి, ఇవి హరించు.

శ్లో. దంతపుప్పుటకే కార్యం తరుణే రక్తమోక్షణమ్
సపంచలవణక్షారం సక్షౌద్రం ప్రతిసారణమ్.

తా. యౌవనంబున దంతములు పుచ్చియుండెనేని యందు ప్రథమంబున దుష్టరక్తమును స్రవింపంజేసి పిదప పంచలవణములు (అనగా సైంధవలవణము, బిడాలవణము, కాచలవణము, సౌవర్చలవణము, సముద్రలవణము) వీటిని గాల్చి క్షారముజేసి యందు తేనె కలిపి దంతధావనం బొనర్చిన దంతములయందు స్రవించెడి రక్తము, దంతములు పుచ్చుట, ఇవి హరించి దంతములకు పటుత్వంబు గలుగు.

శ్లో. కాసీసహింగుసౌరాష్ట్రి దేవదారుసమం జలైః
గుటికాం ధారయే ద్దంతకృమిశూలహరాం పరామ్.

తా. అన్నభేది, ఇంగువ, కావిరాయి, దేవదారుపట్ట, వీటిని సమభాగములుగ నుదకముచే నూరి రేగుబండంత మాత్రలుజేసి యెండించి పుక్కిటియందుంచుకొని దానిరసమును మ్రింగుచుండిన దంతములయందలి క్రిములు, శూలలు, ఇవి నశించు.

శ్లో. యవాగ్రజం తేజవతీసపాఠాం రసాంజనం దారునిశాం సకృష్ణామ్
క్షౌద్రేణ కుర్యా ద్గుటికాం ముఖేన తాం ధారయే త్సర్వగళా
[మయేషు.



తా. యవక్షారము, చాగవేళ్ళు, అగరుశొంఠి, రసాంజనము, మ్రానిపసుపు, పసుపు, పిప్పళ్ళు, వీటిని సమభాగములుగ చూర్ణముచేసి యందు తేనె కలిపి రేగుబండంత మాత్రలుజేసి పుక్కిట నునిచికొని దానిరసమును మ్రింగుచుండిన సమస్త కంఠరోగములు హరించు.

శ్లో. అభయానాం శతం తావ త్ఖండయిత్వా క్షిపే త్తతః
ఖదిరాసననింబానాం సారం వీరతరో స్తథా.
శిగ్రుగోక్షురజీవంతీదంతినాం బలయో ర్ద్వయోః
త్రివృత్పూతికరంజస్య ఘనపూరాశ్వగంధయోః.
పునర్నవారగ్వధయో ర్మూలం భల్లాతకస్య చ
ఫలం బిల్వస్య తగుణం శుష్కం ప్రస్థం పృథక్పృథక్.
మూలద్విపంచమూలానా మాఢకం సాధుకుట్టితమ్
చతుర్భాగే కృతే పాకే సప్తప్రస్థా న్రసాన్ క్షిపేత్.
బ్రాహ్మ్యా గళూచ్యా శిగ్రోశ్చ ధాత్ర్యార్ద్రికవృషస్య చ
నిశాయాః కాసమర్దస్య మహాశృంగరసస్య చ.
శతావర్యా విదార్యాశ్చ చతు ప్రస్థాన్యహానప
త్రిపిప్పలీ హరిద్రే ద్వే సోమరాజీవిభీతకమ్.
విడంగం భద్రముస్తాం చ అంకుశర్కం శిలాజతుమ్
వత్సకాతివిషాలోధ్రం మధుకం కట్ఫలం వచామ్.
మంజిష్ఠాం పద్మబీజాని పద్మకం చవ్యచిత్రకమ్
చందనేక్షురకం హింస్రాం శ్రీపర్ణీ చ దురాలభామ్.
శైలేయకమపామార్గం పాఠాం చ ఫలినీమపి
కదంబం చ శిరీషం చ శుష్కం క్షుణ్ణం పలంపలమ్.
తావద్యావద్యవాః క్లిన్నా భూయః క్వాథే పరిస్రుతే
వింశోత్తరశతం తత్ర దద్యాద్గుడపలస్య చ.
ఆలోడ్య పూతే తస్మింస్తు తైలప్రస్థం నవక్షిపేత్
పురాణసర్పిషః ప్రస్థం సహస్రం చ హరీతకీః.
జర్ఝరీకృత్య గోమూత్రే ప్రక్షాళ్య ప్రక్షిపే త్తతః
దర్వ్యా ప్రలోడ్య కర్తవ్యం మావత్స్యా ద్బుద్బుదోద్భవః.
పునశ్శీతే కృతే తస్మిన్ మధుప్రస్థద్వయం క్షిపేత్
త్రిజాతకస్య త్రిఫలం పిప్పల్యాశ్చ చతుష్పలమ్.

చూర్ణీకృత్వా సమాలోడ్య పశ్చాద్ధాన్యే నిధాపయేత్
అంతశ్శుద్ధం బహిశ్శుద్ధం నరం కృత్వా ప్రయత్నతః.
అబ్దమేకం ద్వికం త్రీణి సంబద్ధం భక్షయే త్తతః
పథ్యాహారం సమశ్నీయా త్పరిహార్యం విసర్జయేత్.
శతేన జయతి వ్యాధీన్ద్విశతేన సిరాగతాన్
శుక్లవృద్ధి స్తృతీయేన వాగ్విశుద్ధి శ్చతుర్థతః.
పంచమే నేంద్రియస్థైర్యం మేధా స్యాత్షట్ఛతేనతు
సప్తమేన జరాం హంతి కాంతి స్స్యాదష్టమేన తు.
నవమే నేశ్వరత్వం స్యా ద్దశమేన శతేన తు
అపమృత్యువిహీన స్స న్త్రిదశానపి పశ్యతి.
శతేన యే వినశ్యంతి వ్యాధయ స్తాన్బ్రవీమి తే
శోథ మేకాదశావస్థం షట్చాప్యర్శాంసి శ్లీపదమ్.
అష్టాదశాపి కుష్ఠాని హ్యూరు స్తంభం చతుర్విధమ్
వింశతిం చ ప్రమేహానాం పంచాపి చ భగందరాన్.
షట్షష్టిం ముఖరోగాంశ్చ మూత్రదోషాంశ్చ షోడశ
హంతి కాసం స్వరార్తిం చ శ్వాసం హిక్కాం తథార్దితమ్.
అష్ఠీలమపి చాధ్మానం ప్రత్యాధ్మానమసృగ్దరమ్
కామిలాం పాండురోగం చ సోమరోగం విశేషతః.
కిలాసకమపస్మార మున్మాదం క్షయవైకృతమ్
అరోచకశిరః పృష్టశూలకండూ క్రిమీనపి.
గ్రంధిమష్టప్రతిశ్యాయగ్రహణీవృద్ధిమేవ చ
అశ్మరీం మూఢవాతాంశ్చ వాతశోణితమేవ చ.
హలీమకం గుదభ్రంశం విష్వగ్వాతం తథైవ చ
దంతాన్ దృఢం కరోత్యేవ ధాతూన్ బధ్నాతి వై ధ్రువమ్.
పామాన్యస్మాలయత్యేష సర్వామయవినాశనః
ఆరోగ్యజననం చైతద్బలవర్ణవివర్ధనమ్.
కాయాగ్నిజననం చైతద్యేతన్నిద్రాకరం నృణామ్
వంధ్యాం కరోత్యవంధ్యాం చ యోనివ్యాపద్వినశ్యతి.



ప్రాతః ప్రాతశ్చ సేవేత శ్రేష్ఠం పుంస్త్వవివర్ధనమ్
రక్తపిత్తం తథా గుల్మం యేతత్సద్యో వినాశయేత్.
ఆమజ్వరం చామశూలమామాతీసారమేవ చ
ఆమోద్గారం చ సహసా పాచయే న్నాత్ర యేదపి.
భగ్నా విస్తీర్ణా యే దంతాః పునరేవోద్భవంతి చ
దుష్టవ్రణే చ తత్పథ్యమసృగ్దోషో వినశ్యతి.
వస్తివాతాదిదోషానా మేతద్ద్విజసుఖావహమ్
తస్మాద్రాజ్ఞా మిదం పూర్వం క్షేమాయ క్రియతాం బుధైః.
అశ్వవత్తీవ్రగామీ స్యా న్నాగవద్బలవా న్భవేత్
భ్రమరోపమకేశ స్స్యాద్భవే త్కాంస్యస్వరో నృపః.
సర్పవద్వీక్షతే దూరం శృణో త్యేవ వరాహవత్
శరవద్వేగవచ్ఛీఘ్రం స్త్రీశతం చాధిరోహతి.
రసాయనమిదం యశ్చ సేవతే వ్యవసాయవత్
తస్య పుత్రాశ్చ పౌత్రాశ్చ జాయంతే పురుషాయుషః.
సర్వాన్ వినాశయే ద్వ్యాధీ న్సుధీ శ్శక్ర ఇవాసురాన్
రసాయనమిదం శ్రేష్ఠం బ్రహ్మణా నిర్మితం పురా.

**తా.** ౧౦౦ కరక్కాయలను వ్రక్కలుచేసి యందలివిత్తులను దీసి పారవైచి ఒకభాండంబున నునిచి యందు చంద్రపట్ట, వేగిసపట్ట, వేపపట్ట, మద్దిపట్ట, మునగ పట్ట, పల్లేరుకాయలు, పాలవేళ్ళు, నేలదంతివేరుపట్ట, చిట్టాముట్టి, పేరాముట్టి, తెల్ల తెగడ, తపసిపట్ట, కానుగపట్ట, కలుక్రానుగపట్ట, పెన్నేరుగడ్డ, తెల్లగలిజేరువేరు, రేల పట్ట, జీడివేరు, మారేడుపిందెలు,యివి దినుసు కొక్కొకప్రస్థము. దశమూలములు, ఆఢక ప్రమాణము. యిటుల వీటినెల్ల దంచి యందు కలిమెడు నుదకముబోసి చతుర్థాంశముగ కషాయము కాచి యం దేడుప్రస్థములు సరస్వతి ఆకురసము, తిప్పతీగెరసము, మునగ పట్టరసము, నెల్లికాయలరసము, అల్లపురసము, ఆడ్డసరపాకురసము, పసపురసము, మాని పసపురసము, దురదగొండిరసము, అడవి అల్లపురసము, కిల్లిపీచరవేళ్ళరసము, నేలగు మ్ముడురసము, వీటిని ౭ ప్రస్థముల యవలనువైచి గాఢాగ్నియం దునిచి నాయవలు పక్వమగునపుడు యందు పిప్పలి, గజపిప్పలి, నీరుపిప్పలి, పసుపు, మానిపసుపు, గచ్చవి త్తులు, తానికాయలు, వాయువిళంగములు, తుంగగడ్డలు, జిల్లేడువేరు, తెల్లజిల్లేడువేరు, శిలాజిత్తు, కొడిశవిత్తులు, అతివస, లొద్దుగపట్ట, అతిమధురము, కాయఫలము, వస, మంజిష్ఠి, తామరవిత్తులు, తామరదుంపలు, చవ్యము, చిత్రమూలము, శ్రీగంధము, రక్త చందనము, పల్లేరువేళ్లు, నల్లఉప్పిపట్ట, గుమ్ముడువేరు, దురదగొండివేరు, రాలిపువ్వు,

ఉత్తరేణివేరు, అగరుశొంఠి, ప్రేంకణపువేరు, కడిమిపట్ట, దిరిశనపువిత్తులు, వీటిని దినుసు కొక్కొక్కపలముచొప్పున చూర్ణముజేసి వైచి యివియన్నియుం చక్కగ పక్వంబగునపుడు యందు ౧౨౦ పలముల బెల్లము, ౯ ప్రస్థముల పాతనువ్వుల నూనె, ౯ ప్రస్థముల నెయ్యి, వైచి కలియబెట్టి, పిదప బద్దలుజేసి గోమూత్రంబున నొకదినము నానబెట్టి యెండించిన ౧౦౦౦ కరకాయలను చూర్ణముజేసి యందు వైచి బుగ్గలులేచువరకు గరిటచే చక్కగ కలియబెట్టి లేహపక్వముగ వండి యది చల్లగనైనపిదప యందు తేనె ౨ పళ్ళు బోసి, ఏలకులు, లవంగపత్రి, నాగకేసరములు, ఇవి దినుసుకు మూడుపలములు, పిప్పళ్ళు ౪ ప, ఇటుల చూర్ణముజేసి యందు వేసి చక్కగ కలిపి యా భాండపుమూతి నిగట్టి ౧౫ దినములు ధాన్యరాశియం దునిచి దీనిని సేవించుటకుముందుగ విరేచనముకు బుచ్చుకొనుటయ గాక నభ్యంగాదుల గావించి సంచారమును వర్జించి పథ్యంబుగ నుండి యొకసంవత్సరంబైనను, రెండుసంవత్సరంబులైనను, మూడుసంవత్సరంబులైనను, పైయౌషధమును నెల్లికాయంత సేవింపుచుండవలయు. మఱియు దీనిని ౧౦౦ దినంబులు సేవించిన సర్వవ్యాధులును, ౨౦౦ దినంబులు సేవించిన నాడిగతరోగంబులును, నశించు. 3౦౦ దినంబులు సేవించిన శుక్లవృద్ధియు, ౪౦౦ దినంబులు సేవించిన వాక్శుద్ధియు, ౫౦౦ దినంబులు సేవించిన నింద్రియస్థైర్యంబును, ౬౦౦ దినంబులు సేవించిన కుశాగ్రబుద్ధియు, ౭౦౦ దినంబులు సేవించిన జరత్వము నశించి యౌవనంబును, ౮౦౦ దినంబులు సేవించిన కాంతియు, ౯౦౦ దినంబులు సేవించిన నీశ్వరత్వంబును, ౧౦౦౦ దినంబులుసేవించిన అపమృత్యురహితుడై దీర్ఘాయువు గలిగి యుండుటయ గాక సురదర్శనంబును గలుగు. మరియు నీయౌషధమును నూరుదినంబులు సేవించిన నశించెడి రోగంబుల వచించెద?— ౧౧ విధములగు శోఫలు, ౬ విధములగు మూలవ్యాధులు, శ్లీపదము, ౧౮ కుష్ఠువులు, ౪ విధములగు ఊరుస్తంభవాతములు, ౨౦ ప్రమేహములు, ౫ విధములగు భగందరములు, ౬౬ ముఖరోగములు, ౧౬ మూత్రదోషములు, కాసము, స్వరహీనము, శ్వాసము, ఎక్కిళ్ళు, అర్దితము, ఆష్ఠీలకము, ఆధ్మానము, ప్రత్యాధ్మానము, అసృగ్దరము, కామిల, పాండువు, సోమరోగమనెడి యోనిరోగము, అపస్మారము, ఉన్మాదము, క్షయము, అరుచి, శిరస్సు, వీపు, వీటియందలి శిబ్బము, దురద, శూల, క్రిమిరోగము, ౮ విధంబులగు గ్రంథులు, పీనసము, గ్రహణి, సంగ్రహణి, శిశ్నంబున రాళ్లుపడెడి మూత్రాశ్మరి, మూఢగర్భము, ౮౦ వాతములు, రక్తవాతము, హాలీమక మనుకామిల, గుదభ్రంశము, విష్వగ్వాతము, గజ్జి, రక్తపిత్తము, గుల్మము, ఆమజ్వరము, ఆమశూలము, ఆమాతిసారము, పుల్లనితేపులు, రక్తదోషము, వ్రణములు, పొత్తికడుపుయందలి శూలలు, సర్వ ఆమయరోగములు, ఇవియన్నియు నశించు. మరియు శరీరంబున కారోగ్యంబును, దంతదార్ఢ్యంబును, బలము, కాంతి, శరీరపుష్టి, వీర్యపుష్టి, అగ్నిదీపనము, ఇవియును గలుగు. మఱియు స్త్రీల వంధ్యత్వంబును, యోనిరోగంబును నశించు. మరియు దంతములు వూడిపోయియుండినను, పగిలియుండినను, పుచ్చియుండినను, నవి మరల నూతనముగ జనించు. కావున రాజ్యమును పరిపాలింపుచుండెడి నృపుడు ముఖ్యంబుగ దీనిని ప్రత్యహము సేవింపుచుండిన నిం దుదహరింపబడిన రోగంబులన్నియు నివృత్తియగుటయ గాక గుఱ్ఱమువంటి వేగంబును, ఏనుగవంటి బలంబును తుమ్మెదలవంటి వెంట్రుకలును, సర్పమువంటి దృష్టియు, వరాహమువంటి వినికయు, గలవాడై స్వర్ణముంబోలిన శరీరముగలిగి బాణంబువలె మిగుల త్వరగలవాడై నూర్గురుస్త్రీలతో రమించు. కావున నిట్టి రసాయనంబును వ్యవసాయము జేయు వానివలె ప్రత్యహము సేవింపుచుండిన దీర్ఘాయుష్మంతులైనపుత్రులు జనించెదరు. మరియు అసురులను యుద్ధంబున దేవేంద్రుడు హతంబొనర్చనమాడ్కి సర్వరోగంబులను మూలముతో నశింపంజేయు. (ఇది బ్రహ్మచే నిర్మింపంబడిన శ్రేష్ఠంబైన నభయాదిరసాయనము.)



ఇట్లు ముఖరోగచికిత్స ముగిసెను.

## కర్ణరోగలక్షణము.

శ్లో. సమీరణ శ్శ్రోత్రగతో యదాచరే
త్సమంతత శ్శూలమతీవ కర్ణయోః
కరోతి దోషైశ్చ్వ యధుం సమావృత
స్స కర్ణరోగః కథితో దురాసదః.

తా. దుష్టంబైనవాతము కర్ణములయందు బ్రకోపించి యందు సర్వత్ర సంచరింపుచు పిత్తశ్లేష్మరక్తములతో జేరి శోష, శూల, వీటిని జనింపంజేయు. ఇదియ కర్ణరోగం బనంబరంగు. (ఇది అసాధ్యము.)

శ్లో. బధిరత్వం కర్ణపూతిలూతా కర్ణరుజా బహు.

తా. వాతదోషముచే బధిరత్వము, చెవులలో చీముస్రవించెడి కర్ణపూతి, చీము, పురుగులు, వీటితోగూడియుండెడి కర్ణలూత, యనెడి కర్ణరోగము లనేకంబులు గలవు.

## కర్ణరోగచికిత్స.

శ్లో. తీవ్రశూలాతురే కర్ణే సశబ్దే క్లేదవాహినీ
బస్తమూత్రం క్షిపేత్కోష్ణం సైంధవేన సమన్వితమ్.

తా. సైంధవలవణమును మేకపోతుమూత్రంబున కలిపి కించిదుష్ణము జేసి కర్ణములయందు వైచిన తీవ్రమైన శబ్దము, చీము స్రవించుట, పోట్లు వీటితోగూడియుండెడి కర్ణరోగము నివృత్తియగు.

శ్లో. జంబ్వామ్రపత్రం వరుణం సమాంశం
కపిత్థ కార్పాసఫలం చ సార్ధమ్

కృత్వా రసం తన్మధునా విమిశ్రం
స్రావాపహం సంప్రవదంతి తజ్జ్ఞాః.

**తా.** నేరేడుచిగుళ్లు, మామిడిచిగుళ్లు, వెలగకాయ, పసిడిపత్తికాయలు, అల్లము, వీటిని సమభాగములుగ దంచి రసముదీసి యందు తేనె కలిపి కించిదుష్ణముజేసి కర్ణముల యందు వైచిన చీముకారుట, పోట్లు, వ్రణములు, ఇవి మొదలగునవి హరించు.

**శ్లో.** కుష్ఠం హింగువచాదారు శతాహ్వా విశ్వసైంధవైః
పూతికర్ణాపహం తైలం బస్తమూత్రేణ సాధితమ్.

**తా.** కోష్ఠు, ఇంగువ, వస, దేవదారు, చల్లపిల్లిగడ్డలు, శొంఠి, సైంధవలవణము, వీటిని సమభాగములుగ మేకపోతుమూత్రముచే నూరి కల్కముజేసి యందు నువ్వుల నూనె కలిపి సూక్ష్మాగ్నిచే తైలపక్వముగ కాచి కర్ణములయందు వైచిన ప్రబలంబులగు కర్ణరోగంబులు నివారణమగు.

**శ్లో.** గవాం మూత్రేణ బిల్వాని పిష్ట్వా తైలం విపాచయేత్
సక్షారం తచ్చ వితరే ద్బాధిర్యే కర్ణపూరణమ్.

**తా.** మారేడుపండును ఆవుపంచితముచే నూరి కల్కముజేసి యందు నువ్వుల నూనె కలిపి తైలపక్వముగ కాచవలయును. ఇట్లు తైలపక్వంబగునపు డందు సర్జక్షారము, యవక్షారము, టంకణక్షారము, వీటిని చూర్ణముజేసి వైచి సాంగశేతలమున గ్రహించి వడియకట్టి, కర్ణములయందు వైచిన చెవుడు నివృత్తియగు.

**శ్లో.** కపిత్థమాతులుంగామ్రశృంగబేరరసైః శుభైః
సుఖోష్ణైః పూరయే త్కర్ణం కర్ణశూలోపశాంతయే.

**తా.** వెలగకాయలు, మాదీఫలము, మామిడిచిగుళ్లు, అల్లము, వీటియందు రసముదీసి కించిదుష్ణముజేసి కర్ణములయందు వైచిన కర్ణశూలలు నివృత్తియగు.

**శ్లో.** కర్ణశూలహరం క్షిప్త్వా లవణార్ద్రికయో రసమ్
దంతేన చర్వయే న్మూలం నంద్యావర్తపలాశయోః.
తల్లాలపూరితే కర్ణే ధ్రువం గోమాక్షికాం జయేత్.

**తా.** అల్లపురసంబున సైంధవలవణమును కలిపి కర్ణములయందు వైచిన కర్ణశూలలు నశించు. మరియును నంది వర్ధనవేరుపట్ట, మోదుగపట్ట, వీటిని దంతములతో నమిలి దానిరసంబును చెవులయందు వైచిన కర్ణప్రవేశమైన జోరీగలు మొదలగునవి నశించు.

**శ్లో.** హింగ్వబ్దదారుమిసిమూలకభస్మభృంగ
రూక్షారసింధురుచగోద్భిదశిగ్రువిశ్వైః
స్నుగ్సర్జికాబిడవచాంజనమాతులుంగ
రంభాంభసా సమధుసూక్తమిదం విపక్వమ్.



తైలం ప్రసిద్ధమితి తచ్ఛ్రవణామయఘ్నం
కర్ణప్రణాదిబధిరత్వహరం నరాణామ్
భూ్రమస్తకశ్రవణశష్కులికాంతరేషు
శూలాపహం చరకశాస్త్రచికిత్సితోక్తమ్.

**తా.** ఇంగువ, తుంగగడ్డలు, దేవదారు, పిన్నసదాపవిత్తులు, ముల్లంగిక్షారము, గుంటగలగర, దుందిలపుపట్ట, సైంధవలవణము, సముద్రలవణము, సురాకారము, మునగపట్ట, శొంఠి, బొంతజెముడుపట్ట, సర్జక్షారము, బిడాలవణము, వస, అంజనపురాయి, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి దీనికిసమముగ మాదీఫలరసము, అరటిగడ్డరసము, తేనె కలిపి వీటికన్నిటికి సమముగ నువ్వులనూనె బోసి తైలపక్వముగ కాచి కర్ణముల యందు వైచిన కర్ణరోగము, కర్ణవ్రణము, చెవుడు, ఇవి నశించుటయ గాక కనుబొమలు, శిరస్సు, చెవులు, వీటియందలి శూలలు నివృత్తియగునని చరకాచార్యకృత వైద్య శాస్త్రమునం దుదహరింపబడి యున్నయది.

**శ్లో.** నాగరసైంధవమాగధిముస్తాహింగువచాలశునంతిలతైలమ్
అర్కసుపక్వపలాశరసేన కర్ణరుజం బధిరం వినిహంతి.

**తా.** శొంఠి, సైంధవలవణము, పిప్పళ్లు, తుంగగడ్డలు, ఇంగువ, వస, వెల్లుల్లి, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి యందు పండుజిల్లేడాకులు, మోదుగపట్ట, రసము వైచి నూరి ఆరసముచేతనే కల్కముజేసి దీనికిసమముగ నువ్వులనూనె బోసి తైలపక్వముగ కాచి కర్ణములయందు వైచిన కర్ణరోగములు, చెవుడు, ఇవి నివారణమగు.

ఇట్లు కర్ణరోగచికిత్స ముగిసెను.

## నాసారోగలక్షణము.

**శ్లో.** అపీనసం పూతినాసా నాసాపాక స్తథైవ చ
తథా శోణితపిత్తం చ పూయశోణితమేవ చ.
క్షవథుభ్రంశముద్దీప్తో నాసానాహః పరిస్రవః
నాసాశోషేణ సహితా దశైకాశ్చేరితా గదాః.

**తా.** అపీనసము, పూతినాసము, నాసాపాకము, శోణితపిత్తము, పూయశోణితము, క్షవథు, భ్రంశము ఉద్దీప్తము, నాసానాహము, పరిస్రావము, నాసాశోషము, లన ౧౧ విధములగు నాసారోగంబులు గలవు.

## నాసారోగచికిత్స.

**శ్లో.** రక్తకరవీరపుష్పంజాత్యంవా తథామల్లికాయాః
ఏతైస్సమం తిలతైలం నాసారోగనాశనం పరమ్.

తా. ఎఱ్ఱగన్నేరుపువ్వులు, జాజిపువ్వులు, మల్లెపువ్వులు, వీటియందు రసము దీసి దీనికిసమముగ నువ్వులనూనె కలిపి తైలపక్వముగ కాచి ముక్కులలో వైచిన నాసికారక్తము హరించు.

శ్లో. గృహధూమకణాదారు క్షారరక్తైస్ససైంధవైః
సిద్ధం శిఖరిబీజైశ్చ తైలం నాసార్శసాం హితమ్.

తా. కరుదూపము, పిప్పళ్లు, దేవదారుపట్ట, యవక్షారము, లక్క, సైంధవలవణము, ఉత్తరేణివిత్తులు, వీటిని సమభాగములుగ నుదకముచే నూరి కల్కముజేసి యందు నువ్వులనూనె కలిపి తైలపక్వముగ కాచి ముక్కులలో పిండిన నాసికారక్తము నశించు.

శ్లో. కళింగహింగుమరిచం లాక్షాసురసకట్ఫలైః
కుష్ఠోగ్రశిగ్రుజంతుఘ్నై రేవ పిండః ప్రశస్యతే.
తైరేవ మూత్రసంయుక్తైః కటుతైలం విపాచయేత్
అపీనసే పూతినాసే శమనం కీర్తితం పరమ్.

తా. కొడిశవిత్తులు, ఇంగువ, మిరియాలు, లక్క, వావిలియాకు, కాయఫలము, కోష్ఠు, వస, మునగ, వాయువిళంగములు, వీటిని సమభాగములుగ నుదకముచే నూరి రేగుబండంత మాత్రలుజేసి ప్రాతస్సాయంకాలములయం దొక్కొకమాత్రచొప్పున భక్షించుటయు గాక ఈమాత్రలను గోమూత్రంబున వైచి వీటికి సమముగ ఆవాలతైలము కలిపి యందలి గోమూత్రము చుంకువరకు సూక్ష్మాగ్నిచే కాచి యాతైలమును ముక్కులలో వైచిన అపీనసము, పూతినాసము, ఇవి నశించు.

శ్లో. శుంఠీకుష్ఠకణాబిల్వ ద్రాక్షాకల్కకషాయకః
సాధితం తైలమాజ్యం వా న స్యాత్క్షవధురుక్ప్రణుత్.

తా. శొంఠి, కోష్ఠు, పిప్పళ్లు, మారేడుపండు, ద్రాక్ష, వీటిని సమభాగములుగ దంచి కల్కముజేసి దీనికిసమముగ నువ్వులనూనెనైనను, నెయ్యినైనను, కలిపి తైలపక్వముగ కాచి నాసికలయందు వైచిన తుమ్ములతోగూడిన నాసారోగము నివృత్తియగు.

శ్లో. పూయస్స్రవతి దుర్గంధో నాసాయా అతితాపకృత్
కృతే నస్యే చ తం హన్యా చ్ఛ్వేతం జీరం సితాయుతమ్.

తా. తెల్లజీలకఱ్ఱను చూర్ణముజేసి యందు శర్కర కలిపి నస్యముజేసిన చీము స్రవింపుచు దుర్గంధము, అతితాపము, వీటితోగూడిన నాసారోగము హరించు.

శ్లో. ఘృతాక్తకుంకుమం నస్యే చ్ఛుష్కపీనసజి ద్భవేత్.

తా. కుంకుమపువ్వును నేతితో నూరి కించిదుష్ణముజేసి నస్యముజేసిన నాసారోగము నశించు.

ఇట్లు నాసారోగచికిత్స ముగిసెను.



## నేత్రరోగలక్షణము.

శ్లో. ఊర్ధ్వంగమాభిరుపగమ్య శిరశ్శిరాభి
ర్దోషా స్స్వహేతుకుపితాః కఫపిత్తవాతాః
కంఠోష్ఠతాలురసనారదమూలకర్ణ
నాసాస్యలోచనశిరస్సురుజ స్సృజంతి.

తా. అపథ్యంబు లొనర్చుటవలన వాతపిత్తకఫములు స్వదోషములచే కుపితములై నాడీలమూలంబుగ శిరస్సునం జేరి కంఠము, పెదవులు, దవడలు, జిహ్వ, దంతములు, కర్ణములు, నాసికము, ముఖము, నేత్రములు, కపాలము, వీటియందు రోగములను జనింపం జేయును.

శ్లో. షట్సప్తతిర్లోచనజావికారా స్తేషా మభిష్యందసముద్భవానామ్
శ్లేష్మాశ్రయత్వాదతిలంఘనం ప్రాక్ప్రశస్యతే ముద్గరసోదనం చ.

తా. మఱియు *అభిష్యందముచే ౭౬ విధంబులగు నేత్రరోగంబులు జనించు. ఈ నేత్రరోగములు శ్లేష్మము నాశ్రయించి జనించియుండెనేని ప్రథమంబున లంఘనమువేసి పిదప పెసరకట్టన్నంబు నిడవలయును.

## నేత్రరోగచికిత్స.

శ్లో. ఆశ్చ్యోతనే చ త్రిఫలా సలోధ్రా సగైరికా దారునిశా ప్రశస్తా
ఆలేపనే గైరికచందనం చ సతార్క్ష్యశైలం మునిభిః ప్రదిష్టమ్.

తా. కరక్కాయలు, తానికాయలు, ఉశిరికవరుగు, లొద్దుగపట్ట, కావిరాయి, మానిపసుపు, పసుపు, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి దీనిచే నేత్రంబులను ప్రక్షాళనము జేసి పిదప కావిరాయి, శ్రీగంధము, రసాంజనము, వీటిని గంధముదీసి నేత్రములచుట్టు పట్టువేసిన నేత్రరోగములు నివారణమగునని మహర్షులు వచియించిరి.

శ్లో. దధ్నా ససైంధవం లోధ్రం మధూచ్ఛిష్టయుతం ఘృతమ్
పిష్టమంజనలేపాభ్యాం సద్యో నేత్రరుజాపహమ్.

తా. సైంధవలవణము, లొద్దుగపట్ట, తేనెమైనము, నెయ్యి, పెరుగు, వీటిని ఖల్వమున మర్దించి నేత్రములచుట్టు పట్టువేయుటయు గాక దీనిచే అంజనము సగా గావించిన నేత్రరోగంబులన్నియును నివారణంబగు.

శ్లో. బృహత్యేరండమూలత్వక్శిగ్రుమూలం ససైంధవమ్
అజాక్షీరేణ సంపిష్ట్వా వర్తిర్వాతాక్షిరోగజిత్.

* అభిష్యందంబనగా — రాగద్వేషాదులచే జనించెడి క్లేశము.

తా. వాకుడువేరుపట్ట, ఆముదపువేరుపట్ట, మునగవేరుపట్ట, సైంధవలవణము, వీటిని సమభాగములుగ దంచి యందు మేకపాలుబోసి నూరి వస్త్రంబునకు లేపనము జేసి వర్తిగావించి నేత్రములయందు రాచిన నేత్రరోగంబుల హరించు.

శ్లో. అర్జునే శర్కరా మస్తు క్షౌద్రై శ్చాశ్చ్యోతనం హితమ్
శంఖ క్షౌద్రేణ సంయుక్తం కతకం సైంధవేన వా.
సితయార్ణవఫేనం వా పృధగంజన మర్జునే.

తా. అర్జునంబను నేత్రరోగంబున పెరుగుమీది నీళ్లు, శర్కర, తేనె, వీటిని సమముగ జేర్చి చక్కగ కలిపి నేత్రములలో వైచినను, లేక శంఖము, తేనె, వీటినైనను, చిల్లగింజలు, సైంధవలవణము, తేనె, వీటినైనను, సముద్రపునురుగు, చక్కెర, తేనె, వీటినైనను, అంజనము గావించినను, నేత్రరోగంబులు హరించు.

శ్లో. చందనం గైరికం లాక్షామాలతీకలికా స్సమాః
వ్రణశుక్రహరీ వర్తి శ్శోణితస్య ప్రసాదనీ.

తా. శ్రీగంధము, కావిరాయి, లక్క, జాజిచిగుళ్ళు, వీటిని సమభాగములుగ దంచి చూర్ణముజేసి యందుదకముబోసి చక్కగ నూరి మృదువుగనుండెడి తెల్లటివస్త్రంబునకు పట్టించి వర్తిజేసి నేత్రములయందు రాచిన వ్రణశుక్రములు, నేత్రముల యందలి దుష్టరక్తము, ఇవి నశించు.

శ్లో. కతకస్య ఫలం శంఖం సైంధవత్ర్యూషణం సితా
ఫేనం రసాంజనం క్షౌద్రంవిడంగాని మనశ్శిలా.
కుక్కుటాండత్వక్ఫలానివర్తి రేషాం సుఖావహా
తిమిరం పటలం కాచం మలం చాశు వ్యపోహతి.

తా. చిల్లగింజలు, శంఖము, సైంధవలవణము, శొంఠి, పిప్పలి, మిరియాలు, శర్కర, సముద్రపునురుగు, రసాంజనము, వాయువిడంగములు, మణిశిల, కోడిగుడ్ల పెంకులు, జాజికాయ, వీటిని సమభాగములుగ దంచి యందు తేనెబోసి నూరి వస్త్రమునకు లేపనముజేసి వర్తులుగావించి నేత్రములయందు రాచిన, తిమిరములు, పటలములు, కాచములు, సారబిందువులు, కంటిపుశి, ఇవియన్నియును నివృత్తియగు.

శ్లో. వ్యోషోత్పలాభయాకుష్ఠతార్క్ష్యైర్వర్తిః కృతా హరేత్
అర్బుదం పటలం కాచం తిమిరార్మాదికా న్గదాన్.

తా. శొంఠి, పిప్పలి, మిరియాలు, నల్లకలువగడ్డలు, కరక్కాయలు, కోష్ఠు, రసాంజనము, వీటిని సమభాగములుగ నుదకముచే నూరి వస్త్రమునకు పట్టించి వర్తులు జేసి నేత్రములయందు రాచిన అర్బుదము, పటలము, కాచము, తిమిరము, అర్మము, ఈ మొదలగు నేత్రరోగములు నివారణమగు.



శ్లో. హంత్యర్జునం శర్కరయాబ్ధిఫేనో
రాత్ర్యంధతాంగోశకృతాచ కృష్ణా
దధ్నా విఘృష్టం మరిచం చరాత్ర్యం
ధనాశయేదంజన ముత్తమంచ.

తా. శర్కర, సముద్రపునురుగు, వీటిని తేనెచే నూరి నేత్రములయందు వైచిన అర్జునమను నేత్రరోగము హరించు. మరియు పిప్పలిని ఆవుపేడరసముతో గంధముదీసి నేత్రములకు వేసినను, లేక మిరియాలను, పెరుగుతో గంధముదీసి నేత్రములకు వేసినను, రేచీకటి నివారణమగు.

శ్లో. అజాపిత్తగతం వ్యోషంధూమస్థానే నియోజయేత్
చిరిబిల్వరసైర్ఘృష్టం రాత్ర్యంధహర మంజనమ్.

తా. మేకచేదుకట్టులో శొంఠి, పిప్పలి, మిరియాలు, వీటిని చూర్ణముచేసి కలిపి దీనిని కొన్నిదినములు పొగవ్యాపించెడి స్థలమున కట్టి యునిచి పిదప దానిని కానుగవేరు పట్టరసముతో ఖల్వమున చక్కగ మర్దించి మాత్రలుజేసి నీడన యెండించి నేత్రముల కంజనము వేసిన రేచీకటి నివారణమగు.

శ్లో. స్వర్ణం వరాటికాసూతం సారం ఫ్రాతిజపత్రకమ్
నవనీతేన సంయుక్తం హంతి పుష్పం చిరంతనమ్.

తా. బంగారువర్ణముగల గవ్వలు, శుద్ధిజేసిన పాదరసము, తాళిశపత్రి, వీటిని సమభాగములుగ కానుగాకురసముచే ఖల్వంబున చక్కగ మర్దించి మాత్రలుజేసి నీడన యెండించి ఆవువెన్నచే నేత్రముల కంజనమువేసిన బహుకాలముగ నుండెడి కంటిపువ్వులు నివృత్తియగు.

శ్లో. రసకేశాశ్మసింధూత్థం వ్యోషం తుత్థం సటంకణమ్
క్షౌద్రేఘృష్టావటీపుష్పం సర్వనేత్రామయాన్ జయేత్.

తా. శుద్ధిజేసిన కపురి, కురువేరు, శుద్ధిజేసిన హేమమాక్షికము, సైంధవలవణము, శొంఠి, పిప్పలి, మిరియాలు, శుద్ధిజేసిన మైలతుత్తము, శుద్ధిజేసిన వెలిగారము, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి ఖల్వంబున తేనెచే చక్కగ మర్దించి కణికెలుజేసి నీడన యెండించి దానిచే గంధముదీసి నేత్రముల కంజనమువేసిన కంటిపువ్వులు మొదలగు నేత్రరోగంబులన్నియును నివారణమగు.

ఇట్లు నేత్రరోగచికిత్స ముగిసెను.

---

## శిరోరోగలక్షణము.

శ్లో. భ్రమో దాహో జడత్వం చ వాతే పిత్తే కఫే క్రమాత్
శిరోరోగస్య విజ్ఞేయం లక్షణం చ పృథక్పృథక్.

తా. వాతపిత్తశ్లేష్మదోషంబులచే శిరోరోగము జనించెనేని యప్పుడు క్రమంబుగ భ్రమ, తాపము, జడత్వము గలుగు.

శ్లో. శిరోరోగాస్తు జాయంతే వాతపిత్తకఫైస్త్రిభిః
సన్నిపాతేన రక్తేన క్షయేణ క్రిమిభిస్తథా.

తా. వాతము, పిత్తము, శ్లేష్మము, సన్నిపాతము, దుష్టరక్తము, క్షయము, క్రిములు, వీటిచేతను శిరోరోగము జనింపుచున్నయది.

---

## శిరోరోగచికిత్స.

శ్లో. పథ్యాక్షధాత్రీభూనింబైర్నిశానింబామృతాయుతైః
కృతః క్వాథ షడంగోయం సగుడశ్శీర్షశూలహా.
భ్రూశంఖకర్ణశూలాని తథార్ధంశిరసో రుజామ్
సూర్యావర్తం శంఖకం చ దంతపాతం చ తద్రుజః.
నక్తాంధ్యం పటలం శుక్రం చక్షుఃపీడాం వ్యపోహతి.

తా. కరక్కాయలు, తానికాయలు, ఉశిరికవరుగు, నేలవేము, పసుపు, వేపపట్ట, తిప్పతీగ, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి యందు దాలవభాగము బెల్లము కలిపి పుచ్చుకొనిన, కనుబొమలు, నుదుటియెముక, చెవులసంధులు, వీటియందు జనించెడి శూల, ఒంటితలనొప్పి, సూర్యావర్తము, శంఖకము, దంతపాతము, దంతశూల, రేచీకటి, పటలము, శుక్రము, నేత్రశూల, ఇవి నివృత్తియగు.

శ్లో. కరంజశిగ్రుబీజాని పత్రకం సర్షపత్వచః
సర్వేషాం శీర్షరోగాణామేతచ్చీర్షవిరేచనమ్.

తా. కానుగవిత్తులు, మునగవిత్తులు, తాళిశపత్రి, ఆవాలు, లవంగపట్ట, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి వస్త్రగాలితమొనర్చి నస్యముచేసిన శిరోరోగంబులన్నియు నివారణమగు. (ఇది సర్వశిరోరోగములను శోధించెడి నస్యము.)

శ్లో. నావనం సగుడం విశ్వం పిప్పలీసైంధవాంబునా
భుజస్తంభాదిరోగేషు సర్వమూర్ధగదేషు చ.

తా. బెల్లము, అల్లపురసము, పిప్పళ్ళు, సైంధవలవణము, వీటిని నుదకముచే నూరి ముక్కులలో పిండిన భుజస్తంభవాయువు, శిరోరోగము, ఇవి నశించు.

శ్లో. సశర్కరం కుంకుమమాజ్యభ్రష్టం నస్యం విధేయం పవనాస్రగుత్థే
భ్రూశంఖకర్ణాక్షిశిరోర్ధశూలే దినాభివృద్ధిప్రభవే చ రోగే.

తా. కుంకుమపువ్వును నేతితో పక్వముగ వేయించి చూర్ణముజేసి యందు శర్కర కలిపి నస్యముజేసిన కనుబొమలు, నుదుటియెముక, నేత్రములు, కర్ణములు, వీటియందు వాతరక్తములచే జనించిన శూలలు, ఒంటితలనొప్పి, సూర్యావర్తము ఇవి నశించు.



శ్లో. కుష్ఠమేరండజం మూలం లేపః కాంజికపేషితః
శిరోర్తిం నాశయత్యాశు పుష్పం వా ముచుకుందజమ్.

తా. కోష్ఠు, ఆముదపువేరుపట్ట, వీటిని కలిచే నూరి శిరస్సు మొదలగువాటియందలి శూలలకు లేపనముజేసినను, లేక తెల్లగంటెనపువ్వులను నుదకముచే నూరి లేపనముజేసినను, శిరశ్శూల నిశ్చయముగ నశించు.

శ్లో. దేవదారునతం విశ్వం నలదం విశ్వభేషజమ్
లేపః కాంజికసంపిష్టస్తైలయుక్తశ్శిరోర్తినుత్.

తా. దేవదారుపట్ట, గ్రంథితగరము, కోష్ఠు, వట్టివేళ్లు, శొంఠి, వీటిని సమభాగములుగ కలితో నూరి యందు నువ్వులనూనె కలిపి తైలపక్వముగ కాచి శిరస్సునకు లేపనముజేసిన తలనొప్పి నివృత్తియగు.

శ్లో. గిరికర్ణిఫలం మూలం సజలం నస్యమాచరేత్
మూలం వా నిధధేత్కర్ణే నిహంత్యర్ధశిరోరుజమ్.

తా. తెల్లగంటెనవిత్తులు, తెల్లగంటెనవేరు, వీటిని నుదకముచే నూరి నస్యముజేసినను, లేక తెల్లగంటెనవేరును నలియగొట్టి కర్ణములయం దుంచుకొనినను, ఒంటితలనొప్పి నివృత్తియగు.

శ్లో. మరీచం భృంగజైర్ద్రావైర్మరీచం శాలితండులైః
అర్ధశీర్షవ్యథాం హంతి లేపో వాశుంఠివారిణా.

తా. మిరియాలను గుంటగలగరాకురసముచే నూరి లేపనముజేసినను, లేక మిరియాలు, వరిబియ్యము, వీటిని గుంటగలగరాకురసముచే నూరి లేపనముజేసినను, లేక శొంఠిని నుదకముచే గంధముదీసి లేపనముజేసినను, ఒంటితలనొప్పి నివృత్తియగు.

వాక్యమ్. అత్ర రసాయనభైరవో నస్యే లేపే యోజయేత్.

తా. మస్తకశూలలకు రసాయనభైరవమును నస్యముచేసినను, లేక శిరస్సునకు లేపనముచేసినను, నవి నివారణమగు.

ఇట్లు శిరోరోగచికిత్స ముగిసెను.

---

## స్త్రీరోగలక్షణము.

శ్లో. అసృగ్దరం యోనిదోష స్స్కంధోఫమూఢగర్భజః
సూతికాస్తనరోగశ్చ స్తన్యరోగాశ్చ సప్తధా.

తా. అసృగ్దరము, యోనిదోషము, స్కంధము, మూఢగర్భము, సూతికారోగము, స్తనరోగము, స్తన్యరోగము, లన ౭ విధంబులగు స్త్రీరోగంబులు గలవు.

శ్లో. యోనేః స్రవతి రక్తం చ శోణం పీతాసితాసితమ్
అసృగ్దరం భవేత్సర్వం సాంగమర్దం సవేదనమ్.

తా. ఒడలువిరుపు, వేదన, ఇవికలిగి యోనినుండి యెఱ్ఱగనైనను, పచ్చగనైనను, తెలుపుగనైనను, నల్లగనైనను, రక్తము స్రవింపుచుండిన అసృగ్దరంబని యెఱుంగవలయు.

శ్లో. అంగమర్దో జ్వరః కంపః పిపాసా హ్యురుగాత్రతా
శోఫశూలాతిసారౌ చ సూతికారోగలక్షణమ్.

తా. శరీరము పోట్లు, జ్వరము, వణుకు, దాహము, శరీరము బరువు, శోఫ, పొత్తికడుపుశూల, అతిసారము, ఇవి గలిగియుండిన సూతికారోగంబని యెఱుంగవలయు.

శ్లో. అన్యేషాం పంచదోషాణాం లక్షణం నాత్ర భాషితమ్.

తా. మఱియు నితరంబులగు నైదుదోషంబులకు లక్షణంబులు చెప్పంబడవయ్యె.

---

## స్త్రీ రోగ చికిత్స.

శ్లో. దేవదారువచాకుష్ఠం పిప్పలీవిశ్వభేషజమ్
కట్ఫలం ముస్తభూనింబతిక్తాధాన్యం హరీతకీ.
గజకృష్ణాచ దుస్పర్శా గోక్షురంధన్వయాసకమ్
బృహత్యతివిషాచ్ఛిన్నా కర్కటం కృష్ణజీరకమ్.
సమభాగాన్వితైరేతైస్సింధురామఠసంయుతైః
క్వాథమష్టావశేషం తు ప్రసూతాం పాయయేత్త్రియమ్.
శూలకాసజ్వరశ్వాసమూర్ఛాకంపశిరోర్తిభిః
యుక్తప్రలాపతృడ్దాహతంద్రాతీసారవాంతిభిః.
నిహంతి సూతికారోగం వాతపిత్తకఫాన్వితమ్.

తా. దేవదారు, వస, కోష్ఠు, పిప్పళ్లు, శొంఠి, కాయఫలము, తుంగగడ్డలు, నేలవేము, కటుకరోహిణి, ధనియాలు, కరక్కాయలు, గజపిప్పళ్లు, వాకుడు, పల్లేరుకాయలు, దురదగొండివేరు, పెద్దములక, అతివస, తిప్పతీగ, మారేడువేరు, నల్లజీలకఱ్ఱ, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి అష్టాంశముగ దించుకొని యందు సైంధవలవణము, నేతితోపొంగించిన ఇంగువ, వీటిని తగుమాత్రముగ కలిపి బాలింతత్రాగిన శూల, కాస, జ్వరము, శ్వాస, మూర్ఛ, వణుకు, తలనొప్పి, వదురుట, దాహము, తాపము, తంద్ర, అతిసారము, వాంతి, సన్నిపాతము, వీటితోగూడిన సూతికారోగములు నశించు.



శ్లో. దార్వీరసాంజనవృషాబ్దకిరాతబిల్వ
భల్లాతకైరవకృతో మధునా కషాయః
పీతో జయత్యతిబలం ప్రదరం సశూలం
పీతాసితారుణవిలోహితనీలయుక్తమ్.

తా. మానిపసుపు, రసాంజనము, అడ్డసరము, తుంగగడ్డలు, నేలవేము, మారేడువేరు, శుద్ధిజేసిన జీడిగింజలు, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి యందు తేనెకలిపి పుచ్చుకొనిన శూలలు, తెలుపు, యెఱుపు, పసుపు, ఈవర్ణములతో గూడియుండెడి ప్రదరరోగములు నశించు.

శ్లో. మధునా తార్క్ష్యసంయుక్తం మూలం స్యాత్తండులీయకమ్
తండులాంబుయుతం పానాత్సర్వప్రదరనాశనమ్.

తా. చిఱ్ఱివేళ్లను బియ్యపుకడుగుచే నూరి యందు తేనె, రసాంజనము, కలిపి త్రాగిన ప్రదరరోగంబులన్నియు నివృత్తియగు.

శ్లో. ఆఖోః పురీషం ధాతక్యాః పుష్పం బోలం తథైవచ
సమభాగాని సంచూర్ణ్య టంకమేతం చ భక్షయేత్.
దినసప్తప్రయోగేణ సర్వప్రదరనాశనమ్.

తా. ఎలుకపెంటికలు, ఆరెపువ్వు, రక్తబోళము, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి పూటకొక టంకప్రమాణముచొప్పున ౭ దినంబులు సేవించిన ప్రదరరోగంబులు నివృత్తియగు.

శ్లో. కుశమూలం సముద్ధృత్య పేషయేత్తండులాంబునా
ఏతత్పీత్వా త్ర్యహాన్నారీ ప్రదరాత్పరిముచ్యతే.

తా. దర్భవేళ్లను బియ్యపుకడుగుతో దంచి యారసమును మూడుదినంబులు త్రాగిన ప్రదరరోగము నివారణమగు.

శ్లో. రాస్నాశ్వదంష్ట్రామృతకైశ్శృతం శూలహరం పయః.

తా. సన్నరాష్ట్రకము, చిన్నపల్లేరుకాయలు, తిప్పతీగ, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి పానంబొనర్చిన గర్భశూలలు నివృత్తియగు.

శ్లో. గుడూచీత్రిఫలాదంతీక్వాథేన పరిషేచితైః
పిప్పలీమరిచైర్మాషైశ్శతాహ్వాకుష్ఠసైంధవైః.
వర్తిస్తుల్యా ప్రదేశిన్యా ధార్యా యోనివిశోధినీ.

తా. తిప్పతీగ, కరక్కాయలు, తానికాయలు, ఉశిరికవరుగు, నేలదంతివేరు, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి దీనిచే పిప్పళ్లు, మిరియాలు, ఉద్దిపప్పు, చల్లపిల్లిగడ్డలు, కోష్ఠు, సైంధవలవణము, వీటిని నూరి వస్త్రమునకు లేపనముజేసి బొట్టన

వ్రేలంతలావుగల వత్తినిగావించి యోనియందుంచుకొనిన గర్భమునందలి శూల హరించుటయ గాక ప్రదరరోగంబులు సగా నివృత్తియగు.

శ్లో. పిత్తజంబూకసంపిష్టం పక్వం తింత్రిణిసంయుతమ్
లేపమాత్రేణ నారీణాం యోనికందం హరేత్పరమ్.

తా. నక్కచేదుకట్టు, లొద్దుగపట్ట, చింతపండు, వీటిని నూరి యుండికించి యోనియందు లేపనముజేసిన యోనిగడ్డలు నివృత్తియగు.

శ్లో. కుశకాశోరుబూకాణాం మూలైర్గోక్షురకస్య చ
శృతం క్షీరం సితాయుక్తం గర్భిణ్యాశ్శూలనుత్పరమ్.

తా. దర్భవేళ్ళు, కాశగడ్డివేళ్ళు, ఆముదపువేరు, పల్లేరుకాయలు, లేక పల్లేరువేళ్ళు, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి యందావుపాలు, శర్కర, కలిపి త్రాగిన గర్భిణీస్త్రీల శూలలు నశించు.

శ్లో. మాతులుంగస్య మూలాని మధుకం మధుసంయుతమ్
ఘృతేన సహ భోక్తవ్యం సుఖం నారీ ప్రసూయతే.

తా. మాదీఫలపువేరుపట్ట, అతిమధురము, వీటిని సమభాగములుగ చూర్ణముజేసియందు తేనె, నెయ్యి, కలిపి గర్భిణీస్త్రీ సేవించిన సుఖప్రసవంబగు.

శ్లో. పిప్పలీపిప్పలీమూలం చవ్యం శుంఠీయవానికా
జీరకే ద్వే హరిద్రే చ బిడసౌవర్చలం తథా.
ఏతైరేవౌషధైః పిష్టైః కారనాళం విపాచయేత్
ఆమవాతహరం వృష్యం కఫఘ్నం వహ్నిదీపనమ్.
వజ్రకం కాంజికం నామ స్త్రీణామగ్నివివర్ధనమ్
సూతికారోగశమనం శూలఘ్నం క్షీరవర్ధనమ్.

తా. పిప్పళ్ళు, మోడి, చవ్యము, శొంఠి, ఓమము, జీలకఱ్ఱ, సహజీర, పసుపు, మానిపసుపు, బిడాలవణము, సౌవర్చలవణము, వీటిని సమభాగములుగ చూర్ణముజేసియందు కలిబోసి యుండికించి పిదప ఖల్వంబున మర్దించి మాత్రలుజేసి నీడన యెండించి దేహతత్త్వము నెఱింగి సేవించిన ఆమవాతము, శూలలు, కఫము, సూతికారోగము, ఇవి హరించి మిగుల దీపనము గలుగుటయ గాక స్తనములయందు పాలు, శరీరమునకు బలము, ఇవియును గలుగు. (ఇది వజ్రకాంజికము,)

శ్లో. వాతవ్యాధివిధానేన సూతికాం సముపాచరేత్
జలౌకాభిర్హరేద్రక్తం వస్తినా చోపనాహయేత్.

తా. వాతవ్యాధుల కుదహరింపంబడియుండెడి యౌషధంబులచే సూతికాసంబంధమగు రోగములయందును నుపయోగింపందగు. మరియు జలగలచే దుష్టరక్తమును



స్రవింపంజేసి యుక్తంబగు పత్రములు మొదలగువాటిచే కట్టుగట్టుటయ గాక విరేచనంబునకును నివ్వవలయు.

శ్లో. లేపో విశాలమూలేన హంతి పీడాం స్తనోత్థితామ్
వసకార్పాసికేక్ష్వాకుమూలం సౌవీరకేన వా.

తా. వెఱ్ఱిపుచ్చవేరును నుదకముచే నూరి కించిదుష్ణముజేసి స్తనములయందు లేపనముజేసినను, లేక అడవిప్రత్తివేళ్ళు, చేదుసొరవేళ్ళు, వీటిని గోధుమకలిచే నూరి స్తనములకు లేపనముజేసినను, స్తనరోగములు నశించు.

శ్లో. విదారికందం సురయా పిబేత్స్తన్యవివర్ధనమ్
పాఠామూర్వాబ్దభూనింబదారుశుంఠీకళింగకైః.
శారిబామృతతిక్తాఖ్యైః క్వాథస్స్తన్యవివర్ధనః.

తా. నేలగుమ్ముడుగడ్డను నూరి మద్యములో కలిపి త్రాగినను, లేక అగరుశొంఠి, చాగవేళ్ళు, తుంగగడ్డలు, నేలవేము, దేవదారు, శొంఠి, కొడిశవిత్తులు, సుగంధిపాలవేళ్ళు, తిప్పతీగ, కటుకరోహిణి, వీటిని సమభాగములుగ దంచి కషాయముబెట్టి పానంబొనర్చినను స్త్రీలకు స్తన్యములయందు పాలు స్రవింపునటుల వృద్ధిజెందు.

ఇట్లు స్త్రీరోగచికిత్స ముగిసెను.

---

## బాలరోగలక్షణము.

శ్లో. జ్వరాతిసారాదయ ఏవ రోగా
బాలస్య దేహే ప్రవదంతి సర్వే
స్తనాదిదంతాది చ భూతబాధా
తేషాం తు పూర్వోక్తమిదం సమాచరేత్.

తా. శిశువులకు సహజంబుగ జ్వరము, అతిసారము, ఈమొదలగునవి జనించు. మఱియు స్తన్యపానముచేతను, భూతాదులు సోకుటచేతను, దంతములు జనించునపుడును, జ్వరాదిరోగంబులు జనించు గాన నీక్రింద నుదహరింపంబోయెడి చికిత్సలం జేయవలయు.

---

## బాలరోగచికిత్స.

శ్లో. భైషజ్యం సర్వముద్దిష్టం మహతాం యజ్జ్వరాదిషు
కార్యం గదేషు బాలానా మత్ర మాత్రా లఘీయసీ.

తా. జ్వరాతిసారాదులయందు జెప్పంబడిన యౌషధంబులనే నాయారోగంబులకు దగినట్టు బాలురతారతమ్యమును, దేహదార్ఢ్యంబును, వ్యాధిబలంబును, ఎఱింగి నివ్వందగు.

శ్లో. శృంగీకణారుణాబ్దానాం చూర్ణం లీఢం సమాక్షికమ్
కాసశ్వాసాతిసారాంశ్చ వమీస్సం నాశయేచ్ఛిశోః.

తా, కరకపువ్వు, పిప్పళ్లు, చిత్రమూలము, తుంగగడ్డలు, వీటిని సమభాగములుగ దంచి చూర్ణముజేసి యందు తగుమాత్రముగ తేనె కలిపి శిశువులకొసంగిన శ్వాసకాసలు, అతిసారము, వాంతి, ఇవి నివృత్తియగు.

శ్లో. గృహధూమనిశాకుష్ఠరాజికేంద్రయవైశ్శిశోః
లేపస్తక్రేణ హంత్యాశు సిధ్మపామావిచర్చికాః.

తా. కరుదూపము, పసుపు, కోష్ఠు, ఆవాలు, కొడిశవిత్తులు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి యందు మజ్జిగ కలిపి శిశువులదేహమునకు లేపనము జేసిన శిబ్బెము, గజ్జి, పుండ్లు, ఇవి హరించు.

శ్లో. వచాకుష్ఠవిడంగస్య కోష్ణక్వాథావగాహనాత్
దద్రూవిచర్చికాకండూక్రిమిభిర్ముచ్యతే శిశుః.

తా, వస, కోష్ఠు, వాయువిళంగములు, వీటిని సమభాగములుగ దంచి యుదకంబునవైచి కాచి కించిదుష్ణముగ శిశువులకు స్నానముచేయించిన దద్దులు, పుండ్లు, క్రిమిరోగము, ఇవి నశించు.

శ్లో. ముఖపాకేతు బాలానాం. తామ్రసారమయోరజః
గైరికం క్షౌద్రసంయుక్తం భైషజ్యం సరసాంజనమ్.

తా. రక్తచందనము, లోహభస్మము, కావిరాయి, రసాంజనము, వీటిని సమభాగములుగ తేనెచే ఖల్వమున చక్కగ మర్దించి ఆస్యపాకముగల శిశువుల జిహ్వా మొదలగువాటికి లేపనముజేసిన నోటిపుండ్లు మొదలగునవి నివృత్తియగు.

శ్లో. గుదపాకేతు బాలానాం పిత్తఘ్నీం కారయేత్క్రియామ్
రసాంజనం విశేషేణ పానలేపనయోర్హితమ్.

తా. గుదపాకముగల శిశువులకు పిత్తమును శమింపజేసెడి చికిత్సలం జేయవలయు. మఱియు రసాంజనమును, పానము, లేపనము, వీటిని గావించునటులంజేసిన శిశువుల గుదపాకము నశించు. (గుదపాకమనగా ఆసనము యుండికి యెఱ్ఱగనుండుట.)

శ్లో. కణోషణసితాక్షౌద్రసూక్ష్మైలాసైంధవైః కృతః
మూత్రకృచ్ఛ్రే ప్రయోక్తవ్యశ్శిశూనాం లేహ ఉత్తమః.



తా. పిప్పళ్ళు, మిరియాలు, సన్నయేలకులు, సైంధవలవణము, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి యందు శర్కర, తేనె, కలిపి శిశువులకొసంగిన మూత్రకృచ్ఛ్రము నశించు.

శ్లో. అశ్వత్థత్వగ్వలాక్షౌద్రైర్ముఖపాకే ప్రలేపనమ్.

తా. రావిపట్ట, చిట్టాముట్టివేళ్లు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి యందు తేనె కలిపి శిశువుల జిహ్వా మొదలగువాటికి లేపనముజేసిన ముఖపాకము నశించు.

శ్లో. సర్పత్వగ్లశునం మూర్వా సర్షపారిష్టపల్లవాః
బిడాలవిడజారోమమేషశృంగో వచా మధు.
ధూపశ్శిశోర్జ్వరఘ్నోఽయమశేషగ్రహనాశనః.

తా. పాముకూసము, వెల్లుల్లి, చాగవేళ్లు, ఆవాలు, వేపయిగుళ్లు, పిల్లిపెంట్రుకలు, మేకవెంట్రుకలు, మేకకొమ్ము, వస, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి యందు తేనె కలిపి శిశువులకు ధూపమువేసిన ప్రబలంబు లగుజ్వరము, గ్రహపీడలు, ఇవి నశించు.

శ్లో. (శివ) తత్వన్నిర్మాల్యసిద్ధార్థం సర్పత్వక్కేశసంయుతమ్
సప్తపర్ణత్వచం పిష్ట్వా మూర్వాతిక్తాసమన్వితామ్.
శిశోరుద్వర్తనం కుర్యాత్సర్వగ్రహనివారణమ్.

తా. మొగిలిపువ్వు, తెల్లావాలు, పాముకూసము, వెంట్రుకలు, ఏడాకులరటిపట్ట, చాగవేళ్లు, కటుకరోహిణి, వీటిని నుదకముచే నూరి శిశువుల శరీరమునకు లేపనముజేసిన సమస్తగ్రహదోషములు నివారణమగు.

ఇక సాధారణంబుగ శిశువులకుసోకెడి బాలగ్రహచికిత్సల వచించెద.—

శ్లో. బలిశాంతీష్టకర్మాణి కార్యాణి గ్రహశాంతయే
మంత్రశ్చాయం ప్రయోక్తవ్యస్తత్రాదౌ సర్వకామికః.

వాక్యమ్. ఓం నమోభగవతే గరుడాయ త్ర్యంబకాయ సద్యస్తవస్తుతః స్వాహా. ఓం కం పం టం శం వైనతేయాయ నమః, ఓం హ్రీంహ్రూంహ్రీక్షః.

బాలదేహప్రమాణేన పుష్పమాలాంతు సర్వతః
ప్రగృహ్యముచ్ఛికాభక్తబలిర్దేయస్తు శాంతికః.
ఓంకారిస్వర్ణపక్షీ బాలకం రక్షరక్షస్వాహా, గరుడబలిః. ఓం నారాయణాయ నమః.

తా. బాలురకు గ్రహములు సోకనేని నవి నివృత్తియగుటకై పై ఓంనమో యనుమంత్రంబుచే బలులు, శాంతికర్మలు, హోమములు, అభిమంత్రించుట, వీటిని గావింపవలయు.

వాక్యమ్. ప్రథమే దివసే మాసే వర్షే వా గృహ్ణాతి నందనా నామ మాతృకా, తయా గృహీతమాత్రేణప్రథమం భవతి జ్వరః, అశుభం శబ్దంముంచతి, ఆత్కారం చ కరోతి, స్తన్యం న గృహ్ణాతి. బలిం తస్య ప్రవక్ష్యామియేన సంపద్యతే శుభమ్. నద్యుభయతటమృత్తికాం గృహీత్వా పుత్తళికాం కృత్వా శుక్లౌదనం, శుక్లపుష్పం, శుక్ల సప్తధ్వజాః, సప్తప్రదీపాః, సప్తస్వస్తికాః, సప్తవటకాః, సప్తశష్కులికాః, సప్తజంబుస్వస్తికాః, సప్తముష్టికాః, గంధం పుష్పం తాంబూలం మత్స్యం మాంసం సురాం మగ్రభక్తం చ పూర్వస్యాం దిశి చతుష్పథే మధ్యాహ్నే బలిర్దేయః. తతోఽశ్వత్థపత్రం కుంభే ప్రక్షిప్య శాంత్యుదకేనస్నాపయేత్, రసోనసిద్ధార్థకమేషశృంగనింబపత్రశివనిర్మాల్యైర్బలకం ధూపయేత్. ఓం నమో నారాయణాయ అముకస్య వ్యాధిం హన హన ముంచ ముంచ హ్రీంఫట్ స్వాహా. ఏవం దినత్రయం బలిం దత్వా చతుర్థదివసే బ్రాహ్మణం భోజయేత్, తతస్సంపద్యతే శుభమ్.

తా. శిశు వుదయించిన ప్రథమసంవత్సరము, ప్రథమమాసము, ప్రథమదివసంబున, నందన యనుగ్రహము శిశువునకు సోకు. ఆగ్రహము సోకినతోడనే జ్వరముగలుగుటయ గాక, అశుభశబ్దంబులు, ఆత్కారములు, వీటిని సేయుచు చనుగుడువకయుండు. కావున నాగ్రహము నివృత్తియై శిశువునకు శుభమువాటిల్లెడి బలిని జెప్పెద.—ఏటి యిరుప్రక్కలయందలి మృత్తికనుదెచ్చి చిన్నబొమ్మనుజేసి దానితోడ తెల్ల అన్నము, తెల్లపుష్పములు, తెల్లని ౭ ధ్వజములు, ౭ దీపములు, ౭ స్వస్తికలు, ౭ కుడుములు, ౭ చక్కిలములు, ౭ జంబుస్వస్తికములు, ౭ పిండిముద్దలు, గంధము, పుష్పము, తాంబూలము, మత్స్యము, మాంసము, మద్యము, శ్రేష్ఠంబైనయన్నము వీటిని దీసికొని పూర్వదిశయందు నాలుగు త్రోవలుగలిసెడి ప్రదేశమున కేగి మధ్యాహ్నకాలంబున బలినిగావించి యొకఘటంబున నుదకంబును, నశ్వత్థపత్రంబును వైచి శాంతికరంబులగు మంత్రంబులచే నభిమంత్రించి శిశువునకు స్నానముజేయించి పిదప వెల్లుల్లి తెల్లా ఆవాలు మేకకొమ్ము, వేపాకు, మొగిలిపువ్వు, వీటినిచూర్ణముజేసి ధూపము వేయువలయు. "ఓం నమోనారాయణాయ ఆముకస్యవ్యాధిం హనహన ముంచముంచ హ్రీం ఫట్ స్వాహా" అనునీమంత్రంబును పూజావాహన బలికార్యంబులయందు నుపయోగింపవలయు. ఈప్రకారము మూడుదినంబులు గావించి నాలవదినంబున బ్రాహ్మణుని కన్నం బిడవలయు. ఇట్లొనర్చిన శిశువునకు సోకియుండెడి నందన యనుగ్రహము నివృత్తియై శుభము వాటిల్లు.



వాక్యమ్. ద్వితీయే దివసే మాసే వర్షే వా గృహ్ణాతి సునందా నామ మాతృకా, తయా గృహీతమాత్రేణ ప్రథమం భవతి జ్వరః, చక్షురున్మీలయతి, గాత్రముద్వేజయతి, క్రందతి, స్తన్యం న గృహ్ణాతి, ఆత్కారశ్చ భవతి. బలిం తస్య ప్రవక్ష్యామి యేన సంపద్యతే శుభమ్. తండులహస్తపృష్ఠైకం దధిగుడఘృతం చ మిశ్రితం శరావైకం గంధం తాంబూలం పీతపుష్పం, పీతసప్తధ్వజాః, సప్తప్రదీపాః, దశస్వస్తికాః, మత్స్యమాంససురాతిలచూర్ణాని పశ్చిమస్యాం దిశి చతుష్పథే బలిర్దేయః, దినాని త్రీణి సంధ్యాయాం తతశ్శాంత్యుదకేన స్నాపయేత్, శివనిర్మాల్యసిద్ధార్థమార్జారరోమ ఉశీరఘృతైర్బాలస్యధూపం దద్యాత్, ఓం నమోనారాయణాయ అముకస్య వ్యాధిం హన హన ముంచ ముంచ హ్రీం ఫట్ స్వాహా. చతుర్థదివసే బ్రాహ్మణం భోజయేత్, తతస్సంపద్యతే శుభమ్.

తా. శిశు వుదయించిన రెండవసంవత్సరము, రెండవమాసము, రెండవదినమున, సునందయనుగ్రహము శిశువునకు సోకు. ఆగ్రహము సోకినతోడనే జ్వరము వచ్చుటయ గాక కన్నులు నిక్కబొడుచుకొని, దేహము వణకుచు, నిద్రింపక, రోదనము సేయుచు, స్తన్యపానం బొనర్పక, ఆత్కారము సేయుచుండు. కావున నాగ్రహము నివృత్తియై శిశువునకు శుభముగలిగెడి బలిని జెప్పెద.—పచ్చిపిండియందు పెరుగు, బెల్లము, ఘృతము, వేసి కలిపి యొకచెయ్యివలె జేసి మూకుడుయందునిచి దానితోడ గంధము, తాంబూలము, పచ్చనిపువ్వులు, పచ్చని ౭ ధ్వజములు, ౭ దీపములు, ౧౦ స్వస్తికలు, మత్స్యమాంసము, మద్యము, నువ్వులపిండి, వీటినిగ్రహించి పశ్చిమదిశకేగి యందు నాలుగు త్రోవలుగలిసెడి ప్రదేశమున సాయంకాలమునందు బలినొసంగి పిదప శాంత్యుదకంబుచే శిశువుకు స్నానముజేయించి మొగిలిపువ్వు, తెల్లావాలు, పిల్లివెంట్రుకలు, వట్టివేళ్ళు, వీటిని చూర్ణముగావించి యందు నెయ్యి కలిపి ధూపము వేయవలయు. "ఓం నమోనారాయణాయ అమ్ముకస్యవ్యాధిం హనహన ముంచముంచ హ్రీం ఫట్ స్వాహా" అను నీమంత్రంబును పూజావాహనాదులయందుఁ బ్రయోగింపవలయు. ఈప్రకారము మూడుదినంబులు గావించి నాలవదినంబున బ్రాహ్మణుని కన్నంబిడవలయు. ఇట్లొనర్చిన నాశిశువునకు సోకియుండెడి సునందయనుగ్రహము నివృత్తియై శుభము వాటిల్లు.

వాక్యమ్. తృతీయ దివసే మాసే వర్షే వా గృహ్ణాతి పూతనా నామ మాతృకా, తయా గృహీతమాత్రేణ ప్రథమం భవతి జ్వరః, గాత్రముద్వేజయతి, స్తన్యం న గృహ్ణాతి, ముష్టిం బధ్నాతి, క్రందతి, ఊర్ధ్వం నిరీక్షతే, బలిం తస్య ప్రవక్ష్యామి యేన సంపద్యతే శుభమ్. నద్యుభయతటమృత్తికాం గృహీత్వా పుత్తళికాం కృత్వా గంధపుష్పతాంబూలం, రక్తచందనం, రక్తపుష్పం, రక్తసప్తధ్వజాః, సప్తప్రదీపాః, సప్తస్వస్తికాః, పక్షిమాంససురాఅగ్రభక్తం చ దక్షిణస్యాం దిశి అపరాహ్ణే చతుష్పథే బలిర్దాతవ్యః. శివనిర్మాల్యగుగ్గులుసర్షపనింబపత్రమేషశృంగైర్దినత్రయం ధూపయేత్. ఓం నమోనారాయణాయ బాలస్య వ్యాధిం హన హన ముంచ ముంచ హ్రాసయ హ్రాసయ స్వాహా. చతుర్థ దివసే బ్రాహ్మణం భోజయేత్, తతస్సంపద్యతే శుభమ్.

తా. శిశువుజనించిన మూడవసంవత్సరము, మూడవమాసము, మూడవదినమున, పూతనయను గ్రహము శిశువునకు సోకు. ఆగ్రహము సోకినతోడనే జ్వరము గలుగుటయ గాక, శరీరము వణకుచు, స్తన్యపానం బొనర్పక, చేతులవ్రేళ్లు ముడుచుకొని, ఏడ్చుచు, కండ్లు నిక్కబొడుచుకొని జూచుచుండు. కావున నాగ్రహనివృత్తికై బలిని జెప్పెద.—ఏటి మృత్తికను దీసికొనివచ్చి చిన్నబొమ్మను జేసి దానితోడ గంధము, పుష్పము, తాంబూలము, రక్తచందనము, రక్తపుష్పము, ౭ యెఱ్ఱధ్వజములు, ౭ స్వస్తికలు, పక్షిమాంసము, మద్యము, శ్రేష్ఠంబైన యన్నము, వీటిని గ్రహించికొని దక్షిణదిశకేగి యందు నాలుగుత్రోవలు గలిసెడిమార్గంబున నపరాహ్ణమున బలినొసంగి శాంత్యుదకంబుచే శిశువునకు స్నానముజేయించి మొగిలిపువ్వు, గుగ్గిలము, ఆవాలు, వేపాకు, మేకకొమ్ము, వీటిని చూర్ణముజేసి ధూపము వేయవలయు. ''ఓం నమోనారాయణాయ బాలస్యవ్యాధిం హన హన ముంచ ముంచ హ్రాసయహ్రాసయ స్వాహా'' అను నీమంత్రంబును పూజావాహనబలులయం దుపయోగింపవలయు. ఈప్రకారము మూడు దినములు గావించి నాలవదినంబున బ్రాహ్మణుని కన్నం బొసంగవలయు. ఇట్లొనర్చిన నాశిశువునకు సోకియుండెడి పూతనయను గ్రహము నివృత్తియై శుభము వాటిల్లు.

వాక్యమ్. చతుర్థే దివసే మాసే వర్షే వా గృహ్ణాతి ముఖమండికా నామ మాతృకా, తయా గృహీతమాత్రేణ ప్రథమం భవతి జ్వరః, గ్రీవాంనామయతి, అక్షిణీ ఉన్మీలయతి, స్తన్యం న గృహ్ణాతి,



రోదితి, స్వపితి, ముష్టిం బధ్నాతి. బలిం తస్య ప్రవక్ష్యామి యేన సంపద్యతే శుభమ్, నద్యుభయతటమృత్తికాం గృహీత్వా పుత్తళికాం కృత్వా ఉత్పలపుష్పం, గంధతాంబూలం, దశధ్వజాః, చత్వారః ప్రదీపాః, త్రయోదశస్వస్తికాః, మత్స్యంమాంససురాఅగ్రభక్తం చ ఉత్తరస్యాం దిశి అపరాహ్ణే చతుష్పథే బలిం దద్యాత్. ఆద్యమాసికో ధూపః. ఓం నమో నారాయణాయ హన హన ముంచ ముంచ స్వాహా. చతుర్థదివసే బ్రాహ్మణం భోజయేత్, తతస్సంపద్యతే శుభమ్.

తా. శిశువుద్భవిల్లిన నాలవసంవత్సరము, నాలవమాసము, నాలవదినమున, ముఖమండిక యనుగ్రహము శిశువునకు సోకు. ఆగ్రహము సోకినతోడనే జ్వరము గలుగుటయ గాక, మెడ వ్రేలవేయుచు, కండ్లు నిక్కబొడుచుకొని, చన్నుగుడువక ఏడ్చుచు, సదా నిద్రింపుచు, హస్తములవ్రేళ్లను ముడుచుకొని యుండు. కావున నాగ్రహనివృత్తికై బలిని వచించెద.—ఏటి యిరుపార్శ్వములయందలి మృత్తికను దీసికొనివచ్చి చిన్నబొమ్మను గావించి దానితోడ నల్లకలువపుష్పములు, గంధము, తాంబూలము, ౧౦ ధ్వజములు, ౪ దీపములు, ౧౩ స్వస్తికలు, మత్స్యము, మాంసము, మద్యము, శ్రేష్ఠమైన యన్నము, వీటిని గ్రహించి ఉత్తరదిశ కేగి యందు నాలుగు త్రోవలుగలిసెడి ప్రదేశమున నపరాహ్ణమందు బలినొసంగి శాంత్యుదకంబుచే శిశువునకు స్నానముజేయించి ప్రథమసంవత్సరంబునకు జెప్పియుండెడి ధూపమునే వేయవలయు. ''ఓం నమోనారాణాయ హన హన ముంచ ముంచ స్వాహా'' అను నీ మంత్రంబును పూజావాహనబలులయందు బ్రయోగింపవలయు. ఈప్రకారము మూడుదినంబులొనర్చి నాలవదినంబున బ్రాహ్మణుని కన్నంబిడిన నాశిశువునకు సోకియుండెడి ముఖమండిక యనుగ్రహము నివృత్తియై శుభము గలుగు.

వాక్యమ్. పంచమే దివసే మాసే వర్షే వా గృహ్ణాతి కటపూతనా నామ మాతృకా, తయా గృహీతమాత్రేణ ప్రథమం భవతి జ్వరః, గాత్రముద్వేజయతి, స్తన్యం న గృహ్ణాతి, ముష్టిం చ బధ్నాతి. బలిం తస్య ప్రవక్ష్యామి యేన సంపద్యతే శుభమ్. కుంభకారచక్రస్య మృత్తికాం గృహీత్వా పుత్తళికాం నిర్మాయ గంధతాంబూలం, శుక్లోదనం శుక్లపుష్పం, పఞ్చధ్వజాః, పంచప్రదీపాః, పంచవటకాః, ఐశాన్యాం దిశి బలిర్దాతవ్యః, శాంత్యుదకేన స్నాపయేత్, శివనిర్మాల్యసర్పనిర్మోకగుగ్గులునింబపత్రైర్బాలకం ఘృతైర్ధూపం దద్యాత్. ఓం నమో నారాయ

ణాయ అముకస్యస్య వ్యాధిం చూర్ణయ చూర్ణయ హన హన స్వాహా. చతుర్థే దివసే బ్రాహ్మణం భోజయేత్, తతస్సంపద్యతే శుభమ్.

శిశువుజనించిన నైదవసంవత్సరము, నైదవమాసము, నైదవదినమున, కటపూతన యనుగ్రహము శిశువునకు సోకు. ఆగ్రహము సోకినతోడనే జ్వరము గలుగుటయ గాక, దేహము వణకుచు, స్తన్యపానం బొనర్పక, చేతులవ్రేళ్లు ముడుచుకొనియుండు. కావున నాగ్రహము నివృత్తియై శిశువునకు శుభముగలిగెడి బలిని వక్కాణించెద.— కుమ్మరవాని చక్రముయందలి మృత్తికను దీసుకవచ్చి చిన్నబొమ్మనుజేసి దానితోడ గంధము, తాంబూలము, తెల్లనియన్నము, తెల్లనిపువ్వులు, అయిదుధ్వజములు, అయిదు దీపములు, అయిదుపిండివంటలు, వీటిని దీసికొని గృహము బైలువెడలి యీశానదిశ యందు బలినొసంగి శాంత్యుదకముచే బాలునకు స్నానముజేయించి మొగిలిపువ్వు, పాముకుబుసము, గుగ్గిలము, వేపాకు, వీటిని చూర్ణముజేసి యందు నెయ్యి కలిపి ధూపమువేయవలయు. "ఓం నమోనారాయణాయ అముకస్యవ్యాధిం చూర్ణయ చూర్ణయ హన హన స్వాహా" అను నీమంత్రంబును పూజావాహనబలులయందు బ్రయోగింపందగు. ఇటుల మూడుదినంబు లొనర్చి నాలవదినంబున బ్రాహ్మణుని కన్నంబిడవలయు. ఇట్లొనర్చిన శిశువునకు సోకియుండెడి కటపూతన యనుగ్రహము నివృత్తియై శుభంబుగలుగు.

వాక్యమ్. షష్ఠే దివసే మాసే వర్షే వా గృహ్ణాతి శకునికా నామ మాతృకా, తయా గృహీతమాత్రేణ ప్రథమం భవతి జ్వరః, గాత్రభేదం చ దర్శయతి, దివారాత్రావుత్థానం భవతి, ఊర్ధ్వం నిరీక్షతే, బలిం తస్య ప్రవక్ష్యామి యేన సంపద్యతే శుభమ్. పిష్టకేన పుత్తళికాం కృత్వా, శుక్లపుష్పం, రక్తపుష్పం, పీతపుష్పం, గంధం, తాంబూలం, శదప్రదీపాః, దశధ్వజాః, దశస్వస్తికాః, దశముష్టికాః, దశవటకాః, క్షీరజంబూడికామత్స్యమాంససురా ఆగ్నేయ్యాం దిశి నిష్కాంతే మధ్యాహ్నే బలిం దాపయేత్, శాంత్యుదకేన స్నాపయేత్, శివనిర్మాల్యరసోనగుగ్గులుసర్పనిర్మోకనింబపత్రఘృతైర్ధూపం దద్యాత్, ఓం నమో నారాయణాయ చూర్ణయ చూర్ణయ హన హన స్వాహా. చతుర్థదివసే బ్రాహ్మణం భోజయేత్, తతస్సంపద్యతే శుభమ్.

తా. శిశు వుదయించిన ఆఱవవత్సరము, ఆఱవమాసము, ఆఱవదినంబున, శకునిక యనుగ్రహము సోకు. ఆగ్రహము సోకినతోడనే జ్వరము గలుగుటయ గాక



ఒడలు వివర్ణముగను, దివారాత్రులయందు నిద్రింపకను, కన్నులు నిక్కబొడుచుకొనియుండు. గాన నాగ్రహము నివృత్తియై శుభము గలిగెడిబలిని వాక్రుచ్చెద.— పచ్చి పిండితో బొమ్మనుజేసి. దానితోడ తెల్లనిపువ్వులు, ఎఱ్ఱనిపువ్వులు, పచ్చనిపువ్వులు, గంధము, తాంబూలము, ౧౦ దీపములు, ౧౦ ధ్వజములు, ౧౦ స్వస్తికలు, ౧౦ పిండి ముద్దలు, ౧౦ కుడుములు, క్షీరజంబూడికములు, మత్స్యమాంసము, మద్యము, వీటిని దీసికొని గృహము బైలువెడలి నిజనస్థలంబున నాగ్నేయదిశయందు మధ్యాహ్నంబున బలినొసంగి శాంత్యుదకముచే శిశువునకు స్నానము జేయించి మొగిలిపువ్వు, వెల్లుల్లి, గుగ్గిలము, పాముకుబుసము, వేపాకు, వీటిని చూర్ణముజేసి యందు నెయ్యి కలిపి ధూపము వేయవలయు. "ఓం నమో నారాయణాయ చూర్ణయ చూర్ణయ హన హన స్వాహా" అను నీమంత్రంబును పూజావాహనబలులయందు బ్రయోగింపవలయు. ఈప్రకారము మూడుదినంబులు గావించి నాలవదినమున బ్రాహ్మణుని కన్నం బొసంగవలయు. ఇటులజేసిన శిశువునకు సోకియుండెడి శకునికయనుగ్రహము నివృత్తియై శుభము గలుగు.

వాక్యమ్. సప్తమే దివసే మాసే వర్షే వా యదా గృహ్ణాతి శుష్కరేవతీ నామమాతృకా, తయా గృహీతమాత్రేణ ప్రథమం భవతి జ్వరః, గాత్రముద్వేజయతి, ముష్టిం బధ్నాతి, రోదితి. బలిం తస్య ప్రవక్ష్యామి యేన సంపద్యతే శుభమ్. రక్తపుష్పం, శుక్లపుష్పం, గంధ తాంబూలం, రక్తౌదనం, కృసరః త్రయోదశస్వస్తికాః, మత్స్యమాంస సురాః త్రయోదశధ్వజాః, పంచప్రదీపాః, పశ్చిమదిగ్భాగే గ్రామనిష్కాశే అపరాహ్ణే వృక్షమాశ్రిత్య బలిం దద్యాత్, శాంత్యుదకేన స్నానం, గుగ్గులుమేషశృంగసర్షపఉశీరఘృతైర్బాలకం ధూపయేత్, ఓం నమో నారాయణాయ దీప్తతేజసే హన హన ముంచ ముంచ స్వాహా. చతుర్థదివసే బ్రాహ్మణం భోజయేత్. తతస్సంపద్యతే శుభమ్.

తా. బాలుం డుద్భవిల్లిన నేడవసంవత్సరము, నేడవమాసము, నేడవదినంబున, శుష్కరేవతి యనుగ్రహము సోకు. ఆగ్రహము సోకినతోడనే జ్వరము గలుగుటయ గాక, ఒడలు వణకుచు, చేతులవ్రేళ్ళు ముడుచుకొని, ఏడ్చుచుండు. గాన నాగ్రహము నివృత్తియై శుభముగలిగెడి బలి న్వచించెద.— రక్తపుష్పములు, తెల్లనిపుష్పములు, గంధము, తాంబూలము, రక్తాన్నము, పులగము, ౧౩ స్వస్తికలు, మత్స్యము, మాంసము, ౧౩ ధ్వజములు, ౫ దీపములు, వీటిని దీసికొని గృహము బైలువెడలి నిర్మానుష్యంబగు ప్రదేశమునందలి యేదైన నొకవృక్షంబు నాశ్రయించి మధ్యాహ్నంబున బలినొసంగ

వలయు. పిదప బాలునకు శాంత్యుదకంబుచే స్నానముజేయించి గుగ్గిలము, మేకకొమ్ము, తెల్లావాలు, వట్టివేళ్ళు, వీటి చూర్ణమును నేతితో ధూపమువేయవలయు. "ఓం నమో నారాయణాయ దీప్తతేజసే హన హన ముంచ ముంచ స్వాహా" అను నీమంత్రంబును పూజావాహన బలులయందు బ్రయోగింపందగు. ఇటుల మూడుదినంబులు గావించి నాలవదినంబున బ్రాహ్మణుని కన్నం బొసంగవలయు. ఇటులచేసిన బాలునకు సోకియుండెడి శుష్కరేవతి యనుగ్రహము నివృతియై శుభంబు గలుగు.

వాక్యమ్. అష్టమే దివసే మాసే వర్షే వా యది గృహ్ణాతి అర్యకా నామ మాతృకా. తయా గృహీతమాత్రేణ ప్రథమం భవతి జ్వరః, గృధ్రగన్ధః పూతిగంధశ్చ జాయతే, ఆహారం చ న గృహ్ణాతి, ఉద్వేజయతి గాత్రాణి, బలిం తస్య ప్రవక్ష్యామి యేన సంపద్యతే శుభమ్. రక్తపీతధ్వజాః, చందనం పుష్పం, శష్కుల్యః, పర్పటికాః, మత్స్యమాంససురాజంబూడికాః, ప్రత్యూషే బలిర్దేయః, ప్రాంతరే. మంత్రః. ఓం నమో నారాయణాయ చతుర్దిశమోక్షణాయ వ్యాధిం హన హన ముంచ ముంచ దహ దహ ఓం హ్రీం ఫట్ స్వాహా. చతుర్థదివసే బ్రాహ్మణం భోజయేత్. తతస్సంపద్యతే శుభమ్.

తా. శిశువుజనించిన నెనిమిదవవత్సరము, యెనిమిదవమాసము, యెనిమిదవదినంబున, ఆర్యక యనుగ్రహము సోకు. ఆగ్రహము సోకినతోడనే జ్వరము గలుగుటయగాక, శరీరము గృధ్రగంధంబైనను, దుర్గంధంబైనను, గలిగి ఆహారమును భుజింపక, దేహము వణకుచుండు. కావున నాగ్రహము నివృత్తియై బాలునికి శుభము గలిగెడి బలిని జెప్పెద.—ఎఱ్ఱగను, పచ్చగను నుండెడిధ్వజములు, చందనము, పుష్పములు, చక్కిలములు, పర్పటిక మనుభక్ష్యములు, మత్స్యమాంసము, మద్యము, జంబూడికములు, వీటిని దీసికొని గృహము బైలువెడలి గ్రామప్రాంతంబున నరుణోదయకాలంబున బలినొసంగి బాలునకు శాంత్యుదకముచే స్నానముజేయించి ధూపము వేయవలయు. మరియు "ఓం నమో నారాయణాయ చతుర్దిశమోక్షణాయ వ్యాధిం హన హన ముంచ ముంచ దహ దహ ఓం హ్రీం ఫట్ స్వాహా" అను నీమంత్రంబును పూజావాహనబలులయం దుపయోగింపవలయు. ఈప్రకారము మూడుదినంబులు గావించి నాలవదినంబున బ్రాహ్మణుని కన్నం బిడవలయు. ఇట్లొనర్చిన బాలునకు సోకియుండెడి నా ఆర్యక యనుగ్రహము నివృత్తియై శుభంబు గలుగు.



వాక్యమ్. నవమే దివసే మాసే వర్షే వా గృహ్ణాతి భూసూతికా నామ మాతృకా, తయా గృహీతమాత్రేణ ప్రథమం భవతి జ్వరః, నిత్యం ఛర్ది ర్భవతి, గాత్రభేదం దర్శయతి, ముష్టిం బధ్నాతి. బలిం తస్య ప్రవక్ష్యామి యేన సంపద్యతే శుభమ్. నద్యుభయతటమృత్తికాం గృహీత్వా పుత్తళికాం నిర్మాయ శుక్లవస్త్రేణ వేష్టయేత్, శుక్లపుష్పం, గంధతాంబూలం, శుక్లత్రయోదశధ్వజాః, త్రయోదశదీపాః, త్రయోదశస్వస్తికాః, త్రయోదశపుత్తళికాః, త్రయోదశమత్స్యపుత్తళికాః, మత్స్యమాంససురాః, ఉత్తరదిగ్భాగే గ్రామనిష్కాశే బలిం దద్యాత్, శాంత్యుదకేన స్నానం, గుగ్గులునింబపత్రగోశృంగశ్వేతసర్షపఘృతై ర్ధూపం దద్యాత్. మంత్రః. ఓం నమో నారాయణాయ చతుర్భుజాయ హన హన ముంచ ముంచ స్వాహా. చతుర్థదివసే బ్రాహ్మణం భోజయేత్. తతస్సంపద్యతే శుభమ్.

తా. బాలుండుద్భవిల్లిన తొమ్మిదవవత్సరము, తొమ్మిదవమాసము, తొమ్మిదవదినంబున, భూసూతిక యనుగ్రహము బాలునకు సోకు. ఆగ్రహము సోకినతోడనే జ్వరము, పలుమారు వాంతి, ఇవి గలుగుటయ గాక, శరీరము వివర్ణంబై చేతులవ్రేళ్లు ముడుచుకొని యుండు. కావున నాగ్రహము నివృత్తియై బాలునికి శుభముగలిగెడి బలిని జెప్పెద.—ఏటి యిరుప్రక్కలయందలి మృత్తికను దీసుక వచ్చి చిన్నబొమ్మను జేసి దానిని తెల్లనివస్త్రంబుచే గప్పి దానితోడ తెల్లనిపువ్వులు, గంధము, తాంబూలము, ౧౩ తెల్లనిధ్వజములు, ౧౩ దీపములు, ౧౩ స్వస్తికలు, ౧౩ పచ్చిపిండిచే చేయబడిన చిన్నబొమ్మలు, ౧౩ మత్స్యాకారము గలబొమ్మలు, మత్స్యమాంసము, మద్యము, వీటిని గ్రహించి గృహము బైలువెడలి ఉత్తరదిశయందు నిర్మానుష్యప్రదేశంబున బలినొసంగి శాంత్యుదకముచే బాలునకు స్నానముజేయించి గుగ్గిలము, వేపాకు, ఆవుకొమ్ము, తెల్లావాలు, వీటిని చూర్ణముచేసి యందొకింత నెయ్యి కలిపి ధూపమువేయవలయు. "ఓం నమో నారాయణాయ చతుర్భుజాయ హన హన ముంచ ముంచ స్వాహా" అను నీమంత్రంబును పూజావాహనబలులయం దుపయోగింపవలయు. ఇటుల మూడుదినంబులు గావించి నాలవదినంబున బ్రాహ్మణున్కి కన్నం బొసంగవలయు. ఇట్లొనర్చిన బాలునకుసోకియుండెడి భూసూతిక యనుగ్రహము నివృత్తియై శుభము గలుగు.

వాక్యమ్. దశమే దివసే మాసే వర్షే వా గృహ్ణాతి నిర్రుతీ నామ మాతృకా, తయా గృహీతమాత్రేణ ప్రథమం భవతి జ్వరః, గాత్ర

ముద్వేజయతి, ఆత్కారం కరోతి, రోదితి, మూత్రం పురీషం చ భవతి. బలిం తస్య ప్రవక్ష్యామి యేన సంపద్యతే శుభమ్. పారావారమృత్తికాం గృహీత్వా పుత్తళికాం నిర్మాయ గంధతాంబూలం, రక్తపుష్పం, రక్తచందనం, పంచవర్ణధ్వజాః, పంచప్రదీపాః, పంచస్వస్తికాః, పంచపుత్తళికాః, మత్స్యమాంససురాః వాయవ్యాం దిశి బలిం దద్యాత్, కాకవిష్ఠాగోమాంసగోశృంగరసోనమార్జారరోమనింబపత్రఘృతైర్ధూపయేత్. ఓం నమో నారాయణాయ చూర్ణితహస్తాయ ముంచ ముంచ స్వాహా. చతుర్థదివసే బ్రాహ్మణం భోజయేత్. తతస్స్వస్థో భవతి బాలకః.

తా. బాలుడుజనించిన పదియవసంవత్సరము, పదియవమాసము, పదియవదినమున, నిర్పతి యనుగ్రహము బాలునకు సోకు. ఆగ్రహము సోకినతోడనే జ్వరము గలుగుటయ గాక, శరీరము వణకుచు, ఆత్కారము సేయుచు, ఏడ్చుచు, నధికముగ మూత్రపురీషోత్సర్జనంబుల గావింపుచుండు. కావున నబ్బాలునికి సోకినగ్రహము నివృత్తియై శుభముగలిగెడి బలిని వచించెద.—సముద్రతటంబునందలి మృత్తికను దీసుకవచ్చి చిన్నబొమ్మనుచేసి దానితోడ గంధము, తాంబూలము, రక్తపుష్పము, రక్తచందనము, అయిదువర్ణములు గలధ్వజములు, ౫ దీపములు, ౫ స్వస్తికలు, ౫ పచ్చిపిండిబొమ్మలు, మత్స్యమాంసము, మద్యము, వీటిని దీసికొని గృహము బైలువెడలి వాయవ్యదిశయందు బలిని యిచ్చి శాంత్యుదకముచే బాలుని స్నానముజేయించి కాకిమలము, గోమాంసము, ఆవుకొమ్ములచూర్ణము, వెల్లుల్లి, పిల్లివెంట్రుకలు, వేపాకుచూర్ణము, నెయ్యి, వీటిని యేకంబొనర్చి ధూపము వేయవలయు. "ఓం నమో నారాయణాయ చూర్ణితహస్తాయ ముంచ ముంచ స్వాహా"అను నీమంత్రంబును పూజావాహనబలులయం దుపయోగింపవలయు. ఇటుల మూడుదినములు గావించి నాలవదినంబున బ్రాహ్మణుని కన్నం బొసంగవలయు. ఇట్లొనర్చిన నా నిర్పతి యనుగ్రహము నివృత్తియై బాలునకు శుభంబు గలుగు.

వాక్యమ్. ఏకాదశే దివసే మాసే వర్షే వా యది గృహ్ణాతి పిలిపిచ్ఛికా నామ మాతృకా, తయా గృహీతమాత్రేణ ప్రథమం భవతి జ్వరః, ఆహారం న గృహ్ణాతి, ఊర్ధ్వదృష్టిర్భవతి, గాత్రభంగో భవతి. బలిం తస్య ప్రవక్ష్యామి యేన సంపద్యతే శుభమ్. పిష్టకేన పుత్తళికాం కృత్వా రక్తచందనం రక్తం చ తస్యాముఖం దుగ్ధేన సించేత్, పీతపుష్పం, గంధతాంబూలం, సప్తపీతధ్వజాః, సప్తప్రదీపాః, అష్టౌ వటకాః, అష్టౌ శష్కులికాః, అష్టౌ పూరికాః, మత్స్యమాంససురాః, పూర్వస్యాం దిశి



బలిర్దాతవ్యః, శాంత్యుదకేన స్నానం, శివనిర్మాల్యగుగ్గులుగోశృంగసర్పనిర్మోకఘృతైర్ధూపయేత్. ఓం నమో నారాయణాయ ముంచ ముంచ స్వాహా. చతుర్థదివసే బ్రాహ్మణం భోజయేత్. తతస్స్వస్థో భవతి బాలకః.

తా. బాలుం డుద్భవిల్లిన పదునొకొండవసంవత్సరము, పదునొకొండవమాసము, పదునొకొండవదినమున, పిలపిచ్ఛిక యనుగ్రహము బాలునకు సోకు. ఆగ్రహము సోకినతోడనే జ్వరము గలుగుటయ గాక, ఆహారమును భుజింపక, పైమోపు చూచుచు, ఒడలు విరుచుచునుండు గాన నాగ్రహము నివృత్తియై బాలునికి శుభముగలిగెడి బలిని వచించెద.—పచ్చిపిండితో చిన్నబొమ్మను జేసి పాలలో రక్తము, రక్తచందనము, వీటిని కలిపి దానిముఖముమీద చల్లవలయు. పిదప యాబొమ్మతోడ పచ్చని పువ్వులు, గంధము, తాంబూలము, ౭ పచ్చనిధ్వజములు, ౭ దీపములు, ౮ పిండివుంటలు, ౮ చక్కిలములు, ౭ పూరీలు, మత్స్యమాంసము, మద్యము, వీటిని దీసికొని గృహము బైలువెడలి పూర్వదిశయందు బలిని యిచ్చి శాంత్యుదకముచే బాలుని స్నానముజేయించి మొగిలిపువ్వు, గుగ్గిలము, ఆవుకొమ్ము, పాముకూసము, వీటిని చూర్ణముజేసి యందు కొంచముగ నెయ్యి కలిపి ధూపమువేయవలయు. "ఓం నమో నారాయణాయ ముంచ ముంచ స్వాహా"అను నీమంత్రంబును పూజావాహనబలులయం దుపయోగింపవలయు. ఈప్రకారము మూడుదినంబులు గావించి నాలవదినంబున బ్రాహ్మణుని కన్నం బొసంగవలయు. ఇట్లొనర్చిన నాపిలిపిచ్ఛిక యనుగ్రహము నివృత్తియై బాలునకు శుభము గలుగు.

వాక్యమ్. ద్వాదశే దివసే మాసే వర్షే వా యది గృహ్ణాతి కాముకా నామ మాతృకా, తయా గృహీతమాత్రేణ ప్రథమం భవతి జ్వరః, విహస్య వాదయతి కరేణ వర్జయతి, గృహ్ణాతి, క్రామతి, నిశ్శ్వసితి, ముహుర్ముహు రాహారం న కరోతి. బలిం తస్య ప్రవక్ష్యామి యేన సంపద్యతే శుభమ్, క్షీరేణ పిష్టపుత్తళికాం కృత్వా గంధం, తాంబూలం, శుక్లపుష్పం, శుక్లసప్తధ్వజాః, సప్తప్రదీపాః, సప్తపూరికాః, కరస్థేన దధిభక్తేన, సర్వకర్మబలిం దద్యాత్, శాంత్యుదకేన స్నాపయేత్, శివనిర్మాల్యగుగ్గులుసర్షపఘృతైర్ధూపయేత్, ఓం నమో నారాయణాయ ముంచ ముంచ హన హన స్వాహా. చతుర్థదివసే బ్రాహ్మణం భోజయేత్, తతస్స్వస్థో భవతి బాలకః.

తా. బాలుడుజనించిన పండ్రెండవవత్సరము, పండ్రెండవమాసము, పండ్రెండవదినంబున, కాముక యనుగ్రహము బాలునకు సోకు. ఆగ్రహము సోకినతోడనే జ్వరము

గలుగుటయ గాక, పిచ్చిపట్టినవానివలె నవ్వుచు, మాటలాడుచు, చేతులతో నేదైన నొకవస్తువును గ్రహింపుచు, వదలుచు, పరుగులిడుచు, నిట్టూర్పు విడుచుచు, భోజన మునందిచ్ఛలేకుండు కావున నాగ్రహము నివారణమై బాలునికి శుభముగలిగెడి బలి నవక్కాణించెద.—పచ్చిపిండిలో పాలుపైచి కలిపి యొక చిన్నబొమ్మనుజేసి దాని తోడ గంధము, తాంబూలము, తెల్లనిపువ్వులు 2 తెల్లనిధ్వజములు, 2 దీపములు, 2 పూరీలు, పెరుగన్నము, వీటినికొని గృహము బైలువెడలి బలిని యిచ్చి శాంత్యుదక ముచే బాలుని స్నానము జేయించి మొగలిపువ్వు, గుగ్గిలము, తెల్లావాలు వీటిని చూర్ణ ముజేసి యం దొకింత నెయ్యి కలిపి ధూపము వేయవలయు. "ఓం నమో నారాయ ణాయ ముంచ ముంచ హన హన స్వాహా" అను నీమంత్రంబును పూజావాహనబలు లయం దుపయోగింపవలయు. ఇటుల మూడుదినంబులు గావించి నాలవదినంబున బ్రాహ్మ ణుని కన్నం బొసంగవలయు. ఇట్లొనర్చిన బాలునికియుండెడి కాముక యనుగ్రహ ము నివృత్తియై శుభము గలుగు.

ఇట్లు బాలగ్రహచికిత్స యనుకౌమారతంత్రము ముగిసెను.

---

## విషలక్షణము.

శ్లో. స్థావరం జంగమం చైవ ద్వివిధం విషముచ్యతే
మూలాత్మకం స్థావరం స్యాత్సర్పాదీనాం తు జంగమమ్.
స్థావరాణాం చ సర్వేషాం వమనం కారయేద్భిషక్.

తా. విషములు స్థావరమనియు, జంగమమనియు, రెండువిధంబులుగ నుండు. అందు వసనాభి మొదలగునవి స్థావరవిషములనియు, సర్పము మొదలగునవి జంగమవిష ములనియు నెఱుంగవలయు. మరియు సమస్తస్థావరవిషములకు వమనము నకివ్వవలయు.

శ్లో. స్థావరం తు జ్వరం హిక్కాం దంతఘర్షం గళగ్రహమ్
ఫేనచ్ఛర్ద్యరుచిం శ్వాసం మూర్ఛాం చ కురుతే భృశమ్.

తా. జ్వరము, ఎక్కిళ్ళు, పండ్లు పటపటకొరుకుట, గొంతు పట్టికొనినట్లుండుట, నోట నురుగుగట్టుట, వాంతియగుట, అరుచి, శ్వాస, మూర్ఛ, ఇవి గలుగుట, ఇట్టి లక్షణంబులుగలిగిన స్థావరవిషంబని ఎరుంగవలయు.

శ్లో. నిద్రాం తంద్రాం క్లమం దాహమపాకం రోమహర్షణమ్
శోఫం చైవాతిసారం చ కురుతే జంగమం విషమ్.



తా. నిద్ర, తూరుకుపాటు, బడలిక, దాహము, అజీర్ణము, గగుర్పాటు, వాపు, అతిసారము, ఇవిగలిగిన జంగమవిషంబని ఎఱుంగవలయు.

---

## విషచికిత్స.

శ్లో. రజనీసైంధవయుతం సక్షౌద్రం ఘృతముత్తమమ్
పానం మూలావిషార్తస్యావిష్వవిద్ధస్య చక్షతే.

తా. నీలివేరునైనను, దానియాకునైనను, చూర్ణముజేసి యందు తగుమాత్రముగ సైంధవలవణము, తేనె, నెయ్యి, కలిపి చక్కగ నూరి స్థావరవిషదగ్ధపీడితులును, శరీరము పైన వ్యాపించిన విషములుగలవారును, భక్షించిన నవి హరించు.

శ్లో. సైంధవం మరిచం తుల్యం నింబబీజం సమీకృతమ్
మధుసర్పిర్యుతం హంతి విషం స్థావరజంగమమ్.

తా. సైంధవలవణము, మిరియాలు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి దీనికి సమముగ వేపవిత్తులచూర్ణమును కలిపి తేనె, నెయ్యి, వీటిని న్యూనాధికముగ పైచి చక్కగ ఖల్వంబున మర్దించి భక్షించిన స్థావరజంగమవిషములు నశించు.

శ్లో. తిక్తకోశాతకీక్వాథం మధ్వాజ్యసంయుతం పిబేత్
కటుకా తుంబిమూలం వా తత్పత్రం వా పిబేజ్జలైః.
తత్క్షణాద్వమనాద్ధంతి విషయోగాద్విముచ్యతే.

తా. చేదుబీరకాయను దంచి కషాయముబెట్టి యందు తేనె, కొంచముగ నెయ్యి కలిపి త్రాగినను, లేక చేదుసొరవేరునైనను, దాని ఆకులనైనను, నుదకముచే దంచి రసముదీసి త్రాగినను వమనంబయి తత్క్షణంబున విషములు నశించు.

శ్లో. రంజనీచూర్ణధూపేన విషం వృశ్చికజం హరేత్
వస్త్రేణ సాధ్యమాసాధ్య ధూపం ధూపం చ పాయయేత్.
దంశే చ ధూపయేత్తూర్ణం సర్వధూపేష్వయం విధిః.

తా. నీలియాకుచూర్ణమును ధూపము వేసి దానిని పానం బొనర్పవలయు. అట్లు త్రాగుట కశక్యం బయ్యేనేని వస్త్రమును నడ్డముగ నునిచికొనియయినను పానం బొన ర్చుటయ గాక తేలుకుట్టినచోట సగా ధూపము వేసిన తేలువిషము నశించు. మఱియు నీరీతినే సర్వధూపములకు జేయవలయు.

శ్లో. తోయైర్వా నాగరం నస్యం పిబేద్వా సైంధవం ఘృతమ్
అర్కదుత్తూరమూలం వా జలపానైర్విషాపహమ్.

**తా.** శొంఠిచూర్ణంబును నుదకంబున కలిపి నస్యముజేసినను, లేక సైంధవలవణమును చూర్ణమును జేసి యందు నెయ్యివైచి త్రాగినను, లేక జిల్లేడువేరు పట్టైనను, నల్లయుమ్మెత్తవేరు పట్టైనను, చూర్ణముజేసి యుదకంబున వైచి త్రాగినను, విషములు నశించు.

**శ్లో.** హింగుర్వా జలలేపేన విషహా వృశ్చికస్య తు
దుత్తూరార్కజటా లేపో నిహంతి వృశ్చికం విషమ్.

**తా.** తేలుకుట్టినచోట ఇంగువన్ను నుదకముచే నూరి పట్టువేసినను, లేక నల్లయుమ్మెత్తవేరునయినను, జిల్లేడువేరునైనను, నుదకముచే గంధమురీసి పట్టువేసినను తేలువిషము నివృత్తియగు.

**శ్లో.** వంధ్యాకర్కోటకీకందం జలైః పిష్ట్వా పిబేల్లిపేత్
సర్పమూషకమార్జారవృశ్చికాదివిషాపహమ్.

**తా.** ఆకాకరగడ్డను నుదకముచే నూరి త్రాగుటయ గాక లేపనము సగా జేసిన పాము, ఎలుక, పిల్లి, తేలు, వీటివిషములు నశించు.

**శ్లో.** శ్వానదంష్ట్రావిషం హంతి లేపాత్కుక్కుటవిష్ఠయా.

**తా.** కోడిమలమును లేపనముజేసిన కుక్కవిషము నశించు.

**శ్లో.** తైలం తిలానాం పలలం గుడం చ
క్షీరం తథార్కస్య సమం హి పీతమ్
అళర్కముగ్రం విషమాశు హంతి
సద్యోద్భవం వాయురివాభ్రబృందమ్.

**తా.** నువ్వులనూనె, నువ్వులపిండి, బెల్లము, జిల్లేడుపాలు, వీటిని సమభాగములుగ కలిపి పానం బొనర్చిన వెఱ్ఱికుక్కవిషము "వాయువు మేఘబృందంబుల నెగరగొట్టుచందంబున" శీఘ్రంబుగ నశించు.

**శ్లో.** సూతం చూర్ణమగారధూమమమలం ప్రత్యేకగద్యాణకం
దుత్తూరస్య రసేన మర్దితమలం పశ్చాచ్ఛతం భాస్కరమ్
జేపాలం మరిచం చతుశ్శతయుతం వాతాదిబీజం లస
ద్వ్యక్తం షష్టిభిః ఖల్వేదం దృఢతరం జంబీరనీరైర్వరైః.
కుర్యాన్మాషవదాకృతిం చ వటికాం ఛాయాసు శుష్కీకృతాం
రాత్ర్యంధం గ్రహసర్పసంధిసకలం శీతజ్వరం దుర్జ్వరమ్.
సన్నేత్రాంజనమౌషధం చ భువనేచాజీర్ణదోషాపహం
సేవ్యం తత్ప్రబలం మహాగుణయుతం శ్రీపూజ్యపాదోదితమ్.



**తా.** శుద్ధిజేసిన పాదరసము, క్రొత్తసున్నము, కరుధూపము, ఇవి దినుసుకు యొక్కొక్క గద్యాణక ప్రమాణముచొప్పున నునిచికొని నల్లయుమ్మెత్తాకురసముచే నొక దినము మర్దించి పిదప యందు శుద్ధిజేసిన నేపాళములపప్పు ౧౦౦ మిరియాల్లు, ౪౦౦ ఆముదపు పప్పు, ౬౦ వైచి నిమ్మపండ్లరసముచే చక్కగ మర్దించి మిరపగింజంత మాత్రలుజేసి నీడన యెండించి గంధముదీసి కన్నులకు అంజనము వేసిన రేచీకట్లు, గ్రహములు, సర్పవిషములు, ఇవి నశించు. మఱియు దీనిని సేవించిన కీళ్లనొప్పులు, సమస్త శీతజ్వరములు, అజీర్ణములు, ఇవియన్నియు నశించునని శ్రీపూజ్యపాదమహాముని వచించె. ఈనేత్రాంజనము మిగుల శ్రేష్ఠంబైనదిగ నున్నయది.

**శ్లో.** శ్వేతం పునర్నవామూలం రవివారే సముద్ధరేత్
కార్పాసమూలం చర్పిత్వా విషం వృశ్చికజం హరేత్.

**తా.** తెల్లగలిజేరుచెట్టు, ప్రత్తిచెట్టు ఇవి యుండెడిస్థలమునకు ఆదివార ముదయమున బోయి వాటికి ధూపదీపనైవేద్యాదులొసంగి పిదప వాటివేరును దెచ్చి యుదకముచే గంధముదీసి తేలుకుట్టినస్థలమున పట్టించిన నా తేలువిషము హరించి చల్లనగు.

ఇట్లు వృశ్చికాది విషచికిత్స ముగిసెను.

---

## కృత్రిమవిషలక్షణము.

**శ్లో.** అన్నేన విషజీవానాం చూర్ణైర్విషయుతైర్యుతమ్
మిశ్రితం నఖకేశైశ్చ లోహానాం చూర్ణసంచయైః.
కృత్రిమం తు విషం ఖ్యాతం పక్షాన్మాసాద్విబాధతే.

**తా.** విషజంతువులను జంపి యెండబెట్టి చూర్ణముజేసి దానిని అన్నంబుననైనను, భక్షణపదార్థములయందైనను, కలిపి భక్షించునటుల జేయుటచేతను, గోళ్ళు, వెంట్రుకలు, వీటిని భక్ష్యపదార్థములయందు మిశ్రమముజేసి భక్షించునటుల జేయుటచేతను, శుద్ధిగావింపని లోహము మొదలగువాటిచూర్ణమును భక్ష్యపదార్థములయందు కలిపి భక్షించునటుల జేయుటచేతను, కృత్రిమవిషము జనించి ౧౫ దినములలోనైనను, నొకమాసంబులోనైనను దృశ్యంబగు.

**శ్లో.** ఆలస్యం కురుతే జాడ్యం కాసశ్వాసబలక్షయమ్
రక్తస్రావో జ్వరశ్శోఫః పీతచక్షుశ్చ లక్షయేత్.

**తా.** మరియు నీ కృత్రిమవిషముగలవానికి ఆలస్యము, జడత్వము, శ్వాసకాసలు, బలహీని, రక్తస్రావము, జ్వరము, శోఫ, కండ్లు పసుపువర్ణము, ఇవి గలుగు.

## కృత్రిమవిషచికిత్స.

శ్లో. తుల్యేన టంకణేనైవ మ్రియతే భక్షణాద్విషమ్
అతిమాత్రం యదా భుక్తం తదాజ్యం టంకణం పిబేత్.

తా. ఉదరంబున బ్రవేశించియుండెడి విషంబునకు సమముగ శుద్ధిజేసిన వెలిగారభస్మమును సేవించిన కృత్రిమవిషము నశించు. ఇటుల జేసియుం నావిషము నశింపకుండెనేని శుద్ధిజేసిన వెలిగారభస్మంబును నెయ్యితో సేవించిన నది నశించు.

శ్లో. పుత్రజీవస్య మజ్జాం చ నిష్కమాత్రాం గవాం పయః
పిష్ట్వా చోగ్రతరం హన్యాన్నానాయోగకృతం విషమ్.

తా. పుత్రజీవివిత్తుల పప్పునైనను, లేక దాని వేరుపట్టనైనను, చూర్ణముజేసి నిష్కప్రమాణము పాలలో కలిపి త్రాగిన సమస్తకృత్రిమవిషంబులు నశించు.

శ్లో. గృహధూమం జలే పిష్ట్వా తండులీమూలతుల్యకమ్
కల్కాశ్చతుర్గుణం చాజ్యం తస్మాత్క్షీరం చతుర్గుణమ్.
ఘృతశేషం పచేత్సర్వం పిబేత్సర్వగరాపహమ్.

తా. కరుధూపము, చిర్రివేళ్ళు, వీటిని సమముగ నుదకముచే నూరి దీనికి నాలుగింతలు నెయ్యి కలిపి వీటికన్నిటికి నాలుగింతలు ఆవుపాలు బోసి యాక్షీర మిగురువరకు ఘృతపక్వముగ కాచి దానిని సేవించిన సమస్తకృత్రిమవిషంబులు నశించు.

శ్లో. శుద్ధసూతం మృతం స్వర్ణం సంశుద్ధం హేమమాక్షికమ్
త్రయాణాం గంధకం తుల్యం మృద్యాత్కన్యాద్రవైర్దినమ్.
తచ్ఛుష్కం ససితం క్షౌద్రైర్మాషైకం భక్షయేత్సదా
వహ్నిమూలం శృతం క్షీరైరనుస్యాద్గరనాశనమ్.

తా. శుద్ధిజేసిన పాదరసము, స్వర్ణభస్మము, హేమమాక్షికభస్మము, ఇవి దినుసుకు ఒక్కొక్కభాగము చొప్పున ఖల్వంబున నునిచి అందు మూడుభాగములు శుద్ధిజేసినగంధకమును కలిపి కలబందరసముచే నొకదినము చక్కగ మర్దించి మాషప్రమాణము మాత్రలుజేసి నీడనయెండించి యం దొకమాత్రను తేనెచేనైనను, శర్కరచేనైనను, భక్షించి తోడనే యొకవరహాయెత్తు చిత్రమూలచూర్ణమును పాలలో కలిపి కాచి త్రాగిన కృత్రిమవిషము నశించు.

ఇట్లు కృత్రిమవిషచికిత్స ముగిసెను.



## సర్పదంశచికిత్స.

శ్లో. కపోతవిణ్మర్త్యశిరోరుహాశ్చ
సగోవిషాణం శిఖిపిఞ్ఛకాగ్రమ్
యవశ్చ ధాన్యం చ తుషాశ్చ బీజం
కార్పాసజం వా పృషితాశ్చ మాలాః.
ఇత్యౌషధీభిఃపరికల్పితోఽయంధూమోగగస్యాద్భుజగైరయుక్తః
గృహే విధేయః కుశలైరనేన నశ్యంతి సర్పాశ్చ తథారవశ్చ.

తా. పావురాయిపిట్టమలము, మనుజులవెంట్రుకలు, ఆవుకొమ్ము, నెమలిజుట్టుయీకలు, యవలపొట్టు, ధనియాలపొట్టు, ప్రత్తిపత్తనములు, రాతిపూత, వీటిని గృహములో ధూపము వేసిన సర్పములు పలాయనంబులగు. మఱియు దీనినే సర్పములు కరచినస్థలంబున పట్టువేసినను, ధూపము వేసినను, సర్పవిషము నశించు. (ఇది సర్పపలాయనధూపము.)

శ్లో. త్వక్సప్తపర్ణాత్కుటజాత్సనింబా
దద్ధా మయోశీరనతాని తాప్యమ్
లోధ్రం నిదధ్యాన్నవమం నవాంగం
ప్రాచేతసం చూర్ణముదాహరంతి.
లోహేదహేమేత్వథ రాజతేవా
స్థితే సదా సద్మని భూపతీనామ్
క్షౌద్రేన లీఢం సచరాచరాణి
విషాణి హన్యాద్భువి మానవానామ్.

తా. ఏడాకులరటిపట్ట, కొడిశపట్ట, వేపపట్ట, తుంగగడ్డలు, కోష్ఠు, వట్టివేళ్లు, గ్రంథితగరము, శుద్ధిజేసిన హేమమాక్షికము, లొద్దుగపట్ట, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి లోహపాత్రయందైనను, బంగారుపాత్రయందైనను, వెండిపాత్రయందైనను నునిచి తేనె కలిపి ముద్దగజేసి ప్రత్యహము తగుమాత్రముగ సేవింపుచువచ్చిన స్థావరజంగమవిషములు నశించు. (ఇది ప్రాచేతసచూర్ణము.)

శ్లో. శ్లేష్మాతకత్వక్క్షవకం గుడూచీ నృపద్రుమత్వగ్బృహతీద్వయం చ
ఏషోఽగదస్సర్వవిషాణి హన్యాదాస్తీకనామ్నా మునినాప్రదిష్టః.

తా. విరిగిచేరుపట్ట, తెల్లఉత్తరేణివేరు, లేక తెల్లజిల్లేడువేరు, తిప్పతీగ, రేలపట్ట, వాకుడువేరు, పెద్దములకవేరు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి పుచ్చుకొనిన సర్వవిషంబులు నశించునని ఆస్తికమహాముని వచించె.

శ్లో. కృకలాసపదం యస్తు సితవస్త్రేణ వేష్టయేత్
బాహౌ బద్ధ్వా విషం హంతి విషం భుక్త్వా న బాధతే.

తా. తొండకాలును నరికి సాంబ్రాణిధూపమువేసి తెల్లటివస్త్రంబున గట్టి రెట్టను గట్టికొనిన సర్వవిషములు నశించు. మరియు నిది రెట్టయం దుండువరకు విషమును భక్షించినను, నది బాధింపకుండు.

శ్లో. పారదం గంధకం తుత్థం టంకణం రజనీసమమ్
దేవదాల్యాద్రవైర్మర్ద్యం దినశుష్కం తు భక్షయేత్.
కాలవజ్రాశనిర్నామ రసస్సర్వవిషాపహః
నరమూత్రం పిబేచ్చాను కాలదష్టోఽపి జీవతి.

తా. శుద్ధిజేసిన పాదరసము, శుద్ధిజేసిన గంధకము, శుద్ధిచేసిన మైలతుత్తము, శుద్ధిజేసిన వెలిగారము, పసపు, వీటిని సమభాగములుగ దేవరడొంగికాయలరసముచే ఖల్వంబున నొకదినము చక్కగ మర్దించి గురిగింజంత మాత్రలుజేసి నీడన యెండించి యం దొక్కొకమాత్ర చొప్పున ప్రాతస్సాయంకాలములయందు భక్షించి తోడనే నరమూత్రంబును త్రాగవలయు. ఇటులచేసిన సమస్తవిషంబు లతిశీఘ్రంబుగ హరించుట య గాక సర్పాదివిషజంతువులచే గఱవంబడి కొంతకాలము గతించియుండినను నావి షంబు సగా నశించు (ఇది కాలవజ్రాశనీరసము.)

శ్లో. జలేన లాంగలీకందం నస్యం సర్వవిషాపహమ్.

తా. చన్నచర్లగడ్డను నుదకముచే దంచి రసముదీసి నస్యముజేసిన సమస్తవిష ములు నశించు.

శ్లో. కుష్ఠం వచామదనకోశవతీఫలేన
సంయోజితం తదితి చూర్ణమిదం చతుర్ణామ్
గోమూత్రపీతమఖిలాఖువిషం నిహంతి
కోశాతకీక్వథనమాపిబతోథవాపి.

తా. కోష్ఠు, వస, మ్రంగకాయలు, చేదుబీర, వీటిని సమభాగములుగ చూర్ణము జేసి యందు గోమూత్రము కలిపి పుచ్చుకొనినను, లేక చేదుబీరసమూలమును దంచి కషాయముబెట్టి పుచ్చుకొనినను, ఎలుకలు మొదలగువాటివిషంబులు నివృత్తియగు.

శ్లో. రసంగంధంనిశాబంధుం గృహధూమం శిరీషకమ్
బీజం దినకరక్షీరైర్మర్దయిత్వా విలేపనమ్.
విశేషాన్మూషకవిషం హన్యాదన్యాన్విషోద్భవాన్.

తా. పాదరసము, గంధకము, హారతికర్పూరము, కరుధూపము, దిరిశనపువిత్తులు, వీటిని సమభాగములుగ జిల్లేడుపాలచే నూరి వృశ్చికము, ఎలుకలు, మొదలగు విషజం



ు కఱచినస్థలంబున లేపనముజేసిన వాటివిషములు నశించు. మరియు నీయౌష ధము యెలుకలవిషంబును నతిశీఘ్రంబుగ నశింపంజేయు.

శ్లో. శిలాతాళ కుష్ఠాని పిష్ట్వా నిర్గుండిజద్రవైః
పానం మూషకదంష్ట్రాణాం దత్వా తీవ్రవిషం హరేత్.

తా. శుద్ధిజేసిన మణిశిల, శుద్ధిజేసిన హరితాళకము, కోష్ఠు, వీటిని సమభాగము ఖల్వమున నునిచి వావిలియాకురసముచే చక్కగ మర్దించి యుదకంబున వైచి మిష్టముజేసి పానంబొనర్చినను, లేక కఱచినస్థలంబున, లేపనముజేసినను, ఎలుక ల విష ములతిశీఘ్రంబుగ నశించు.

శ్లో. చించాపలసమాయుక్తం గృహధూమం పలార్ధకమ్
పురాణాజ్యేన సప్తాహం లీఢ్వా చాఖువిషం హరేత్.

తా. చింతపండు ౧ పలము, కరుధూపము ½ ప, వీటిని పాతనేతితో నూరి ప్రతిదినంబును నొక్కొకతులముచొప్పున నేడుదినంబులుసేవించిన యెలుకవిషము హరించు.

ఇట్లు సర్పాదిదంశవిషచికిత్స ముగిసెను.

―•◆•―

## శ్వానదంష్ట్రావిషచికిత్స.

శ్లో. పిష్ట్వాపామార్గమూలం తు కర్షైకం మధునా పిబేత్
శ్వానదంష్ట్రావిషం హన్యాత్కుమారీదళసైంధవమ్
దంశస్థానే బంధయేత్తు త్రిదినాంతే సుఖావహమ్.

తా. ఉత్తరేణివేరును నుదకముచే నూరి యొకకర్షప్రమాణము తేనెలో కలిపి త్రాగిన కుక్కకాటు నశించు. మరియు సన్నకలబందపట్ట, సైంధవలవణము, వీటిని నూరి కుక్క కఱచినస్థలమునందు 3 దినములు కట్టుగట్టిన కుక్కకాటు నశించు.

ఇట్లు శ్వానదంష్ట్రావిషచికిత్స ముగిసెను.

―•◆•―

## రోగగణనము.

శ్లో. జ్వరోఽతిసారగ్రహణీ చార్శోఽజీర్ణం విషూచికా
క్రిమిరుక్చ తథా పాండుః కామిలారక్తపిత్తకమ్.
రాజయక్ష్మాథ కాసశ్చ హిక్కాశ్వాసస్తథైవ చ
స్వరభేదారోచకే చ ఛర్దిస్తృష్ణా చ మూర్ఛనమ్.

పానాత్యయస్తథా దాహోన్మాదభూతాఖ్య ఉన్మదాః
అపస్మారో వాతరోగో వాతరక్తం తథైవ చ
ఊరుస్తంభామవాతౌ చ శూలోన్న పరిణామజః
ఆధ్మానశ్చహ్యుదావర్తం గుల్మో హృద్రోగ ఏవ చ.
మూత్రకృచ్ఛ్రం తథా మూత్రాఘాతాశ్మరి చ శర్కరా
ప్రమేహో మధుమేహశ్చ పిటికా మేద ఏవ చ.
ఉదరం త్వథ శోఫాఽంత్రముష్కవృద్ధిరేవ చ
గళగండం గండమాలాపచిగ్రంథ్యర్బుదాని చ.
శ్లీపదం విద్రధిశ్చైవ వ్రణశోపస్తథైవచ
భగ్నవ్రణం నాడివ్రణం భగందరోపదంశకః.
శుక్రదోషశ్చ కుష్ఠం చ శీతపిత్తం తథైవ చ
శీతవాతస్స్పర్శవాతస్తథామ్లం పిత్తమేవ చ.
విసర్పిశ్చ సవిస్ఫోటో మసూరీస్నాయునామకౌ
క్షుద్రాస్యకర్ణనాసాక్షిశిరస్త్రీబాలకామయాః.
విషం చ సంగ్రహేత్వస్మిన్ సచికిత్సం పృథక్పృథక్.

తా. జ్వరము; అతిసారము, గ్రహణి, అర్శస్సు, అజీర్ణము, విషూచిక, జం
రోగము, పాండువు, కామిల, రక్తపిత్తము, రాజయక్ష్మము, కాస, ఎక్కిళ్లు, శ్వ
స్వరభేదము, అరోచకము, ఛర్ది, దాహము, మూర్ఛ, పానాత్యయము, తా
ఉన్మాదము, భూతోన్మాదము, అపస్మారము, వాతరోగము, వాతరక్తము, ఊ
భము, ఆమవాతము, శూల, పరిణామశూల, ఆధ్మానము, ఉదావర్తము, గుల్మము, హృ
ద్రోగము, మూత్రకృచ్ఛ్రము, మూత్రాఘాతము, మూత్రాశ్మరి, మూత్రశర్కర, ప్రమే
హము, మధుమేహము, పిటికలు, మేదోరోగము, ఉదరరోగము, శోఫ, అండవృ
ముష్కవృద్ధి, గళగండము, గండమాల, అపచి, గ్రంథులు, అర్బుదము, శ్లీపదవ
విద్రధి, వ్రణశోఫ, భగ్నవ్రణము, నాడీవ్రణము, భగందరము, ఉపదంశవ
శుక్రదోషము, కుష్ఠువు, శీతపిత్తము, శీతవాతము, స్పర్శవాతము; ఆమ్లపిత్తము, విస
విస్ఫోటకము, మసూరిక, స్నాయుకము, క్షుద్రరోగము, ముఖరోగము,
రోగము, నాసారోగము, నేత్రరోగము, శిరోరోగము, స్త్రీరోగము, బాలరో
విషములు, ఈరోగంబుల కింద వెవ్వేరుగ చికిత్సలు చెప్పబడియె.

శ్లో. చికిత్సాసారనామాయం గ్రంథః పరమదుర్లభః
శ్రీమద్గోపాలదాసేన వాగీంద్రేణ చ ధీమతా.



...పకారపుణ్యాయ ప్రయాసేన చ నిర్మితః
లోక... సుశ్రుతం బృందం హారీతం చరకం తథా.
...త్రేయ...వాగ్భటం సిద్ధం సారసార్ణవవాదికమ్
...నాం గ్రంథరత్నానాం సారముద్ధృత్య యత్నతః.
...శ్రుతం దృష్టం చానుభూతం తత్సర్వం లిఖితం మయా
...గ్రాహ్యం తత్కుశలైర్వైద్యైః సద్యః...యోగికమ్.

తా. శ్రీమద్వైద్యశిఖామణియును, విద్వాంసుడును, నగు గోపాలదాసుం
డగల నేను సుశ్రుతము, బృందము, హారీతము, చరకము, ఆత్రేయము, వాగ్భ
...రసార్ణవము, యీ మొదలగు వైద్యశాస్త్రరత్నంబుల నవలోకించి యందు
శములను అతిప్రయాసచే సంగ్రహించి పెద్దలవలన విని వారు క్రియలనొనర్చ
...న జూచి అనుభవించి తత్కాలమునం దుపయోగించెడి చికిత్సలు గలిగి
...టు దుర్లభంబగు చికిత్సాసారంబను నీవైద్యశాస్త్రంబును పరోపకారార్థ
...నకై రచియించినాడను.

శ్రీమద్గోపాలదాసునిచే రచియింపబడిన
చికిత్సాసారము
సంపూర్ణము.

---

# జ్యోతిషగ్రంథములు.

జలార్గళశాస్త్రము, ఆంధ్ర తాత్పర్యసహితము ..
జాతకచంద్రిక, గోపాలరత్నాకరము, సాంధ్ర తాత్పర్యము ..
ముహూర్తదర్పణము, సటీక, చక్కనికూర్పు ..
రెట్టమతశాస్త్రము, తాత్[illegible]తము ...
షోడశప్రశ్నరత్నావళి, నెపోలియన్ అనుష్ఠించిన ప్రశ్నగ్రంథమునకు తె
ఛప్పన్నము, ప్రశ్నశాస్త్రము, ఆంధ్ర తాత్పర్యసహితము ...
నక్షత్ర చూడామణి, చక్కని ప్రతి
శ్రీపతి, సాంధ్ర తాత్పర్యము
సర్వార్థచింతామణి, మేలుప్రతి
లఘుతాచకము, సాంధ్ర తాత్పర్యము
భృగుసూత్రములు ,, ...
భావార్థచంద్రిక ,, ...
వృద్ధపారాశర్యము ,, ...
కేరళప్రశ్నము ,, ...
సనత్కుమారగృహవాస్తు, సాంధ్ర తాత్పర్యము ..
మయవాస్తువు ,,
వాస్తుసర్వస్వము ,,
వనమాల (వర్షఫణి) ,,
స్వప్నశాస్త్రము ,,
గౌళిశాస్త్రము, తెనుఁగు
సాముద్రికశాస్త్రము, సటీక
అష్టకవర్గు, సాంధ్ర తాత్పర్యము, చక్కని ప్రతి.
శకునశాస్త్రము (శిఖినరసింహశతకము,) తాత్పర్యసహితము .
సారావళి, సాంధ్ర తాత్పర్యము ...
ఆరూఢరత్నసిద్ధాంజనము, సాంధ్ర తాత్పర్యము ...
బృహద్యోగరత్నాకరము ...

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చె

